# గీతోపదేశతత్త్వము

## ప్రథమ భాగము

రచన

"విద్యాప్రవీణ, భాషాప్రవీణ"

ఆకెళ్ళ అచ్చన్నశాస్త్రి B. A.

లెక్చరర్, యస్. వి. ఓ. కాలేజి, తిరుపతి.

గీతోపదేశతత్త్వము (ప్రథమ భాగము)

మొదటికూర్పు 1982

ప్రతులు 1000

హక్కు లన్నియు రచయితవి.

వెల : 22 రూ॥



ప్రతులకు :-

ఆకెళ్ళ దశరథరామశాస్త్రి
అసురనివాస్
18-3-30, శాంతినగర్
తిరుపతి 517501



ప్రింటర్స్ :- శ్రీ శారదా పవర్ ప్రింటింగ్ వర్క్సు,
భట్నవిల్లి,
అమలాపురం తా॥ తూ॥ గో॥ జిల్లా

*This book is Published*

*With the financial Assistence*

**OF**

**TIRUMALA TIRUPATI DEVASTHANAMS**

*Under their schme*

*'Aid to Publish religious books'*

# కృతజ్ఞత

ఈ 'గీతోపదేశతత్త్వము'ను ముద్రించుటకు ధనసహాయము చేసిన వదాన్యశేఖరులు శ్రీ పి. వి. ఆర్. కె. ప్రసాద్, ఐ. ఎ. యస్, భూతపూర్వకార్యనిర్వహణాధికారులు; శ్రీ జి. కుమారస్వామి రెడ్డి, ఐ. ఎ. యస్., కార్యనిర్వహణాధికారులు; తిరుమల తిరుపతి దేవ స్థానములు, తిరుపతి - వారికి నా హృదయపూర్వకకృతజ్ఞతాంజలుల నర్పించుకొనుచున్నాను

మరియు, ఈ గ్రంథము రూపు దాల్చుటకు ఉత్సాహప్రోత్సాహముల నిచ్చిన సహృదయవతంసులు - సప్తగిరి సంపాదకులు శ్రీ కె. సుబ్బారావు, ఎం. ఏ. గార్కి; తిరుమల తిరుపతి దేవస్థానం ప్రజాసంబంధాధికారి; శ్రీ రావుల సూర్యనారాయణమూర్తి, ఎం. ఏ. బి. ఇడి. గారికి తి. తి. దే. పబ్లికేషన్స్ కో ఆర్డినేటర్ డా. శ్రీమద్భాగవతం రఘునాథాచార్యులు, న్యాయవిద్యాప్రవీణ, ఎం. ఏ. పి. హెచ్. డి. గారికి కృతజ్ఞతలు తెలుపుకొనుచున్నాను.

"కృతఘ్నే నాస్తి నిష్కృతిః"

# విషయ సూచిక

# గీతోపదేశ తత్త్వము - విషయసూచిక

# ఆశీస్సులు

"న్యాయ శిరోమణి, విద్వాన్"

ఉడాలి సుబ్బరామశాస్త్రి, M. A. (సంస్కృతము)

రిటైర్డు ప్రిన్సిపాల్ వేదసంస్కృతకళాశా

మూలపేట, నెల్లూరు.

శ్రీయుతులు ఆకెళ్ళ అచ్చన్నశాస్త్రిగారు నెల్లూరు వే సంస్కృతకళాశాలలో చాలకాలము విద్య నభ్యసించి విద్యాప్రవీ పట్టము పొందినారు. ఆకాలేజిలోనే కొంత కాలము ఉపన్యాసకులు పని చేసియున్నారు. వారి విద్యాభ్యాసకాలములోనే వారి ప్రతిభ వ్యుత్పత్తులు, వైదుష్యము మాకు సుపరిచితములు. ఆకాలము వీరు శ్రీపోతనభాగవతముపై నొక వ్యాసమును రచించి యున్నారు అది మొదలు వీరియందు ఉత్సాహము పెరుగుచుండుటవలన అనే విషయములపై పెక్కు వ్యాసములను రచించియున్నారు. వీరి ధైర్యసాహసములు మెండు. ఏ విషయమునందును మొగమోటమి లేదు. అట్టివారు భగవద్గీతపై వ్రాసిన గీతాతత్త్వోపదేశ మనె గ్రంథము విమర్శనిర్భరమై వెలయుచుండుటలో ఆశ్చర్యము లేదు ఈ గ్రంథమును నేను చాలవరకు చదివితిని. అందలి విషయములు చవిచూచితిని. ఇందు చాల విషయములు రమణీయములై యున్నవి ముఖ్యముగ భగవద్గీత ఏర్పడిన పిదప దాని ననుకరించి పెక్కు గీ లేర్పడినవి. వానిలో ఋభుగీత, అవధూతగీత, అష్టావక్రగీత, ఉద్ధ గీత, భ్రమరగీత, రామగీత మున్నగునవి ఆ గీతాపరంపరలో చేరినవి ఇవన్నియు భగవద్గీతకు సాటి కా నేరవు అని భగవద్గీత యను పేరు తోనే సిద్ధించుచున్నది. ఇది మన భారతీయసంఘమునకు ఉండెడి ప్రస్థానత్రయ మనెడు వేదాంతగ్రంథములలో నొక్కటియై అంద ప్రజలచేతను భక్తిప్రపత్తులతో సేవింపబడుచు తత్త్వజ్ఞానప్రసా కమై యలరారుచున్నది. ఈ భగవద్గీతలో—

అశోచ్యా నన్వశోచ స్త్వం ప్రజ్ఞావాదాం శ్చ భాషసే।
గతాసూ నగతాసూం శ్చ నానుశోచంతి పండితాః ॥
ఏషా బ్రాహ్మీ స్థితిః పార్థ! నై నాం ప్రాప్య విముహ్యసి।
స్థిత్వా స్యా మంతకాలేఽపి బ్రహ్మనిర్వాణ మృచ్ఛసి ॥

ఇత్యాది వచనములతో శ్రీకృష్ణభగవానుడు అర్జునునకు తత్త్వోపదేశము గావించెను. తక్కిన గ్రంథ మంతయు దాని వివరణము, విస్తరణమునై యున్నది.

ఇందు మోక్షమునకై పదునెనిమిది అధ్యాయములలోను పదునెనిమిది యోగములు చెప్పబడినవి: యోగ మనగ సాధన మనుట సరి యని తోచుచున్నది. కాని అచ్చన్నశాస్త్రిగారు ఈ శబ్దార్థ మును చక్కగ వివరించినారు. కాని ఇంకనూ దానికి వివరణము చెప్పవలసియున్నది. ఈయోగశబ్దము "యోగ శ్చిత్తవృత్తి నిరోధః" అను పతంజలి సూత్రముచే మనోవృత్తిని నిరోధించుటయే యని నిర్వచింపబడినది. ఈ చెప్పబడిన పదునెనిమిది యోగములకును చిత్తవృత్తినిరోధ మున్నప్పుడే సార్థకత: మరియు యోగక్షేమశబ్దము నందును యోగశబ్దము ఘటితమై యున్నది. అది అలబ్ధమైనదానిని సంపాదించుట. ఇది లౌకికము. మరియు "అయం హి పరమో ధర్మః యత్ యోగే నాత్మసాధనమ్" అని యోగముచే ఆత్మసాధన పరమ ధర్మ మని చెప్పబడినది. ఈయోగ మెట్టిదో విచారింపవలెను. ఇట్లు యోగశబ్దము సంస్కృతవేదాంతప్రపంచమున భూరిప్రయోగమును పొందియున్నది. దానికి అచ్చన్నశాస్త్రిగారి వివరణ మిక్కిలి ఉపయోగకరము.

"ఆతతాయి," శబ్దమును నిర్వచించుచు పాండవులు కూడ ఆతతాయు లని కర్తగారు తెల్పియున్నారు. "సర్వధర్మాన్ పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ" అనెడు భగవద్వచన మాధారముగ, శ్రీకృష్ణభగవానుడు కూడ ధర్మత్యాగము చేయు మని చెప్పినందున, అతడును ధర్మవిధ్వంసకుడే అని గ్రంథకర్తగారు చెప్పినారు.

విషాదయోగములోని విషాదశబ్దమును నిర్వచించుటలోను శాస్త్రి గారు ఇట్టి స్వతంత్రతనే వహించినారు. ధర్మక్షేత్రే అను స్థానమున కురుక్షేత్రే యని పఠించుట కూడ ఉత్తమ మని వీరు భావించినారు. ఇట్టి కల్పనలు పెక్కు లున్నవి. ఇవి శాస్త్రిగారి స్వతంత్రప్రతిభకు తన్మూలకమైన కల్పనావైభవమునకు నికషోపలములు.

భగవద్గీత కల్పవృక్షము వంటిది. ఎంత తరచిన అన్ని అర్థముల నీయగలిగినది. 'సర్వోపనిషదో గావః' ఇత్యాది వచనములతో గోపాలనందను డగు శ్రీకృష్ణభగవానుడే ఉపనిషద్గోవులనుండి గీతామృతమును చిలుకగా అదియే భగవద్గీతయై వెలసినది. కావున నిది ప్రపంచవిఖ్యాతి గడించినది.

మరియు, 'తత్త్వమసి' అనెడి మహావాక్యార్థసారమే భగవద్గీత యని సంప్రదాయము. ఈ పదునెనిమిది అధ్యాయములలో మొదటి యారును తచ్ఛబ్దార్థ మనియు, తర్వాతి యారును త్వం శబ్దార్థ మనియు, కడపటి ఆరు ఆ రెండు శబ్దార్థములకు అద్వైతము కూర్చెడి "అసి" శబ్దార్థ మని పెద్దలు వచింతురు. అద్వైతము, విశిష్టాద్వైతము, ద్వైతము, శుద్ధాద్వైతము మొదలైన వేదాంతము లన్నింటికిని "భగవద్గీత" పుట్టినిల్లయినది. దీని యాధారమున జగద్గురువులైన శ్రీ శంకరభగవత్పాదులు, శ్రీరామానుజ శ్రీ మధ్వాచార్య ప్రభృతులు వారి వారి మతములను సమర్థించుచున్నారు. ఇట్లు ప్రపంచమునకు జ్ఞానభిక్ష పెట్టి అజ్ఞానముతో సంసారము నం దలమటించెడి జనులకు భవబంధములను తెంపి మోక్షప్రసాదకమైన ఇట్టి గ్రంథమున కృషి చేసి గీతాతత్త్వోపదేశ మనెడి గ్రంథమును రచించి తన్మూలముగ ఆత్మతత్త్వమును విశదీకరించిన శ్రీ అచ్చన్నశాస్త్రిగారు వేయినోళ్ళ పొగడదగినవారు. వారి కృతి యాంధ్రదేశ మండలి పండితుల యాదరపాత్రము కా గలదని నేను ఆశించుచున్నాను.

నెల్లూరు,
తేది : 10-10-82

ఇట్లు సుజనవిధేయుడు,
శ్రీ॥ షు। రా॥ శాస్త్రి

శ్రీరామాయ నమః　　　　శ్రీనివాసాయ నమః　　　　శుభమస్తు

"వేదార్థనిష్ణాత, బ్రహ్మభూషణ, న్యాయసాహిత్యవిద్యాప్రవీణ"
ధూళిపాళ రామచంద్రశాస్త్రి
ప్రిన్సిపాల్
యస్. వి. వేదాగమ విద్యాకేంద్రము
తి. తి. దేవస్థానములు
నరసింగాపురము

శ్రీ వేదమూర్తులైన ఆకెళ్ళ అచ్చన్నశాస్త్రిగారి సముఖమునకు ధూళిపాళ రామచంద్రశాస్త్రి వ్రాయు నమస్కారపూర్వక విజ్ఞప్తి. ఉభయకుశలోపరి. తాము వ్రాసిన విషయములు అత్యంతము గంభీరములుగ ఉన్నవి. ఇందు మీరు వ్రాసిన విమర్శలు చదువుట చాల అవసరమై యున్నది. మూలగ్రంథమును వ్రాసి, అందు విమర్శించిన భాగములు చాలవరకు నేను చదివితిని. అందు నాకు అన్నియు సయుక్తికముగ తాము ఉపపాదించుటచే సంతోషమును కల్గించుచున్నవి. ప్రతిదినము ఒక గంట కాలము ఈ గ్రంథము చూచుచుంటిని. కాని చివర వర్కు చూచుట పూర్తి కాలేదు. పూర్తి అయిన తర్వాత అభిప్రాయమును వ్రాసి పంపవలయు నని తలచుచున్నాను. ఇంతలో తమవద్ద నుండి నిన్న సాయంత్రము విద్యార్థి వచ్చుటచే నేను చూచిన విషయములను ఉపోద్ఘాతమందు వివరించుటకు తగిన యవకాశము ఈ రోజున లేకపోవుటచేత సామాన్య రూపముగ నా అభిప్రాయము వ్రాసి పంపించితిని. సంస్కృతభాషలో వ్రాసితిని. గాని తెలుగులో వ్రాయవలె నని తమ అభిప్రాయమున్నయెడల వ్రాయగలను. కాని ఈ భాషయందు దున్నయెడల మీరు వ్రాసిన గ్రంథమునకు గల యౌన్నత్యమునకు సంస్కృతమే ఔచిత్యమును పోషించగల దని నా ముఖ్యాభిప్రాయము.

మీరు ఈ గ్రంథరచనయందు చాల కృషి, పరిశ్రమను చేసి యున్నందున నా సంతోషమును వ్యక్తము చేయుచుంటిని. మీ కృషి నీ గ్రంథము చెప్పుచున్నది.

# శుభాశంసనము

చరాచర మభివ్యాప్య త దతీత్య చ సంస్థితమ్ ।
అనంత మనవచ్ఛిన్నం య త్తత్త్వం త దుపాస్మహే ॥

భారతేఽస్మిన్ ఆధ్యాత్మికవాఙ్మయే ఉపనిషదః అత్యంతం ముఖ్యతయా గణనీయం స్థాన మలంచక్రు రితి నిర్వివాదమ్. తత్రాపి ఉపనిషదర్థబోధకత్వేన గీతాశాస్త్ర మపి ప్రవృత్తినివృత్తిరూపస్య ద్వివిధ స్యాపి ధర్మస్య బోధకం సత్ జిజ్ఞాసూనాం సుఖేన తత్త్వజ్ఞాన సంపాదనద్వారేణ ఇతరగ్రంథా నపేక్ష్య అధికతయా ఉపకరో తీతి ప్రాయేణ నావిదితం విదుషామ్.

అత ఏవ చ భగవద్గీతాయాః శ్రీమంతః శంకరభగవత్పాదాః, శ్రీ రామానుజస్వామినః, మధ్వాచార్యాః ఇత్యాదయః ఆచార్య ప్రముఖాః త న్మార్గానుసారిణః ఉచ్చావచాః జ్ఞానినః అన్యే చ మేధావినః స్వస్వమతానుసారేణ వ్యాఖ్యాః కృత్వా స్వీయమతాని, తత్తచ్ఛిష్యపరంపరయా గీతాబోధితం అమృతం చ జిజ్ఞాసుజనతాయై బహుధా వితరంతి స్మ.

అనేన బ్రహ్మవిద్యాబోధకగ్రంథజాతేషు భగవద్గీతాయాః ముఖ్యతమం స్థాన మితి చ న తిరోహితం విపశ్చితామ్.

ఏవం స్థితే సర్వేషాం బ్రహ్మవిద్యావ్యుత్పిత్సూనాం గీతార్థ రహస్యప్రకాశన మేవ ప్రాధాన్యేన లక్షీకృత్య గీతోపదేశతత్త్వ మితి గ్రంథస్య రచనాయాం కృతప్రయత్నాః శ్రీ వేదమూర్తయః పండితవరేణ్యాః శ్రీమంతః ఆకెళ్ళ అచ్చన్నశాస్త్రి మహోదయాః కృతకృత్యా అభవ న్నితి సానందం విజ్ఞాపయామి.

ఏతే చ గీతాశాస్త్రం తద్వ్యాఖ్యారూపాన్ ఆచార్యానుగృహీతాన్ భాష్యాదిగ్రంథాం శ్చ అధీత్య బహుధా విచార్య తన్మథేన సముత్పన్నం స్వానుభవం ప్రధానీకృత్య అమృతస్యందిన మిమం మధురతమం గ్రంథం రచయామాసు రితి చ నః ప్రమోదవచనమ్.

అపి చ గీతాశాస్త్ర నిగూఢాన్ పూర్వాచార్యాణాం అభిప్రాయాన్ ప్రథమం విచార్య తదను తత్రత్యానాం లోకోపయుక్తానాం భాగానా ముద్ధరణం తదుపరి స్వాభిప్రాయప్రకటనమ్ తత్రాపి హేతువాదపురస్సరం తత్తద్విషయసమర్థనం ఏతత్ సర్వం గ్రంథకర్తౄణాం గ్రంథరచనాయాం బహుముఖం పరిశ్రమం విమర్శనయోగ్యాం నవనవోన్మేషశాలినీం మేధాసంపత్తిం చ సూచయతి ఇతి మయా నివేద్యతే.

గ్రంథోఽయం ఆమూలచూడం స్థాలీపులాకన్యాయేన మయా విచారితః. అత్ర గ్రంథకర్తృభిః విమృష్టా విషయా బహవః హృదయంగమాః మమ హృదయే ప్రవిష్టాః. తేషాం సర్వేషాం మత్ర ఉపోద్ఘాతావసరే నివేదనం గ్రంథస్య విస్తృతిం జనయిష్యతీతి సామాన్యరూపేణైవ తేషాం గంభీరతా ప్రస్తుతా.

తస్మాత్ గీతోపదేశతత్త్వగ్రంథః భగవద్గీతార్థజిజ్ఞాసుభిః సర్వైః అవశ్యం పఠనీయః, విజ్ఞానోపయుక్తత్వేన బహుధా సమాదరణీయః ఇతి చ నివేద్యతే.

అతశ్చ ఏతద్గ్రంథకర్తౄణాం శ్రీమతాం అచ్చన్నశాస్త్రి మహోదయానాం విద్వద్వరేణ్యానాం సర్వాంతర్యామీ భగవాన్ శ్రీనివాసః సంపూర్ణమాయుః ఐశ్వర్యాది భాగ్యజాతం చ అనుగృహ్య ఏతన్ముఖేన ఏతాదృశానాం బ్రహ్మవిద్యాప్రకాశకానాం ఉత్తమగ్రంథానాం ఆవిష్కరణాయ అవకాశం దత్త్వా అనుగృహ్ణాతు ఇతి శ్రీనివాస మభ్యర్థయే.

నరసింగాపురము | ఇతి నివేదకః

3-11-1982 | ధూ. రామచంద్రశాస్త్రీ

# శ్రీః

# పరిచితిః అపచితిశ్చ

"శిరోమణి, విద్వాన్,"

శ్రీమాన్ ఎన్. సి. వి. నరశింహాచార్యులు,

*M. A. B. O. L.*

సాహిత్యశాఖాధ్యక్షులు,

యస్. వి. ఒ. కాలేజి.

తిరుపతి 517 501.

"హర్తుం తమ స్సదసతీ చ వివేక్తు మీశో మానం ప్రదీప మివ కారుణికో దదాతి' — అంధతమసే విచరం శ్చేతనః సతీ మసతీం వా సరణి మభిజ్ఞాతు మప్రభవిష్ణుః దిఙ్మూఢ ఆహిండమానో విపద్యేత; మాస్మ భూ దేవ మితి తదా కృపాళుః కశ్చిత్ ప్రసృమర స్వప్రభావిసర విధ్వస్త దుర్దాంతధ్వాంత సంఘాత మేకం ప్రదీపం తస్మై ప్రవితరతి. అధ్వనీన శ్చ త మధిగత్య సుపంథాన మపంథాన శ్చ వివినక్తి. అపథే సద మనిధాయ సుపథి తు నిధాయ గంతవ్య మనపాయమాయతే. పరమకారుణిక స్సర్వశక్తో భగవాన్ తమో వ్యపోహ్య, సద సద్వివేక ముపజనయితుం దేదీప్యమానం మానాఖ్యం ప్రదీప మస్రాక్షీత్. మానశబ్దే నాఽత్ర పరమప్రమాణభూతఃనిగమాదిశబ్దవ్యపదేశ్యః శబ్దరాశి రేవ బుభోధయిషితః.

నిరుపాధికవత్సలః శరణ్యో నారాయణః స్వాజ్ఞారూపాం వివిధపురుషార్థ ప్రవర్తినీం, దురంతసంతాపసంతానసందాత్రసంసారనిశ్శేషనికృంతనబద్ధపరికరాం అనశ్వరీం శ్రుతిం లోకోద్దిధీర్షయా చతురాననాయ చతురాననాయ సముపాదిశత్. అస్యాః పున ర్వ్యాఖ్యా సాపేక్షతాం నిధ్యాయ, స్వయం రూపాంతరేణావతీర్య, కాంశ్చి న్మహాత్మనోఽనుప్రవిశ్య చ స్మృతీతిహాసపురాణాగమాదీన్ తదుపబృంహణాన్ వ్యరరచత్. తేషు చ 'ఇతిహాసపురాణాభ్యాం వేదం సముపబృంహయేత్.' ఇత్యుక్తరీత్యా స్మృత్యాగమాదీన్ ఇతిహాసపురాణా వతిశయాతే. తత్రాఽపి కృష్ణ ద్వైపాయనం వ్యాసం విద్ధి నారాయణం ప్రభుమ్' ఇత్యుపశ్లోకితేన వ్యాసేన గ్రథితం ఉపనిషద్వ్యాఖ్యారూపతయా జేగీయమానం, 'చత్వార ఏకతో వేదా భారతం చేద మేకతః" ఇతిచ జోఘుష్యమాణం మహాభారతం "మహత్త్వా ద్భారవత్త్వా" చ్చ అనితరసాధారణ్యా భాసా శోశుభ్యతే. తత్రాఽపి భారతసారభూతా భగవద్గీతా సుయోధనాదివిజిగీషయా ప్రవృత్తే మహతి సంగరే గురుజనాదరేణ, కులక్షయ భయేన, బంధుస్నేహేన చ యుద్ధశ్రద్ధావికలం ఇతికర్తవ్యతావిమూఢచేతసం కి

మప్యచేతయమాన మర్జునం ప్రకృతౌ పర్యవస్థాపయితుం విదితవేదితవ్యేన భగవతా వాసుదేవేన స్వస్వధర్మానుష్ఠాన మేవ అశేషాణా మపి జనానా మావశ్యకమితి ఉపదేశాపదేశేన ప్రవర్తితా, అష్టాదశవిద్యానాం సంగ్రాహిణీతి కిల అష్టాదశాధ్యాయినీ సతీ సంకీర్త్యతే సర్వదా సర్వలోకైః. కించ —

"గీతాయాః పుస్తకం యత్ర, యత్ర పాఠః ప్రవర్తతే ।
తత్ర సర్వాణి తీర్థాని ప్రయాగాదీని తత్ర వై ॥"

ఇతి గీతామాహాత్మ్య ముద్భావయతో విశ్వంభరస్య విష్ణోః దయితాం విశ్వంభరాదేవీ ముద్దిశ్య తదనుయోగసమాధానసమయసందృబ్ధోఽయం వారాహపురాణమధ్యగతః శ్లోకః గీతాయాః మహిమాన ముదంచయితు మీహతే. "సంసారభోగిసందష్ట జీవజీవాతుః", పావనానాం పావనోఽయం గీతాగ్రంథః పారాయణపరాయణానపి పాపిష్ఠా నపి సముద్ధృత్య మోక్షసామ్రాజ్యలక్ష్మీస్వయంవరపతీ న్విధాతుం ప్రగల్భతే. అత ఏవేయం గీతా "మోక్షసప్తశతీ" సమాఖ్యయా సమింధే చిరత్నై రూత్నైరపి విద్వద్భిః సర్వథా సర్వదా అవిగీయమాన ముత్తమం ప్రమాణమితి ఉత్తమాంగేన సశ్రద్ధ ముహ్యతే. వీతరాగాణా మగ్రణీ రన్వర్థనామా వివేకానందః "సర్వలోకసర్వమతసర్వకాలసమ్మతోఽయ మేక ఏవ ప్రబంధః సమగ్రవాఙ్మయే" ఇత్యుచ్చై రగర్జ. గాంధీమహాత్మాఽపి యదా యదా ప్రతిభాశాలిభి రప్యసమాధేయై స్సందేహసందోహై రాందోలితమనా అజనిష్ట, తదా తదా గీతా మాదాయ ఉద్ఘాట్య దృష్టౌ నిపతితం పృష్ఠ మీక్షమాణ ఆస్తే స్మ, ద్రాక్ తదీయం మానసం సంశయవినిర్ముక్తం సత్ సంతతం మార్గం లక్షయితుం ప్రాభవ దితి బహువార ముదధీఘటత్. ఇయమనుభూతి రేకస్య మహాత్మన ఏవ న, అపితు అసంఖ్యానాం సంఖ్యావతాం అనుభవపరిపాటీ సత్యాపితేతి చ విజ్ఞాయతే.

తస్యా అస్యాః అయాతయామాయాః, అగతరసాయాః, సర్వాత్మనీనాయాః రసాసారభూతాయాః రసాసారభూతాయాః, పంచమవేదనవనీతాత్మనః, బహుజనప్రాణభూతాయా గీతాయాః పరశ్శతా వ్యాఖ్యాః ప్రవిలసంతి. స్వస్వమతానుసారేణ, స్వస్వప్రతిభప్రభావానురోధేన చ గీతేయం వ్యాక్రియత, వ్యాక్రియతే వ్యాకరిష్యతే చ. తస్యా అంతరంగ మావిష్కుర్వంతోఽనంతా విమర్శభాసురా నిబంధా లిఖితా ముద్రితాః ప్రకాశితా శ్చ దరీదృశ్యంతే. తథాఽపి ప్రాయశస్తే "గతానుగతికో లోకో న లోకః పారమార్థిక" ఇతి రీత్యా ప్రాచీనవ్యాఖ్యానువర్తనమాత్రపరాయణా ఇతి వాస్తవం తత్త్వ మావిర్భావయితుం న ప్రగల్భంతే ఇతి మన్వానైః, వేదవ్యాఖ్యావిమర్శనదక్షైః, సంస్కృతాంధ్రభాషావిచక్షణైః, రచితనానాప్రబంధైః, కుశాగ్రీయ

బుద్ధిభిః సారగ్రహణధురీణైః, శాస్త్రీయచర్చాపరిశీలితమతిభిః, నవమార్గమార్గణనిపుణైః అస్మత్సుహృద్వరైః, శ్రీమద్భిః, ఆకెళ్ల అచ్చన్నశాస్త్రి మహోదయైః 'గీతోపదేశతత్త్వము' ఇత్యాఖ్యయా, ఆంధ్రీమయః ప్రభూతప్రమాణతుందిలోఽమందశోధప్రబంధః కశ్చిన్నిరమాయి. తస్య ప్రాథమికో భాగోఽద్య ప్రాకాశి చ. ద్వైతీయీకోఽపి ఖండోఽచిరేణైవ కాలేన ప్రకాశనసౌభాగ్యమశ్నువీతేతి చ విశ్వసిమి.

"అప్యప్రసిద్ధం యశసే హి పుంసామనన్యసాధారణమేవ కర్మ" ఇతి వాక్యం ప్రత్యక్షరమనుపద్యంతే ఏతే విమర్శకా ఇతి భాతి యత ఇమే "మననజలధేరంతరుదరం నిమగ్నాః" ప్రాచీనవ్యాఖ్యాభిరచుంబితాని ఉచ్చావచాని బహూని విషయరత్నాని ఉదనైషుః. తాని సహృదయానాం సన్నిధౌ ఉపదీక్రియంతే; త ఏవాఽత్ర తాత్పర్యం విహాం కుర్వంతు. "అర్జునవిషాద యోగ" ఇతి ప్రథితే ప్రథమాధ్యాయే ఏవ "ప్రథమకబలే మక్షికాపాత మాకులయంతః, తన్నివారణాయైతే భృశం ప్రయేతిరే. అర్జునవిషాదయోగ ఇత్యత్ర విషాదశబ్దస్య ఉత్సాహాపపాదరూపోఽర్థో న ఘటతే. అర్జునోఽయం ధీరోదాత్తః. ధీరగతం "ఔదాత్త్యం హి నామ సర్వోత్కర్షేణ వృత్తిః, తచ్చ విజిగీషుత్వే ఏవోపపద్యతే. సతతోత్సాహసంపన్నోఽయం పాండవమధ్యమః. "లోకోత్తరేషు కార్యేషు స్థేయాన్ ప్రయత్నో" ననూత్సాహపదవ్యపదేశ్యః. తస్మిన్ విషణ్ణతాయాః లేశోఽపి నావకాశమశ్నుతే. అతోఽత్ర సందర్భశుద్ధ్యై విషాదశబ్దః అన్యార్థపర ఏవోరరీకర్తవ్యః. తతో విషాదశబ్దస్య వ్యుత్పత్తిమభిసంధాయ శివః, కృష్ణః, భీష్మః, పరమాత్మా, సాత్యకిః, భీమః, ఇత్యాదీన్ బహూనర్థాన్ విలిఖ్య, భీమభీష్మాదిభిరర్జునస్య యోగ ఏవాఽత్ర అర్జునవిషాదయోగ ఇత్యేతే ప్రేక్షావంతః అపూర్వమర్థం ప్రత్యపీపదన్.

దుర్యోధనకృతానామకృత్యానాం పాండవా ఏవ కారణమ్ ఇతి ప్రతిజ్ఞాయ తదుపోద్బలకాన్ ప్రఘట్టాన్ ప్రదర్శ్య నిరూపణమ్, లాక్షాగృహదాహసందర్భే పాండవైరతిశగారుభిః అపరాధస్పర్శలేశదవీయఃకుటుంబనిర్దాహేన ప్రదర్శితాయాః నిర్ఘృణతాయాః ప్రతిపాదనమ్, వస్తుతో దుర్యోధనాద్యపేక్షయా పాండవా ఏవ ఆర్ద్రతాశూన్యహృదయా ఆతతాయితరా ఇతి చ స్థాపనమ్, ఇత్యేతే చాన్యే చ విషయాః వైదగ్ధ్యపరిమాణమాస్థాయ బహునా గ్రంథేన నిరూపితాస్సంతః పాఠకానాం హృదయాని విస్మయాంబుధౌ నిమజ్జయేయుః

"దుర్యోధనోఽపి ధర్మాత్మా", "భీష్మద్రోణావపి ధర్మపరౌ న భవతః" ఇత్యాది శీర్షికాణాం సామాన్యజనవిశ్వాసవిరుద్ధానామవలోకనం సాధారణజనతా

చిత్తేషు విప్రతిపత్తిముత్పాదయే దపి. పరం తు, బహ్వీభి ర్వాచోయుక్తిభిః, సంవాదైః, ప్రమాణవచనై శ్చ సుష్ఠు నిరూపితే తస్మిన్ విమృష్టే తు విశ్వాస ఉదియా దపి. వినూత్న వైఖరీ మాస్థాయ విమర్శకై ర్వ్యాఖ్యాతృభి శ్చ, అనుల్లిఖితా ననేకాన్ భావాన్ వ్యంగ్యపరిపాట్యా, ప్రమాణకోటీః మాటీకనేన చ నిధ్యాయ న్యరూపయ న్నితి గ్రంథాధ్యయనేన సమ్య గవసీయతే. ప్రత్నరీతీ విమర్శనై రత్యర్థ ముద్విగ్నా ఏతే తేషు తేషు సందర్భేషు "విమర్శకమ్మన్యా" ఇతి, విమర్శకమూర్ధశిఖామణయ ఇతి, తథా వ్యాఖ్యానం ఉదీయ పాండిత్యదౌష్ట్య దర్పాహంకారాణాం నిదర్శన మితి, వ్యాఖ్యాతారః అజ్ఞానాంధా ఇతి, మహాత్తరాః జ్ఞానే శిశవః, ప్రతిభాయా మల్పాః, సమయసందర్భపరిజ్ఞానే మందప్రజ్ఞాః' ఇత్యేవ మన్యథాచ వ్యాఖ్యాతృవిమర్శకాన్ నిర్నామనిర్దేశం ప్రఖరై ర్వచోభి రనిందుషః. తత్ర స్వోపజ్ఞస్వకీయసిద్ధాంతే ఏతేషాం తథాతిమహతీ శ్రద్ధా, స్వప్రతిభావిలాసే చ విస్రంభః విమర్శకలాపారీణతాయాం అవిచాల్య ఆత్మప్రత్యయశ్చ, తా నేతా నేవం ప్రేరిర న్నితి భావయామి.

తత్తిష్ఠతు తథా, ఏతావత్తు తథ్యమ్. గ్రంథ మిమ మధీయానాః నూత్నేలోకే నవీనే పథి విహరామ ఇతి మన్యేరన్. విమర్శకశిరోమణీనా మేతేషాం ప్రజ్ఞోన్మేషం సశిరఃకంపం శ్లాఘేరన్ 'గీతోపదేశతత్త్వ' సముపదేశసంప్రవృత్తా స్సూరయ ఏతే లక్షశ్లోకాత్మకం మహాంతం భారతం ఆమూలచూలం పరిశీల్య, సారతమా నపేక్షితాన్ విషయాన్ సంకలయ్య నిరూపణాయ ప్రతిజ్ఞాత మర్థం సమార్తథంత ఇతి సంస్తవనీయ ఏష వ్యవసాయః.

అగాధ మముం గ్రంథం విమ్రష్టుం, అంతతః యథావత్పరిజ్ఞాతుం వా మమాదంతీ నాస్తీ త్యబాధితం తథ్యమ్. తావతీ గ్రంథపరిచితిః, అస్పృష్టవిషయ సంస్పర్శిః శేముషీపరిణతిః, ఊహాపరిణాహః రచయితృసమానహృదయతారూప హృదయాలుతాచ మయి నవిద్యతే. తథాపి లేఖనాయ కృతం, సుహృన్నియోగ మురరీకృత్య, శాలీనతా ముత్సార్య యత్కించి ద్వ్యలిఖమ్. మార్షయంతు మహాంతో మామకీనం ధార్ష్ట్య మితి ప్రతి మహతాం క్షమాం యాచే.

శ్రీపదపురీ. ఇత్థం లబ్ధవర్ణనియోజ్యః

19-8-82 నరసింహః

# ప్రశంస

డా. కె. ఎస్. ఆర్. దత్త,

ఎం. ఏ., పి. హెచ్. డి.,

ప్రిన్సిపాల్ ఎస్. వి. ఓ. కాలేజి, తిరుపతి.

మహాభారతాంతర్గత మగు భగవద్గీత హైందవులకు పరమ ప్రమాణమైన వేదాంతగ్రంథము. సాక్షాత్తు శ్రీకృష్ణభగవానుని చేత ఉపదేశింపబడుటచేతను, ఉపనిషత్సారమును బోధించుటచేతను దీనికి మిక్కిలి ప్రాశస్త్యము కలిగినది. దీనికి శ్రీశంకర, రామానుజ, మధ్వాచార్యులవంటి ప్రాచీనదార్శనికులేకాక, ఆధునికకాలముననుపెక్కుమంది వ్యాఖ్యానములను, వివరణములను వ్రాసిరి. ఆస్తికత సన్నగిల్లుచున్న ఈ దినములలోకూడ ఇటువంటి మతగ్రంథముల పరిశీలనము, విమర్శనాత్మకాధ్యయనము జరుగుచున్నది. శ్రీ ఆకెళ్ళ అచ్చన్నశాస్త్రిగారు వ్రాసిన "గీతోపదేశతత్త్వము" అను ఈ గ్రంథము విమర్శనాత్మకగ్రంథములలో చేరును.

శ్రీ అచ్చన్నశాస్త్రిగారు వేదమును చక్కగా అభ్యసించిరి. అంతేకాక సంస్కృతాంధ్రములలో పండితులు. వీరు శ్రీరామాయణ భారతములను విమర్శనాత్మకదృష్టితో చదివి, అందలి విషయము లను అప్పుడప్పుడు నాతోకూడ చర్చించుచుండిరి.

వీరి ప్రస్తుతగ్రంథము "గీతోపదేశతత్త్వము". భగవద్గీత వీరికి అర్థమైన విధము అస్మదాదులకంటె విభిన్నముగా నున్నది. వీరి దృష్టిలో దుర్యోధనుడు ధర్మాత్ముడు (పుట40), భారతయుద్ధము అధర్మము (పుట-48), కృష్ణునకుకూడ శోకదుఃఖములు కలవు. (పుట-57), అర్జునుడు దుఃఖమును నటించెను. (పుట-59), భీష్మ ద్రోణులును ధర్మపరులు కారు (పుట-56), పాండవులుకూడ ఆత తాయులే (పుట-126), కృష్ణుడు దౌత్యమునందు దూతగ వ్యవహ రింపలేదు. (పుట-139), వీరి ఈ అభిప్రాయములు సంప్రదాయబద్ధు లైన ఆస్తికులకు కష్టమనిపించవచ్చును, కాని, వీరు మహాభారతము

నుండి ఎన్నియో శ్లోకముల నుదాహరించి, యుక్త్యుపపత్తులతో తమ అభిప్రాయములను విపులీకరించిరి. కాని, కొన్ని వేల సంవత్సరములుగ భారతీయుల మనఃఫలకములపై చెరుగని ముద్రవేసికొని, తమ జీవితములకు మార్గదర్శిగను, అత్యంతప్రమాణమైన వేదాంత గ్రంథముగను పరిగణింపబడుచున్న భగవద్గీతకు (శ్రీ) శాస్త్రిగారి వివరణము ఆస్తికులకు మిక్కిలి ఖేదము కలిగింపవచ్చును. కాని, ఇటువంటి గ్రంథములు భగవద్గీతయందు ఆస్తికులకున్న భక్తిశ్రద్ధలను, ప్రమాణబుద్ధిని సడలింప లేవని నా యభిప్రాయము. వారిందు ప్రతిపాదించిన విషయములు సత్యములా, అసత్యములా, యుక్తములా, అయుక్తములా, చదువరులు దీనిని ఆదరింతురా, లేక నిరాకరింతురా? అను విషయములను కాలమే నిర్ణయించును. వేచి చూతముకాక! ఏది ఏమైనను వీరి విమర్శనలో, శ్లోకములను యుక్త్యుపపత్తులతో తమ యభిప్రాయానుగుణముగ మలచుకొనుటయందు వీరికి గల నైపుణ్యము ప్రస్ఫుట మగుచున్నది. కొందరు విమర్శకులు "పండితమ్మన్యులు, మూర్ఖశిఖామణులు" అని వీరి యాగ్రహమునకు గురియైనారు. వీరి గ్రంథములో విషయైక్యము కనుపింప కున్నది. తాము ఈ గ్రంథములో నేమి చెప్పదలచుకొనిరో అవగత మగుట లేదు. కాని, గ్రంథము మొదటి భాగము అగుటవలన రాబోవు మిగతభాగములలో వారేమి చెప్పదలచుకొనిరో మనకు స్పష్టముగ తెలియవచ్చును.

ధార్మికగ్రంథముల ప్రచురణముకొరకు తిరుమలతిరుపతి దేవస్థానము వారి ఆర్థికసహాయముతో ప్రచురింపబడిన దీ గ్రంథము. ఇందలి అసంఖ్యాకము లైన ముద్రారాక్షసములు పునర్ముద్రణములో తొలగింపబడు నని ఆశించుచున్నాను.

(సం) కాశీభట్ట శేతురామేశ్వరదత్త.

తిరుపతి

28-9-82

# అభిప్రాయం

"విద్వాన్"
డి. నాగసిద్ధారెడ్డి
లెక్చరర్, యస్. వి. ఓరియంటల్ కాలేజి,
తిరుపతి.

శ్రీ ఆకెళ్ళ అచ్చన్న శాస్త్రిగారు సంస్కృతాంధ్రాల్ని ఆపోశనం పట్టిన అపరకుంభసంభవులు. సునిశితమేధాశక్తి, మొగమాటడని నిష్పక్షపాతవిమర్శా వీరి సొమ్ములు. తన అభిప్రాయానికి విరుద్ధమైన విషయాన్ని కుండ బ్రద్దలు కొట్టినట్లు విమర్శించడం వీరికి అలవాటు. దీనివల్ల శాస్త్రిగారిని "చదువుకొన్న దుర్మార్గుడు" అని ఈసడించిన పండితులు కూడ లేకపోలేదు. "ప్రతిభావ్యుత్పత్తులలో మమ్ము మించిన శాస్త్రిగారు మా వలె మసిపూసి మారేడు కాయ చేసే మనస్తత్వాన్ని అలవరచుకోక సత్యాన్వేషణదీక్ష పూనడం దేనికి?" అనే అక్కసు మాత్రమే అందుకు కారణం. ఎవ్వరేమని అనుకొన్నా ఈ విమర్శ గ్రంథం శాస్త్రి నిర్భయత్వానికి నికషోపలం.

శ్రీ శాస్త్రిగారు తన గీతోపదేశతత్వ గ్రంథానికి రెండు మాటలు వ్రాయవలసిందని నన్ను కోరడం వారి సౌజన్యసహృదయాలకు సాక్ష్యం. నా యోగ్యతని వారు అధికంగా అంచనా వేయడంచేతనే నాకీ పని అంటగట్టారు. అందరు ప్రాచ్యపండితుల వలెనే శాస్త్రిగారి విమర్శకూడ కొంత ఛాందస (చాదస్తపు) ధోరణిలోనే సాగివుంటుంది కదా! అనే భావంతో గ్రంథపఠనం ప్రారంభించాను. కాని వారి నిష్పక్షపాతవిమర్శ నా కాశ్చర్యాన్ని, ఆనందాన్నీ కల్గించింది. ఎందుకంటే భారత భాగవత భగవద్గీతాది హిందూ మత గ్రంథాల్ని పారాయణం చేసే వారే ఎక్కువమంది కన్పడతారు; కాని చదివే వారు దాదాపు లేరనే నా ఉద్దేశం. పారాయణంతో భక్తి యేర్పడవచ్చు; లేదా ముదరవచ్చు;

సత్యాన్ని వెలికి తీయడం మాత్రం సాధ్యం కాదు. భారతాన్నో, రామాయణాన్నో దేన్నైనా సరే ప్రాచీనగ్రంథాల్ని విమర్శిస్తే పుట్టి మునిగిపోయినంతగా బాధపడేవాళ్లు కొల్లలుగా మనకు దర్శన మిస్తారు. ఇలాంటి వారివల్ల వేల సంవత్సరాలనుండి జాతికి జరిగిన, జరుగుతూవున్న నష్టం అంతా యింతా కాదు. ఒకే గాడిలో పడి కొట్టుకుపోయే వారికి ఆలోచనాశక్తి చిట్టంకట్టుకుపోయిందని చెప్పక తప్పదు. శాస్త్రిగారి విమర్శ ఈ కోవకు చెందింది కాకపోవడం జిజ్ఞాసువులు చేసికొన్న అదృష్టం.

గీతోపదేశతత్త్వం అత్యాధునిక పద్ధతుల్లో నిర్భయంగా సాగిన సద్విమర్శ. ప్రతి మేధావినీ ఆలోచింపచేసే శక్తి దీనికి పుష్కలంగా వుంది. భగవద్గీతను మాత్రమే గాక వారీ గ్రంథంలో తమ విమర్శకు ఉపబలకంగా రామాయణ మహాభారతాల నుండి కూడ సన్నివేశాల్ని వుపయోగించుకొన్న విధం మిక్కిలి ప్రశంసనీయం. భగవద్గీత కేవలయోగశాస్త్రం మాత్రమే కాదు. అది ద్విధాభూతులుగా వున్న కృష్ణార్జునుల్ని యుద్ధకర్మయందు ఏకాకారులనుగా చేసిన సాధనమని వీరు నిరూపించడం చాల గొప్పగా వుంది. విషాద శబ్దాన్ని 'విష + అద' అని శ్రీ శాస్త్రిగారు వ్యాఖ్యానించిన తీరు గంభీరంగావుంది. అయినా అది కొందరికి చమత్కారప్రాయంగా తోచవచ్చు. 43 వ పుటలో "అర్జునుడు ధర్మమునకు విముఖుడై క్లైబ్య కశ్మలత్వములను పొందెను - అని సామాన్యవిమర్శకుల భావమనియు, "అర్జున విషాద యోగ" మను పేరు ఆ అధ్యాయమునకు అతని దుఃఖమునే ఆధారముగ చేసికొని పెట్టినారనుట అవిచారిత రమణీయ మనియు (33 వ పుట) సోదాహరణంగా వీరు నిరూపించడం శాస్త్రిగారి విమర్శనాపటిమకు నిదర్శనం. ఇంకను శ్రీకృష్ణుడు పరీక్షిత్తును పునరుజ్జీవితుణ్ణి చేసే ఘట్టంలో తాను చేసిన కంసవధమూ, అర్జునసహాయంతో జరిగిన దుర్యోధనవధనూ ధర్మ సమ్మతములే అని నిరూపించడం (86వ పుట), దుర్యోధనుని ప్రతి

అకృత్యానికీ పాండవులే కారణ మని (127 వ పుట) నిర్ధారించడం పెక్కు సందర్భాల్లో దుర్యోధనుణ్ణి ధర్మపరునిగానే కీర్తించి పాండవుల్ని కూడ ఆతతాయులుగానే వ్యక్తీకరించడం భీష్మద్రోణుల పాండవాభిమానాన్ని కృష్ణ సంజయుల రాయబారాల్లోని అంతరార్థాల్ని వివరించడం మున్నగునవి శాస్త్రిగారి విషయైక్య దృష్టికి పరాకాష్ఠ లని పేర్కొనవచ్చు. మేధావుల మెదడుకు పదు నెక్కించే ఈ గ్రంథం పూర్తి కావలసివుంది. అప్పుడు మరిన్ని విశేష విషయాలు మనకు ప్రత్యక్ష మవుతాయి. భగవద్గీతను ఈ రక మైన దృష్టితో విమర్శించినవారు దాదాపు లేరనే చెప్పవచ్చు.

ఇందలి సంస్కృతశ్లోకాలకు తాత్పర్యం ఇచ్చివుంటే సంస్కృతం తెలియనివారికి ఎంతో సౌకర్యంగా వుండేది. 2వ భాగంలో ఆ పని చేయబడుతుం దని ఆశిస్తాను. అంతే గాక విషయ నివేదనంలో స్పష్టత మరింత అవసరం. ఈ నా అభిప్రాయాన్ని వెల్లడించే అవకాశాన్ని కల్గించిన శాస్త్రిగారికి ధన్యవాదాలు.

తిరుపతి — ఇట్లు

5–10–82 — **డి. నాగసిద్ధారెడ్డి**

# అభిప్రాయం

"శిరోమణి"
సముద్రాల లక్ష్మణయ్య, ఎం. ఏ.

భగవద్గీత ఒక విశిష్టమైన గ్రంథం. అందలి వైశిష్ట్యాన్ని ఇద మిత్థమని నిర్వచించడం చాలా కష్టం.

గీతాశాస్త్రం సమస్తవేదార్థసారసంగ్రహభూతమని ఆచార్యులు పేర్కొన్నారు. వేదాలకు అర్థనిర్ణయంచేయడం సులభం కాదు. గీతకూ అంతే. అట్లని పండితులెవరూ గీతకు అర్థాలు చెప్పడం మానడంలేదు. తమకు తోచిన తాము సత్యమని విశ్వసించిన అర్థాలు వివరస్తూనే వున్నారు. భవిష్యత్తులో గూడా ఇలా వివరిస్తారే గాని వదిలిపెట్టరు.

ఒకే గ్రంథానికి పరస్పరవిరుద్ధమైన వివిధ వ్యాఖ్యానాలు చూచినతరువాత జిజ్ఞాసువైన పాఠకుడు అందులో ఏది నిక్కమో నిర్ణయించుకోలేకపోతున్నాడు. ఒకవ్యాఖ్య యథార్థమైతే, అందుకు విరుద్ధమైన ఇతరవ్యాఖ్యలన్నీ అసత్యం కాక తప్పదు. లేదా ఈ వ్యాఖ్యలన్నీ అసత్యాలై అసలు సత్యం వేరుగానైనా వుండాలి. ద్వైత-అద్వైత-విశిష్టాద్వైత సిద్ధాంతాల విషయంలో కూడా ఈ విమర్శను కాదనడానికి వీలులేదు. అందుకే తాము సత్యమని విశ్వసించిన సిద్ధాంతాలను గీతాదిగ్రంథాలతో ముడిపెట్టడానికే ప్రాచీనాచార్యులందరూ ప్రయత్నించారనీ, అసలు సత్యమేదో ఎవరికీ అంతు చిక్కడంలేదని అభిజ్ఞులు అభిప్రాయపడుతున్నారు.

"గీతోపదేశతత్త్వం" అన్న పేరుతో మిత్రులు శ్రీ ఆకెళ్ల అచ్చన్నశాస్త్రిగారు వివరించిన కొన్ని విషయాలు విద్వత్ప్రముఖులను సైతం పునరాలోచనలో పడవేస్తున్నాయి. తమ వాదాల కన్నిటికీ ప్రమాణంచూపడానికై వీరెంతో శ్రమించారు. సంప్రదాయానుసారులు వీరి అభిప్రాయాలతో ఏకీభవింపకపోవచ్చు. అయినా వీరి పరిశ్రమనుమాత్రం కాదనలేరని నా అభిప్రాయం.

'అర్జునవిషాదయోగం' అన్న పదానికి శ్రీశాస్త్రిగారిచ్చిన వివరణలు వీరి పాండిత్యబలానికి నిదర్శనాలు.

అర్జునుని దుఃఖం నటనామాత్రమే కాని నిక్కము కాదన్న వీరి వాదన విప్లవాత్మకం. "పాండవులు ఆతతాయులు" ఇత్యాది వాదనలు కూడా ఇలాంటివే.

కాని "యుద్ధము ధర్మహానికరమని భావించుట చేతనే అతనికి (అర్జునునికి) ధర్మవిషయక విషాదము కలిగినది" (పు-65) "యుద్ధము నందువచ్చి నిల్చుటకుముందే అర్జునునితో ధర్మసమ్మూఢచేతస్త్వము తదాధారముగ కార్పణ్యదోషోపహతస్వభావము కలిగినవని మన మూహింపనగును" (పు - 72), "అర్జునునకు యుద్ధమునందు వైమనస్య మేర్పడినది" (పు-118) అన్న మాటలను పరిశీలించినప్పుడు అర్జునుని విషాదము నటన ఎట్లగును? అను సంశయం కల్గుతుంది. ఇందులో ఏది సిద్ధాంతమో, ఏది పూర్వపక్షమో నిర్ణయించడం కష్టం.

ఇలాంటి సందిగ్ధవిషయాలెన్నో ఈ గ్రంథంలో ఉన్నాయి. వీటి కన్నిటికీ సముచితసమాధానాలు గీతోపదేశతత్త్వం-రెండవ భాగంలో లభిస్తాయని భావిస్తాను.

శ్రీశాస్త్రిగారు భారతంలోని అనేక ఘట్టాలను క్షుణ్ణంగా పరిశీలించారు. అందలి భాగాలను తమ వాదాలకు ఉపోద్బలకంగా చూపడంలో చాలా వరకూ కృతకృత్యులయ్యారు.

సదవగాహన, సహనశీలత గల బుద్ధితో వీరి విమర్శలన్నీ పలుసార్లు పఠిస్తే మన ఊహలకందని అనేకనూతన విషయాలు తెలుసుకోగలుగుతాము.

శ్రీశాస్త్రిగారి కృషి అవిరతంగా సాగి, విమర్శనక్షేత్రంలో క్రొంగ్రొత్త మార్గాలను ప్రవేశపెట్టగలదని మనసారా ఆశిస్తున్నాను.

సముద్రాల లక్ష్మణయ్య

తిరుపతి

1-9-1982

# యోగ్యతాపత్రము

రావుల సూర్యనారాయణ

ఎం. ఏ., బి. ఇడి.

ఉపనిషత్తులు బీజంగా, ఆత్మావలోకనం అంకురంగా, ఎన్నో శాస్త్రరహస్యాలు శాఖోపశాఖలుగా, శమదమాదిగుణాలుచిగుళ్లుగా, వైరాగ్యం కుసుమంగా, నారాయణ పాదపద్మాలపై భక్తి పరిమళం గా విలసిల్లిన కల్పవృక్షమే భగవద్గీత. దీన్ని లోకంలో ప్రకటించిన వాడు శ్రీకృష్ణుడు. పెంచి పెద్దచేసి ప్రచారంలోకి తెచ్చినవాడు వ్యాసభగవానుడు.

సకలసిద్ధాంతసమన్వయరూపంగా సనాతనసారథిచేత ఉపదేశించబడ్డ ఈ మహాగ్రంథం మహనీయవిజ్ఞానభాండారం. అందుకనే దీనిపై ఎన్ని భాష్యాలు, వ్యాఖ్యానాలు తామరతంపరగా వెలువడినా ఇంకా ఇంకా క్రొత్తఊహాలకు; ఆలోచనలకు అవకాశం ఉండనే ఉంది. వారివారిసంస్కారాలను బట్టి ఇందులో ఎంతమందికో ఎన్నెన్నో నూతనార్థాలు స్ఫురిస్తున్నాయి. ఇప్పటికే చాలామంది వారికి తోచిన అభిప్రాయాలను గ్రంథరూపంగా వెలువరించారు.

ఆ కోవకు చెందిందే ప్రస్తుతం ప్రచురింపబడుచున్న "గీతోపదేశతత్త్వం" అనే ఈగ్రంథం. శ్రీ ఆకెళ్ల అచ్చన్నశాస్త్రిగారు భారతాన్ని సమగ్రంగా పరిశీలించి తమకు తోచిన అభిప్రాయాలను ఈ పుస్తకరూపంలో లోకానికి అందజేశారు. పాఠకులు ఇందులోని మంచిని గ్రహించి శ్రీ శాస్త్రిగారిని ప్రోత్సహిస్తారని ఆశిస్తున్నాను.

తిరుపతి
నవంబరు 10, 1982

రావుల సూర్యనారాయణమూర్తి
ప్రజాసంబంధాధికారి,
తిరుమల తిరుపతి దేవస్థానం.

# ఆకాంక్ష

డాక్టర్ ఎస్. బి. రఘునాథాచార్యులు,
శ్రీవేంకటేశ్వరవిశ్వవిద్యాలయం,
తిరుపతి

"విమర్శ" అంటే సంశయ మని వాత్స్యాయనుని మాట. ఒక వస్తువుపైన గల సంశయాలనన్నింటిని క్రమంగా సమీక్షించి, ఏదో ఒక నిర్ణయానికి దోహదం చేసే కొన్ని విశేషాంశాలను సూచిస్తూ సాగే వాక్యసందర్భానికికూడ కాలక్రమంగా "విమర్శ" అనే ప్రసిద్ధి లభించింది. అయితే లక్ష్యశుద్ధి చెడకుండా, చిత్తశుద్ధి లోపించకుండా ఆసూచనలు ప్రకటింపబడి, సమాజ యోగక్షేమాలకు, శాంతికి ఉపయోగపడే నిర్ణయాలు పాఠకుల కేర్పడటానికి అవి దోహదం చేయాలి. తీరు తెన్ను లేని విమర్శకమ్మన్యుల చలవవల్ల అపదానికి స్వస్వరూపచ్యుతి ఏనాడో సంభవించింది.

ఇది గీతోపదేశతత్త్వం. ఈ పేరు వింటూనే గీతోపదేశపుపరిధిలో కొన్ని తాత్త్వికాంశాలపైన వివిధకోణాల్లో చక్కని సమీక్ష లభిస్తుందని ప్రతివాడు ఆశిస్తాడు. అయితే ఇది ప్రథమభాగం కాబట్టి అసలు విషయానికి మున్నుడిగా మహాభారతంలోని కొన్ని భాగాలను పరిశీలిస్తూ ఎన్నో మౌలికాంశాలను రచయిత చాలా లోతుకు పోయి విచారించారు. ఆయన దిగినంత లోతుకు దిగినవారికే ఇది బోధపడుతుంది. కాని ఆయన పడిన శ్రమ ప్రతిపేజీలోను మనకు కనబడుతుంది. భగవద్గీతను స్వతంత్రంగా కాక ఇతరభారతభాగాలతో కలిపి అర్థం చేసుకోవడానికి ప్రయత్నించి ఎంతో శ్రమపడి శ్రీ అచ్చన్నశాస్త్రిగారు సాధించిన ఫలితంలో ఇది సగంమాత్రమే. శాస్త్రిగారి ప్రయత్నాన్ని ఆంధ్రులందరు తప్పక అభినందిస్తా రని నమ్ముతున్నాను.

శ్రీ అచ్చన్నశాస్త్రిగారు ఆవేశానికి ప్రతీకగా ఇదివఱకు నాకు తెలుసు. కాని ఇందులో ఎవరికి అందకుండా అందంగా ఆయన నడిపించిన అక్షరాలగారడీ చూస్తే "మర్మపత్రికాశ" కర్త నాగేశభట్టు జ్ఞాపకం వస్తున్నాడు. వీరు సుమారు ఎనభై అంశాలపైన చక్కని ప్రతిజ్ఞావాక్యాలు ఇందులో వ్రాశారు. వాటిలో కొన్నింటిని సమర్థించడానికి కొంతకు కొంత ప్రయత్నంకూడా చేశారు. కొత్త

కొత్త వ్యుత్పత్తులను సాధించారు. ఔచితీనికషోపలంపైన వాటిల్లో ఎన్ని నిలబడ తాయనేది మిగిలిపోయిన ప్రశ్న. దానికి సమాధానం కావాలంటే రెండవభాగం రావాలి. సద్ధేతు - దృష్టాంతపరిపుష్టాలు కాని ప్రతిజ్ఞలు సాధ్యాన్ని సాధించగలవని ఎవరుమాత్రం చెప్పగలరు ?

మహాభారతార్థభారాన్ని దింపుకోవడంలో కొంచెం తొందర కనపడుతున్నది. ఇంకొంచెం ఉడికితే పదార్థం మధురమధురమై ఉండేదని నా నమ్మకం. కొన్ని సందర్భాలలోని నగిషీలు నాస్తికమ్మన్యులకు నవ్వు పుట్టిస్తాయి. రచయిత పరమ తాత్పర్యంకూడ నిజంగా అంతవఱకే.

పల్లవగ్రాహిపాండిత్యంతో గీతాశ్లోకాలకు అపార్థాలను వల్లెవేస్తున్న బహు పండితులను కొందఱిని చూచి సహించలేక ఇలా సమగ్రపరిశోధనకు పూనుకున్న శాస్త్రిగారి శ్రద్ధను, ఆవేశాన్ని నేను మనసారా అభినందిస్తున్నాను. భగవద్గీతకోసం మహాభారతాన్ని సమగ్రంగా సహనంతో పరిశీలించిన రచయిత పట్టుదల ఈనాటి పరిశోధకులకందఱకు మార్గదర్శకం కావాలి. అయితే దేశ-కాల-వ్యక్తి ప్రభావాలకు లొంగని ఒక సత్యాన్ని నిరూపించడంలో గతంలోని మంచిని తోసిరాజనకుండా, క్షుద్రప్రశంసల నాశించకుండా, ఉండగలిగే ధైర్య-స్థైర్యాలు శాస్త్రిగారిలో తరగ కూడదని ఆశిస్తున్నాను.

లక్ష్యశుద్ధితో విచారణచేయడానికి పాండిత్యం, పదునైనబుద్ధి, సహృదయత, సంయమనం అనే నాలుగూ చాలా అవసరం. ఇవి శాస్త్రిగారిలో పూర్వాపూర్వో త్కర్షను సంపాదించుకున్నాయి. కనుక వారి విమర్శ ఆపాతరమణీయంగా దేవానాం ప్రియప్రియంగా కాక నామానుగుణంగా, ఔచితీభరితంగా శాశ్వతవిజ్ఞాన సంధా యకంగా రూపొంది, వారికి విమర్శకలోకంలో సమున్నతస్థానాన్ని సంపాదిస్తుందని ఆకాంక్షిస్తున్నాను.

"యోగః కర్మసు కౌశలమ్"

ఎస్. బి. ఆర్.
తిరుపతి
9-11-82.

# సదాశయము

"సాహిత్యవిద్యాప్రవీణ, భాషాప్రవీణ"
కె. యస్. రామానుజాచార్యులు, ఎమ్. ఏ;
ప్రిన్సిపాల్:- వేదసంస్కృత కళాశాల.
మూలపేట, నెల్లూరు.

మిత్రులు శ్రీ ఆకెళ్ల అచ్చన్నశాస్త్రిగారు రచించిన గీతోపదేశతత్త్వములోని కొన్ని ఘట్టములను వారే స్వయముగ వినిపించగ నిదివరలో విన్నాను. ముద్రితమైన పిదప అంతయు చూచుట సంభవించినది.

శ్రీ శాస్త్రిగారు బహుగ్రంథపఠిత, విమర్శకుడు, విశేషించి స్వేచ్ఛావాది. భగవద్గీతను భిన్నదృక్పథములతో విభిన్నమతాచార్యులు వ్యాఖ్యానించియున్నారు. రాజకీయవాదులు, సంఘసంస్కర్తలు తమ సిద్ధాంతములను భగవద్గీతలో సమన్వయించి చూపియున్నారు. శ్రీ శాస్త్రి తమ మిశ్రమ దృక్పథముతో ఇప్పుడు భగవద్గీతను పరిశీలించినారు. వీరి పరిశీలనము మత్తదంతావళ ప్రక్రీడా పరిణతిని తలపించుచున్నది.

భగవద్గీత మొదటి అధ్యాయమునకు "అర్జున విషాద యోగము" అని పేరు, ఇట్లు ప్రతిఅధ్యాయమునకును కర్మయోగము, సాంఖ్యయోగము, భక్తియోగము అని నామములు ప్రసిద్ధములు. మొదటి అధ్యాయమున—

తాన్ సమీక్ష్య స కౌంతేయః సర్వాన్ బంధూ నవస్థితాన్ ।
కృపయా పరయావిష్టః విషీద న్నిద మబ్రవీత్ ॥

అని అర్జునవిషాదము ప్రస్తుతమగుటచే ఈ అధ్యాయమునకు అర్జునవిషాదయోగ మను సార్థకనామమును పెద్దలు పెట్టినారు. ఈ విషయమున ఎవ్వరికి వివాదము లేదు.

కాని శ్రీ శాస్త్రి అర్జునవిషాదయోగశబ్దములకు వాచకలక్షక వ్యంజక వృత్తుల నాశ్రయించి దాదాపు ఇరువది అర్థములను ఉల్లేఖించినారు. ఇది అపూర్వము. వీనిలో కొన్ని యర్థములు మాత్రమే ప్రకరణానుగుణములు. ఈ సందర్భమున ప్రసక్తానుప్రసక్తముగ అనేకశాస్త్రములకు సంబంధించిన విషయములు చర్చించబడినవి. చివరకు ఈ అధ్యాయమునకు ధర్మసంశయయోగ మను నామమును వీరు సూచించినారు.

గీత అర్జునునికి మాత్రమే ఉపదేశింపబడినది కాదని యుద్ధరంగమునందలి యోద్ధలందరికిని ఉపదేశింపబడినదన్ని ఉత్తరగీతలను కూడ కలగలపుకొనినగాని గీత సంపూర్ణము కాదన్ని, గీతకు ఉదాహరణమే భారతకథ యంతయు అని శ్రీ శాస్త్రిగారు సహేతుకముగ నిరూపించినారు.

“ధార్తరాష్ట్రస్య దుర్బుద్ధేః” అనునెడ దుర్యోధనుని దుర్బుద్ధికి ధృతరాష్ట్రసంబంధము కూడ కారణ మని నుడివిన పూర్వవ్యాఖ్యానమును తిలశః ఖండించుటలో శ్రీ శాస్త్రి చూపిన నేర్పు అనన్యాదృశము.

అచుంబితభావములను ఆవిష్కరించుటలో దిట్ట శ్రీశాస్త్రి ఇందలి భీష్ముని సింహానాదమును వివరించు ఘట్టమును పరిశీలింపునది, తాను చెప్పదలచిన విషయములను వీరు సోపపత్తికముగ చెప్పుట ప్రశంసనీయము. ప్రతిపక్షఖండనమున అపరుషోక్తి నేటి సహృదయ లక్షణము. కాని ఎందుచేతనో అది ఇందు అనేక సందర్భములలో ఆదరింపబడలేదు. ‘‘న మే ద్వేష్యోస్తి న ప్రియః’’ అన్న ముగింపు ఈ లోపమును పరిహరించుచున్నది.

మొత్తము మీద నూతన ఫక్కికలో శ్రీశాస్త్రి భగవద్గీతను పరామర్శించినారు. ఇది సంప్రదాయవాదులకు అంతగ రుచింపకున్నను నవ్యభావుకులలో వినూతనాలోచనాధోరణులను రేకెత్తించుననుటలో సందేహము లేదు. "భిన్నరుచిర్హి లోకః". పాండవుల యందును అనేకలోపములు గలవు. కర్ణదుర్యోధనాదులయందును అనేకగుణములు కలవు. కావున గతానుగతికముగ పరప్రత్యయనేయబుద్ధితో ఒక పక్షమును విపరీతముగ ప్రశంసించుట, మరియొక పక్షమును విపరీతముగ దూషించుట విజ్ఞత కాదని శ్రీశాస్త్రి చక్కగ నిరూపించినారు. భగవద్గీత యంతయు అర్జునవిషాదయోగమే అని చివర తీర్మానించిరి. ఇవి ఇందలి కొన్ని పులాకలు మాత్రమే. ఇట్టి అనేక అపూర్వ విమర్శాపరంపరలతో గూడిన ఈ గీతోపదేశతత్త్వమును సహృదయులు సహృదయముగ ఆదరింపగలరని ఆశించుచున్నాను. శ్రీ గీతాచార్యుని అనుగ్రహమున శ్రీశాస్త్రిగారు ఇతోధికముగ సారస్వత సేవ గావింతురుగాక!

నెల్లూరు
14-10-1982

ఇట్లు విద్వద్వశవదుడు :
కె. యస్. రామానుజాచార్యులు

శ్రీః

# పరిచయం

"కవికిశోర, కవితావిశారద, కవితావతంస, విద్వాన్"

పూడి వేంకటరామయ్య.

ఆంధ్రోపన్యాసకులు.

యస్. వి. ఒ. కళాశాల, తిరుపతి.

శ్లో॥ నారాయణం నమస్కృత్య నరం చైవ నరోత్తమమ్ ।
దేవీం సరస్వతీం వ్యాసం తతో జయ ముదీరయేత్ ॥

ప్రపంచప్రఖ్యాతి చెందిన భారతీయతత్త్వశాస్త్రానికి వేదవాఙ్మయం ప్రతీక. వేదాలు అపౌరుషేయాలనీ, ఈశ్వరీయాలనీ అంటారు. తదంతర్గతాలైన బ్రాహ్మణకములూ, ఆరణ్యకాలూ, ఉపనిషత్తులూ భగవత్సృష్టిలోని జననమరణ సంబంధమైన జీవుని విడిపించటానికి సాధనాలని చాలమంది పెద్దల అభిప్రాయం.

వేదాలు కర్మకాండకు ఉపయుక్తమైనవని; ఉపనిషత్తులు జ్ఞానమార్గప్రబోధకాలనీ ప్రతీతి. అన్ని ఉపనిషత్తులు కూడ సత్యము-అహింసలకే ప్రాధాన్య మిస్తున్నాయి. అయోగ్యునికి బ్రహ్మవిద్యోపదేశం చేసిన పాపఫలంకంటె అసత్యదోషంచేత లభించే పాపఫలమే అధికమని ఉపనిషత్తులు ఘోషిస్తున్నాయి. "సత్యంవద-ధర్మంచర" అను ధర్మసూత్రాలద్వారా మాత్రమే భగవద్దర్శనం సాధ్యమనీ; మరి యే యితరమార్గాలద్వారా తత్త్వదర్శనం చేయడం దుర్లభమనీ యివి నొక్కి చెబుతున్నాయి. అందుచేతనే ఉపనిషత్తులు బ్రహ్మవిద్యాబోధకాలుగ గణనీయమైన స్థానాన్ని పొందాయి. విశేషించి యివి ఆర్షమహర్షులద్వారా బోధింపబడటంవల్ల భారతీయ తత్త్వశాస్త్రానికి లభించినంతటి ప్రాచుర్యం ప్రపంచంలోని యే యితర తత్త్వశాస్త్రాలకూ లభించడం లేదు.

వేదాలూ ఉపనిషత్తులే కాక, షడ్దర్శనాలూ, రామాయణ మహాభారతాలూ, అష్టాదశపురాణాలూ ఆదిగాగల కావ్యాలూ భారతీయతత్త్వశాస్త్రాన్ని ప్రతిబింబింపజేస్తున్నాయి. వేదాలు నాల్గు

గుగా, ఉపనిషత్తులు నూటయెనిమిదిగ, న్యాయవైశేషిక సాంఖ్యయోగపూర్వమీమాంస ఉత్తరమీమాంసలుషడ్దర్శనాలుగ లోకవిశ్రుతమయ్యాయి. ఇందులో ప్రత్యేకించి ఉత్తరమీమాంసను బ్రహ్మసూత్రాలు అని వ్యవహరిస్తున్నారు. భగవద్గీత, బ్రహ్మసూత్రాలు ఉపనిషత్తులూ ప్రస్థానత్రయంగా పరిగణింపబడ్డాయి లోకంలో వందాయెనిమిది ఉపనిషత్తులలో విశేషించి పదింటికి యెక్కువ ప్రాచుర్యం లభించటంచేత "దశోపనిషత్తులు" గా పరిగణింపబడి అద్వైతభావనారూపమైన బ్రహ్మవిద్యకు నిధానంగా నిలిచిపోయాయి ఇక భగవద్గీతవిషయంలో; అది మనో చాంచల్యాన్ని నిరోధిస్తుండగనక చిత్తవృత్తి విరోధం గీతాపఠనంవల్ల లభిస్తుంది అని యెంచి చాలమంది తత్త్వజిజ్ఞాసువులు భగవద్గీతను ఆశ్రయిస్తుంటారు.

సనత్సుజాతీయం — భగవద్గీత - దశోపనిషత్తులకు ఆదిశంకరులవారూ, రామానుజులవారూ, మధ్వాచార్యులవారూ వారివారి సిద్ధాంతాల పరంగా అద్వైత, విశిష్టాద్వైత, ద్వైత భావాలతో సామాన్య జనబాహుళ్యానికి యోగ్యంగా ఉపయుక్తంగా ఉండేలా భాష్యాలు వ్రాశారు. తరువాతి కాలంలో పీఠాధిపతులూ, సన్యాసాశ్రమంలో ఉండేవాళ్ళూ ఆశ్రమనియమాలను అనుసరించి యేదైనా ఒక ఉపనిషత్తుకు భాష్యం వ్రాయాలని నియమం ఉండటంవల్ల సాధారణంగ భాషాంతరీకరణకు యోగ్యంగాఉండటంవల్ల భగవద్గీతనే యెంచుకొంటూ వాళ్ళు సముపార్జించుకొన్న తత్త్వార్థాన్ని ప్రజాబాహుళ్యానికి అందజేస్తుంటాను.

మహాభారతంలో భీష్మపర్వాంతర్గతమైన 'శ్రీమద్భగవద్గీత' పద్దెనిమిది అధ్యాయాలతో యేడువందల శ్లోకాలతో యిమిడివున్న ఒక అపూర్వమైన, సర్వమానవజాతికీ తరణోపాయంగా వున్న ఆధ్యాత్మికవిద్యాకేంద్రం. కనకనే దానిని 'మోక్షసప్తశతి' అని కూడా అంటారు. "గీత" అనగా గానం చేయబడినది అని అర్థం. వాల్మీకిమహర్షులవారి రామాయణం కుశలవులచేత గానం చేయ

చేయబడిన విధంగా జగద్గురుడూ, యోగారూఢుడూ అయిన శ్రీకృష్ణపరమాత్మచేత గీ త గా న ం చేయబడ్డ విషయం అందరికీ తెలిసిన విషయమే.

వసుదేవసుతం దేవం కంసచాణూరమర్దనమ్ ।
దేవకీపరమానందం కృష్ణం వందే జగద్గురుమ్ ॥

శ్రీకృష్ణపరమాత్ముడు జగద్గురు డని ప్రతీతి. భగవద్గీతలో ప్రతిఅధ్యాయంలోనూ చివరిభాగంలో "ఇతి శ్రీమద్భగవద్గీతాస ఉపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే" అని వుండటంవల్ల ఉపనిషత్తుల్లోలాగా యిందులోగూడా గురుశిష్య సంవాదరూపంలో జగద్వందితుడైన శ్రీకృష్ణుడు యోగయుక్తుడై సచివుడూ, బంధువు, శిష్యుడూ అయిన అర్జునునకు ఉపదేశించటం వల్ల భగవద్గీత ఉపనిషత్తనియూ, బ్రహ్మవిద్యనే బోధిస్తూ వున్నదని యూ, యోగశాస్త్రమనియు తెలుస్తూవున్నది. తన్మయత్వంతో భగవద్గీతను చదవడం జరిగితే అందులోని ప్రతివిషయంకూడా గురువులాగా ప్రబోధిస్తున్నట్లు తెలుస్తుంది. ఇది అనుభవ పూర్వ కంగా తెలిసికోనవలసిన విషయం. అంచేతనే మహాత్మాగాంధి, బాల గంగాధర్ తిలక్ లాంటి మహానుభావులు తమ దైనందిన జీవితా లలో గీతాపఠనం నిత్యకృత్యంగా స్వీకరించారు. స్వీకరించడమే కాదు, గీతామాతను దర్శించగలిగారు కూడా. అంచేతనే అసాధ్య మైన కార్యాలను సాధించగలిగారు వాళ్ళు. స్వామివివేకానంద భగవ ద్గీతను "లోకైకమతగ్రంథం" అని ప్రశంసించారు.

ఇలా లోకప్రఖ్యాతి చెందిన భగవద్గీతను కావ్యవస్తువుగా స్వీకరించి "గీతోపదేశతత్త్వం" అన్నపేరుతో మిత్రులు బ్రహ్మశ్రీ ఆకెళ్ళ అచ్చన్నశాస్త్రిలు వారు సంచలనాత్మకమైనవిమర్శచేశారు. అదే యీ కావ్యం. శ్రీశాస్త్రిలవారు సాంప్రదాయకమైన వైదిక కుటుంబానికి చెందినవారు. సంస్కృత, ఆంధ్ర, ఆంగ్ల భాషలలో గణనీయమైన స్థానం సంపాదించుకొన్న మనీషులు. విశేషించి శాస్త్ర పండితులు. తర్కవిద్యలో నిష్ణాతులు. వారికి వారేసాటి అనన్య

యాలంకారంలాగ. తిరుపతిలోని శ్రీవేంకటేశ్వర ప్రాచ్యభాషాలలో ఆంధ్రోపన్యాసకులు. ఆవిభాగంలో సంస్కృతోపన్యాసకులు కూడా. చమత్కారం, వాదనాపటిమ, హాస్యం వారి మామూలు మాటల్లో కూడ తొనికిసలాడుతూ వుంటాయి. యుక్తియుక్తంగా హేతుబద్ధంగా వారిసమాధానా లుంటాయి.

ఇక యీ కావ్యంలోని ఔచిత్యం ప్రశంసార్హం. మహాభారత సాగర గర్భంలోని రత్నాలను వెలికి దీసి పాఠకులకు అందించే ప్రయత్నంలో కృతకృత్యులయ్యారు అని అందరూ భావిస్తా రీ కావ్యం పరిపూర్తిగా చదివింతరవాత. ముఖ్యంగా యోగసంపన్నమైన గీతను యోగశాస్త్రంగా వివరించి "గీత భగవదభిన్నము- కర్తృకారయితల యేకరూపము - కృష్ణార్జునులకు అభిన్నము" అని చమత్కారయుక్తంగా ఉచితమైన ఆధారాలతో నిరూపింప యత్నించి కృతకృత్యులయ్యారు. ఈ సందర్భంలో పాఠకుల ఆలోచనాసరళినే సంపూర్ణంగామార్చివేయగలిగారు. అది ఒక వినూతనమైన ప్రత్యేకపంథా అని చెప్పవచ్చు. అలా చేయడంలో తత్సంబంధమైన భారతకథలోని పాత్రలచేతనే కథను తార్కికంగా పూర్వపక్షం చేసి గీతోపదేశంల్లోని పరమార్థ రహస్యాన్ని వివరిస్తూ "కార్పణ్యదోషదుష్ట జీవునకు ఉపదేశకమైన గురువుగా" ఉపమించిన తీరుతెన్నులు విజ్ఞులూ, విజ్ఞుల్లూ, సూక్ష్మగ్రాహులూ అయిన పాఠకులు సులభంగా అర్థం చేసుకోగలరు.

అల్పాక్షరాలలో అనల్పార్థం యిమడ్చగల శక్తి ఒక్క సంస్కృతభాషకు తప్ప మరి యే యితరభాషకూ లేదు. ఆశక్తితో శ్రీ శాస్త్రిలవారు చాల ఘనవిజయం సాధించగలిగారు ఈకావ్యంలో. అర్జున విషాద యోగములోనివిషాద-విష-అదశబ్దాలను యోగమునకు అన్వయించి తదాదిగ మహాభారతంలోని వివిధపాత్రలకు రామాయణ గాథలోని పాత్రలకూ సమన్వయం కల్పించి ప్రయోజనం సాధించారు. అర్జునవిషాద శబ్దం పూర్వగ్రంథానికి ఉత్తర గ్రంథానికి సేతు

వుగా వున్నట్లు వారు వ్యాఖ్యానించిన తీరు పాఠకులకు విస్మయం కలిగించక మానదు. (గీతలో) అర్జునుడు విషాదగ్రస్తుడగుటకు పూర్వమే తత్సంబంధమైన విషాదం పొందే ఉన్నాడని అందుకు నిదర్శనంగా ఆదిపర్వంలోని కొన్ని శ్లోకాలను (పుట 28-29) ఉటంకించి, అర్జునుడు అస్త్రశస్త్రాలను పొందినప్పటినుండియు మరలా వాటిని విడిచిపెట్టినప్పటివరకూ విషాదయోగమే నని తత్సంబంధమైన భారతగాథతో వివరించారు. ఉదాహరణకు అర్జునవిషాదశబ్దమునకు విషాదుడు ఈశ్వరుడనీ విష మనగా శబ్దాదివిషయములనీ "అత్తి నాశయతి భగవాన్" అనగా భగవంతుడే విషాదుడనీ వివరించి 'అత్తా చరాచరగ్రహణాత్' చరాచరవిషయసుఖాలకు ఆధారమైన సంసార సాగరంనుండి తరింపజేయువాడు భగవంతుడనీ అలాంటి భగవంతునితో అర్జునునకు యోగం గలదు అని సమన్వయపరచటం హేతుబద్ధమైనమాట. అలా చెప్పటానికి యెంతో వైదుష్యమూ చాకచక్యమూ అవసరం. శ్రీ శాస్త్రిలవారి విమర్శనాత్మకదృష్టికీ తార్కిక దృష్టికీ మరోఉదాహరణ. వ్యాసభగవానుల అనుగ్రహం వల్ల సంజయునికి దూరదృష్టి, దూరశ్రవణం ఇతరుల మనోజనిత భావాలను గ్రహించగల శక్తి లభించాయి. అందువల్లనే ధృతరాష్ట్రుడు భారతయుద్ధగాథను సంజయునిద్వారా వినగలిగాడు. సంజయుడు జ్ఞాని కనుక యింటిలోనుండే యుద్ధతంత్రాలను దివ్యదృష్టితో ప్రత్యక్షంగా చూచి చెప్పాడని ప్రచారం చేస్తున్నారు. అది అజ్ఞానవిలసితం, అని అందుకు ఉపోద్బలకంగా భీష్మపర్వంలోని కొన్నిశ్లోకాలను చూపి సంజయుడు యుద్ధరంగంలోనే వుండెనని స్పష్టీకరించడం శ్రీ శాస్త్రిలవారి పూర్వాపరసందర్భోచితశుద్ధి ప్రశంసార్హం. వారి సూక్ష్మపరిశీలన బుద్ధిని పాఠకులు పరిశీలింతురుగాక!

సాధారణంగా భారతగాథ ఎరిగిన వాళ్ళందరూ పాండవులు ధర్మాత్ములనీ కౌరవులు అధర్మపరులనీ భావిస్తూంటారు. కాని భారతకావ్యకర్త శ్రీ వ్యాసభగవానులవారు మాత్రం భారత

ఘంటలి ఏ పాత్రను కూడ భేదభావంతో రచింపలేదు. కావ్యరచయితలు తమ కవితాశిల్పాన్ని సమాహితచిత్తంతోనే చిత్రిస్తారు. కనకనే అధర్మయుద్ధంలో భీముడు కృష్ణప్రేరితుడై దుర్యోధనుని ఊరువులు గదాఘాతంతో విరిచినపుడు సాక్షాద్భగవదవతారమూర్తి యయిన శ్రీకృష్ణుని దుర్యోధనునిచేత దూషింపచేస్తాడు వ్యాసభగవానుడు. అలాగే భారతగాథలోని పూర్వాపరాలను సమగ్రంగా పరిశీలించామంటే కురుక్షేత్ర సంగ్రామానికి ముఖ్యకారకుడైన దుర్యోధనుడు కూడ ధర్మాత్ముడేననీ, కనుకనే అతడు మరణానంతరం స్వర్గలోకం వెళ్ళాడనీ, హేతుబద్ధంగా వివరించారు. పాండవులు రాజ్యభాగం అడుగునప్పుడు తాము ధర్మబద్ధంగా నియమబద్ధంగా అరణ్యవాసం అజ్ఞాతవాసం పూర్తి చేశామని అడగక తమ తండ్రి భాగమైన రాజ్యం కోరటం పరిశీలింపవలసిన విషయంగా శ్రీ శాస్త్రులవారు సోదాహరణంగా వివరించడం వారి ధర్మవిమర్శనాత్మక దృష్టికి నిదర్శనం.

"మహాత్ములకును సంశయములు గలవు" అని శ్రీ శాస్త్రులవారు చెప్పటం అలా చెప్పిన మాటను అతిచాకచక్యంగా తమ విద్యాపాటవంతో సమర్థించుకొనడం ఒకవిధంగా హాస్యవిజల్పితం. మరోవిధంగా యథార్థం. అర్జునుడు సంశయగ్రస్తుడయిన విధంగానే రామాయణంలో తాటకవధ సమయంలో శ్రీరాముడు సంశయించినతీరూ, సీతాన్వేషణ సందర్భములో రావణుని గృహంలో ఉన్న పరనారీజనాన్ని చూచి హనుమంతుడు సంశయించిన విధమూ, శాకుంతలమున దుష్యంతుని తీరూ; మనుచరిత్రలోని ప్రవరునితీరూ; వాళ్ళకు గల సంశయాలను వివరిస్తూ రాముడు అజ్ఞాని అయినచో అర్జునుడుకూడ అజ్ఞానియే అని అనడం శ్రీ శాస్త్రులవారి ఔచిత్యానికీ ఆత్మస్థైర్యానికీ మచ్చుతునక.

భీష్మద్రోణుల ఎదుట తన రథాన్ని నిలుపమనడం కేవలం నాటకమేననీ అర్జునుడు విషాదం నటించాడని అలా చేయడంలో అతని

రాజనీతి, యుద్ధనీతులు రెండూ అభివ్యక్తమయ్యాయనీ తెలుస్తూ వుంది అన్నారు. అర్జునుని యుద్ధనీతికి మహోపుదాహరణద్వారా ప్రత్యేకించి చూపించారు కూడా. ద్రోణవధసందర్భంలో ధృష్టద్యుమ్నుణ్ణి తీవ్రంగా గర్హించడం యిందుకు ఉపోద్బలకం మహాభారతకథ ఆరంభంనుండీకూడ అర్జునుడు తనపైన పాపపంకిలం పడనీయకుండా అతిజాగ్రత్తగా మెలుకువతో ప్రవర్తిస్తూ వచ్చాడని యీ గ్రంథం వలన తెలుస్తుంది.

ఇక "పాండవులు ఆతతాయులు" అన్న విషయం పరిశీలిద్దాం.

"అగ్నిదో గరదశ్చైవ శస్త్రపాణి ర్ధనాపహః ।
క్షేత్రదారాపహారీ చ షడేతే హ్యాతతాయినః ॥"

(వశిష్ఠస్మృతి 1-19)

ఆతతాయి అంటే విషం పెట్టేవాడూ, కొంపలుకాల్చేవాడూ, పరుని భార్యను అపహరించువాడూ, ఆయుధం పట్టి చంపవచ్చేవాడూ, నీటముంచువాడూ సర్వస్వమూ హరించువాడు అని వశిష్ఠస్మృతిని వివరించి దుర్యోధనాదులు ఆతతాయులు అని లోకం గ్రహిస్తూ వుందంటూ ఆలాంటి ఆతతాయులను చంప అవసరం లేదని కూడా రామాయణంలో ప్రమాణం చూపిస్తూ సమర్థించారు. రావణుడు సీతాపహారణం చేసినా శరణుకోరిన పక్షంలో క్షమిస్తానని రాముడు చెప్పటం యిందుకు నిదర్శనం. పాండవులు సైతం ఆతతాయులే అని పేర్కొంటూ శల్యపర్వంలో సంజయుడు "పాండవాన్ ఆతతాయినః" అని అనడం ఉదాహరణ రూపంలో యిచ్చారు. నిజానికి తాము కూడ ఆతతాయులే అన్న భావం అర్జునునకు ఉంది.

తాన్ ప్రేక్ష్య సహితాన్ సర్వాన్ జనేనోద్యత కార్ముకాన్ ।
సొబలోఽ భ్యద్రవద్యుద్ధే పాండవా న్నాతతాయినః ॥

(శ॥ ప॥ 28-30)

ఈవిధంగా చూస్తుంటే యథార్థంగానే కనపడుతూంది కదా. ఇలాంటి పట్టుల్లో శ్రీశాస్త్రిగారి తార్కికశక్తి ద్యోతక మవుతూ

వుంది. సంభవపర్వంలో భారతగాథను పరిశీలిస్తే పాండవులు సైతం ఆతతాయులే అని అందరూ సులభంగా గుర్తిస్తారు. వారణావతంలో లాక్షాగృహదహన సందర్భంలో ధర్మరాజు తమ ప్రాణ సంరక్షణ కోసం అక్రమంగా అధర్మంగా అమాయికులైన ఆరునిండు ప్రాణాలను బలిగావించటం ఆతతాయిత్వం కాక మరేమిటి? ఇలా వుంటుంది శ్రీశాస్త్రిలవారి ధర్మపరిశీలన బుద్ధి.

శ్రీశాస్త్రులవారు చెప్పినట్లు "మహాకవుల వాక్యాలలోని సారం గ్రహించాలంటే నిరంతర పరిశ్రమా పూర్వాపరసందర్భాలను పరిశీలించగల ఓర్పు తుమ్మెద మకరందం గ్రహించునట్లు సారాంశం గ్రహింపగల నేర్పు ఉంటేనేగాని యథార్థం గ్రహింపబడదు" అన్న సత్యం యథార్థమైన మాట. ఆమాట సార్థకం చేసుకొనడం కోసం ఉత్తమమైన ఒక ఉదాహరణ చూపించారు. అది ఇది.

విరాటుడు ఉత్తరను అర్జునున కిచ్చి పరిణయం చేస్తానన్నాడు. ఈమాట ఒకటికి రెండు పర్యాయాలన్నాడు. కానీ అర్జునుడు అందుకు అంగీకరించక తానే బలవంతపరచి తనకుమారుడైన అభిమన్యున కిప్పించాడు. యుద్ధమే సంభవించిన పక్షంలో అభిమన్యుడు మహాబల పరాక్రమోపేతులైన కౌరవులను జయింపజాలడనీ అంచేత అతనికి తనకుమార్తెనిచ్చి వివాహం జరిపితే రాబోవు యుద్ధములో అభిమన్యుని విషయంలో యేదైనా అశుభం జరిగినపక్షంలో తన కుమార్తె స్థితి మహా భయంకరంగా ఉంటుందనీ తండ్రిగా విరాటుని యోచన అని వ్యంగ్యంగా చెబుతూ యీ ఘట్టం పరిశీలనార్హమని ప్రతికుటుంబీకుడూ పరిశీలించ వలసిన విషయం ఇందులో యిమిడివుందనీ ప్రత్యేకంగా వివరించాడు.

చివరగా భీష్ముని సింహనాదంలోని వైశిష్ట్యాన్ని గూర్చి వివరిస్తూ సింహనాదం విష్ణుధర్మమనీ, కృష్ణబోధ భీష్మచరితమేననీ, శివుడూ, భీష్ముడూ ఒక్కరేననీ సింహశబ్దానికి రఘువంశంలోని

సింహ వృత్తాంతాన్ని జోడించిన విధానమూ, సింహనాదం వేదప్రతి
పాద్యమైన విష్ణుధర్మమనీ, మనుష్యులలో అనాసక్తియోగం నిర్వహిం
చిన ఘనత ఒక్క భీష్మునకే దక్కిందనీ స్పష్టంగా తెలిపారు.

"స్థూలంగా మహాభారతం అనేకపాత్రలతో అనేకవిషయాలతో
కూడిన బృహద్గాథ కనుకనే అనేకాలైన అవాంతర విషయాలు కూడ
సుదీర్ఘంగా చోటు చేసుకొన్నాయి. అంచేతవిమర్శకులు చాల తెలివి
తేటలతో, ఓర్పుతో, నేర్పుతో, స్ఫురణాత్మకమైన బుద్ధివైభవంతో,
పరిష్కృతప్రసన్నమతితో, పూర్వాపరసందర్భ స్ఫురణతో పరిశీలించక
పోయిన పక్షంలో వ్యాసభగవానుల హృదయం అంతుబట్టదు.
పాత్రచిత్రణా, విషయనిర్ధారణా అసలే స్ఫురించవు. అలాంటి మహా
కావ్యం ఆధారంగా "గీతోపదేశతత్త్వం" అను కావ్యం ఆంధ్ర
సాహిత్యంలో ఒక విలూత్నమైన కావ్యం. ఆంధ్రులందరూ ఈ
కావ్యాన్ని ఆదరిస్తారని ఆశిస్తున్నాను. ఇంతటి మహత్తరకావ్యం
వ్రాసి లోకానికి అందించిన శ్రీ శాస్త్రిలవారికి హృదయపూర్వ
కంగా నమస్కారాలర్పిస్తూ విరమిస్తున్నాను.

తిరుపతి ఇట్లు,

10-11-82 పూడి వేంకటరామయ్య.

శ్రీ మహాగణాధిపతయే నమః

# సదాశయము

వేదోదిత మగు ధర్మము విధినిషేధాత్మకమై యనుష్ఠేయ పరిహార్యరూపముగ ద్వివిధమై యొప్పుచున్నది. మరియొక విధానము ననుసరించి ప్రవృత్తినివృత్తి రూపమున ద్విధా విభాగార్హమై ప్రేయః, శ్రేయః ఫలకముగా వ్యవస్థిత మైనది. అట్టి వేదము సంహితా బ్రాహ్మణరూపమై యొప్పుచు కర్మకాండోపయోగియై ప్రేయః ఫలకముగను, ఉపనిషత్తుల (వేదముయొక్క చివరి భాగములు) రూపమున విలసిల్లుచు శ్రేయఃఫలకముగను నుపకరించుచున్నది. మఱియు నిందు పూర్వకాండమున ప్రసక్తానుప్రసక్తముగ నటునట నివృత్తిధర్మము, ఉత్తరకాండమున (ఉపనిషద్భాగమున) ప్రవృత్తిధర్మమును బోధింపబడినది.

ఈ ప్రమాణ కోటిలో విశిష్టస్థాన మలంకరించిన వేదము "అనంతా వై వేదాః!" అను ప్రమాణము ననుసరించి అనంతసంఖ్యాకముగ కీర్తింపబడినది. మఱి ప్రస్తుత ముపలబ్ధమగు వేదము "ఇతి వేదాస్త్రయ స్త్రయీ" అను కోశానుసారము త్రయ్యాత్మకముగను, వేఱొకవిధముగ చతుర్వేదాత్మకముగను విభాగార్హమై స్వతః ప్రమాణమై (ఇతరత్రానపేక్ష ప్రమాణమై) యలరారుచున్నది.

(1) "వేదోదితం సర్వం ప్రమాణ మితి బుద్ధ్వా యః కర్మ కరోతి స ఆస్తికః", (2) "నాస్తికో వేదనిందకః" అను రెండు నిర్వచనములు ఇతరాఽనపేక్షప్రామాణ్యమును వేదములం దుంచి మెలగుట ఆస్తిక్య మని, అట్టి వేదప్రామాణ్య మంగీకరింపమి నాస్తిక్యమనియు చాటుచున్నవి. అట్టి వేదముయొక్క యర్థనిర్ణయము నెడ ననేక విప్రతిపత్తు లేర్పడుట సహజము. అందువలన సంగ్రహముగ వేదోదిత మగు విషయమును విపులీకరించుట యక్కఱ యైనది. ఏతదర్థమే పురాణేతిహాసావిర్భావము. ఇట్టి స్థితిలో "ఇతిహాసపురాణాభ్యాం వేదం సముపబృంహయేత్" అను నాభాణకముననుసరించి యపౌరుషేయ మగు వేదముయొక్క యర్థ

మును వివరించుటలో నితిహాసపురాణములకు ప్రమాణ గ్రంథరాశిలో పరమ ప్రామాణ్య మంగీకరింపబడినది. అందునను జయ మను పేర బరగు భారతేతిహాసమునకు ప్రాథమ్యము పైశ్లోకమున స్ఫుటముగ కనబ్బడుచున్నది. లేదా; ద్వంద్వసమాసఘటితములకు సమప్రాధాన్య మున్నందున భారతేతిహాసమునకు ప్రాధాన్య మవిచాల్యమై యొప్పుచునే యున్నది.

ఇట్టి భారతేతిహాసము పదునెన్మిది పర్వములతో "వేదానధ్యాపయామాస మహాభారతపంచమాన్" అను సూక్తి ననుసరించి పంచమవేదమను పేర ప్రసిద్ధమై భారతీయు లందరిచే పరమప్రమాణముగ శిరోధార్యమగుచు "ధర్మవర్తనులగు పాండవులవలె మెలగవలయు" ననియు, తమ పితృవ్యకుటుంబము రూపుమాపుటకై కొంపకు నిప్పు ముట్టించినవారును, విషాన్నమును పెట్టి నదిలో పడద్రోసిన వారును, కపటద్యూతమున సహోదరుల సర్వస్వ మపహరించి ద్రౌపదీవస్త్రాపహరణాద్యనేకావమానములో నర్చినవారును, మఱియు పాండవుల నరణ్యాజ్ఞాతవాసములకు గురిచేసి నానావస్థల పాల్పడ జేసినవారును, అరణ్యవాసకాలమునను తమ యౌన్నత్యమును జూపి వారికి మనోవైకల్యమును గూర్చు తలంపుతో నటకు వెడలి యట గాంధర్వబంధములో జిక్కుకొని "వయం పంచోత్తరం శత" మ్మన్ను సదుద్దేశ్యముతో ప్రవర్తిల్లిన ధర్మజుని ప్రోత్సాహము ననుసరించి విక్రమించిన యర్జునునిచే బంధవిముక్తులయ్యు, కృతఘ్నతాహతమతులై భారతయుద్ధాంతము వఱకు గోగ్రహణము, అభిమన్యువధ - ఇత్యాద్యకృత్యములకు పాల్పడి సర్వనాశమున కుద్యమించిన వారగు దుర్యోధనాదులవలె "అధర్మమునకు పాల్పడదగ" దనియు ప్రబోధించుచున్నది. మానవమాత్రులగు వారెల్లరు భారతేతిహాసమునుండి యాప్రబోధమును నాటినుండి నేటివఱకు గ్రహించి ధర్మాధర్మవివేకము నొంది యథోచితముగ ప్రవర్తించుచున్నారు. కనుకనే ప్రజలలో నెవడేని ధర్మమార్గము నుల్లంఘించుచో "వీడేమైన ధర్మరాజా ?" అనియు "వీడు- దుర్యోధ

నుడురా" అనియు అధర్మ ప్రవర్తకుని పరిహసించుచున్నారు. ఇట్లే ధర్మ ప్రవర్తకుని "వీడు నిజముగ ధర్మరాజురా" అనియు, "వీడు దుర్యోధనుడు కాదురా" అనియు గొనియాడుచున్నారు. ఇది యథార్థ జనక్షుణ్ణమైన మార్గము.

ఇది యిట్లుండ మామిత్రులు చి. ఆకెళ్ల అచ్చన్నశాస్త్రిగారు తమ విలక్షణమైన వ్యంగ్యవైభవగ్రహణపారీణతాభిమానము నూతగ గొని పై మార్గమునకు వ్యతిరేకముగ "గీతోపదేశ తత్త్వము" అను గ్రంథమును వెలయించినారు. దీనిలో "ధర్మరాజాదులును అధర్మపరులే" అనియు, "దుర్యోధనాదులు ధర్మపరులే" యనియు వీ రా యా శీర్షికలక్రింద విపులముగా ప్రమాణాభాసములతో వివరించిన గ్రంథభాగములకు సంగ్రహార్థమును గ్రహింపవలసి యున్నది. మంచిదే; వీరి వ్రాతను ప్రమాణముగ గ్రహించినచో నేది ధర్మమో, ఏది యధర్మమో తెలియని స్థితి యేర్పడి, "మొత్తము భారతమే ప్రమాణము కాదు" అని నమ్మునట్టిస్థితి అజ్ఞలోకమునకేర్పడును. ఈ దుస్థితి తొలగుటకు ఏ కొద్దిపాటి పాండిత్యము గలవారైనను విమర్శనదృష్టితో జూచి వేదములయెడ, తదుపబృంహకమగు భారతమునెడ, తద్భాష్యములయెడ, వ్యాఖ్యానవ్యాఖ్యానములయెడ దృఢప్రామాణ్యము కలవారయినచో, తమలో మోక్షాదివిషయములలో మతభేదము లున్నను, ఆస్తికమతములలో నేమతమునకైనను విరుద్ధముగ ప్రవర్తిల్లిన వీరి శీర్షికలక్రింది విషయములను పూర్వపక్షముగ గ్రహించి, పూర్వాపరవిషయవిరోధములు, స్వవచనవ్యాఘాతములు, విషయానిర్ధారణము మున్నగు దోషములకు నిలయమైన యీ వినూత్నగ్రంథమును ప్రమాణముగ గైకొనక, పూర్వాచార్యుల యొక్కయు, వ్యాఖ్యాతలయొక్కయు సంప్రదాయానుబద్ధవిషయములనే సదాశయముతో సిద్ధాంతీకరించుకొని అజ్ఞలోకమునకు పరమార్థమును బోధించి, "స్వయం తీర్త్వా పరాం స్తారయేత్॥" అను న్యాయానుసారము తాము తరించుటకు, ఇతరులను తరింపజేయుటకును ప్రయత్నింతు రని ఆశించుచున్నాను. ప్రజలలో ఆస్తిక్యము

పడలినచో "పరైః పరిభవే ప్రాప్తే మదధీనా తవ స్థితిః" అను సూక్తికి గురి యగు శ్రీ శ్రీనివాసపరబ్రహ్మముకూడ స్వయముగ భక్తజనావనబద్ధపరికరు డగుట భయభక్తులతో (ఇట భయమును స్వస్థితివిషయకముగను, భక్తిని స్వవిషయికముగను, భక్తహృదయనిష్ఠముగను గ్రహింపనగును.) పైన సూచించిన ప్రయత్నసిద్ధికై యన్నివిధముల యనుగ్రహించు నని నా విశ్వాసము.

ఇక మా మిత్రులును, మా పూజ్యపితృపాదు లగు కీ. శే. బులుసు అప్పన్నశాస్త్రులవారి శిష్యపరంపరలో జేరినవారును, దైవసాన్నిధ్యమునగూడ "అసురగృహ" నివాసులై ఆసురీసంపదభినివిష్టులైనవారు నగు చిరంజీవి ఆకెళ్ళ అచ్చన్నశాస్త్రిగారు ఇట్టి గ్రంథము వ్రాయుటలో నేదియో దృష్టేతరప్రబలకారణ ముండియుండును. అది యేదియైనను దీనికి ప్రయోజనమును గల్పించుట స్నేహధర్మముగ నెంచి "అపదోషతైవ విగుణస్య గుణః" అని సమర్థించుద మన్నను, 'స్వవచనవ్యాఘాతములు హెచ్చుగ నుండుట, నిర్దుష్టములు, నిష్కృష్టములు నగు సిద్ధాంతములు లేకుండుట, సర్వాస్తికవాదులకు సమ్మతము లగు సంప్రదాయసిద్ధసిద్ధాంతములకు సంపూర్ణముగ విరుద్ధము లగు నిర్ణయాభాసములు కోకొల్లలుగ నుండుట, ఇంతకంటె క్షమింపరాని విషయముగ పూర్వవ్యాఖ్యాతలపై సద్విమర్శకగర్వ్య మగు దుర్వచఃపకము వెదజల్లి తమగ్రంథమునే పంకిల మొనర్చుకొని దివాంధము లోకబాంధవుని గానలేక పగటినే దూషించునట్లు వెలితిపడి తమ యవివేకమును బట్టబయలు కావించుకొనుట - ఇత్యాదిదోషములతో నిండిన వీరి గ్రంథములో అపదోషతాభావమే యెట జూచినను దృగ్గోచరమైనది. ఇది నిర్వివాదాంశము. విశేష మేమన:- తమయభిప్రాయముల నా యా యుదాహరణములతో ననుపాదేయముల నుపాదేయములుగ నిరూపించి యజ్ఞులను భ్రమింపజేయుటలో వీరిదియందె వేసిన చేయి యన తప్పదు. మఱియు, "ఉత్థాతప్రతిరోపితకలమ"

న్యాయమున భారతీయుల కభ్యున్నతిని చేకూర్చు సత్సంప్రదాయసిద్ధ సిద్ధాంతములను పూర్వపక్షములుగా నున్మీలితములు గావించి యొక ప్రోగుగా నీగ్రంథరూపమున భారతీయుల ముందుంచి (సేద్యకర్మలో కొంత భారమును తగ్గించినట్లు) వీరు మహోపకృతిని యొనర్చినారనుటయు సత్యదూరము గాదు. ఈ సదవకాశమును జారవిడువక విజ్ఞులగువారు సంప్రదాయసిద్ధసిద్ధాంతముల ననతికాలము ననే పునఃప్రతిష్ఠితముల నొనర్చి ప్రచారము చేయుటకును, అజ్ఞులగువారు పెద్దల నుపసర్పించి తమ సంశయముల వర్జించి తమ హృదయక్షేత్రములలో సత్సిద్ధాంతములు నాటుకొని యిత్యోధిక ఫలము నందుటకును, మా మిత్రులును, సతీర్థశిష్యావతంసులు నగు శ్రీ ఆకెళ్ళ అచ్చన్నశాస్త్రిగారును వారి అనుమతి ననుసరించియే వ్రాసిన నాయభిప్రాయమున కాగ్రహావేశపూరితులు కాక, వారియెడ నాకు గల సౌభ్రాతృత్వము నాధారముగ గొని, వారియొక్కయు, ఏతద్గ్రంథపఠితలయొక్కయు శ్రేయః ప్రేయః ప్రచ్యుతిభీతితోనే వ్రాసినదిగా నెంచి ప్రసజ్యప్రతిషేధక న్యాయమున తామే తమ సిద్ధాంతములను పూర్వపక్షములుగ పునరావృత్తములను జేసి, సంప్రదాయసిద్ధసత్సిద్ధాంతములను సుప్రతిష్ఠితములను చేసికొని ప్రచారము చేయు సదాశయము కల్గియుండుటకును, శ్రీశ్రీనివాసపరబ్రహ్మముగూడ భక్తజనోద్ధరణబద్ధ పరికరు డగుట ప్రాజ్ఞ, అజ్ఞ, గ్రంథకర్తల సదుద్యోగమును సర్వాంతర్యామియై నెరవేర్చుటకును సాంజలిబంధముగ నా సదాశయము నాశంసించుచున్నాడను.

ప్రధానముగా గ్రంథకర్తలు పరబ్రహ్మస్వరూపులుగా పేర్కొనబడిన గురూత్తముల సన్నిధిని గురుతర గురుకులావాస క్లేశముతో సద్విద్య నార్జించి యనన్యప్రతిభావ్యుత్పత్తులతో "ఘటంపటయితుం, పటం ఘటయితుం వా" తగు సామర్థ్యము కల్గియుండియు సదసద్వివేకముతో పైన సూచించిన నా సదాశయమును నెరవేర్చుటకు పూనుకొననిచో వారి కృషి "భస్మని హుతమ్" న్యాయమున

వ్యర్థ మగుననుటయు, ప్రభూతగోక్షీర-విషబిందుమిశ్రణన్యాయమున విషప్రాయమై విషమఫలద మగు ననుటయు నతిశయోక్తి కాదు. కావున గ్రంథకర్తలే తాము వ్రాసిన ప్రథమభాగమును (శాస్త్రగ్రంథములలో "నను, నచ" ఇత్యాదిగ్రంథభాగమును వలె) పునః పూర్వపక్షగ్రంథముగా నెంచి రెండవభాగమును సత్సంప్రదాయసిద్ధ సిద్ధాంతగ్రంథముగా ప్రవచించి వ్రాసినచో నీకృషిఫలమును (సేద్య ఫలమును) బహుగుణితముగా తామే చూరగొనినవా రగుదు రనుట యథార్థకథనము. భారతసత్సిద్ధాంతముల నసత్సిద్ధాంతములుగ నిరూపించుటలో పతితలను తల లూపునట్లు చేసిన యఖండ పాండిత్యమండితులైన వీరు తత్పాండితీవిశేషముతో నిజమును నిజముగా నిరూపించుటలో నింతకంటె వేయిరెట్లధికముగా-సమర్థముగా - వ్రాయగల్గుదు రనుట నిర్వివాదాంశము.

వీరు కోరగా వీరియెడ స్నేహభావముతో మధ్యేమార్గము నాశ్రయించి వ్యంగ్యవైభవమున దమ యభిప్రాయములను వ్రాసి యిచ్చిన పండితప్రకాండులకంటె భిన్నమార్గము (వాచ్యవృత్తి) నాశ్రయించి సుహృత్సమ్మితముగ నా అభిప్రాయమును వ్రాసితిని. ఇందులకు కారణము వీ రెరిగినదే. వీరు తమ గ్రంథముద్రణమునకై మా ముద్రణాలయమునకు విచ్చేసి "ఈ గ్రంథముద్రణము కొంతవరకు చురుకుగా సాగి అలస్య మగుచున్నదనియు, మఱియు నీగ్రంథమున నేను పూర్వుల మతములను నిరసించుచు వేఱు విధముగ వ్రాసితిననియు జెప్పి మీ కేమైన దీనిని ముద్రించుటలో సందేహ మున్నదా!" యని ప్రశ్నించిరి. నేను వృత్తిధర్మము నాశ్రయించి ముద్రణమున కంగీకరించుచు, ఏతద్గ్రంథముద్రణద్వారమున సహకర్తృతాదోషము, అనుమంతృతాదోషము నాయెడ ప్రసక్తము లగునేమో యని శంకించి, "నేనుగూడ నీగ్రంథముపై నాకు దోచిన యభిప్రాయములు వ్రాయుట కంగీకరింతురా?" అని యభ్యర్థనపూర్వకముగ ప్రశ్న గావించితిని. అంత నాయెడ సుహృద్భావముతో వీరు "ఈ గ్రన్థమంత గ్రంథమును వ్రాయ

వయ్యా!" అని యనుజ్ఞ నిచ్చిరి. ఇట్టి నా యధికారము అభ్యర్థన పూర్వకముగా సంపాదించుకొన్నదియు, వారు నాయెడ సుహృద్భావముతో నొసంగినదియు నగుటచేతను, మత్సందేహ నివృత్తిఫలకమగుటచేతను నిట్లు ప్రత్యేకవిధముగా వ్రాసితినికాని పై పండిత ప్రకాండులకంటె నాయందు లేని ఘనత నాపాదించుకొనుటకు గాదు. ఇక నా యభిప్రాయ మీగ్రంథమున బాహిరపరీక్షచేసి వ్రాసినదే కాని, తలస్పర్శిగ నాంతరవిషయవిమర్శ చేసి వ్రాసినది కాదందు రేమో? ఈ గ్రంథమున కభిప్రాయము నిడిన పండితపుండరీకులు చాల వఱకు పృష్ఠసంఖ్యోట్టంకనముతో నా యా విప్రతిపత్తులను, విషయానిర్ణాయకసిద్ధాంతములను, స్వవచనవ్యాఘాతములను చూపియే యున్నారు. మఱియు, నీ శాస్త్రిగారు చేసిన నిర్ణయములు కొన్ని "మహాభారతతత్త్వకథనము" మున్నగు గ్రంథములయందు దత్తోత్తరములై యున్నవి. పాండవులయెడగూడ నాతతాయిత్వారోపణము, గీతలోని యన్ని యధ్యాయములకు అర్జునవిషాదయోగాత్మకానార్థకల్పనము మున్నగునవి యసంగతములగుటచేతను, అనూచానముగ నున్న నామములను వీడి యన్యార్థపరికల్పనమున ప్రత్యేకత గోచరింపకుండుటచేతను స్వప్రతిభామాత్రప్రదర్శనపరములే యై యవి చాలతరమణీయములుగనే భాసించుచున్నవి. కృష్ణార్జునగీతలకు గౌణాభేదకల్పన మలంకారప్రాయమే యగును కాని విశిష్టప్రయోజనసాధకము కాదని నా యభిప్రాయము. ఈ రీతిగ సంగ్రహముగ నన్నివిషయములను పేర్కొని వ్రాసినను నా యభిప్రాయము వీరు వ్రాసిన గ్రంథమంత గ్రంథ మగును. వీరందుల కుదారముగ ననుజ్ఞ నిడినను గ్రంథపరిమాణము గల యభిప్రాయమును వ్రాయుట సంప్రదాయవిరుద్ధమని యెంచి యీప్రయత్నమునుండి విరమించుచున్నాను. ఇంకొక మనవి: ఏతద్గ్రంథవిషయమున స్వాభిప్రాయము లొసగిన కొందరు పండితులు వీరి వ్రాతలు సందిగ్ధాశయములుగా నున్నవనియు, ఏతత్సందేహోపశోధకముగ రెండవ భాగ

మును వ్రాసినచో, దానిని చూచి సంతృప్తి నొందెదమనియు, నేతద్విషయమున వారి యసంతృప్తిని మృదుఫణితిని వ్యక్తీకరించిరి. మఱి నా యభిప్రాయ మందురా, వినుడు! వీరు ఇంతతో నీ విలక్షణప్రయత్నము వీడి యున్మూలితము లైన సత్సిద్ధాంతములను రెండవభాగమున వీరే పునఃప్రతిష్ఠితముల నొనర్చి బహుగుణితధర్మఫలమును తాము పొంది యితరుల కందింపవలయు నని నా సదాశయాశంసనము తెల్పుచు, —

“య చ్చార్థప్రవణా త్పురాణవచనా దిష్టం సుహృత్సమ్మితాత్”

అను విద్యానాథోక్తి ననుసరించి మిత్రసమ్మితము లైన పురాణేతిహాసములకు విపరీతవ్యంగ్యార్థస్ఫూర్తి కల్పించి, ధర్మేతరానర్థమును కల్పింపకుందురుగాక యని మైత్రీధర్మమున హితమును పల్కుచు నా యభిప్రాయమును సంగ్రహించుచున్నాడను.

“పథ్యం హితం, సాధు వచశ్చ దుర్లభమ్.”

ఇట్లు
సుధీజనవిధేయుడు,
శ్రీ శారదాముద్రణాలయాధికారి,
బులుసు వేంకటశాస్త్రి.

భట్నవిల్లి.
ది. 11-12-1982.

# శుభాకాంక్ష

పావనగౌతమీనద్యంతశ్శాఖయై ప్రవహించు వైనతేయనది తీరమున గల తొండవర మను గ్రామము తొండేశ్వరకృపావిలసితము; శాంతపావనజీవన మాశించిన గృహస్థుల కది నిలయము. అదియే యీ గీతోపదేశతత్త్వరచయిత యభిజనము. నేను, ఈ రచయితయు సమానాభిజనుల మగుట, ఏతద్గ్రంథప్రవర్తకు లయిన శ్రీకృష్ణార్జునుల కున్న సంబంధమే మా యిరువురి నడుమ బాంధవ్యబంధన మగుట, మఱియు నే నీ రచయితతో 'ఓనమాలు' పఠించుటయు ప్రధాన కారణములుగా నేర్పడిన చనువును, దానిని మించిన మెఱుకను పురస్కరించుకొని ఏతద్గ్రంథవిషయమున నా యభిప్రాయమును సహృదయుల ముందుంచుటకు సాహసించుచున్నాను. చదువరులు నా యీ ప్రయత్నములోని గుణములు గ్రహించి దోషములు విడుతురుగాక!

ఈ రచయితతో నేను 'ఓనమాలే' చదువగ నాచదు వింత వఱకు ఓనమాలుగనే మిగిలిపోయినది. కాని యీ రచయిత గాఢ జిజ్ఞాసతో విశాలప్రపంచమున నడుగిడి శిష్యచిత్తాపహారకు లయిన గురువర్యులను సమాశ్రయించి, శుశ్రూషచే వారి కృపకు పాత్రుడై కావ్యనాటకాలంకారశాస్త్రము లాపోశన పట్టెను. మఱియు "ఆచార్యాత్పాద మాదత్తే పాదం శిష్య స్స్వమేధయా।, పాదం సబ్రహ్మచారిభ్యః పాదం కాలక్రమేణ తు॥" అను రీతిగ నీతడు బహుగ్రంథ పరిశీలన మొనర్చి బహుముఖప్రజ్ఞావంతుడై యీ యుద్గ్రంథరచన సాగించె ననుట వస్తుస్థితికథనముమాత్రము.

ఏతద్గ్రంథరచనకు పూనిన యీ దీక్షామూర్తి ముందుగ భగవద్గీతను ప్రత్యక్షరసమీక్షతో కొన్ని వందలు తడవులు పారాయణ మొనర్చెను. నిరంతరము తద్వ్యాఖ్యానములను సవిమర్శ పరిశీలనము గావించెను. అవసరపడి మహాభారతమును మథించెను. తద్గ్రంథతత్త్వకథనములను నిశితదృష్టిని వీక్షించెను. ప్రస్తుతప్రసక్తము

లైన రామాయణ, భాగవతాద్యార్షగ్రంథముల నెల్ల నాసక్తితో పఠించెను. మఱియు, నింతకు మున్ను పఠించిన ధ్వన్యాలోక, రసగంగాధరాదిప్రామాణికగ్రంథములను పునఃపునఃపరిశీలన గావించెను. ఏతత్కృషిసమాసఫలితమే ఏతద్గీతాతత్త్వావిర్భావ మని నానిశ్చప్రిచమైన భావము. ఏతద్గ్రంథమును సాంతముగా చదివినచో సహృదయుల కీభావము తేటతెల్లము కాగలదు.

ఈ రచయిత యింతకృషి యొనర్చి యీగ్రంథరూపమున వెల్లడించినది, సాధించినది యేమన్న నెంతేని కలదనియే నా యభిప్రాయము. అదేదో పరికింతము ;—

ఈ గ్రంథములో నపూర్వములైన సంగతు లెన్నో ప్రతిపాదింపబడినవి. కృష్ణార్జునసంవాదరూప మగు గీతకు, కృష్ణార్జునులకు, గీతాశ్రోతలకు యోగసంపన్నత కలదని నిరూపించుట, కృష్ణార్జునుల కైక్యము ప్రతిపాదించి వారితో గీత కభేదము తెల్పుట, విషాదయోగము, అర్జునవిషాదయోగము అను మాటలకు బహుముఖార్థములు కల్పించి బహువిధముగ సమర్థించుట మున్నగున వన్నియు అపూర్వములైన విషయములు. మఱియు నీగ్రంథమున రచయిత ప్రసక్తానుప్రసక్తముగ భారతకథలోని ధర్మాధర్మములను, ఆ యా పాత్రల మనస్తత్త్వములను, వా రనుసరించిన న్యాయ్యాన్యాయ్యప్రవృత్తులను మూలగ్రంథతత్త్వావలోకన, బహుగ్రంథపరిశీలనసముపలబ్ధమైన, స్వీయోపజ్ఞాసముదితమైన ప్రజ్ఞాప్రాభవములతో నిశితముగ తఱచిచూచి కొన్ని అపూర్వసంగతులను, నిర్ణయములను ప్రకటించెను. గ్రంథమును సాంతముగ పఠించువారికి శీర్షికారూపములో నవి కొన్నివిస్ఫుటముగ కన్పట్టును. కొన్ని సూక్ష్మపరిశీలనమున పొడసూపును. గీతాతత్త్వవిషయమున, భారతకథావిషయమున, పాత్రలవిషయమున, తద్గతన్యాయ్యాన్యాయ్యవిషయమునను సాంప్రదాయబద్ధమైన భావము గల సనాతనుల కందు కొన్ని సమ్మతములు కాకపోవచ్చును. కాని, కొన్ని సర్వజనాంగీకార్యములై హృదయంగమములైన విషయము

టున్నవి. ఆతతాయితనము కౌరవపాండవులయందు సమానముగనే యున్న దనుట, ధర్మజు నధర్మాత్మునిగను, సుయోధనుని ధర్మాత్మునిగను పేర్కొనుట యిత్యాదులు మొదటి తెగకు చెందగా భీష్మార్జునవైశిష్ట్యకథనాదులు రెండవ తెగకు చెందినవి. ఏమైనను భగవద్గీతను, భారతమును, తత్సంబంధి ప్రామాణికగ్రంథములను నిష్పాక్షికదృష్టితో పరిశీలించువారికి సద్యుక్తులతో, సునిశితమతితో సప్రమాణముగ వచింపబడిన తన నిర్ణయములు, సిద్ధాంతములు త్రోసిరాజనుటకు వీలయినవి కాక, శిరోధార్యములు కావలసినదే యను భావమీ రచయిత కుండుట గమనింపదగినది. ఈ యభిప్రాయ మీరచయితకు కలదనుట కీత డితరపండితవిమర్శకుల యభిప్రాయములను ఖండించు ఘట్టములందు వారిని "కుమతులు, దుర్యుక్తివిలసితమతులు" ఇత్యాదిపరుషపదజాలముతో నిరసించుటయే నిదర్శనము. ఇత డట్టి పదజాలమును వాడుటలో నాంతర్యము తాను సిద్ధాంతీకరించిన విషయము లంత ప్రమాణబద్ధములై న్యాయసమ్మతములయిన వని నమ్ముటయే యనవచ్చును. అదియట్లుంచి వాస్తవస్థితిలో అపూర్వవిషయప్రతిపాదకమైన యీగ్రంథారంభము సమర్థనీయమే యగుచున్నది.

బహుగ్రంథపరిశీలనమున బహుముఖపాండిత్య ప్రాభవమున ఈ రచయిత యీగ్రంథమందు వెల్లడించిన యభిప్రాయములు, సిద్ధాంతములు సహృదయధురీణవిమర్శక, విద్వత్తల్లజుల మనస్సుల నెంతవఱకాకట్టుకొనునో యన్నది గ్రంథావిష్కరణానంతరము తన్నికషోపలముల పైన తెలియదగిన యంశము"

ఏమైనను ఏతద్గ్రంథరచనలో ఈ రచయిత చూపిన ప్రతిభ, పాండిత్యము బహుధా ప్రశంసనీయములు. అభ్యుదయభావసంపన్నుడైన యీపరిచిత రచయిత యిక ముందును నిరంతరకృషితో నార్షధర్మావలంబములైన సద్గ్రంథములను లోకకల్యాణమునకై వెలయించుగాక! యని యాకాంక్షించువాడను.

నమో మహద్భ్యః.

తొండవరమ్, "ఏవమ్ ఆశిషః"

11-12-1982 వెంపరాల శివబ్రహ్మశాస్త్రి.

# మున్నుడి

యుక్తోఽయ మాత్మసదృశా న్ప్రతి మే ప్రయత్నో
నాస్త్యేవ త జ్జగతి సర్వమనోహరం యత్ ।
కేచి జ్జ్వలంతి వికసంత్యపరే నిమీలం
త్యన్యే య దభ్యుదయభాజి జగత్ప్రదీపే ॥

లోకప్రదీపుడగు సూర్యభగవాను డభ్యుదయ మందుచుండగ సూర్యకాంతమణులు భగ్గున మండును. లక్ష్మీనివాసములగు కమలములు వికసించును. కలువలు కనులు మూయును. సర్వమనోహరమగు వస్తు వేదియును జగత్తున లేనేలేదు. కావున ఈ నా ప్రయత్నము ఆత్మ సదృశుల నుద్దేశించినదే.

విశిష్టాలంకారిక ప్రస్థానముగ ఆనందవర్ధనాచార్యప్రవర్తితమై సుప్రతిష్ఠితమైనధ్వని సిద్ధాంతసర్వస్వమును అనుమానాంతర్భూతముగ ప్రకాశింపజేయు ప్రతిన బూనినవాడై మహిమభట్టు "వ్యక్తి వివేకము" అను సిద్ధాంతగ్రంథమును విరచించుచు కృత్యాదియందు పై విధముగ చెప్పెను.

ఒక మహిమభట్టే కాదు. ప్రతిగ్రంథకర్తయును ఈసు నసూయలకు లోనైన సమకాలికుల విమర్శనల కిట్లే సమాధానములను చెప్పియుండెను.

పురాణ మిత్యేవ న సాధు సర్వం న చాపి కావ్యం నవ మిత్యవద్యమ్।
సంతః పరీక్ష్యాన్యతరద్భజంతే మూఢః పరప్రత్యయనేయబుద్ధిః ॥

అను కాళిదాసశ్లోకములో ఆతని సమకాలికులవలన మహాకవి లోనైన వ్యథ సూచితమగుచున్నది. భవభూతికీ సమకాలికపండిత నిరాదరణక్లేశము మిక్కిలి శిరోవేదనము కాగా అతడు వారి కిట్లు సమాధానము చెప్పెను—

యే నామ కేచి దిహ నః ప్రథయం త్యవజ్ఞాం
జానంతి తే కి మపి తాన్ప్రతి నైష యత్నః ।

ఉత్పత్స్యతే మ తు కో౽పి సమానధర్మా
కాలో౽హ్యాయం నిరవధి ర్విపులా చ పృథ్వీ॥

సంస్కృతకవులే కాదు, సమకాలికుల ఆదరణమునకు నోచః తెలుగు కవులు సైతము ఈ విధముగనే ప్రతిఘటించిరి.

క్షితిపయి వట్టి మాత్రికులు చిగిర్ప వసంతుడు తా రసోపగుం
భితపదవాసనల్ నెఱప, మెచ్చక చంద్రుడు మిన్నునన్ బ్రౌ
న్నతయును సౌకుమార్యము గనంబడ రాల్గరగంగ జేసె, ౹
గతి రచియించిరేని సమకాలమువారలు మెచ్చరేకదా
(విజయ విలాసము 1-210)

మహా కవులకే సమకాలికుల మెప్పు లభింపలేదు.

ప్రస్తుతము నా యీ 'గీతోపదేశతత్త్వము' పండిత విమర్శ కుల ఆగ్రహమున కర్హము కాదని తలచు మూర్ఖుడను కాను.

ఈ గ్రంథములో కొన్ని ఘట్టములు ప్రహతమార్గములో లేవు.

రేఖామాత్ర మపి క్షుణ్ణా దామనో ర్వర్త్మనః పరమ్।
న వ్యతీయుః ప్రజా స్తస్య నియంతు ర్నేమివృత్త్యయః॥
(రఘువంశము-1-)

అను శ్లోకములో మహాకవి కాళిదాసు 'పూర్వసరళి దాటరానిది' అని నియమించినట్లున్నది కదా! మరి పూర్వనియమావళి నధిగమించిన ఈ నాగ్రంథము దోషజుష్టమే కదా! యని అనవచ్చును. కానే కాదు. ఏవిషయములోను నియమభంగము చేయలేదు.

పూర్వనియమములుగ చెప్పబడుచున్న వానిలో రెండు అంశములు గలవు. ఆధారగ్రంథము లొక అంశము. వ్యాఖ్యాన గ్రంథములు రెండవ అంశము. భగవద్గీత యాధార గ్రంథము. దానిపై లెక్కకు మిక్కుటముగ ఉద్భవించిన నానా వ్యాఖ్యానములు ఆధేయములు. ఈ రెండును పూర్వసరణికి చెందినవే.

ఆధారగ్రంథమగు భగవద్గీత, దాని ఆధిక్యమును కాదనుట వేరు. దానిపై గల వ్యాఖ్యానములను కాదనుట వేరు. వ్యాసమహర్షి

రచించిన గీతను కాదని అన్నప్పుడే సంప్రదాయవిరుద్ధ మగును. వ్యాఖ్యానములను కాదనినప్పుడు వైరుధ్యమని చెప్ప పని లేదు. చెప్పకూడదు కదా! అట్లు చెప్పినవారు ఎన్ని గంతులు వేసినను గల్లంతు అగుదురు. శ్రీ శంకరభగవత్పాదులు తమ కంటె పూర్వ ములగు వ్యాఖ్యానములను తీవ్రముగ ఖండించిరి. శంకరుల కాల మించు మించు క్రీ.శ. 8 వశతాబ్దముగ పండితులు, విమర్శకులు నిర్ణ యించిరి. క్రీ. శ. 8వ శతాబ్దములో రచితమైన 'శాంకర భాష్యము' తప్ప అన్యభాష్యమును చదువుటయు, నమ్ముటయు నరకహేతు వగును' అని చెప్పుచున్నారు. మన భారతీయ సంప్రదాయ మెచ్చట నుండి ఎప్పటినుండి వచ్చినదో ఎవరును తేల్చిచెప్పలేరు. పోనీ, వ్యాసుని కాలము సరిగ తేల్చిచెప్పగలిగిన వారున్నారా? లేరు. మరి క్రీ.శ. 8వశతాబ్ది వరకు అందరును నరకము పొందిరా?

సరే! శంకర సిద్ధాంత మైన నిలచినదా? ఇదియు ఖండింపబడి నది. అదియు శ్రీశంకరులు ప్రమాణీకరించిన వేదములో నుండియే అనేక ప్రమాణోపపత్తులు చూపి బహుముఖములుగ ఖండింపబడినది. ఆ ఖండనములు వెలుగొంద లేదా? కనుక, వ్యాఖ్యాన గ్రంథములు పరిమితప్రమాణము లే కాని మూలగ్రంథముల వలె సార్వజనీనములు, సార్వకాలికములును కావు.

కొందరు ఏకాంత మందున్నపుడు – తామనుసరించు సిద్ధాంత మనుసరించువారే అమృతత్వము నొందుదురు. బ్రహ్మపదము నందు దురు. స్వర్గ భోగముల నందుదురు. తక్కినవారి గతి అధోగతియే. వారి సంగతి పునరపి జననం పునరపి మరణమే– అని చెప్పుచుందురు.

కాని మరల వారే, పండితసభలలోగాని, మరెక్కడ నైన గాని స్వవిరుద్ధ వ్యాఖ్యాన సంప్రదాయానుసారులగు పండితులు కలసినప్పు డు అహో! మీ రెంత గొప్పవారు. మీరు తీర్థభూతులు. మీదర్శ నము సకలపాప వినాశకము. మిమ్ములను చూచిన ఈ దినము సుది నము. మీరు లేకున్న ఈ సూర్య చంద్రు లిట్లు ప్రకాశింతురా? వర్ష ములు కురియునా? పంటలు పండునా? ప్రజలు సుఖింతురా మీ వల

ననే ఈ కలిమలము ధ్వంసమగుచున్నది—ఇత్యాదిగ ప్రశంసలు పలుకుదురు. వారటు తిరుగగనే– ఇట్టి సిద్ధాంతములు పాటించుచున్నందునే కదా కాలమిట్లు తగులబడుచున్నది. ఎక్కడ చూచిన అతివృష్ట్యనావృష్టి క్షామములు ప్రబలి పోవుచున్నవి. ఆహా! కలికాల మహిమ–అని ఏవేవో నిందాపూర్ణ వాక్కులు స్వానుయాయులతో చెప్పుకొనుచు గొప్ప వ్యంగ్యమున ఎదుటివారిని కించపరిచితి మని ఆత్మస్తుతి చేసికొనుచు పొట్టపగుల విరగబడి నవ్వుకొనుచు తమ హాస్యమునకు తామే ఆనందించుచు పోవుచుండుట సరసులకు తెలియనిది కాదు. ఇట్టి వారి వ్యాఖ్యానము లన్నియు సుందోపసుందన్యాయమున నున్నవే.

ఇట్టి స్థితిలో వీరు ఆస్తికులు, వీరు నాస్తికులు– అని నిర్ణయించుట అసంగతము.

నా చిన్నతనమున అ.గ చదువుకొనుచున్న రోజులలో ఒక పురాణప్రవచనము వినుట తటస్థించినది. ఆపురాణశాస్త్రులవారు ఇట్లు చెప్పిరి. –

భగవద్గీతలో ప్రథమాధ్యాయమున దుర్యోధనుడు ద్రోణాచార్యులతో మాటలాడిన ప్రసంగము కలదు కదా! ఈ ప్రసంగమును 'దుర్యోధన ఉవాచ' అను వాక్యమును చెప్పిచెప్పక 'సంజయఉవాచ' అను వాక్యము క్రిందనే సంజయానువాదముగ నేల చెప్పబడినదో తెలియునా? ఆ దుర్యోధనుడు పరమపాపి కనుక పరమ పవిత్ర మగు భగవద్గీతలో "దుర్యోధన ఉవాచ" అని యుండుట తగదని పరమర్షి వ్యాసుడు భావించెను. భీముడు దుర్యోధనుని తొడలు విరగగొట్టి చంపుదు నని ప్రతిజ్ఞ చేసెను. సరే! శత్రువును చంపుట కా ప్రతిజ్ఞ చాలదా? దుర్యోధనుని శిరస్సును వామపాదమున తన్నుదునని ఏల ప్రతిన చేసెను? అతడు ప్రతిజ్ఞాపాలనము కావించె ననియు అందరకు తెలిసినదే. దీని యంతరార్థమేమి? దుర్యోధనుని నీచత్వమును చూపుటయే కదా! ఇది వ్యాసుని హృదయము. కావుననే పరమ పవిత్రమగు భగవద్గీతలో "దుర్యోధన ఉవాచ" అని ప్రయోగింపక, వాని వాక్యములనుసంజయ వాక్యములుగ అనువదించెను",

సంప్రదాయబద్ధుల మనుకొనుచు కొందరిట్లు లేనిపోని అస్వారస్యములను వెల్లడించుచుండుటవలన మన సంప్రదాయము "నానాటికి తీసికట్టు నాగంభట్టూ" అన్నట్లగుచున్నది.

"దుర్యోధన ఉవాచ" అని చెప్పరాదని వ్యాసమహర్షి భావించియుండునా? నిజ మాలోచింతము. అతని కట్టి భావమే ఉన్నచో మహాభారతములో మరెన్నో స్థలములలో ఆవాక్యమును ఎందులకు ప్రయోగించెను? "భగవద్గీత ప్రత్యేకమగు వేదాంత గ్రంథము. ప్రస్థాన త్రయములో నిది ప్రకృష్టము. కనుక దీనిలో "దుర్యోధన ఉవాచ" అను వాక్యమును మహర్షి పరిహరించెను"- అని కొందరు వాదించుచున్నారు. అదే నిజమగుచో భగవద్గీతను చదువునప్పుడు మనము "ఇతి శ్రీమన్మహాభారతే శతసహస్రికాయాం సంహితాయాం వైయాసిక్యాం భీష్మపర్వణి భగవద్గీతా సూపనిషత్సు" అని చెప్పియుండువారము కాము. భగవద్గీత భారతాంతర్గతమే యని ఈ గద్య స్పష్టీకరించుచుండగ, భగవద్గీత విశిష్టవేదాంత గ్రంథమనియు, దానిలో దుర్యోధనప్రసక్తి కూడదని వ్యాసభగవానుడు భావించెననియూ, కావుననే 'దుర్యోధన ఉవాచ' అని చెప్పవలసిన సందర్భములో దానిని పరిహరించెనని వ్యాఖ్యానించుట మూలగ్రంథ పరిచయ మించుకయైన వారికి లేదను యథార్థమున కద్దము పట్టుటయే కదా!

మరి, భగవద్గీతలో "దుర్యోధన ఉవాచ" అని లేకుండుటకు హేతు వేమి? దుష్టమతులగు వారు మనస్సులో నేదో నిస్సారమైన స్వారస్యమును వెలువరించి తద్ద్వారమున కీర్తి గడింపవలయు నన్న భావముతో మూలగ్రంథములో నుండియుండుటకు అవకాశమున్న "దుర్యోధన ఉవాచ" అను వాక్యమును తీసివేసి యుందురు. "గతానుగతికో లోకః న లోకః పారమార్థికః" అన్నట్లు, "శతాంధాః కూపం ప్రవిశంతి" అన్నట్లు పరప్రత్యయనేయ బుద్ధులు ఈనాటికిని ఆ తంతుకే వంత పాడుచున్నారు. నిజముగ వ్యాసమహర్షి హృదయ మదే యగుచో, భగవద్గీత ప్రత్యేకగ్రంథముగ రాణింపవలయునన్న భావము

మహార్షి కుండినచో, ఆ భాగములో ఆ దుర్యోధనుని ప్రస్తావ మే మాత్రము రాకుండగ ఆరంభించి యుండెడివాడు. కాని అతడట్లు చేయలేదు.

ఈ సందర్భములో కొందరు మరొక దుర్వ్యాఖ్యానముకూడ చేయుదురు. "శ్రీ ఆదిశంకరులు భగవద్గీతకు - అశోచ్యా నన్వ శోచ స్త్వం - అను ద్వితీయాధ్యాయములోని పదునొకండవ శ్లోకము నుండియే వ్యాఖ్యాన మారంభించిరి. కావున యథార్థ భగవద్గీతకు ఆ పై శ్లోకమే ఆదిశ్లోకము!" అని.

శ్రీశంకరాచార్యుల ప్రతిశ్లోకవ్యాఖ్యానము వీరు చెప్పినట్లు భగవద్గీత 2-11 నుండియే కలదు. కాని ప్రథమాధ్యాయము మొత్తము, ద్వితీయాధ్యాయములో పదియవ శ్లోకము వరకు గల భాగమును గీతాశాస్త్రమునకు పీఠికగ గ్రహింపవలయు నని వారు ప్రకటించిరి. "దృష్ట్వా తు పాండవానీకం" ఇత్యారభ్య "న యోత్స్య ఇతి గోవింద ముక్త్వా తూష్ణీం బభూవ హ" ఇత్యేతదంతః ప్రాణినాం శోకమోహాది సంసారబీజభూత దోషోద్భవకారణ ప్రదర్శనార్థత్వేన వ్యాఖ్యేయో గ్రంథః" ఇట్లు మొదట దుర్యోధనార్జునుల వచనములను సాకల్యముగ గాని వ్యాఖ్యానింపనగినట్లు వ్రాసిరి. "తథాహ్యర్జునేన రాజ్యగురుపుత్రమిత్ర సుహృత్స్వజన సంబంధి బాంధవేష్వహ మేషాం మమైత ఇత్యేవం ప్రత్యయ నిమిత్త స్నేహవిచ్ఛేదాది నిమిత్తా వాత్మనః శోకమోహౌ ప్రదర్శితౌ"। "కథం భీష్మ మహం సంఖ్యే ఇత్యాదినా," అని మరల అర్జునునిమాత్రమే ఆధారముగ స్వీకరింపవలయు నని నిర్ధారణ చేయుచు దుర్యోధనుని విసర్జించిరికదా అని అన వచ్చును. ప్రకృతము కృష్ణార్జునసంవాదరూపమగు భగవద్గీతలో దుర్యోధనునకు ప్రత్యక్షముగ ప్రమేయము లేనందున, నిమిత్త మర్జునుడే అగుచున్నందున అర్జునుని ప్రత్యేకముగ పేర్కొనట సంభవించినది. ఈ నెపముతో దుర్యోధనవచనములు భగవద్గీతాంతర్గతములు కావను వాదము శ్రీ శంకరభగవత్పాదులకు సమ్మత మని

వ్యాఖ్యానించుట తగదు. శ్రీ శంకరుల దృష్టి భగవద్గీత యాధార ముగ సర్వోపనిషత్సిద్ధాంతము ప్రతిపాదించుటే అగుటవలన "అశో చ్యా" నిత్యాది శ్లోకమునుండి స్వసిద్ధాంతానుగుణమగు వ్యాఖ్యా నము చేయవలసినవారైరి. ఆనందగిరి మున్నగు మహామహు లందరు గీత ప్రథమాధ్యాయము ప్రథమ శ్లోకమునుండి వ్యాఖ్యలను రచించినారు. కనుక దుర్యోధనుని వచనములు గీతాంతర్గతములు కావు. అనుట అతి సాహసవచనము. కావున వ్యాసహృదయ విరుద్ధ ముగ గీతనుండి "దుర్యోధన ఉవాచ" అను మకుటము తొలగించుట సదాచారమునకు లక్షణముకాదు.

ఇట్లే మరింకెన్నో విషయములలో మూలగ్రంథమున కపకర్షా వహము లగునట్లుగ వ్యాఖ్యాతలు చేసియున్నారు. మూలగ్రంథాను సారులకు ఈ వ్యాఖ్యాతల వ్రాతలు విస్మరణీయములే. మూలగ్రం థమును ప్రమాణీకరించుకొని కొనసాగుటయే సదాచారపద్ధతిగ భావిం పవలయును. అట్టి పట్టున మూలగ్రంథానుసారముగ శోధితమగు తత్త్వమును నిరూపింప యత్నించు సద్విమర్శకునకు, వ్యాఖ్యాతలెంత గొప్పవారైనను, వారిననుసరింపకపోవుట నాస్తికత్వమునకు లక్షణ మనియో, అధర్మ ప్రవర్తనమునకు చిహ్నమనియో చెప్పుట తగని మాట. కృష్ణుడు కూడ గీత చెప్పి 'విమృశ్యైత దశేషేణ యథే చ్ఛసి తథాకురు.' అనియే చెప్పెను కాని తాను చెప్పినదే అక్షరాల నిజమనియు, దానినే అనుసరింపుమనియు చెప్పలేదు. అయిన విమర్శ కుడు అపమార్గమును త్రొక్కినట్లెట్లగును?

సదాచారమునకు పెద్దలు కొన్నిమార్గము లేర్పరచిరి. వానినను సరింపవలెను కదా! అన్నచో కాదనువారెవ్వరు ? కాని సదాచారము ననుసరించువారు వ్యాఖ్యాతలను తు, చ, తప్పకుండ మక్కికి మక్కిగ అనుసరింపు మనుట మంచి లక్షణము కాదు. దీనికి ప్రబల మగు ఒక ఉదాహరణము చెప్పెదను.

ద్రౌపది పంచపాండవులను వివాహమాడుట లోకవేదవిరుద్ధము అని ద్రుపదాదులు సంశయించిరి. ధర్మరాజు తమకు మాతృవచనము శిరోధార్యమనియు, తన యాత్మయు ఈవివాహము ధర్మవే యని బోధించుచున్నదనియు పలికి ఈ విధమైన వివాహము లోకవిరుద్ధము కాదనుటకు అనేకోదాహరణములను చూపెను. ఆ సందర్భములో వ్యాసమహర్షి ద్రౌపదీపూర్వజన్మ వృత్తాంతమును ఎఱిగించి ఆమె పంచపాండవులను వివాహమాడుట దుష్టము కాదని వివరించెను. ఇక్కడ ధర్మరాజు కాని, వ్యాసమహర్షి కాని ఈ వివాహము వేదవిరుద్ధము కాదని నిరూపింపలేదు. ఈ ప్రసంగములో ఒక వ్యాఖ్యాత వ్యాఖ్యానమును గమనింపుడు—

సూక్ష్మో ధర్మో మహారాజ! నాస్య విద్మో వయం గతిమ్ ।
పూర్వేషా మానుపూర్వ్యేణ యాతం వర్త్మానుయామహే ॥
నమే వాగనృతం ప్రాహ నాధర్మే ధీయతే మతిః ।
ఏవం చైవ వదత్యంబా మమ చైతన్మనో గతమ్ ॥

టీక॥ సూక్ష్మః "నైకస్యై బహవ స్సహపతయః" ఇతి శ్రుత్యా సహేతి యుగపద్బహుపతిత్వనిషేధో విహితో న తు సమయభేదేన, తతశ్చానిషిద్ధం, మాత్రా సమేత్య భుంక్తే త్యాజ్ఞప్తం చ న లంఘనీయమ్. పితోరాజ్ఞయా నిషిద్ధమపి కర్తవ్యమ్, పరశురామకృత మాతృవధవత్, కిముత అనిషిద్ధమితి భావః "పూర్వేషాం ప్రచేతః ప్రభృతీనాం తైర్యాతం వర్త్మ బహూనా మేక పత్నీత్వ మనుయామహే, తచ్చానుపూర్వ్యేణైవ న త్వక్రమేణ.

ఈ టీకలో నుదహరించిన శ్రుతి పాఠ మిట్లున్నది.

"ఏకస్య బహ్వ్యో జాయా భవంతి నైకస్యా బహవస్సహపతయః, ఇతి యదేకస్మిన్ యూపే ద్వే రశనే పరివ్యయతి తస్మాదేకో ద్వే జాయే విందతే యన్నైకాం రశనాం ద్వయో ర్యూపయోః పరివ్యయతి తస్మాన్నైకా ద్వౌపతీ విందతే.

ఈ శ్రుతిలోని "సహ" శబ్దమును వ్యాఖ్యానించుచు – ఒకే సమయమున అనేకపతులుండుట నిషిద్ధము కాని విభిన్న సమయము

లలో అట్లుండుట దోషము కాదని ఆ వ్యాఖ్యాత వివరించిరి. ఈ వివరణము ద్వారమున ద్రౌపదీ వివాహము వేదవిరుద్ధము కాదని నిర్ధారణ చేసిరి.

ఇక్కడ ఈ వేదవాక్యముచే ద్రౌపదీవివాహమును వ్యాసమహర్షి సమర్థింపదలచియున్నచో ద్రుపదుని ఒప్పించుటకు ద్రౌపదీ పూర్వజన్మ వృత్తాంతమును చెప్పినతర్వాత ఈ శ్రుత్యర్థమును వివరింపకుండునా? ధర్మరాజు కూడ దీనిని తన కృత్యమున కన్వయింపకుండునా?

వ్యాసమహర్షి కాని, ధర్మజుడు కాని ఈ వివాహమును ఒక విశేషవిధిగ భావించినవారే గాని వేదవిరుద్ధము కాదన్నవారు కారు.

అయినచో శ్లోకములోని 'సూక్ష్మో ధర్మః' అన్న చోట 'సూక్ష్మ' శబ్దమున కర్థమేమి? ఈ శ్రుత్యర్థమే యని వ్యాఖ్యానించుటకు వీలులేదు. ధర్మరాజు 'సూక్ష్మోధర్మః' అని చెప్పి- నామాట అబద్ధముకాదు. నాబుద్ధి ధర్మబద్ధమై యున్నది. నాతల్లియు నట్లే చెప్పినది_అనెను. అతని వచనములకు ప్రమాణముగనే సూక్ష్మశబ్దము వ్యాఖ్యానింపవలెను.

ద్రౌపదికి పంచపతిత్వవర మొసగిన మహేశ్వరుడుకూడ "నీవు 'పతిం దేహి' యన్నవరము నైదుసార్లు అడిగినందున నీకిట్లు వరమునిచ్చితిని" అని చెప్పెనే కాని "ఇది వేదసమ్మత" మని చెప్పలేదు వేదసమ్మతము కాని ఈ వరమును ప్రమాణీకరించుటకై "దినదిన కౌమారము పొందుట" యను వరమును కూడ ఈశ్వరుడు ఆమెకు ప్రసాదించెను.

యథార్థ మిట్లుండగ వ్యాఖ్యాతలవ్రాతలేమి ఇట్లున్నవి? 'బిభేత్యల్పశ్రుతా ద్వేదః మామయం ప్రతరిష్యతి' అన్న వచనము ఇట్టివ్యాఖ్యాతల పట్టుననే సమన్వయమగును. 'నాస్తికో వేదనిందకః' వేదమును నిందించువాడనగ వేదము దుష్టము. వేదము దుష్టము

అనువాదుకాదు. వేదవచనమునకు అపార్థమును చెప్పి దానిని అప్రమాణమనిపించునట్లు వ్యాఖ్యానించువారే వేదనిందకులు. వారే నాస్తికులు.

మరి శ్రుతిలోని 'సహాపతయః' అనుదానికర్థమేమి?
"సోమః ప్రథమో వివిదే. గంధర్వో వివదఉత్తరః, తృతీయోఽగ్నిష్టేపతిః. తురీయస్తే మనుష్యజాః." ఇత్యాదివాక్యములయందు సోముడు మున్నగువారు 'కన్యకకు పతులుగ చెప్పబడుచున్నారు. వారుకూడ ఏకకాలమున పతులుగ నుండరు. అనుటయందే తాత్పర్యము. వారి పతిత్వము రక్షణార్థమున మాత్రమే పరిమితము. 'సహపతయః' అనునది వివాహపతిని చెప్పునది కాదు. వివాహోత్పూర్వము పతులుగ నున్న సోమాదుల ఏకకాలబహుపతిత్వమునకు మాత్రమే నిషేధకము. "సమయభేదమున వివాహప్రాప్త బహుపతిత్వాస్వీరకము" అని చెప్పుట వేదమును మంట కలుపుటయే.

"పతీనాం చ దేవృాణాం చ సజాతానాం విరాడ్భవ" అను నీ మంత్రమున బహువచనములో నున్న పతిశబ్దమునకు "పత్యుర్మమ మత్స్థానీయానాం చ" అని హరదత్తాచార్యులు వ్యాఖ్యానించిరి. అనగనేమి? నావలె గౌరవింప దగిన పెద్దలని యర్థము. అంతకుముందు శ్వశురాదులను చెప్పియున్నందున అట్లే ఇంకను గౌరవార్హులగు వారికి అన్న యర్థమును స్ఫురింపజేయుటకు బహువచనమును గ్రహించెను. వీరందరిని గౌరవింపవలసి వచ్చినపుడు ఏకకాలమునందు కూడదు. అని చెప్పుటకే సహశబ్దము తోడ్పడును. ఉదాహరణమునకు చండకౌశికోపాఖ్యానములో పతివ్రతయొక్క ఆచరణమును గ్రహింపవచ్చును. ఆ పతివ్రత అతిథిమర్యాద తెలిసినదైనను, అతిథిదైవస్వరూపుడని తెలిసినదైనను ప్రత్యక్షదైవము పతి యని ఆతని సేవ తర్వాతనే ఇతరుల సేవ యని భావించినదై, పతిదేవుని సంపూర్ణముగ సేవించిన యనంతరమే అతిథిసత్కారమునకు పూనుకొనినది.

ఇప్పుడు పై వేదమంత్రమున కిట్లు అర్థము చెప్పవలయును.

ఒక స్త్రీ ఒక పురుషుని తప్ప అనేక పురుషులను వివాహము చేసికొనకుండుట మాత్రమే కాక భర్తతో సమానముగ ఇతరులను ఏకకాలమునందు చూడకూడదు.

అల్పశ్రుతిత్వ, నాస్తికత్వప్రతిపాదకములగు వ్యాఖ్యానములను గుడ్డిగ అనుసరించుట పతనహేతువగుటచే మూలగ్రంథముల వలె వ్యాఖ్యానములు ప్రమాణపదవి నొందవు. కనుక వ్యాఖ్యాతల నెంత వరకు గ్రహింపవలయునో, వారు మూల గ్రంథము నిందపడకుండ నెంతవరకు వ్యాఖ్యానించిరో అంతవరకే స్వీకరింపవలయును. అంతేకాని వారు చెప్పిన అపార్థముల నన్నింటిని అంగీకరింపకపోయినచో ఆస్తికత్వము పోదు. మహర్షుల గ్రంథములను పరిశీలించునపుడు ఆ మహర్షుల భావ మేమో కనుగొని ప్రవర్తింపవలసినదే దానినుండి ఒక భాగమును విడదీసి దానికి ప్రత్యేకప్రతిపత్తిని వ్యక్తిత్వమును కల్పించనంతమాత్రమున దానికి విలువ రాదు. కాగా, భగవద్గీత మహాభారతాంతర్గతముగ భావించుచు, మహాభారతమున దానిస్థాన మేమో సద్విమర్శకుడు గమనింపవలయును.

ఇట్టి సందర్భములో అర్జునుని వ్యక్తిత్వమును గమనింపక అతనిని ఒక సామాన్యుడుగ, శోకమోహాదులచే నభిభూతుడైన వానినిగ వ్యాఖ్యానించుట నాకు మనస్సు మెలివేసినట్లయినది, అట్లే ధృతరాష్ట్రుని గుడ్డి వాడనియు, తద్ద్వారమున జ్ఞానాంధుడనియు ఆగుణమే దుర్యోధనునకు సంక్రమించినదనియు చేయు దుర్వ్యాఖ్యలు కూడ మంచి మార్గము కాదు అనిపించినది. అట్లే ఇంకను అనేక విషయములలో గీత చెప్పుచు తన్మహాత్మ్యమును చెప్పబోయి కొందరు మై మరచి మాటిమాటికి దుర్యోధనుడు దుష్టుడు, ధృతరాష్ట్రుడు దుష్టుడు అనుచుండుట క్రొత్తగ అప్పుడే గీతాహృదయ మెఱుగ

వలయు ననుకొన్న వారి హృదయములో విషబీజములు పడి అసలు విషయమును గమనింపక వీరిని దుష్టు లనుటతోనే కొందరు సర్వజ్ఞత్వమును ప్రకటించుకొన్న వారగుచున్నారు.

అసలే గ్రంథమైనను చదువుటకు ముందు అసూయాద్వేషము లుండరాదు. "శ్రోతవ్య మనసూయయా" అను వచనము లెన్నియో కలవు. ఇందలి రహస్యము చెప్పెదను వినుడు-అసూయలేకుండ విన వలయు నను నియమ మేల? అసలు అసూయ ఏల కలుగును? కవి ఒక గ్రంథమును లోకోద్ధరణార్థము వ్రాయును. అందలి పాత్రలు ఆ యా సందర్భములలో దేశకాలాదుల ననుసరించి ఆత్మస్తుతి పర నిందలు కావించుకొనును. ఎంత గొప్పవారైనను అవృతజ్ఞానులే. భగవంతునివలె ననావృతజ్ఞానులు కారు. సంకల్పప్రభవము లగు కామక్రోధములకు లోను కానివాడు కోటి కొక్క డుండవచ్చుగాక!

"మనుష్యాణాం సహస్రేషు కశ్చి ద్యతతి సిద్ధయే।
యతతా మపి సిద్ధానాం కశ్చి న్మాం వేత్తి తత్త్వతః॥"

ఇట్టి స్థితిలో ఒక వర్గమే యల్పదోషమును లేక సకలగుణఖనిగ ఉండు నని ఎట్లు చెప్పగలము? అట్లే ఏ మాత్రము సద్గుణమే లేక దుర్గుణములే మూటకట్టుకొను వర్గమెట్లుండును? కనుక ఈ రెండు వాదములు అసహజములైన వాదములే.

రామాయణము చదువునప్పుడు 'రామునివలె ఉండవలయును రావణునివలె ఉండరాదు, అన్న వాదము సర్వసహృదయరంజకము కాదు. హనుమంతుడు చెప్పిన వాక్యము ప్రమాణము కదా!

"య ద్యధర్మో న బలవాన్ స్యా దయం రాక్షసేశ్వరః।
స్యా దయం సురలోకస్య స శక్రస్యాపి రక్షితా॥"

(రా. సుం. 49-18)

ఇది హనుమంతుడు రావణున కిచ్చిన ప్రమాణ పత్రము.

"విభీషణ స్తు ధర్మాత్మా న తు రాక్షసచేష్టితః" అని పేరొందిన విభీషణుడు కూడ సీతాపహరణము విషయమున

రావణుని ఎదిరించెను. అంతకు పూర్వపురావణచేష్టల నాతఁడెదిరింపలేదుకదా! కాగా, రావణుడుకూడ ధర్మములు చేయకపోలేదు. రాముడు వాలివధాదివిషయములలో అధర్మముగ ప్రవర్తించె నని పేరొందెను. అకారణవైరము మనకేల? యన్న సీతావాక్యమును త్రోసిరాజనెను. అగుచో, గుణదోషముల ఆధిక్యమునుబట్టి రాముని వలె వర్తింపవలెను, రావణునివలె కూడదు అని చెప్పుటకన్న గుణ మెక్కడనుండియైనను గ్రహింపవలసినదే అన్న సూక్తిని పిల్లలకు నేర్పవలయును అన్నదే నా మతము. రామునివలె వర్తింపవలె నన్నప్పుడు కొందరు అమాయకులు అకారణవైరముకూడ ధర్మమే అని భావింతురుకదా!

ప్రకృతము దుర్యోధనాదు లందరు ఏకపక్షముగ దుష్టులే యనుట సాహసవచనము. వికర్ణుడు ద్యూతసందర్భమున సభలో "ధర్మ మిది" యని తన మతమును నొక్కి చెప్పి, అందరిచేత నోహో యనిపించుకొనెను కదా!

భారతయుద్ధములో అధర్మము జరుగలే దనుటకు ఆస్కారమే లేదు. అభిమన్యువధ అధర్మ మని ఎలుగెత్తి చాటబడినది. అనంతర మందు ప్రతిపక్షులకు సమాధానముగ అర్జునుడు మున్నగువారు "మీరు చేసినది ధర్మమా?" అని పలుమారులు ఆ అభిమన్యువధనే ఉదాహరించిరి.

అర్జునుడు భీష్మవధలో అధర్మము చేయనిచో అతడు శాప మేల పొందెను? (బభ్రువాహనుని చేతిలో అర్జునుడు పతన మగుట ద్వార ఆ శాపమునకు నిష్కృతి లభించెను.) ద్రోణవధవిషయమున ధర్మరాజు అసత్య మాడుట అధర్మము కాదనుటకు వీలులేదు. రాము నకు వాలివధ ఎట్లో అట్లే నీకిది అపకీర్తికర మగు నని అర్జును డాక్రోశించెను కదా! ఏ అధర్మము చేయకపోయినచో కృష్ణునకు గాంధారీ శాప మేల?

విదురాదులు ధృతరాష్ట్రునకు దుర్యోధనుని చంపుమని చెప్పినప్పుడు అతడు వినలేదని కృష్ణుడు మున్నగువారు తప్పుపట్టిరి పో. అసలేమాత్రము ధర్మస్వరూప మెరుగనివారును, ధృతరాష్ట్రుని ఆడిపోసుకొనుటయేనా? కురుక్షేత్రసంగ్రామము అంతమంది నశించుటకు హేతువైనది. దీనికి దుర్యోధనుడే కర్త యనుచున్నారు. విదురుని మాటలు విని గాంధారియు ఒప్పుకొన్నది. రాయబారములో కృష్ణుడును అట్లే చెప్పినాడు. ధార్తరాష్ట్రులు పాములవలె వధ్యులని కృష్ణుడు ధర్మజునితో అనెను. అర్జునుడుకూడ ఈ దుర్మార్గుని అప్పుడే చంపియుండిన బాగుండెడి దని పలికెను. సరే; చంపలేదు. దీనికి కారణము ధృతరాష్ట్రుని పుత్రప్రీతి.

కృష్ణుడు దూర్వాసశాపమున కేల గురియైనాడు? అది అట్లుండనిండు, వృష్ణివంశము నాశన మగుటకు సాంబాదులు కారణము కదా! ధృతరాష్ట్రు డజ్ఞాని. వానికి చెప్పినను తలకెక్కలేదు. అతని పుత్రప్రీతి అంత దుష్టమైనది. మరి కృష్ణుడు త్రికాలజ్ఞుడు కదా! మరి సాంబుడు ఆ వంశమునకు నష్టజాతకుడై పుట్టెనుకదా! ఇది కృష్ణునకు తెలియదని చెప్పుట అతని త్రికాలజ్ఞత, పరమేశ్వరత్వములకు హాని చేయుటయే. మరి వాని నేల చంపియుండకూడదు? భవితవ్యతను పరమేశ్వరుడు మార్చ డందురేని ధృతరాష్ట్రుని విషయమున నట్లెందులకు సమాధానపడరాదు?

"కర్తా కారయితా చైవ ప్రేరక శ్చానుమోదకః ।
సుకృతే దుష్కృతే చైవ చత్వార స్సమభాగినః ॥"

అని చెప్పబడినది. దుష్టచతుష్టయము ఈ గుణములకు ప్రతీకలు. కర్త కన్న కారయితకే అధికప్రాశస్త్య మున్నది. కృష్ణుడు స్వయముగ యుద్ధము చేయకపోయినను పాండవులు చేయు ప్రతి కృత్యమునందు వెనుకనుండి నడిపి, తానే కర్త నని అనేకపర్యాయములు చెప్పికొని

నాడు. అందరును అట్లే అనిరి. కారయితృత్వము అంతటిది. దుర్యోధనుని కర్తృత్వమున జరిగిన అత్యల్పమైన కృత్యమునుండి అతిబృహత్కృత్యమువరకు కర్ణుడే కారయిత యని కృష్ణునిదగ్గరనుండి అందరు అన్నదే. ఆ కర్ణుడు తన అన్న అని తెలియగనే అంతకు ముందు ఆ కర్ణునే ఎన్నియో విశేషములతో నిందించిన ధర్మరాజు అంతకు మించి మరెన్నియో విశేషములు జోడించి గొప్పగ భావించెను. ఏమీ! తనవాడు అనగనే అంత ప్రీతియా? పగవా డనగనే అంత ద్వేషమా?

దుర్యోధనుని విషయములో ధర్మరాజు రెండు నాలుకల చిలువ యనక తప్పదు. గదాయుద్ధమున దుర్యోధనుని నేలపడగొట్టి భీమసేనుడు అతని శిరస్సును వామపాదమున తన్నెను. ఆ సమయమున ధర్మజుడు భీమసేనునితో నిట్లనెను.

"గతోఽసి వైరస్యానృణ్యం ప్రతిజ్ఞా పూరితా త్వయా ।
శుభేనై వాశుభేనాథ కర్మణా విరమాఽధునా ॥ (శల్య-60-16)

మా శిరోఽస్య పదాఽమర్దీ ర్మా ధర్మ స్తేఽతిగో భవేత్ ।
రాజా జ్ఞాతి ర్హత శ్చాయం నైత న్న్యాయ్యం తవానఘ ॥ 17

ధార్మికో భీమసేనోఽసా విత్యాహు స్త్వాం పురాతనాః ।
స కస్మా ద్భీమసేన! త్వం రాజాన మధితిష్ఠసి ॥" 21

మరల అతడు దుర్యోధనునిచూచి ఇట్లనెను :—

"తాత! మన్యు ర్న తే కార్యో నాఽఽత్మా శోచ్య స్త్వయా తథా
నూనం పూర్వకృతం కర్మ సుఘోర మనుభూయతే ॥

ధాత్రోపదిష్టం విషమం నూనం ఫల మసంస్కృతమ్ ।
య ద్వయం త్వాం జిఘాంసామ స్త్వం చాస్మాన్ కురుసత్తమ ॥

ఆత్మనో హ్యపరాధేన మహ ద్వ్యసన మీదృశమ్ ।
ప్రాప్తవా నసి య ల్లోభా న్మదా ద్బాల్యాచ్చ భారత ॥

ఘాతయిత్వా వయస్యాంశ్చ భ్రాతౄన్ అథ పితౄంస్తథా ।
పుత్రాన్ పౌత్రాన్ తథా చాన్యాం స్తతోఽసి నిధనం గతః ॥
తవాఽపరాధా దస్మాభిః భ్రాతర స్తే నిపాతితాః ।
నిహతా జ్ఞాతయ శ్చాపి దిష్టం మన్యే దురత్యయమ్ ॥
నాత్మాఽనుశోచనీయ స్తే శ్లాఘ్యో మృత్యు స్తవానఘ ।
వయ మేవాధునా శోచ్యా స్సర్వావస్థాసు కౌరవ ॥
కృపణం వర్తయిష్యామ స్తై ర్హీనా బంధుభిః ప్రియైః ।
భ్రాతౄణాం చైవ వీరాణాం తథా వై శోకవిహ్వలాః ॥
కథం ద్రక్ష్యామి విధవా వధూః శోకపరిప్లుతః ।
త్వ మేకః ప్రస్థితో రాజన్! స్వర్గే తే నిలయో ధ్రువః ॥
వయం నరకసంజ్ఞం వై దుఃఖం ప్రాప్స్యామ దారుణమ్ ।
స్నుషా శ్చ ప్రస్నుషా శ్చైవ ధృతరాష్ట్రస్య విహ్వలాః ॥
గర్హయిష్యంతి వో నూనం విధవా శోకకర్శితాః ॥"

(శల్య - 60అ - 23 నుండి 30 వరకు.)

భీముని ప్రవర్తన మధర్మ మని ధర్మరాజు స్పష్టపరచెను. పూర్వజన్మార్జిత మగు పాపపుణ్యములవలన ప్రస్తుతజన్మలో ప్రాణికి సుఖక్లేశము లొనగూడునని, దుర్యోధనుడును ఆదిష్టమువలననే సర్వ నాశమునకు కారణ మాయె ననియు, దుర్యోధనుని నిందించెను. మరల 'నాయనా! నీవు దుఃఖింపవలదు; నీకు స్వర్గము ధ్రువము. మేమే చివరకు నరకప్రాయ మగు దుఃఖము ననుభవింపవలసియున్నది' అని పలికెను. ఇక్కడ 'త్వ మేకః ప్రస్థితో రాజన్! స్వర్గే తే నిల యో ధ్రువః' అను వాక్యము గమనార్హము. శస్త్రపూతముగ తను త్యాగము చేసినవారికి స్వర్గము లభించును. అన్న శాస్త్రవచనమున కిది యనువాదము. అంతేగాక, విజయము సాధించిన ధర్మరాజు దుర్యోధనుని 'నీకు స్వర్గమున నిలయము ధ్రువము' అని ఆశీర్వాదము చేసెను.

అవునా! ధర్మజు డిట్లు శాస్త్రసమ్మతముగ పలికియు, అనం తరము అనేకపర్యాయములు ఈదుర్యోధనుని నిందించుచుండును. ధర్మరాజు స్వర్గమును చేరెను. అచ్చట దుర్యోధనుని చూచెను.

దుర్యోధనం శ్రియా జుష్టం దదర్శాఽఽసీన మాసనే ।
భ్రాజమాన మివాదిత్యం వీరలక్ష్మ్యాఽభిసంభృతమ్ ॥

దేవై ర్భ్రాజిష్ణుభి స్సాధ్యైః సహితం పుణ్యకర్మభిః ।
తతో యుధిష్ఠిరో దృష్ట్వా దుర్యోధన మమర్షితః ॥

సహసా సన్నివృత్తోఽభూ చ్ఛ్రియం దృష్ట్వా సుయోధనే ।

మనము భారతము నింతవరకు వరుసగ చదువుకొనుచు వచ్చి నపుడు- దుర్యోధనుడు రాజ్యలక్ష్మీసమేతుడై యుండిన యుధిష్ఠిరుని చూచి అసూయాద్వేషములను పొందెను. అందువలననే అతడు అనేక విధములుగ పాండవాదులకు కష్టము కలిగించి చివరకు దుర్మరణము పొందెను- అన్నట్లు కనిపించును. కాని, పై శ్లోకములను చదివినప్పుడు ఇట్టి భావము ఎవరి హృదయములో పాతుకొనిపోయినదో ఈ ప్రసంగ మువలన స్పష్ట మగుచున్నదికదా! భారతము శాస్త్ర దృష్టితో వ్రాయబడిన కావ్యము. శాస్త్రదృష్టితో సందర్భానుసారముగ అనేకఅంశములు చర్చింపబడినవి. కావ్యనయములో పాత్రానుశీలనము వాచ్యవ్యంగ్యరూపములో సాగినది. వాచ్యముగ దుర్యోధనునియందు కనబడిన దంతయు అప్రధానమే అనియు, నిజమున కిది యంతయు ధర్మరాజు మానసికక్షేత్రమున పండిన పంటయే యనియు, ఈ ఘట్టమువలన తెలియుచున్నది. ఇక్కడ ధర్మరాజును యుధిష్ఠిరుడని, దుర్యోధనుని సుయోధను డని పేర్కొనుట గమనింపదగి యున్నది.

"బ్రువ న్నుచ్చై ర్వచ స్తా న్వై నాఽహం దుర్యోధనేన వై ।
సహితః కామయే లోకాన్ లుబ్ధేనాఽదీర్ఘదర్శినా" స్వర్గ-1-7

యత్కృతే పృథివీ సర్వా సుహృదో బాంధవా స్తథా।
హతాస్మాభిః పరిసహ్యేజా క్లిష్టైః పూర్వం మహావనే॥ -8

ద్రౌపదీ చ సభామధ్యే పాంచాలీ ధర్మచారిణీ।
పర్యాకృష్టాఽనవద్యాంగీ పత్నీ నో గురుసన్నిధౌ॥ -9

అస్తి దేవా న మే కామః సుయోధన ముదీక్షితుమ్." -10

"దుర్యోధనునితో కలసి యుండుట నే సహింపను" అని ధర్మ రాజు ఖండితముగ పలికెను. కలసి యుండుటకు దుర్యోధనుడు వ్యతిరేకి యని మనము భావించుచుంటిమికాని ఆ భావము ధర్మరాజులో సంస్కారరూపమున నున్నది. అగుచో ద్రౌపదీపరాభవమును దుర్యోధనునియందు దోషముగ చూపి అతనితో నే నీలోకమున నుండను. అని కదా చెప్పుచున్నాడు. అగుచో దౌత్యకృత్యమునందు ఎల్లెనను కలసియుండుటకే ధర్మరాజు ప్రయత్నించె ననుట పొరపాటగును కదా! అది కాదు; దుర్యోధనకృతముగ బంధువధ జరిగినది. దానికి ఈ ఈసడింపు - అనియు, చెప్పవచ్చును. కాని, ఆ యుద్ధమునకు ఒక్క దుర్యోధనుడే కారణము కాదని, తాముకూడ కారణమే యని ధర్మరాజు అనేకపర్యాయములు చెప్పియున్నాడు.

తత్త్వ మిట ఇట్లు గ్రహింపవలసియున్నది :-

ఒకనియందు సద్భావముగాని, దుర్భావముకాని కలుగుటకు ఎదుటి వ్యక్తియు కారణమే. ఆ ఎదుటి వ్యక్తిలో భావనారూపమున నున్నదానిని కొందరు వెంటనే వెలువరింతురు. ఆ సందర్భములో భావావిష్కరణము చేసినవానిదే ఆ భావ మంతయు అనుటకు వీలులేదు. కనుక దుర్యోధనగతముగ ప్రస్ఫుటమైన భావము లన్నియు ధర్మరాజులో మొలకెత్తినవే. దుర్యోధనుడుపాండవ లక్ష్మిని

చూచి యోర్చుకొనకుండుట ద్యూతమునకు ముందు వాచ్య మొనరించునాడు. నిజముగ ఆ భావము ధర్మరాజులోనే కలదు. దుర్యోధనుని దగ్గర నున్న అర్ధరాజ్యముకూడ తాను కాజేయలేదే అన్న భావము అతని మనస్సులో వేళ్ళూనినది. తత్ఫలమే ద్రౌప ద్యాదులు దుర్యోధనుని పరిహసించుట. అది ధర్మరాజులో ఎంత సం స్కారముగ నున్నదో కనుగొనవలయు నన్నచో దుర్యోధనశ్రీని చూచి స్వర్గమునందుకూడ ధర్మరాజు అమర్షితు డగుటవలన తెలియు చున్నది.

కాని, పోతనీరుండదు అన్నట్లు సంసర్గమువలన కలిగిన దోష ములు, గుణములు నిలువవు. ధర్మరాజు సమక్షములో దుర్యోధ నునకు కలిగిన అమర్షాదులు అతని అసన్నిధానమున తొలగిపోయినవి. స్ఫటికమునందు జపాకుసుమరాగము తత్సన్నిధానమువలన కలుగును. అది తొలగగనే ఇది తొలగును. అట్లే స్వచ్ఛమైన దుర్యోధనహృద యస్ఫటికమునందు ధర్మరాజుసన్నిధి జపాకుసుమము ప్రతిఫలించి అది దుర్యోధనుని హృదయగతమే యన్నట్లు భ్రమింపజేసినది. దుర్యోధ నుడు స్వర్గమును చేరిన తర్వాత, స్వర్గవాతావరణమునకు అలవాటు పడిన తర్వాత, సాధ్యాదిపుణ్యాకర్ములతో సంసర్గ మేర్పడినతర్వాత సహజమైన దుర్యోధనహృదయము స్వచ్ఛమై అమర్షాపూరితు డగు ధర్మరాజు కనబడినను తొలగిపోలేదు. ధర్మరాజునకు అది ఇంకను అట్లే యున్నది. అందుకే మన పెద్దలు చెప్పుదురు "స్వర్గములోకూడ సవతిపోరు తప్పదు" అని. సవతి 'సపత్ని' శబ్దమునకు వికృతి. సపత్ని యనగ శత్రువు. ధర్మరాజు స్వర్గమునకు వచ్చినను ఆ ద్వేషమును వీడలేదు అనుటయే ఈ సామెతకు మూలము, కాని అసూయ తొల గిన కాని స్వర్గమున స్థానముండదు. అందువలనే ధర్మరాజునందు

ఉత్పన్నమైన ఈ అమర్షమును పోగొట్టుటకై

"కృచ్ఛ్రం పూర్వం చాఽనుభూయ ఇతః ప్రభృతి కౌరవ।
విహరస్వ మయా సార్ధం గతశోకో నిరామయః॥" స్వర్గ- 3-22

అని ఇంద్రుడు ఆతనిని ఓదార్చెను. ఇంకను ఇట్లనెను :—

"ఏషా దేవనదీ పుణ్యా పార్థ! త్రైలోక్యపావనీ।
ఆకాశగంగా రాజేంద్ర! తత్రాఽఽప్లుత్య గమిష్యసి॥ -28

తత్ర స్నాతస్య భావ స్తే మానుషో విగమిష్యతి।
గతశోకో నిరాయాసో ముక్తవైరో భవిష్యసి॥ -29

గంగాం దేవనదీం పుణ్యాం పావనీ మృషిసంస్తుతామ్।
అవగాహ్య తతో రాజా! తనుం తత్యాజ మానుషీమ్॥ -41

తతో దివ్యవపు ర్భూత్వా ధర్మరాజో యుధిష్ఠిరః।
నిర్వైరో గతసంతాపో జలే తస్మిన్ సమాప్లుతః॥ -42

తతో యయౌ వృతో దేవైః కురురాజో యుధిష్ఠిరః।
ధర్మేణ సహితో ధీమాన్ స్తూయమానో మహర్షిభిః॥ -43

యత్ర తే పురుషవ్యాఘ్రాః శూరా విగతమన్యవః।
పాండవా ధార్తరాష్ట్రా శ్చ స్వాని స్థానాని భేజిరే॥" -44

ధర్మరాజు ఇంద్రుడు చెప్పినట్లుగ గంగాస్నానము చేసి వైరత్యాగము ఒనరించె నని తెలియుచున్నది. ఇట్లు విగతమన్యువులైన పాండవధార్తరాష్ట్రులు తమ తమ స్థానములను పొందిరి. ఇచట గమనింపవలసినది-విగతమన్యవః అను పదము. "దుర్యోధనో మన్యుమయో మహాద్రుమః," అని ఆదిలో ప్రారంభము. ముగింపులో ఆ మన్యువు తొలగిపోయినది అని చెప్పుటచేత తత్కృతమగు దోషజాతమంతయు నిరస్తమైనదని భావము. ఈ మన్యువు దుర్యోధనుని

యంటే గాక, ధర్మజునందు నున్నట్లు 'అర్జునస్య ఆత్మసమః సఖా' అని కీర్తినందిన సంజయుడు ధర్మరాజుతో అన్న ఈవచనమువలన స్పష్ట మగుచున్నది.

ఎవరైనను గ్రంథమును చదువునప్పుడు కామక్రోధరహితుడై, మత్సరరహితుడై, యసూయారహితుడై ఏల చదువవలె ననగ ప్రధాన ముగ ఏ పాత్రలను చదువుచున్నను, దేశకాలాదులవలనగాని, సంస్కారవశమునగాని, లేక పూర్వుల దుర్బోధలు చెవి కెక్కుటవలన గాని ఒకనిని నిందించుట, ఒకనిని స్తుతించుట జరుగుచుండును. కాని ఆ పాత్రలు రెండును కూడ చివరకు సామంజస్య మందుచునే యుండును. ఆ పాత్ర లట్లు కలసినతర్వాత వారి వారి పాతకథలను త్రవ్వి కొని పాఠకుడు అసూయా ద్వేషములకు గురి కాకూడదు. అట్లు గురి యగుచో వారిద్దరి నే సుకృతము కలిపినదో, అదే మంగళాశాసము కదా! అది పాఠకునకు లభింపదు. ఒక పత్రికలో నొక కథ చదివితిని. ఇద్దరు స్నేహితులు వయస్సులోనే వైరాగ్యము కలిగి సన్యసించిరి. వారిరువురు ఒకనాడు ఒక నదిని దాటుచుండిరి; ఆ సమయములో నొక యువతియు, ఆ నదిని దాటుచు ప్రవాహవేగమునకు నిలువలేక కొట్టికొనిపోసాగినది. అది చూచి వారిలో నొకడు కారుణ్యముతో నామెను రక్షించి, భుజమున మోసుకొని ఒడ్డు చేర్చెను. రెండవ సన్యాసి ఆ సంఘటనమును మాటిమాటికి ఉదాహరించుచు మొదటి వానిని గేలి చేయసాగెను. 'నీ కామె యవయవస్పర్శ కలిగినది. నీ వ్రతము భంగ మైనది.' అని. క్రమముగ వారికి వయస్సు చెల్లినది. స్త్రీని రక్షించిన సన్యాసి మరణోన్ముఖుడై యుండెను. ఎన్నిమార్లు రెండవ సన్యాసి తన నెగతాళి చేసినను నోరు మెదపని ఆ సన్యాసి తన మరణసమయములో నిట్లనెను "నేను సమయమును బట్టి కొద్దికాలము మాత్రమే ఆమెను భుజముపై మోసితిని. నీవుమాత్రము నిరంతర

మాయెను మోయుచునేడున్నావు. ఆబరువు నికనైనను దింపుకొనుము” అని. దీనివలన తెలియవలసిన దేమి? ఏ కారణమునగాని, ఒక డొక చెడ్డ పని చేయును. దానిని పావనములగు కర్మలవలన పోగొట్టుకొనును. కాని దానిని నిత్యము ఆ రూపమున ఆలోచన చేయువానికి మాత్రము తొలగదు.

ప్రకృతము పాండవధార్తరాష్ట్రులు విగతమన్యువులైరి. వారినిగురించి ఎవరైనను మన్యువును చూపుచో పతితులగుటతథ్యము.

రామాయణమున రావణునకు ప్రేతకృత్యము లొనరింప నన్న విభీషణునితో రాము డిట్లనును—

“మరణాంతాని వైరాణి యథా తవ తథా మమ,” విభీషణా! నీవు నాకు మిత్రుడవు; కనుక నా శత్రువు నీ శత్రువని భావించితివి. వైరము మరణాంతము; ఇంక రావణుడు నాకు శత్రువు కాదు; అంతే కాదు, అతడు నీకెట్లో నాకట్లు. నీకు సోదరుడు; ‘జ్యేష్ఠః పితృసమో మతః’ నాకును అంతే.

రాముడు రావణునియందు పితృభావమునే చూపెను కదా! రామాయణము చదువువారు రావణుని నిందించుచు చదువుచో ఆ పఠనఫలము పొందరు. ఇదే రామానుశాసనము. ఏ గ్రంథమునందైనను మహర్షులు ఇట్టి ముగింపునే చేయుదురు. వ్యాసుని ముగింపు కూడ ఇంతే. ఇరువాగులవారు విగతమన్యువులైరి. వారియందు మీరు మన్యుభావమును ప్రసరింపజేయవద్దు అన్నదే మహర్షి యాదేశము. “కృతోదకాస్తే సుహృదాంసర్వేషాం పాండునందనాః॥” శాం.1-1 ‘సుహృదా మిత్యనేన దుర్యోధనాదీనామపి గ్రహణమ్’, ‘మరణాంతాని వైరాణి’ ఇతిన్యాయేన తేషా మపీదానీం సుహృత్త్వాత్’ అని వ్యాఖ్య. ఇక్కడ సుహృత్ శబ్దముచే దుర్యోధనాదులును గ్రహింపబడుదురు. మరణాంతాని వైరాణి అన్న న్యాయమునే నీలకంఠాచార్యులుకూడ చూపి వ్యాఖ్యానించిరి.

ఒక గ్రంథమును వ్రాయుట కనేక ప్రేరణము లుండును. ప్రేరకులు ననేకు లుందురు. వారి మాట కాదనుటకు వీలు కాదు; స్వారస్యము కాదు. శిష్యప్రచోదితుడై ధ్వనిఖండనము చేయుమహిమ భట్టు ఇట్లనెను —

"ముగ్ధః కిం కి మసభ్య ఏష భజతే మాత్సర్యమానం ను కిం
పృష్టో న ప్రతివక్తి యః కిల జన స్తత్త్రేతి సంభావయేత్ ।
ఛాత్రాభ్యర్థనయా తతోఽద్య సహసైవోత్సృజ్య మార్గం సతాం
పారోభాగ్య మభాగ్యభాజనజనాసేవ్యం మయాంగీకృతమ్ ॥"

వ్యక్తివివేకము-2-1

అడిగిన చెప్పవలయు నని సూత్రము భారతమున యాజ్ఞవల్క్యుడు జనకునకు చెప్పినాడు.

"న తవాఽవిదితం కించి న్మాం తు జిజ్ఞాసతే భవాన్ ।
పృష్టేన చాపి వక్తవ్యం ఏష ధర్మ స్సనాతనః ॥" శాం-311-8.

భగవద్గీతతో నాపరిచయము త్రిదశకము. ఆంధ్రరాష్ట్రీయ బ్రాహ్మణసభవారు నెల్లూరునగరములో నెలకొల్పిన శ్రీ చంద్రశేఖరధర్మశాస్త్రవిద్యాలయములో 1951వ సంవత్సరములో నేను విద్యార్థిగ నుంటిని. భగవద్గీత శంకరభాష్యసహితము, మనుస్మృతి, అభినవషడశీతి, సంధ్యావందనభాష్యము - ఇవి మా పాఠ్యగ్రంథములు. వీని నన్నిటిని నేను గురుముఖముగ క్షుణ్ణముగ అధ్యయనము చేసితిని.

నెల్లూరులో సంపన్నగృహస్థులు కీ. శే. శ్రీ చతుర్వేదుల రామచంద్రయ్యగారు తమ ఏకైకపుత్రుని స్మారకముగ గీతామందిరము నొకదానిని ఆంధ్రమహాసభ యావరణములో 1954లో నిర్మించిరి. దాని నిర్వహణమునకై కొంత ధనమును కేటాయించిరి. ఆ ద్రవ్యముతో ప్రతి ఆదివారము ఆ మందిరములో గీతాచార్యుని పూజ, గీతలో ఒక అధ్యాయమును పారాయణము చేయుట, ఒకటి

రెండు శ్లోకములకు శంకరభాష్యానుసారముగ ప్రవచనము చేయుట జరుగునట్లు ఏర్పాటు చేసిరి. ప్రతి ఆశ్వయుజ శుద్ధ నవమినాడు బాలబాలికలకు గీతపోటీలు నిర్వహించి బహుమతు లిచ్చుటయు కలదు. ఈ కార్యక్రమముల నిర్వహణములో నేనుకూడ 1954నుండి 1964వరకు పాల్గొనుచుండువాడను. అప్పు డప్పుడు గీతార్థప్రవచనముకూడ చేయుచుండువాడను. తత్సందర్భమున అనేకగీతావ్యాఖ్యానములు చూచుట సంభవించినది. చదివిన వానికే సందేహములు కలుగు నని కదా చెప్పుదురు. నాకు పలు సందేహములు కలుగుచుండెడివి. నాపండితమిత్రులతో పలుమార్లు చర్చించితిని. సంతృప్తికరమగు సమాధానము లభింపలేదు. వారి ప్రోద్బలముతో నా సందేహములకు నేనే సమాధానము లన్వేషింపదలచి అనేక గ్రంథములు పరిశీలించితిని. నాకు కలిగిన ఆలోచనలు గ్రంథరూపమున వెలయించుట కీప్రయత్నము.

'శబ్దప్రయోగః ప్రాయేణ పరార్థ ముపయుజ్యతే'
న హి తేన వినా శక్యః వ్యవహారయితుం పరః ॥''

అన్నందున ఏదైనను గ్రంథరూపమున వెలయింపకపోయినచో పలువురకు తెలియుట దుర్ఘటము. "జీర్ణ మంగే సుభాషితం" అన్నట్లు నా భావములు నాలోనే అణగారినచో జిజ్ఞాసువుల కది అందకనేపోవును.

"పరోపకారాయ వహన్తి నద్యః పరోపకారాయ దుహంతి గావః ।
పరోపకారాయ ఫలంతి వృక్షాః పరోపకారాయ సతాంవిభూతయః॥"

నా ఈ ప్రయత్నము "స్వయం తీర్ణః పరాం స్తారయతి" అన్నట్లు వివిదిషులకు అసూయారహితముగ గ్రంథపఠనమునందు అభిలాష కలుగుటకు గుణావిష్కారముతో బాటు దోషావిష్కారముకూడ చేసితిని. అట్లు చేయకున్న ఉభయపక్షనిరూపణముగ విమర్శ లేకపోయినచో నది సద్గ్రంథనిరూపణము కాదని సద్భావన; సాధుభావన.

మహాభారతమును మొత్తముగ చదివినగాని గీత పరమార్థము తెలియ దని నా భావన. కావున భారతము నంతయు చదివితిని. గీత పూర్వాపరఘట్టములకు సంగ్రహస్వరూప మని గుర్తింపు నాకు కల్గినది. గీతను వ్యాఖ్యానింపవలయు నన్న ఆదిపర్వమునుండి ఉద్యోగపర్వము వరకు ఘట్టములను నెమరు వేసికొనుచు తర్వాత జరిగిన కథారూప మంతయు పరికించినపుడు ఇది పూర్వాపరములకు సేతువువంటి దని తేలును. కనుక గీతా వ్యాఖ్యానము భారతసమన్వయపరమై యుండవలయు నని నా నిర్ణయము.

గీతోపదేశతత్త్వము అను పేరుతో నింకను కొన్ని భాగము లను వ్రాయదలచితిని. దీని రెండవభాగము ఇంచుమించు సిద్ధమైనది. తక్కిన భాగములకు అంశములు కూర్పబడుచున్నవి.

ఈ భాగములో స్థూలాకారముగ కొన్ని విషయములు చర్చించితిని. ఏ విషయమైనను, దాని నెంత పండితుడు విమర్శించినను కొన్ని దోషము లుండకపోవు. వానిని కాదనుటకు వీలులేదు. నేను కొందరియందు చూపిన అస్వారస్యములు నాయందును ఉండవచ్చును. మహిమభట్టు చెప్పిన ఈపద్యము చూడుడు—

"స్వకృతి ష్వయంత్రితః కథ మనుశిష్యా దన్య మితి న వాచ్యమ్ ।
వారయతి భిషగపథ్యా దితరాన్ స్వయ మాచరన్నపి తత్ ॥
(వ్యక్తివివేకము 2-2)

వైద్యుడు రోగి కపథ్య మన్నది తాను పథ్య మనుకొనును.

"నియతం యశసే ప్రపత్స్యతే మహతాం సంస్తవ ఏవ గౌరవాయ"
(వ్యక్తివివేకము 1-3)

"దృష్ట్వా త్వాదిత్య ముద్యంతం కుచరాణాం భయం భవేత్ ।
అధ్వగాః పరితప్యేయుః ఉష్ణతో దుఃఖభాగినః ।" (అనుగీత, 39-13)

సూర్యు డుదయించుచుండగ కుచరులకు భయము, అధ్వగులకి ఉష్ణమువలన దుఃఖపరితాపములు కలుగును.

ఇందులో వ్యాసమహర్షి తన భారతమును గురించి కూడ చెప్పి కొనినట్లు చెప్పవచ్చును. సూర్యునితో పోలికభారతమునకున్నది.

"భారతం భానుమా నిందుః యది న స్యు రమీ త్రయః ।
తతోఽజ్ఞానతమోంధస్య కావస్థా జగతో భవేత్ ? ॥"

భారతమూ, సూర్యుడూ, చంద్రుడు–వీరు ముగ్గురు లేనిచో అజ్ఞానతమోంధ మగు జగత్తున కే యవస్థ పట్టియుండెడిదో!

ఆ సూర్యుడుదయించుచుండగ కొందరు దుఃఖ పరితాపము లొందుదురు. మహానుభావు డగు వ్యాసమహర్షి లోకమునకు వెలుగ చూపుటకై నిర్మించిన భారతమే అట్లుండ, అజ్ఞానవిలసిత మగ బుద్ధితో వ్రాసిన గ్రంథము చూచినప్పుడు కొందరు పరితాప మందుః ట సహజము కాన పండితులు తప్పక చదువదగుదురు. ఈగ్రంథము తుచివర కృష్ణభక్త్యావిష్టతత్త్వమహితమైన బుద్ధితో "న మే ద్వేష్యోఽ స్తి న ప్రియః" అని చెప్పినది నా యథార్థహృదయము.

"కింతు తదవధీర్యార్యై ర్గుణలేశే సతత మవహితై ర్భావ్యమ్
పరిపవన వదథవా తే జాత్యైవ శిక్షితా స్తుషగ్రహణమ్."

వ్యక్తి–1–6 పండితులు గుణలేశమున అవహితమతులు కావలెను. జల్లెడవలె తుషగ్రహణమే వారు నేర్వలేదు కదా!

"ఆపరితోషా ద్విదుషాం న సాధు మన్యే ప్రయోగవిజ్ఞానమ్ ॥"

"వాసుదేవోఽపి జగ్రాహ ప్రీతిం పార్థేన శాశ్వతీమ్ ।
దదౌ సురపతి శ్చైవ వరం కృష్ణాయ ధీమతే ॥"

## కృతజ్ఞాతాభివందనములు

అస్మద్గురువులు, బ్రహ్మశ్రీ వేదమూర్తులైన వెంపరాల శివ బ్రహ్మశాస్త్రిగారు, గురుపాదులు బ్రహ్మశ్రీ వేదమూర్తులైన ఉడాలి సుబ్బరామశాస్త్రిగారు, విద్యావయోవృద్ధులు వేదభాస్కరులు బ్రహ్మశ్రీవేదమూర్తులైన ధూళిపాళ రామచంద్రశాస్త్రిగారు, భగవద్గీతాప్రచారైకమతులు బ్రహ్మశ్రీ వేదమూర్తులైన బులుసు వేంకటశాస్త్రిగారు, మా కళాశాలాధ్యక్షులు డా. కె. యస్. ఆర్. దత్తగారు, సహృదయమిత్రులు, సహోపన్యాసకులు ఉ.వే.ప్ర.కె.యస్. రామానుజాచార్యులుగారు, ఉ. వే. ప్ర. యన్. సి. వి. నరసింహాచార్యులుగారు, మహారాజశ్రీ డి. నాగసిద్ధారెడ్డిగారు, మ॥ రా॥ శ్రీ సముద్రాల లక్ష్మణయ్యగారు, మహారాజశ్రీ పూడి వేంకట రామయ్యగారు, తిరుమలతిరుపతిదేవస్థానాధికృతులు మహారాజశ్రీ రావుల సూర్యనారాయణమూర్తిగారు, డా. బి. యస్. బి. రఘునాథాచార్యులుగారు నా గ్రంథమును సాదరముగ పరిశీలించి అమూల్యము లగు ఆశీస్సులను, సదాశయములను, సదభిప్రాయములను నాకు ప్రసాదించిరి. గుణగ్రహణపారీణు లగు ఈ పండిత ప్రకాండులకు అందరకు నా హృదయపూర్వకకృతజ్ఞతాభివందనములు.

శ్రీమాన్ నరసింహాచార్యులుగారు నా పుస్తకమును కడు జాగరూకతతోను, నిపుణముగను సాకల్యముగ పరిశీలించి నాకు చాల సూచనల నిచ్చిరి. వానిని పునర్ముద్రణములో పాటింపగలను. వారి సూచనలకు నా కృతజ్ఞతలను ప్రత్యేకముగ అర్పించుచున్నాను.

భట్నవిల్లి యందలి శ్రీశారదాముద్రణాలయాధిపతులు, బ్ర. వే. వేంకటశాస్త్రిగారు, మిత్రసత్యనారాయణశాస్త్రిగారు నా యీగ్రంథమును ముద్రించుట కంగీకరించి నాకెంతయో తోడ్పడిరి. వీరి పితృపాదులు తర్కరత్న, న్యాయవేదాంతవిద్యాపారీణ, దర్శనాలంకార ఇత్యాద్యనేకబిరుదాంకితులు కీ. శే. బ్రహ్మశ్రీ బులుసు అప్పన్నశాస్త్రిగారు నాకు పరమగురువులు. తమ విరచితమగు శ్రీ భగవద్గీతాశాంకరభాష్యతత్త్వబోధిని యను ఐదు భాగముల గ్రంథమును వీరు 1962వ సంవత్సరములో నాకు దయతో అనుగ్రహించిరి. వారికి నాపై గల పుత్రవాత్సల్యము కారణముగనే బ్ర. వే. బులుసు వేంకటశాస్త్రిగారు, మిత్రసత్యనారాయణశాస్త్రిగారలు నన్ను తమ భ్రాతృసమానుడుగ సంభావించిరి. నాకు ముద్రణాకార్య క్రమమును పర్యవేక్షించు వీలు లేనందున ఆ బాధ్యతనుగూడ తామే వహించి అనేకప్రయాసల కోర్చి, నాపుస్తకమును చక్కగ ముద్రించి ఇచ్చినారు. వారి సౌహార్దమునకు నే నెంతయో ఋణపడియున్నాను.

"ప్రాజ్ఞ స్తు జల్పతాం పుంసాం శ్రుత్వా వాచ శ్శుభాశ్శుభాః ।
గుణవ ద్వాక్య మాదత్తే హంసః క్షీర మివాంభసి ॥
చలస్వభావా దుస్సేవ్యా దుర్గ్రాహ్యా భావత స్తథా ।
ప్రాజ్ఞస్య పురుషస్యేహ యథా వాచ స్తథా స్త్రియః ॥
శ్లక్ష్ణాం వాణీం నిరాబాధాం మధురాం దోషవర్జితామ్ ।
స్వాగతే నాభిభాషంతే తే నరాః స్వర్గ గామినః ॥"

ఇట్లు విధేయుడు,
గ్రంథరచయిత.

# గీతోపదేశతత్త్వము

## భగవద్గీత - యోగశాస్త్రము

కృష్ణార్జునసంవాదమగు భగవద్గీతలో 18 అధ్యాయములు ఉన్నవి. ప్రతిపాద్యవిషయానుసారముగా ప్రతి అధ్యాయమునకు విషాద, సాంఖ్య, కర్మ ఇత్యాదిగా నామము నిర్దేశింపబడినది. అన్ని అధ్యాయములకు అంతమున యోగశబ్దము కలుపబడినది. దీనినిబట్టి గీతాబోధ యోగసంపన్న మని తెలియుచున్నది.

"పరమం రూప మైశ్వరమ్" (గీ. 11-9)

"మహాయోగేశ్వరో హరిః" (11-9)

"పశ్య మే యోగ మైశ్వరమ్" (11-8)

"యత్ర యోగేశ్వరః కృష్ణః" (18-78)

"యోగం యోగేశ్వరాత్కృష్ణాత్" (18-74)

మున్నగు ప్రయోగములవలన కృష్ణుడు యోగసంపన్నుడు అని స్పష్టము.

"తస్మా ద్యోగాయ యుజ్యస్వ, యోగః కర్మసు కౌశలమ్" (గీ 2-50)

"సిద్ధ్యసిద్ధ్యో స్సమో భూత్వా సమత్వం యోగ ఉచ్యతే" (2-48)

"సమాధా వచలా బుద్ధి స్తదా యోగ మవాప్స్యసి" (2-53)

యోగనిర్వచనపూర్వకముగా కృష్ణుడు అర్జునుని యోగమును పొందు మని చెప్పుటవల్ల దానిని విని తెలిసికొనిన అర్జునుడును యోగసంపన్ను డని విశదమగును.

"అన్నం చ బ్రహ్మ అహం చ బ్రహ్మ భోక్తా చ బ్రహ్మ"

అనినట్లు తెలియదగిన విషయము, దానిని తెలిసి చెప్పిన వక్త, దానిని శ్రద్ధాసక్తులతో విని తన్మహత్త్వము నొందిన శ్రోతకూడ యోగసంపన్ను లగుచున్నారు.

"జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్" (గీ 7-18)

ఇత్యాది వాక్యములవలన గీతాబోధ నివి జ్ఞానియైన అర్జునుడు భగ
దభిన్నుడు. వాని న ల్లైక్య మొనర్చిన గీతాప్రతిపాదితయోగశాస్త్రము కృష్ణార్జున
కభిన్నమే యగును. భగవానుడు, తదనతిరిక్తు డగు నర్జునుడు ఎట్టిమహిమాన్వితుల
అట్లే భగవద్గీతయు అంతటి యోగమహిమాన్వితమే.

## గీత భగవదభిన్నము

అర్జునునివలె సదసద్వివేకము కోల్పోయి కర్తవ్యాంశమున సమ్మూఢులై
వారలకు ఉపదేష్ట గీతయే. అనగా ఆనాడు సాక్షాద్భగవన్ముఖారవిందనిర్గళితగీ
రూపయోగమకరందామృతమును ఆస్వాదించి అమృతతత్త్వము నందిన అర్జునునివ
గీతాసారము గ్రోలువారు అమృతతత్త్వము నొందుదురు. యోగులును అగుదురు
"బ్రహ్మవిద్బ్రహ్మైవభవతి" ఇత్యాదివచనములందుపేర్కొనబడినట్లు భగవతత్త్వ
మగు యోగమహిమ నెరిగినవారు యోగయుక్తులైన భగవదభిన్నులే యగుదురు

"య ఇదం పరమం గుహ్యం మద్భక్తే ష్వభిధాస్యతి ।
భక్తిం మయి పరాం కృత్వా మా మే వైష్య త్యసంశయః ॥" (18-68)
న చ తస్మా న్మనుష్యేషు కశ్చి న్మే ప్రియకృత్తమః ।
భవితా న చ మే తస్మా దన్యః ప్రియతరో మమ ॥ (18-69)
అధ్యేష్యతే చ య ఇమం ధర్మ్యం సంవాద మావయోః ।
జ్ఞానయజ్ఞేన తే నాహ మిష్టస్స్యా మితి మే మతిః ॥ (18-70)
శ్రద్ధావా ననసూయ శ్చ శృణుయా దపి యో నరః । (18-71)
సోఽపి ముక్త శ్శుభా న్లోకాన్ ప్రాప్నుయా త్పుణ్యకర్మణామ్ ॥ (18-71)

భగవానుడే చెప్పిన ఈ వచనములు పై విషయమునకు స్ఫోరకములు.

నరనారాయణరూపు లగు కృష్ణార్జునులు పరస్పర మభిన్నులే "ఏకం సత్
విప్రా బహుధా వదన్తి" అన్న వచనమువలన ఏకమే యగు తాత్త్వికాంశము
బహు ముఖముల నున్నట్లు విప్రులు చెప్పుచున్నారు. అట్లే ఒక్కరే అగు కృష్ణా
ర్జునులు అనేకముగ చెప్పబడుచున్నారు.

ఏష నారాయణః కృష్ణః ఫాల్గుణశ్చ నరః స్మృతః ।
నారాయణో నర శ్చైవ సత్త్వ మేకం ద్విధా కృతమ్ ॥ (ఉ 48-21)
ఏతౌ హి కర్మణా లోకా న శ్నువాతే ఽక్షయా న్ధ్రువాన్ ।
తత్ర తత్రైవ జాయేతే యుద్ధకాలే పునః పునః ॥ (ఉ 48-22)

ఏకరూపమే యుద్ధకాలమున ద్విధాభూతమై జన్మించి ఆ యుద్ధకర్మను పూర్తి గావించును. ద్విధాభూతులుగా నున్నవారు ఏకరూపమున ఆ కర్మయందు ఏకాకారమున కారణముగా నుండవలె నన్న వారి నట్లు ఐక్య మొందించు సాధనము కావలెను. యోజనము చేయునది ఈ యోగశాస్త్రము. ఏకరథస్థులై రథరథికరూపమున భిన్నులుగ నున్నను వారు యోగసంపత్తి నందినవారై అద్వితీయులై అలరుచున్నారు.

## కర్త్ర్యాకారయుతల ఏకరూపము గీత

మహాభారతమునందు గీతాబోధానంతరము అనేకస్థలములలో "నరునకు నేను, నాకు నరుడు ఆత్మలమైయుంటి" మని పలు పర్యాయములు కృష్ణ డనును.

భీష్మునితో యుద్ధము చేసి పాండవసేనలు అంత్యదశకు చేరినవి. ధర్మరాజు యుద్ధమైన తర్వాత రాత్రి కృష్ణుని చేరి ఇ ట్లనును.

సోఽహ మేవంగతే కృష్ణ! నిమగ్న శ్శోకసాగరే ।
ఆత్మనో బుద్ధి దౌర్బల్యా ద్భీష్మ మాసాద్య సంయుగే ॥ (భీ 108-18)
వనం యాస్యామి దుర్ధర్ష శ్రేయో మే తత్ర వై ధ్రువమ్ ।
న యుద్ధం రోచయే కృష్ణ హన్తి భీష్మో హి న స్సదా । (భీ 108-19)
క్షయం నీతోఽస్మి వార్ష్ణేయ రాజ్యహేతోః పరాక్రమీ ॥ (భీ 108-21)
జీవితం బహు మన్యేఽహం జీవితం హ్యద్య దుర్లభమ్ ।
జీవిత స్యావశేషేణ చరిష్యే ధర్మ ముత్తమమ్ ॥ (భీ 108-23)

అట్లు ధర్మరాజు అనగా కృష్ణు డిట్లనును "నన్నుకూడ యుద్ధమున నియోగింపుము. ఈ మహాహవమున నీచే నియోజితుడనై ఏమి చేయను? విషాదము చెందకుము. ఒకవేళ అర్జునుడు ఇష్టములేక భీష్మాదులను చంపకున్న నేను చంపెదను. ఇంద్రునివలె విక్రమించు నన్ను చూడుము భీష్ము నిప్పుడే రథమునుండి పడద్రోతును." అని మరియు ఈవచనము లనును —

య శ్శత్రుః పాండుపుత్రాణాం మచ్ఛత్రు స్స న సంశయః ।
మదర్థా భవదీయా యే యే మదీయా స్త వైవ తే ॥ (భీ 108-32)
తవ భ్రాతా మమ సఖా సంబంధీ శిష్య ఏవ చ ।
మాంసా న్యుత్కృత్య దాస్యామి ఫాల్గునార్థం మహీపతే ॥ (భీ 108-33)

ఏష చాపి నరవ్యాఘ్ర మత్కృతే జీవితం త్యజేత్ ।
ఏష న స్సమయ స్తాత తారయేమ పరస్పరమ్ ॥ (భీ 108-3
స హనిష్యతి సంగ్రామే భీష్మం పరపురంజయమ్ ।
అశక్య మపి కుర్యాద్ధి రణే పార్థ స్సముద్యతః ॥ (భీ 108-3
నిహన్యా దర్జున స్సంఖ్యే కిము భీష్మం నరాధిప । (భీ 108-3

ఈ కృష్ణవచనములలో ఎన్ని విషయములో వాచ్యవ్యంగ్యరూపమున తరతండోపతండములుగ వెలుగొందుచున్నవి. 'శిష్య ఏవ చ' అనుటకు "శిష్యస్తేహం శాధి మాం త్వాం ప్రపన్నమ్ ।" అని అర్జునుడు శిష్యత్వము నంగీకరించుటను స్మరింపజేయుచు తత్ఫలితముగ తా నొనరించిన యోగవిషయకమగు బోధ ప్రతిఫలించును. "నా కతడు, ఆతడికి నేను ప్రాణము లర్పించ కొందుము ఇది మా సమయము" అనును. ఇది ఏమి? ఎప్పు డిట్టి సమయము నేర్పరచు కొనిరి? అని ఆలోచించగా నది గీతాబోధయే తప్ప మరొక్కటి కాదు అని తేలును. గీతాఫల మిట్లున్నది. నిష్క్రియుడైన కృష్ణుడు కర్త యగును కర్త యగు అర్జునుడు అకర్తగనే కీర్తింపబడుచున్నాడు.

మయైవైతే నిహతాః పూర్వ మేవ
నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్ ॥ (గీ 11-33)

అని భగవంతుడు చెప్పుట యుక్తముగా నున్నది. ఆపైన అర్జునుని యందు క్రియాశీలము తగ్గిన సందర్భములలో ఆయుధము పట్టనన్న కృష్ణుడు ఆయుధము పట్టును, భీష్ము నెదుర్కొనును. చక్ర మడ్డువేసి, మాయ కల్పించి, సూర్యాస్తమయమును కల్పించి సైంధవవధకు కారణ మగును. సైంధవవధా దివసమున అర్జునుని పూజాప్రక్రియలో తన క్రియాచణత్వము చూపును. కనుక తరచి తరచి చూచినకొలది కృష్ణార్జును లిరువురును మహాభారతరణయజ్ఞమున సమభాగులే యనియు, శత్రుసంహార-భూభారహరణ-ధర్మస్థాపనాద్యనితరసాధారణకృత్యసంసిద్ధికి ఏకరూప ఏకకారణములై యున్నా రనియు సుస్పష్టమగుచున్నది వారిలో ఏకత్వము గీతాయోగమహిమచే సిద్ధించిన దనుట నిస్సందేహము.

"సహ వీర్యం కరవావహై" అను వచనమునకు వీరి యైక్యమే ప్రత్యక్ష నిదర్శనము.

## భగవద్గీత కృష్ణార్జునుల కభిన్నము-యుద్ధకారణము

"తత్ర తత్రైవ జాయేతే యుద్ధకాలే పునః పునః" (ఉ 48-22)

యుద్ధనాయకులు :— ధృష్టద్యుమ్నుడు సేనానాయకుడు. అనాయకునికి నాయకుడు నరుడు. వానికిని నాయకుడు నారాయణుడు.

తతో ద్రుపద మానాయ్య విరాటం శినిపుంగవం ।
ధృష్టద్యుమ్నం చ పాంచాల్యం ధృష్టకేతుం చ పార్థివ ॥ (ఉ 156-11)
శిఖండినం చ పాంచాల్యం సహదేవం చ మాగధం ।
ఏతా న్సప్త మహాభాగా న్వీరా న్యుద్ధాభికాంక్షిణః ॥ (ఉ 156-12)
సేనాప్రణేతౄ న్విధివదభ్యషించ ద్యుధిష్ఠిరః ।
సర్వసేనాపతిం చాత్ర ధృష్టద్యుమ్నం చకార హ ॥ (156-13)
ద్రోణాంతహేతో రుత్పన్నో య ఇద్ధా జ్జాతవేతసః ।
సర్వేషా మేవ తేషాం తు సమస్తానాం మహాత్మనామ్ ॥ (156-14)
సేనాపతిపతిం చక్రే గుడాకేశం ధనంజయమ్ ।
అర్జునస్యాపి నేతారం సంయంతా చైవ వాజినామ్ ॥ (ఉ 156-15)
సంకర్షణానుజ శ్శ్రీమా న్మహాబుద్ధి ర్జనార్దనః ॥ (ఉ 156-16)

కృష్ణార్జునులు యుద్ధకారకులు, తన్నాయకులును అన్న విషయము సుస్పష్టము. "సంయంతా చైవ వాజినాం" అని జనార్దనుడు పేర్కొనబడుట గమనార్హము. వాజులకు నియామకు డైనట్లే "ఇంద్రియాణి హయా నాహుః" అన్న ఇంద్రియ వాజులకును కృష్ణుడు సంయంతగా భావింపదగును. గుడాకేశుడుగా నరుడు కీర్తింపబడుచున్నాడు. అనగా నిత్యోత్సాహము కలవాడని పర్యవసితార్థము. వీరు సంవదించుకొనిరి. ఆ సంవాదము వారిని అభిన్నులను చేసినది, వారు యుద్ధకారకులైరి. వారివలెనే ఈగీతాయోగము యుద్ధకారణము. కృష్ణార్జునులతో అభిన్నమై యుద్ధకారణమైన గీత యనశ్వరము; అజరామరము; నిత్యోత్సాహతరంగితము. కృష్ణార్జునులు లౌకిక దేహమును విడిచినను వారి కభిన్నమగు ఈగీత నిత్యక్రియాచణ మగుచున్నది. ఎవరికి ఎట్టి విషాద మేర్పడినను జ్ఞానోపదేష్టయై కర్తవ్య నిర్వహణమున ప్రధానకర్తృత్వమును తానే బూని కర్తను నిమిత్తమాత్రునిగా చేసి ఫలసిద్ధిని ప్రసాదించుచున్నది.

"కౌంతేయ ప్రతిజానీహి న మే భక్తః ప్రణశ్యతి"

అన్న గీతాచార్యుని ప్రతిజ్ఞను నిలుపు బాధ్యతను గీత స్వీకరించినది. లౌకికదృష్టితో చూచినపుడు ఆ నరనారాయణాకృతు లగు కృష్ణార్జునులయందు ఏవో కొన్ని దోషము లున్నట్లు అజ్ఞులకు అనిపించును. అట్లుగాని నిర్దుష్టమగు నీ గీతాచార్యుడు మనకు లభించెను గదా! గీత చెప్పినందువలననే కృష్ణుడు భగవంతు డైనాడు.

సర్వధర్మా న్పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ ।
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః ॥ (గీత 18-66)

అను భగవద్వచనము భగవంతునివలెనే బోధించుచు "మనలను తదేక శరణులను గావించికొని సకలపాపములనుండియు విముక్తులను చేయుచున్నది." అని పెద్దలు అనుభవరసికులు చెప్పుచున్నారు.

కనుకనే భగవంతుడు గీతలో అట నట భవద్వేషమును నరునకు చూపి నట్లు గీతకూడ సూచించుచున్న దనుటవలన నిది భవద్వేషిణిగా గీతామాహాత్మ్య మున కీర్తింపబడినది. "గీతాజ్ఞాన ముపాశ్రిత్య త్రీ న్లోకా న్పాలయా మ్యహమ్," అని గీతామాహాత్మ్యమున భగవంతుడే చెప్పుచుండుటవలన గీతామహిమ నిజము నకు భగవంతుని కన్న మిన్న యని భావింపవచ్చును.

అవినాశి తు తద్విద్ధి యేన సర్వ మిదం తతమ్ ।
వినాశ మవ్యయ స్యాస్య న కశ్చి త్కర్తు మర్హతి ॥ (గీ 2-17)

ఈ శ్లోకము గీతకు అన్వయింపదగును.

తత్=నాచే నీకు చెప్పబడే ఆ తత్త్వము ఈ చరాచర భూతప్రపంచవ్యాప్త మైన పరమాత్మవలె సకలలోకమును వ్యాపించును. ఈ గీతాతత్త్వము అవినాశి నిన్ను, నన్ను లౌకికదేహవంతుల మగుటవలన ఏ మృత్యువైనను కబళింపవచ్చును ఏ నాస్తికుడుకాని, ఏ మతస్థుడుకాని అవ్యయమగు నీ తత్త్వమును వినాశము కావింపలేడు. అని వ్యంగ్యార్థము ప్రకాశించుచున్నది.

## గీత – కర్తవ్యబోధకుడు

ఏత న్మే సంశయం కృష్ణ! ఛేత్తు మర్హ స్యశేషతః ।
త్వ దన్యః సంశయ స్యాస్య ఛేత్తా న హ్యుపపద్యతే ॥ (గీ 6-39)

కృష్ణుడు సర్వసంశయ ఛేదకుడుగా నిందు కీర్తింపబడుచున్నాడు. అట్లే సంశయములు కలిగినపుడు గీతకు మించిన బోధకుడు లేడు.

కనుక భగవద్గీత యోగసంపన్నులైన కృష్ణార్జునులవలె యోగసంపన్నమై, ఈశరీరమధ్యమున రథికత్వము వహించి కర్తవ్యనిర్వహణమున మైమరచిన కార్పణ్యదోషదుష్టజీవునకు ఉపదేశకమై గురువుగా నున్నది.

గురు ర్బ్రహ్మ గురు ర్విష్ణు ర్గురు ర్దేవో మహేశ్వరః ।
గురు స్సాక్షా త్పరం బ్రహ్మ తస్మై శ్రీ గురవే నమః ॥

అన్న గురుమహత్త్వబోధక మగు గురువచనము గీతయందు సమన్విత మగును. కర్తవ్యాంశమును బోధించు విధానమును బట్టి బోధ రాజ మిత్ర కాంతా బోధగా విభక్తమైనది. ఆ త్రివిధమగు బోధ గురువు శిష్యుని బోధించుపట్ల మనము గమనింతుము. అట్టి గురువు బ్రహ్మాద్యభిన్నుడే. కృష్ణుని లోకగురువుగా భారతము పలుచోట్ల కీర్తించినది. "కృష్ణం వందే జగద్గురుం" "త్వ మస్య పూజ్య శ్చ గురు ర్గరీయాన్" (గీ 11-43). అట్టి కృష్ణునికి అభిన్నమగు నీ బోధ కూడ అట్టి గురుత్వ మహిమాన్వితమే యగుట మనము గీతలో చూడగలము.

తా నహం ద్విషతః క్రూరా న్సంసారేషు నరాధమాన్ ।
క్షిపా మ్యజస్ర మశుభా నాసురీ ష్వేవ యోనిషు ॥ (16-19)

ఆసురీం యోని మాపన్నా మూఢా జన్మని జన్మని ।
మా మప్రాప్యైవ కౌన్తేయ! తతో యా న్త్యధమాం గతిమ్ ॥ (16-20)

కామః క్రోధ స్తథా లోభ స్తస్మా దేత త్త్రయం త్యజేత్ ॥ (గీ 16-21)

ఏతై ర్విముక్తః కౌన్తేయ తమో ద్వారై స్త్రిభి ర్నరః ।
ఆచర త్యాత్మన శ్శ్రేయ స్తతో యాతి పరాం గతిమ్॥ (16-22)

య శ్శాస్త్రవిధి ముత్సృజ్య వర్తతే కామకారతః ।
న స సిద్ధి మవాప్నోతి న సుఖం న పరాం గతిమ్ ॥ (16-23)

తస్మా చ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్యవ్యవస్థితౌ ।
జ్ఞాత్వా శాస్త్రవిధా నోక్తం కర్మ కర్తు మిహార్హసి ॥ (16-24)

చేతసా సర్వకర్మాణి మయి సన్న్యస్య మత్పరః ।
బుద్ధియోగ ముపాశ్రిత్య మచ్చిత్త స్సతతం భవ ॥ (18-57)

మచ్చిత్త స్సర్వదుర్గాణి మత్ప్రసాదా త్తరిష్యసి ।
అథ చే త్త్వ మహంకారా న్న శ్రోష్యసి వినంక్ష్యసి॥ (గీ 18-58)

య దహంకార మాశ్రిత్య న యోత్స్య ఇతి మన్యసే ।
మిథ్యైష వ్యవసాయ స్తే ప్రకృతి స్త్వాం నియోక్ష్యతి ॥ (18-59)

ఈ వచనముల సారము రాజబోధ. ఇట్లు చేయకున్న నాప్రకృతి నీ చేయించును. ఇది విధి.

ఉత్సీదేయు రిమే లోకా న కుర్యాం కర్మ చే దహం ।
సంకరస్య చ కర్తా స్యా ముపహన్యా మిమాః ప్రజాః ॥ (గీ 3-24)
సక్తాః కర్మ ణ్యవిద్వాంసో యథా కుర్వన్తి భారత ।
కుర్యా ద్విద్వాం స్తథాఽసక్త శ్చికీర్షు ర్లోకసంగ్రహమ్ ॥ (3-25)
య ద్య దాచరతి శ్రేష్ఠ స్త త్త దేవేతరో జనః ।
స యత్ప్రమాణం కురుతే లోక స్త దనువర్తతే ॥ (3-21)
కర్మణైవ హి సంసిద్ధి మాస్థితా జనకాదయః ।
లోకసంగ్రహ మేవాపి సంపశ్య న్కర్తు మర్హసి ॥ (3-2 )

ఇత్యాది వాక్యములచే చేసిన బోధ మిత్రబోధ.

పార్థ ! నైవేహ నాఽముత్ర వినాశ స్తస్య విద్యతే ।
న హి కల్యాణకృ త్కశ్చి ద్దుర్గతిం తాత గచ్ఛతి ॥ (6-40)

ఇత్యాది చేసిన బోధ కాంతాబోధ.

ప్రకృతవిశేషరూప మగు నర్థమును అప్రకృతమగు నర్థముచే సమర్థించుట కనుగొందుము. సామాన్యముచే విశేషార్థసమర్థనరూపమగు నర్థాంతరన్యాస మిందు గలదు. అందువలన నిట్టి బోధ కాంతాసమ్మిత మగు బోధ.

గురువు శిష్యుని మదికి తాను చెప్పు అంశము సుకరముగ గ్రాహ్య మగు నట్లు ఆ యా సందర్భముల నెట్లు చెప్పవలెనో అట్లు చెప్పి, ఆతనిని కృతార్థుని చేయును.

బహవో గురవ స్సన్తి శిష్యవిత్తాపహారకాః ।
న హ్యేకో గురు రస్తీహ శిష్యచిత్తాపహారకః ॥

అని సద్గురువు లభించుట దుర్ఘటము.

గీతను తన్మయమై చదువుదు మేని ఈ గీతలో చెప్పెడి ప్రతివిషయము గురువువలెనే చెప్పుచున్న ట్లుండును.

న మాం కర్మాణి లింపంతి న మే కర్మఫలే స్పృహా ।
ఇతి మాం యోఽభిజానాతి కర్మభి ర్న స బధ్యతే ॥ (గీ 4-14)
భోక్తారం యజ్ఞతపసాం సర్వలోకమహేశ్వరమ్ ।
సుహృదం సర్వభూతానాం జ్ఞాత్వా మాం శాంతి మృచ్ఛతి ॥ (5-29)

ధాయబారిగా ప్రోవు కృష్ణునితో అర్జునుడు ఇట్ల నెను.

పాండవానాం కురూణాం చ భవా న్నః ప్రథమ స్సుహృత్ ।
సురాణా మసురాణాం చ యథా వీరః ప్రజాపతిః ॥ (ఉ. 77-7)

కృష్ణుడు కురుపాండవుల కిరువురికి ప్రథమస్నేహితు డని స్పష్ట మగు చున్నది.

ఇది చదువునప్పుడు నిజముగా గీత మనలను పిలిచి "సర్వభూతసుహృత్తుని నేను సర్వలోకమహేశ్వరుడను నేను, యజ్ఞతపోదానాదులవలనమీకు కలిగిన పుణ్య ఫలములను నేనే అనుభవింతును. అనగా మీకు మోక్షప్రతిబంధకములగు పుణ్యము లను పాపములతో భుజించి మీకు మోక్షమును ప్రసాదింతును " అనుచున్నదా? అని పించును. "అహం, మాం, మయా, మత్తః, మమ, మయి" అని చెప్పిన కృష్ణవచనము లన్నియు గీత చెప్పినవే అని భావింపదగును. గీతలో కృష్ణార్జున సంవాదమని చెప్పుచు కృష్ణ గీత అనక భగవద్గీత అనుట ఎట్లు? "అర్జున ఉవాచ" అనినప్పుడు "కృష్ణ ఉవాచ" అనికదా అనవలయును.

"కేషుకేషుచ భావేషు చింత్యోసి భగవ న్మయా" అని అర్జునుడు కృష్ణుని "భగవన్" అని సంబోధించినందున కృష్ణుని భగవతత్త్వము ఇందు ప్రకాశింపబడుటవలన భగవంతుడుగా చెప్పుచుండెనేకాని కృష్ణుడుగా చెప్పుటలేదు. అందువలన "భగవా నువాచ" అనియు, "భగవద్గీత" అనియు పేర్కొనుట జరిగినది. యోగసంపన్ను డైనవాడు భగవానుడే అనుటయు పొసగును.

బహూని మే వ్యతీతాని జన్మాని తవ చార్జున! ।
తా న్యహం వేద సర్వాణి న త్వం వేత్థ పరంతప ॥ (4-5)

ఎవడు త్రికాలవేదియో, తానెవడో తెలిసినవాడో వాడు భగవంతు డని తెలియదగును.

నరనారాయణులు కాని, కృష్ణార్జునులుకాని ఒకే తత్త్వము నుండి వెలువడిన రెండురూపాలు. ఆరూపములు కృష్ణార్జునులు. వారు యోగవిషయములను చర్చించిన అనంతరము ఏకతత్త్వము భగవద్రూపముగా నుందురు.

ఇ త్యహం వాసుదేవస్య పార్థస్య చ మహాత్మనః ।
సంవాద మిమ మశ్రౌష మద్భుతం రోమహర్షణమ్ ॥ (18-75)

ఇది సంజయ వచనము.

వాసుదేవ స్సర్వ మితి స మహాత్మా సుదుర్లభః ॥

అని కృష్ణు డనెను. ఈపై సంజయవచనమువలన వాసుదేవుడే సర్వః అని అర్జునుడు భావించి యుండును. అందుకే పార్థుని "మహాత్మనః" అనెః 'పార్థస్య చ' అనుచోటగల చ కారము "వాసుదేవస్య" అన్న పదము నాకః చును. మహాత్ముడై వాసుదేవు డైనవాడు భగవంతుడు. అని చెప్పవచ్చును. .. గీతాబోధ కృష్ణార్జునులను భగవంతులనుగా చేయుచున్నందున భగవత్త్వః నందుటకై వారిరువురు చర్చించుకొనిన విషయమే భగవద్గీత యని చెప్పనగున భగవంతుడు జ్ఞానమే రూపముగా కలవాడు. అతనికి వేరే నామములు లేః జ్ఞానమే భగవంతుడు.

"ఆత్మాన మాత్మనా వేత్సి" ఇత్యాది మహాకవుల వచనములు —

సర్వస్య చాహం హృది సన్నివిష్టో మత్త స్స్మృతి ర్జ్ఞాన మపోహనం చ।
వేదైశ్చ సర్వై రహ మేవ వేద్యో వేదాన్తకృ ద్వేదవి దేవ చాహమ్॥
(15-15

న హి తే భగవన్। వ్యక్తిం విదు ర్దేవా న దానవాః॥ (10-14
స్వయ మేవాత్మనాఽఽత్మానం వేత్థ త్వం పురుషోత్తమ।
భూతభావన భూతేశ దేవ దేవ జగత్పతే॥ (10-15

ఇత్యాదివచనములవలన భగవత్స్వరూపము కృష్ణతత్త్వమున కన్న భిన్న మైనది కాదని చూపుటకే "భగవా నువాచ". ఆతడు కృష్ణుడుగా కాక, భగవంత డుగా చెప్పుటచేత భగవద్గీత అని తెలియవలయును.

"ఓదనం పచతి" అని భవిష్యద్వృత్తి నాశ్రయించి తండులపచనముః "ఓదనం పచతి"అని ప్రయోగించుచున్నట్లు ఈ ప్రశ్నోత్తరానంతరము ఉభయుల భగవత్త్వరూపు లగుదురు. కాన "భగవా నువాచ" అని భగవద్గీత అని చెప్ప బడుచున్నది.

ఈ గీతామాహాత్మ్యమువలననే నేను త్రిలోకపాలనము చేయుచుంటి నః భగవంతుడే చెప్పుటవలన నిర్గుణభగవతత్త్వము ఈ గీతయే అని చెప్పుటక భగద్గీత భగవ దభిన్నమైన గీత అని పేర్కొనవలసినది. కృష్ణార్జునులను భగవంతులను చేయునది ఈ గీత యగుటవలన భగవద్గీత అని ప్రసిద్ధి నందినది.

కనుకనే పార్థునివలెనే మహాత్ముడు అని కీర్తింపబడిన శ్రీగాంధీమహాత్ముడు కర్తవ్య మేమియో తోచనప్పుడు గీతాపఠనము తన్నిర్వహణోపాయమును తోపింప జేయుననని చెప్పుచుండెడివాడు. ఇట్లే లౌకికాలౌకికవ్యవహారవ్యగ్రులైనవారందరును

భగవద్గీత తమ్ము ఎట్లు తీర్చి దిద్దినదో చెప్పుకొనుటకు కారణమైనది. కనుక కృష్ణుని వలెనే భగవద్గీతయు గురువై బోధించుచున్నది.

"భగవద్గీత" అని సామాన్యముగ అనుచున్నారు దీనికి కృష్ణార్జునసంవాద మని పేరు. "ధర్మ్యం సంవాద మావయోః, సంవాద మహ మశ్రౌషం" ఇత్యాదివచనముల వలన భగవదర్జునసంవాద మని, కృష్ణార్జునసంవాద మని పేరుండుట తగును. భగవద్గీత అని తగియున్నదా ? ఇద్దరి సంవాదమునకు ఒకరి పేరు పెట్టుట తగదనే చెప్పవలెను.

కాని కృష్ణార్జును లిరువురును భగవచ్ఛబ్దవాచ్యులే యని నిర్ణయింపవలెను. నన్ను తెలిసినవాడు జ్ఞాని. "జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్" అన్నట్టి వాక్యాలు వరుసలో సమన్వయించుకొనుచో కృష్ణుడు వేరు, అర్జునుడు వేరు కాదు. ఇద్దరు ఒక్కరే. "ఉత్పత్తిం చ వినాశం చ భూతానా మాగతిం గతిమ్‌। వేత్తి విద్యా మవిద్యాం చ స వాచ్యో భగవా నితి ॥" అన్న నిర్వచనము ననుసరించి వీటినితెలిసినవాడు కృష్ణుడు;అట్లే అర్జునుడును అందుకే అర్జునుడు అనును- "నష్టో మోహః" జీవాత్మభేదవాదము మోహము అది నశించినది. తానుఎవరు? అని తెలిసికొనుట స్మృతి. "స్మృతి ర్లబ్ధా". సందేహము ఉన్నచో నాజ్ఞానము యథార్థము కాదు. "గతసందేహః" ఇత్యాదివచనములు భగవదభిన్నుడు అర్జునుడు అని నిరూపింపగలవు. భగవద్గీత-భగవంతులే యగు కృష్ణార్జునుల సంవాదరూప మగు గీత అని నిష్కర్షింపవలెను. దీనివలన అర్జునునికి కర్మయందే అధికారము; జ్ఞానమునందధికారము లేదు. జ్ఞానులు వేరు, కర్ములు వేరు ఇత్యాది అపార్థకవ్యాఖ్యానములు హేయములు, నింద్యములు. తిరస్కార్యములు, ఉపేక్షణీయములు ఆదరణీయములు గావు. గీత చదివినతరువాత దానికి వ్యాఖ్యానము వ్రాయుచు కూడ ఇట్టి భేదవాదమును చేయుటకు సాహసించు పెద్దలను వారు పెద్దలగుటవలన వారిని అనరాదు. కనుక వారి అజ్ఞానము "నశించుకాక" అని గీతాభగవానుని ప్రార్థించుట విజ్ఞుల కర్తవ్యము

## యోగము - విషాదము

భగవద్గీతలోని 18 అధ్యాయములు 18 యోగములుగ పేర్కొనబడినవి. సాంఖ్యకర్మాదులతో విషాదముకూడ యోగముగ పరిగణనమునందుట గమనార్హము.

తం విద్యా ద్దుఃఖసంయోగవియోగం యోగసంజ్ఞితమ్ ।
స నిశ్చయేన యోక్తవ్యః యోగోఽనిర్విణ్ణచేతసా ॥ (గీ. 6-23)

అను నిర్వచనానుసారముగా యోగశబ్దము విషాదశబ్దముతో కలుపతగదు

యోగస్థః కురు కర్మాణి సంగం త్యక్త్వా ధనంజయ ।
సిద్ధ్యసిద్ధ్యో స్సమో భూత్వా సమత్వం యోగ ఉచ్యతే ॥ (2-48)
బుద్ధియుక్తో జహా తీహ ఉభే సుకృతదుష్కృతే ।
తస్మా ద్యోగాయ యుజ్యస్వ యోగః కర్మసు కౌశలమ్ ॥ (2-50)

ఈ పై నిర్వచనములకు తగినట్లుగా లేదు. విషాదయోగము. ఇది ఇట్లుండ సాంఖ్యాదియోగములు సాంఖ్యయోగము, కర్మయోగము అని నిరుపపదముగ నుండ విషాదయోగముమాత్రము అర్జునపదఘటితమై అర్జునవిషాదయోగముగా నిర్దేశింపబడినది. మిగిలినవానికి అర్జున శబ్దసంబంధములేదు. ఇం దేమియో గూఢార్థము ఇమిడియే యుండును. అని విచారించిన స్పష్ట మగును. సాంఖ్యాది యోగములు ఒక్క అర్జునునికే పరిమితములు కావు. అందర నుద్దేశించి ప్రవర్తిల్లి నవి. విషాదయోగము మాత్రము ఒక్క అర్జుననకుమాత్రము చెందినది. కావున అర్జునవిషాదయోగమైనది. ఇది ఒక సమర్థనము.

గీతాబోధ కేవలము కృష్ణుడుగా చేయలేదు. యోగమహిమాన్వితుడై భగవ దభిన్నుడై భగవదభిన్నమైన యోగ బోధచేసెను. కావున ద్వితీయాధ్యా యము నుండి చెప్పిన అంశము లొక్క అర్జుననకే కాక ఎల్లరకు నుపదేశములుగ నలరారుచున్నవి. ప్రథమాధ్యాయములో ప్రసక్తులైన కృష్ణార్జునులు యోగవిష యులు కారు. అశ్వమేథికపర్వములో,అనుగీతాపర్వము పదునారవ అధ్యాయమున "పూర్వము చెప్పిన గీతార్థమును మరల చెప్పుము." అని అర్జునుడు కృష్ణుని అడుగును.

విదితం మే మహాబాహో సంగ్రామే సముపస్థితే ।
మాహాత్మ్యం దేవకీమాత స్తచ్చ తే రూప మైశ్వరమ్ ॥ 5
య త్త ద్భగవతా ప్రోక్తం పురా కేశవ సౌహృదాత్ ।
త త్సర్వం పురషవ్యాఘ్ర నష్టం మే భ్రష్టచేతసః ॥ 6
మమ కౌతూహలం హ్యాస్తి తే ష్వర్థేషు పునఃపునః ।
భవాంశ్చ ద్వారకాం గంతా న చిరాదివ మాధవ ॥ 7

అపు డది యోగయుక్తుడ నై చెప్పితిని. మరల చెప్ప వీలుకాదు. తదర్థక మగు కథ చెప్పెదను అనును.

శ్రీవీత స్త్వం మయా గుహ్యం జ్ఞాపితశ్చ సనాతనమ్ ।
ధర్మం స్వరూపిణం పార్థ సర్వలోకాంశ్చ శాశ్వతాన్ ॥ 9

అబుద్ధ్వా యాగ్రహీ ర్య స్త్వం త న్మే సుమహ దప్రియమ్ ।
న చ సాఽద్య పున ర్భూయః స్మృతి స్తే సంభవిష్యతి ॥ 10

నూన మశ్రద్దధానోఽసి దుర్మేధా హ్యసి పాండవ ।
న చ శక్యం పున ర్వక్తు మశేషేణ ధనంజయ ॥ 11

స హి ధర్మ స్సుపర్యాప్తో బ్రహ్మణః పదవేదనే ।
న శక్యం త న్మయా భూయః తథా వక్తు మశేషతః ॥ 12

పరం హి బ్రహ్మ కథితం యోగయుక్తేన త న్మయా ।
ఇతిహాసం తు వక్ష్యామి తస్మి న్పూర్వే పురాతనమ్ ॥ 13

యథా తాం బుద్ధి మాస్థాయ గతి మగ్ర్యాం గమిష్యసి ।
శృణు దర్మవతాం శ్రేష్ఠ! గదితం సర్వమేవ తత్ ॥ 14

కనుక కృష్ణుడు అర్జునుని విషాదమును బోగొట్ట యోగయుక్తుడై బోధించెను. "అశోచ్యా నన్వశోచ స్త్వమ్" (2-11) అను శ్లోకమునుండి బోధ ఆరంభింపబడినది. యోగసంబంధముకూడ కృష్ణునికి ఇక్కడనుండియే యని ఎంచదగును. అంతకుముందు కృష్ణుడు యోగిగా పేర్కొనబడుచున్నాడేకాని. ఈ యోగమహిమాన్వితుడు కాడని చెప్పవలయును.

భోగా యస్మా త్ప్రతిష్ఠంతే వ్యాప్య సర్వా న్సురాఽసురాన్ ।
ప్రణతో ద్రష్టు మిచ్ఛామి కృష్ణం యోగిన మవ్యయమ్ ॥ (ఉ. 105-16)
కృష్ణ కృష్ణ మహాయోగిన్ విశ్వాత్మన్ విశ్వభావన ।
ప్రపన్నాం పాహి గోవింద! కురుమధ్యే చ సీదతీమ్ ॥ (స. 67-44)

ఇత్యాదిస్థలములలో కృష్ణునికి ప్రయోగింపబడిన యోగిశబ్దము గీతార్థబోధానంతరము ప్రయుక్తయోగిశబ్దముకన్న భిన్నార్థకమై యుండును. ఈ దృష్టితో చూచినప్పుడు ప్రథమాధ్యాయమునందు అర్జునునియందు ప్రకటిత మగు విషాదము యోగము అనుట తగదు. అందుచేతనే విషాదయోగము అర్జునవిషాదయోగముగ విశిష్టమగు నామమున పేర్కొనబడినది. అనగా నిది సాంఖ్యాదులవలె యోగము కాదని స్పష్టము. అయినచో యోగశబ్ద మేల జోడింపవలసివచ్చినది? "ఛత్రిణో యాంతి" అన్న స్థలమున ఛత్రరహితు డగువాడును ఛత్రములు గలవారిమధ్య ఛత్రిగా చెప్పబడినట్లు సాంఖ్యాదియోగసంబంధమున అర్జునవిషాదముకూడ

యోగ మని సామాన్యముగ గృహీతమైన దనవచ్చును. 'తన్మధ్యపతితన్యాయము చేతకూడ విషాదమును యోగముగ సాధింపవచ్చును.

అయినను ఏదైన ఒక మహావిషయముతో యోగశబ్దమును జోడింపవచ్చునేమో కాని, విషాదముతో జోడింపవచ్చునా? అన్న ప్రశ్న అందరికిని కలుగుచున్నది. నిజమే ఇచ్చటి అర్జునుని విషాదము యోగశాస్త్రావతరణమునకు దారి తీసినది. ఎందరు విషణ్ణులు అగుటలేదు? వారందరి విషాదము యోగశాస్త్రావతరణమునకు మార్గదర్శకము కాగలిగినదా? అందుచేతనే అర్జునశబ్దము ఇందు ప్రయుక్తమైది. కార్యకారణముల కభేద మున్నందున యోగకారణమైన అర్జున విషాదము యోగమే యగుచున్నది.

అయినచో "కారణగుణాః కార్యే సంక్రామంతి" అను న్యాయమున్నది కదా! యోగశాస్త్రము అవతరించుటకు కారణభూతమైన విషాదము తక్కిన సాంఖ్యాదియోగములందుకూడ అనుస్యూతము కావలెనే! అని సామాన్యాకారమున ప్రశ్న కలుగును. అందుకే—

కర్మ ణ్యకర్మ యః పశ్యే దకర్మణి చ కర్మ యః ।
స బుద్ధిమాన్ మనుష్యేషు స యుక్తః కృత్స్నకర్మకృత్ ॥

అని భగవంతుడు చెప్పినాడు.

అనగా కారణము కార్యముగను, కార్యము కారణముగను గ్రహింపవలెనని ఇందు వ్యంగ్యార్థము భాసిల్లుచున్నది. అప్పుడు అర్జునవిషాదము కారణము కాదు. అది కార్యము. సాంఖ్యాదిబోధ కార్యమును కాదు. అదికారణమే. కారణమైన సాంఖ్యాదియోగబోధ కార్య మగు విషాదమునందును యోగత్వమును కలిగించినది.

ప్రత్యక్షకర్త యగు అర్జునుడు నిమిత్తమాత్రుడు; నిమిత్తమాత్రుడై నటింపచుచున్న కృష్ణుడు ప్రధానకర్త. ఈ క్రిందివచనములు ఇందుకునిదర్శనములు.

మ యై వై తే నిహతాః పూర్వమేవ ।
నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్ ॥ (గీ. 11-33)
మయా హతాం స్త్వం జహి మా వ్యథిష్ఠాః ।
యుద్ధ్యస్వ జేతాసి రణే సపత్నాన్ ॥ (గీ. 11-34)
తస్య కర్తార మపి మాం విద్ధ్యకర్తార మవ్యయమ్ ॥ (గీ. 4-13)

ఇత్యాదివాక్యములును ఈ పై అంశమును బలపరచును. రామాయణమునందు రాక్షసులు; ద్విజమన్యుహతులు. తరువాత వారిని రాముడు సంహరించెను. ప్రతిప్రత్యక్షమగు క్రియకు పరోక్షక్రియ ఒకటి ఉండియే తీరును.

పఞ్చైతాని మహాబాహో కారణాని నిబోధ మే।
సాఙ్ఖ్యే కృతాన్తే ప్రోక్తాని సిద్ధయే సర్వకర్మణామ్ ॥ (గీ. 18-13)

అధిష్ఠానం తథా కర్తా కరణం చ పృథగ్విధమ్ ।
వివిధాశ్చ పృథ క్చేష్టా దైవం చైవాఽత్ర పంచమమ్ ॥ (గీ. 18-14)

శరీరవాఙ్మనోభి ర్య త్కర్మ ప్రారభతే నరః ।
న్యాయ్యం వా విపరీతం వా పఞ్చైతే తస్య హేతవః ॥ (గీ. 18-15)

ఏకర్మయైనను సిద్ధిని పొందవలె నన్నచో కారణపంచకమును గీత పేర్కొనినది. పంచమకారణము దైవము. ఈ దైవ మనగా నేమి? "దైవం దిష్టం భాగధేయం" అన్నప్రకారము దైవ మన్నను, దిష్ట మన్నను, భాగధేయమన్నను సమానములే. విధి భవితవ్యము మున్నగు పదములుకూడ దైవపదమునకు పర్యాయములే.

పూర్వజన్మార్జితం కర్మ దైవ మిత్యభిధీయతే ।

పూర్వజన్మలో చేసిన కర్మఫలము దైవమని చెప్పుదురు.

"ప్రకృతి స్త్వాం నియోక్ష్యతి" అని చెప్పినప్పుడు ప్రకృతిశబ్దము దైవపదమునకు పర్యాయమే.

న దేవా దండ మాదాయ రక్షన్తి పశుపాలవత్ ।
యం తు రక్షితు మిచ్ఛన్తి బుద్ధ్యా సంబోధయన్తి తమ్ ॥ (ఉద్యో)

దేవశబ్దముచే చెప్పబడునది దైవమే "న కర్తృత్వం న కర్మాణి లోకస్య సృజతి ప్రభుః; స్వభావస్తు ప్రవర్తతే" స్వభావము దైవమే. ఇంతకు చెప్పునదేమన దేనికైనను దైవము వెనుకబలమై పని చేయుచుండును. అది కర్తవ్యము వెనుక నుండి ఒకకొలిక్కి తెచ్చియుండును: ఆదైవమే ప్రకృతము కృష్ణుడు— "మ యైవై తే నిహతాః పూర్వ మేవ॥" అనగా దైవ మగు నాచే పూర్వమే వీరు నిహతులైరి. వీరు తమ కర్మానుసారముగా నిహతి పొందుదురు. అనియే అర్థము: రామాయణమునందు "ద్విజమన్యుహతాని వై" అన్నప్పుడు ద్విజమన్యురూపముగనే దైవము వారల చావునకు అంతరకారణము.

భగవంతుడు ధర్మమునకు గ్లాని ఏర్పడగా అధర్మము తల ఎత్తి విచ్చలవిడిగా వీరవిహారము చేయుచుండ అవతరించును. ముఖ్యము ధర్మోద్ధరణమే ఆ ధర్మము తనను ఉద్ధరించుకొనతలంచి కృష్ణార్జునుల నాశ్రయించినది.

ఇందు ఒకడు ధర్మము తెలిసినవాడుగా, రెండవవాడు తదజ్ఞుడుగా నున్నారు. ఇది ఆ ధర్మవిలాసమే. గుణనిధి యగు నరునినిలో పరాకృపను జనింపచేసి కర్తవ్యము తోపకుండ చేసినది. బంధుమిత్రాదులన్న భావము ఇంతకు ముందు అర్జునునకు వారియందు ఉన్నదే. తదర్థమే వారితో కలసియుండవలె నని సంధిప్రయత్నములు జరిగినవి. శత్రువులుగా ఇట చేరిరి. శత్రువులయందు మిత్రభావము కనపట్టినది. ఇది విషాదము. దీనికి కారణము కృప మాత్రము కాదు. పరాకృప. పరాకృపాకార్యమే విషాదము. ఆవిషాదమునకు యోగధర్మము కారణము. యోగధర్మకార్యము విషాదము. కనుకనే విషాదము యోగముగా ప్రోక్తము. అర్జునవిషాదయోగములో అర్జునశబ్దముచే స్వచ్ఛమైన ధర్మము చెప్పబడుచున్నది. ఆ స్వచ్ఛధర్మకార్యము విషాదము అర్జున విషాదము. అదే యోగము. అర్జునవిషాదయోగము.

లోకములోనిసామాన్యవిషాదమునకంటె ధర్మగుణమైన పరాకృపాజనిత విషాదము విలక్షణమైనది అని చెప్పుటకే అర్జున విషాదమని పేర్కొనబడినది.

ధర్మగుణ మగు పరాకృప స్వచ్ఛమైనది. అది అర్జునశబ్దముచే నిర్దేశింపబడుచున్నది అర్జునవిషాదమనగా అర్జునునియొక్క విషాద మనిచెప్పుట తగదు. స్వతః ప్రకాశమానమైన శుద్ధసత్త్వధర్మగుణమే అర్జునశబ్దార్థము. "పరయా కృపయాఽఽవిష్టః" అను వచనపరిశీలనమున తేలు సారాంశ మేమన ఉత్తమమైన కృపతో అర్జునుడు ఆవేశింపబడినట్లే ఉత్తమపరమకృపతో కూడునదిగా పరమధర్మము తనను మరచిపోయిన యీలోకమును గురించి వీరందరు నొకప్పుడు ఎంతో ప్రీతి-ఆనందము కలిగియుండి, ఇప్పుడు దుఃఖమున బడుచున్నారే, వీరిని ఉద్ధరించుట ఎట్లు? అని విషాదము పొందినది. కనుక గీత మొదటి అధ్యాయమునందు వివరి పబడిన విషయము పరధర్మకృపావిలాసమే. అర్జునశబ్దమునకు ధర్మమర్థము. ఆ ధర్మము కృష్ణుడే. ధర్మము కృష్ణుడు వేరు గారు. అర్జునశబ్దమునకే కృష్ణుడు అర్థము. ఆ ధర్మము కృష్ణార్జునరూపముగ విభక్తమై యున్నది. కృష్ణశబ్దమునకు భారతమున కృష్ణార్జును లిరువురు వాచ్యార్థముగా గ్రహింపబడుచున్నారు అర్జునశబ్దముచేతను కృష్ణుని చెప్పవచ్చును. కృష్ణశబ్దముచే అర్జునుడు గౌణముగను, వాసుదేవుడు ప్రధానముగ నిర్దేశింపబడుచున్నటు అర్జునశబ్దముచేఅర్జునుడుప్రధానముగను, కృష్ణుడు అప్రధానముగను గ్రహింపబడుచున్నారు. ఈ కారణంబున సాక్షాత్కర్త అర్జునుడు కదా! ధర్మాభిన్నుడగు కృష్ణుడు తన రూపమే అగు అర్జునునియందు విషాదమును కల్గించినట్లు భాసిల్లచేసి, తాను అర్జునునికి యోగ

మహిమ బోధించుచున్నట్లు చూపి గురుశిష్యపరంపర లోకమున నెలకొల్పినాడు. కనుక అర్జునవిషాదము యోగధర్మమే అయి యున్నందున అర్జునవిషాదయోగ మని చెప్పుటకు హేతు వైనది.

ఆత్మాన మాత్మనా వేత్సి సృజ స్యాత్మన మాత్మనా. ఆత్మనా కృతినా చ త్వా మాత్మన్యేవ ప్రలీయసే (కు. 2-10) ఇత్యాది మహాకవి వచనములందు ఈ మహార్థమే భాసిల్లుచున్నది.

న హి తే భగవ న్వ్యక్తిం విదు ర్దేవా న దానవాః। (గీ 10-14) స్వయ మే వాత్మనాత్మానం వేత్థ త్వం పురుషోత్తమ। భూతభావన! భూతేశ దేవదేవ! జగత్పతే! (గీ. 10-15)

ఇత్యాది భగవద్వచనములును సుసంపన్నము లగుచున్నవి ప్రకృతము అర్జునశబ్దగ్రాహ్యు డగు కౌంతేయుడు భగవదభిన్నుడు. ఆతని నావేశించిన "పరా కృప" భగవత్కృపయే. పరాకృప ఆతని నావేశించినది. అర్జునునకు కర్తృత్వము లేదు. పరాకృపకే కర్తృత్వము. కృప అర్జును నావేశించి తన మహత్త్వమును వెలువరించుకొనుటకు అవసర మైన పరిస్థితుల నాతనిచే ననిపించి మరల నాకృపయే కృష్ణనిద్వారమున ఉపదేశముగా నావిష్కృత మైనది. కనుక అర్జునునియందు గలిగిన విషాదము కృష్ణునివలన ప్రవర్తిల్లిన దివ్యబోధ రెండు యోగశక్తిచే- భగవదిచ్ఛచే ప్రవర్తితములు. కృప — విషాదము, బోధ, యోగధర్మములు.

## అర్జున విషాద యోగము

ఏ శబ్దమునకైనను అర్థనిర్ణయము చేయునప్పుడు కేవలసంకేతితార్థమును చెప్పుట గాక, సందర్భమునుబట్టి వాచ్య, లక్ష్య, వ్యంగ్యములలో నేది సమరస మగునో దానిని చెప్పవచ్చును. ఒకప్పు డీ యర్థములు వెగటును కల్గింపవచ్చును. కాని శాస్త్రీయ మగు చర్చ చేయునప్పుడు తమ తమ యభిప్రాయములను వ్యక్తము చేయుటకుగ విమర్శకులు, ముఖ్యముగ పండితులు ఈ వింతవ్యాఖ్యానములను చేయుచునే యున్నారు.

"విషం అత్తీతి విషాదః" దుర్యోధనుడు పెట్టిన విషము తినిన భీముడు విషాదుడు. ఇతడు వాయుపుత్రుడు. అర్జునుడు ధనంజయుడు. అనగా అగ్ని వాయ్వగ్నిసంయోగమువలె వీరిద్దరు ధార్తరాష్ట్రవనదహనమునందు కలసిరి.

"వనాని దహతో వహ్నేః సఖా భవతి మారుతః" అన్నట్లు యుద్ధనాయకు డగు అర్జునునకు వాయువు వలె మారుతి తోడ్పాటుగ నున్నందున అర్జునవిషాద యోగ మన్న పేరు వచ్చినది.

విషాదుడు ఈశ్వరుడు. హాలాహలమును భక్షించిన శివుడు అర్జునకు పాశుపతము నిచ్చెను. అంతమాత్రముతో తృప్తిపడక త్రిశూలధారియై యుద్ధములో శత్రుసంహారమున తోడ్పడుచున్నాడు. ఈ వ్యాసవచనములు పరిశీలింప దగును:—

సంగ్రామే న్యహన న్యతూన్ శరౌఘై ర్విమలై రహమ్ ।
అగ్రతో లక్షయే యాంతం పురుషం పావకప్రభమ్ ॥ (ద్రో 203-4)
జ్వలన్తం శూల ముద్యమ్య యాం దిశం ప్రతిపద్యతే ।
తస్యాం దిశి విశీర్యంతే శత్రవో మే మహామునే । (- 5)
తేన భగ్నా నరీ న్సర్వా న్మద్భగ్నా న్మన్యతే జనః ।
తేన భగ్నాని సైన్యాని పృష్ఠతో నుదదా మ్యహమ్ ॥ (- 6)
భగవం స్త్వం మమాఽఽచక్ష్వ కో వై స పురుషోత్తమః ।
శూలపాణి ర్మయా దృష్ట స్తేజసా సూర్యసన్నిభః ॥ (- 7)
న పద్భ్యాం స్పృశతే భూమిం న చ శూలం విముంచతి ।
శూలా చ్ఛూలసహస్రాణి నిపేతు స్తస్య తేజసా ॥ (- 8)

ఇట్లర్జునుడు ప్రశ్నించగ వ్యాసు డిట్లు సమాధానము చెప్పెను;—

ప్రజాపతీనాం ప్రథమం తేజసాం పురుషం ప్రభుమ్ । (- 9)
ఈశానం వరదం పార్థ! దృష్టవా నసి శంకరమ్ ।
తం గచ్ఛ శరణం దేవం వరదం భువనేశ్వరమ్ ॥ (- 10)
స శివ స్తాత ! తేజస్వీ ప్రసాదా ద్యాతి తేఽగ్రతః ॥ (- 20)

యుద్ధమునందు అర్జునునకు ముందు పోవుచున్న దివ్యశక్తి సాక్షాత్తు శివుదే యనియు, అర్జునునిపై గల దయతో అత డట్లే తానే శత్రువులను సంహరించి అర్జునునియొక్క కార్యమును సులభము చేయుచుండు ననియు, కావున అర్జును డాశివుని శరణు జొచ్చుట శ్రేయస్కర మనియు, శ్రీ వేదవ్యాసుడు వివరించెను. ఈ యుద్ధమున అర్జున-విషాదుల కలయికయే అర్జునవిషాదయోగము.

విష మనగ శబ్దాదివిషయములు. దానివల్ల కలుగు సుఖదుఃఖములు, శీతాతపములు, ఆధ్యాత్మిక, ఆధిదైవిక, ఆధిభౌతికము లగు త్రివిధపీడలు, మోక్షప్రతిబంధకములగు పుణ్యపాపములు మున్నగున వన్నియును. వాటిని "అత్తి నాశయతి భగవాన్" అనగ భగవంతుడే విషాదుడు. "అత్తా చరాచర గ్రహణాత్" విషయ సుఖములకాధార మైన చరాచరములను త్రాపత్రయకలితమైన చరాచరసంసారమును నాశనము చేయువాడు; అట్టి భగవంతునితోటి అర్జునునకు యోగము కలదు.

ఒకే రథమున ఒకే కార్యమునుసాధించు అర్జున-విషాదుల కలయికే అర్జున విషాదయోగము.

విష మనగ జలము. "విషం అత్తి పాతి" నీటిని త్రాగునది మేఘము. "ధాతూనా మనేకార్థత్వాత్" అనుటవలన భక్షణార్థక మగు "అద-"ధాతువునకు త్రాగుట అను అర్థము చెప్పవచ్చును.

అబ్భక్షణము అను ప్రయోగము కలదు. కనుక విషాదశబ్దమునకు మేఘ మని యర్థము చెప్పవచ్చును. భగవంతుని రూపము మేఘముతో పోల్చుటయే గాక, మేఘముగ రూపించుటయు గలదు. "కృష్ణమేఘః" ఆదిగ ప్రయోగములు కొల్లలుగ నున్నవి.

స్మృతాపి తరుణాతపం కరుణయా హరన్తీ నృణామ్
అభంగురతనుత్విషాం వలయితా శతై ర్విద్యుతామ్।
కళిందగిరినందినీతట - సురద్రుమాలంబినీ మదీయ
మతిచుంబినీ భవతు కాపి కాదంబినీ ॥ (రస. 1-1)

భగవంతుడు-మేఘము అభిన్న మని వర్ణించు పద్యము లెన్నియో గలవు. ప్రకృతము విషాదశబ్దముచే చెప్పబడు మేఘము కృష్ణుడే. వారిరువురి కలయికయే అర్జునవిషాదయోగము. వారిరువురు ఒకరి కొకరు ప్రాణము లైనను రథ-రథికులుగ ప్రకృతయుద్ధమున మహాస్యందనమున ఉండుటవలన వారిరువురి యోగము అర్జునవిదషాయోగము.

విష మనగ సంసారము. సంసారమును వృక్ష మందురు. "సంసారవిషవృక్షస్య" అను వచనము ప్రమాణము. ఈ సంసారవృక్షమున జీవాత్మ-పరమాత్మలు పక్షిరూపమున ఉన్నా రని :-

ద్వా సుపర్ణా సయుజా సఖాయా సమానం వృక్షం పరిషస్వజాతే ।
తయో రన్యః పిప్పలం స్వా ద్వత్తి అనశ్న న్నన్యోఽభిచాకశీతి॥ అను వచనము ప్రమాణము ఇక్కడ చెప్పిన వృక్షమే గీతలో కృష్ణార్జును లధిరోహించిన రథముగ రూపొందినది. అర్జునశబ్దముచే కృష్ణార్జును లిరువురును తెలియబడుదురు.

దుర్యోధనుడే విషరూపమైన వృక్షము. "దుర్యోధనో మన్యుమయో మహాద్రుమః" అన్నది ప్రమాణము. ఈ మహాద్రుమము కూల్చుటకు అర్జునశబ్దవాచ్యు లైన కృష్ణార్జునుల కలయికే అర్జునవిషాదయోగము.

ఊర్ధ్వమూల మధశ్శాఖం అశ్వత్థం ప్రాహు రవ్యయమ్,
ఛందాంసి యస్య పర్ణాని య స్తం వేద స వేదవిత్ ॥ (గీ. 15-1.)

అథ శ్చోర్ధ్వం ప్రసృతా స్తస్య శాఖా గుణ ప్రవృద్ధా విషయప్రవాలాః ।
అధశ్చ మూలా న్యనుసంతతాని కర్మానుబంధీని మనుష్యలోకే ॥ (-2)

ఇందు వర్ణిత మగు అశ్వత్థవృక్షము దుర్యోధనుడే. అశ్వత్థమనగ రేపు ఉండనిది. అనగ యుద్ధానంతరము దుర్యోధను డుండడు. ఈ అశ్వత్థము సువి రూఢమూలము. అనగ రాజ్యములో పాతుకుపోయినాడు. అసంగశస్త్రముతో వీనిని ఛేదింపవలయును అనగా బంధు వసు సంగము లేక నాశనము చేయవలయును. అపిస్మట సకలభోగస్థాన మగు రాజ్యప్రాప్తి కలుగును. అని (గీ.15-3) దీనివలన తెలియుచున్నది ఇట్లు విషరూపమైన అశ్వత్థమన్యమహాద్రుమనాశనము చెప్పుటయే అర్జునవిషాదయోగము.

కాలమునకు విషముతో పోలిక గలదు. కాలకూటవిషము అనగా కాల సమూహమే విషము. కాల మనగ మృత్యువు. విషరూప మగు మృత్యువును భక్షించువాడు భగవంతుడు. "మృత్యు ర్యస్యోపసేచనం ।" అని కఠోపనిషత్తు. అట్టికాలమృత్యుభక్షకు డగు భగవానుడు విషాదుడు. అట్టి విషాదునితో అర్జునయోగము అర్జునవిషాదయోగ మైనది.

లోకము విసముతో పోల్చబడుచున్నది. "లోక్యత ఇతి లోకః" అనగా దృశ్యప్రపంచము. ఇట్టి లోకము నాశనము చేయువాడు "కాలోస్మి లోకక్షయకృత్ప్రవృద్ధః" "లోకాన్ సమాహర్తు మిహ ప్రవృత్తః (గీ 11-32)" భగవంతుడు విషాదుడు. అట్టి విషాదునితో అర్జునుని కలయికయే అర్జునవిషాదయోగమైనది.

యథాఽమృతం చ సత్యం చ యథా చాపి విషామృతే ।
తథా త్వ మపి పార్థ శ్చ ప్రఖ్యాతా వాత్మకర్మభిః ॥ (కర్ణ. 30-5)

శల్యుడు పార్థుని అమృతముగను, కర్ణుని విషముగను చెప్పుచున్నాడు. ఈ కర్ణుడేకాక కర్ణునివలన ప్రేరితు లగు దుర్యోధనాదులును కూడ విషశబ్దముచే చెప్పబడుదురు. వీరందరినీ నాశనము చేసినవాడు విషాదుడు.

యు స్తాన్ ద్వేష్టి స మాం ద్వేష్టి య స్తా నను స మా నను ॥ (ఉ 90-28)
ఐకాత్మ్యం మాం గతం విద్ధి పాండవై ర్ధర్మచారిభిః ॥ (29)
పాండవాన్ ద్విషతే రాజన్। మమ ప్రాణా హి పాండవాః ॥ (33)

దుర్యోధనునితో కృష్ణుడు చెప్పిన ఈ వచనములవలన పాండవశత్రువులను పాండవులకన్న కృష్ణుడే ఎక్కువగ శత్రువులుగ చూచుచున్నా డని వారినిచంపుటకు తానే పూనుచున్నా డని తెలియుచున్నది.

తతః స్థాస్యంతి సమయే పాండవా ఇతి మే మతిః ।
సముచ్ఛేదం హి నః కృత్స్నం వాసుదేవ శ్చికీర్షతి ॥ (ఉ. 54-8)

దుర్యోధనుని ఈ వచనమువలన పాండవద్వేషులను చంపు పట్టుదల కృష్ణున కున్నట్లు తెలియుచున్నది. ద్యూతకృత్య మైనతర్వాత పాండవు లరణ్యమునకు పోయినపుడు పాండవులను చూచుటకు వెళ్ళిన కృష్ణుడు కౌరవులను నాశనము చేసి, ఆ ధర్మజునకు రాజ్యమిచ్చెదు ననగ అర్జునుడుకృష్ణుని కోపము నుపశమింపజేయును. మరల అరణ్యవాసములో నుండగ అజ్ఞాతవాసము కంటె ముందు కృష్ణుడు పాండవుల దగ్గరకు వచ్చి యుద్ధమునకు సేనలను సమకూర్చితి నని చెప్పును. కృష్ణుని కన్న సాత్యకి పాండవశత్రువులను నాశము చేయుటకు పనిగట్టుకొని యున్నాడు. కావున విషాదు డనగ కృష్ణు డైనను కావచ్చును. సాత్యకి యైనను కావచ్చును అర్జునున కట్టి విషాదునితో యోగమును చెప్పుటయే అర్జునవిషాదయోగము.

కృష్ణుడే విషరూపులగు శత్రువులను నాశనము చేసె ననుటకు "మయై వైతే నిహతాః పూర్వమేవ నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్" అను వాక్యమే ప్రమాణము.

విషరూపశత్రుసంహారమున ప్రత్యక్షముగ సారథి యై ఎక్కడి కక్కడ తగు సహాయము చేయుచు శత్రునాశము చేయుచున్న కృష్ణుడు విషాదుడు. త్రిశూల ధారియై పరోక్షముగ శత్రునాశము చేయుచున్న విషాదుడే విషాదుడు. అభిన్నులగు శివకేశవులు విషాదశబ్దముచే చెప్పబడుచున్నారు. వారిద్దరితో యోగము అర్జునునకు కలదు కావున అర్జునవిషాదయోగము.

కర్ణునిచే భంగపడిన ధర్మరాజు గుడారములోనికి పోగా అన్నను చూచి వత్తమని అర్జునుడు కృష్ణునితో అటు పోయెను. కర్ణుని చంపలేదని తెలిసి ధర్మజుడు గాండీవమును అవమానపరచెను. అది యొక విషమఘట్టము. విషరూప మగు ఆ ఘట్టమునుసూక్ష్మధర్మప్రసంగముచే విషరూపమైన అర్జునుని ప్రతిజ్ఞను మరొక రీతిలో నాశనము చేసి కృష్ణుడు విషాదు డైనాడు. అట్టి విషాదునితో యోగము అర్జునవిషాదయోగము.

విషయసుఖములు విషము. స్త్రీధనములు 'విష' శబ్దముచే దూపించుట ప్రసిద్ధమే.

వేధా ద్వేధా భ్రమం చక్రే కాంతాసు కనకేషు చ ।
తాసు తే ష్వప్యనాసక్తః సాక్షాత్ భర్గః నరాకృతిః ॥

మన్మథసంహారము చేసి కాంతారూపవిషమును, దిగంబరత్వము, వహించి కనక రూపమైన విషమును నాశనము చేసిన ఈశ్వరుడు విషాదుడు. అట్టివాడే భీష్ముడు. వారిద్దరూ విషాదులే. వారిద్దరితో శతృ-మిత్రరూపమున అర్జునునకు ఈ యుద్ధమున యోగ మున్నందున అర్జునవిషాదయోగ మనవచ్చును.

"ఈశ్వరానుగ్రహాదేవ పుంసా మద్వైతవాసనా ।" అన్నట్లు ఈశ్వరుని వలననే అద్వైతజ్ఞానము కలుగును. ఈశ్వరాభిన్నుడగు భీష్మునివలన జ్ఞానమును అర్జునుడు ధర్మరాజుతోకూడ పొందబోవుచున్నాడు. గనుక విషరూపమైన అజ్ఞానమును నశింపజేసినవారు ఈశ్వర, భీష్ములు విషాదులు. వారితో యోగ మున్నందున అర్జునవిషాదయోగ మనవచ్చును.

ఉలూకుని ద్వారా రాయబార మంపుచూ :— క్రోధో బలం తథా వీర్యం జ్ఞానయోగోఽస్త్రలాఘవమ్ । ఇహ తే దృశ్యతాం పార్థ! యుధ్యస్వ పురుషో భవ ॥" క్రోధము, బలము, వీర్యము జ్ఞానయోగము, అస్త్రలాఘవము అర్జునునియందున్నట్లు దుర్యోధనుడు పేర్కొనుచున్నాడు. ఈ జ్ఞానయోగము కల యర్జునుడే విషాదుడు. అనగా విషరూపమైన అజ్ఞానమును నాశనము చేసినవాడు "అర్జునశ్చాసౌ విషాదశ్చ అర్జునవిషాదః, అర్జునవిషాదస్య యోగః అర్జునవిషాదయోగః" జ్ఞానయోగముద్వారా అజ్ఞానమును నశింపజేసికొనిన యర్జునుడు శతృసంహారకర్మ చేయుచుండుట అర్జునవిషాదయోగమున కర్థము యోగశబ్దము యుద్ధార్థక మని ముందు వివరింపబడును.

అర్జున శబ్దముపలక్షణము. పాండవులను, పాండవసైన్యమును కూడ ఇది చెప్పును. విషశబ్దము కర్ణుని చెప్పుచు తత్సహాయమున యుద్ధమునకు కడంగిన దుర్యోధనపక్షమునంతను చెప్పును. శల్యుడు పార్థకర్ణులను అమృతవిషములతో పోల్చుటలో ఎంతో యర్థమున్నది. "సంసారవిషవృక్షస్యద్వేఫలేఅమృతోపమే" అని లోకమున సాహిత్యపరు లర్థము చెప్పుచున్నారు. "ద్వేఫ తే విషామృతే" అని చెప్పినచో కుంతి యను వృక్షమునకు కర్ణ పార్థు లను విషామృతఫలములు పుట్టిన వన్న భావము శల్యుని వాక్యములలో కన్పట్టుచున్నది. నిజమునకు ఈ రెండు ఫలములు విషతుల్యములే. ఒకటి బాహిరముగ, మరియొకటి ఆంతరంగికముగ రెండును పీడాకరములే. అర్జునవిషములు అన్నప్పుడు పాండవ, కౌరవసేనలుగ చెప్పవచ్చును ఈ రెంటినికూడ "శత్రునాశయతి" అనగ భగవంతుడు ఈ రెంటిని కూడానాశనముచేయబూనియే యున్నాడనగ కృష్ణభగవానుడే. అతనియొక్క యోగము. అనగా యోగశక్తితో కూడిన యుద్ధకర్మ. అర్జునవిషాదయోగము,

నిజమునకు కృష్ణుడు పాండవులను రక్షించె నని, కౌరవులను నాశనము చేసె నని అనుకొనుచున్నారు. కౌరవపక్షమున ముగ్గురు, పాండవపక్షమున ఏడుగురు మిగిలినా రని తెలియుచున్నది. ఇందులో సాత్యకి కృష్ణుడు ఇరువురు, పోగా పంచపాండవులు మిగులుదురు. ఈ పాండవుల పుత్రులు ఎవరూ మిగలనే లేదు. ఈ యుద్ధమునకు ఫలముగనే గాంధారీశాపము యాదవవంశము నాశన మగుటకు కారణ మగుచున్నది. ఋషిశాపముకూడ ముసలోత్పత్తికి కారణమై యాదవ వంశము నాశ మగుటకు కారణమగుచున్నను, ముఖ్యముగ కురుపాండవయుద్ధము ఆ వంశనాశనములో హేతుభూత మగుచున్నది. కృతవర్మ సాత్యకులు ఈ యుద్ధములో జరిగిన అన్యాయములను ఎత్తిపోతలతో కలహము ప్రారంభమగును. కనుక "లోకక్షయకృత్ప్రవృద్ధః" అను కృష్ణుని వచనము యథార్థము. అర్జునుడు విశ్వరూపములో చూచినదానితో ఉభయసేనల వీరులు నశించిపోవుటనే చూచెను. కృష్ణుడు పంచపాండవులను మాత్రమే మిగల్పదలచెను కాని, ఎవరినీ మిగిలింప దలంపలేదు. అతడు త్రికాలవేది. 'కర్తు మకర్తు మన్యథా కర్తుం ప్రభవతి ప్రభుః" అన్నట్లుగ చేయుటకు, చేయకుండుటకు, అన్యథాకరించుటకు సమర్థుడు. అభిమన్యువధ అతనికి అభిమతమే. దిష్టము నాపనని కృష్ణుడే చెప్పినాడు పదునారు సంవత్సరముల తర్వాత అభిమన్యుడు చనిపోవు నని అతనియుత్పత్తిలోనే యున్నది. దుర్యోధనవధానంతరము ధర్మజుని ప్రేరణతో గాంధారీధృతరాష్ట్రుల నోదార్చుటకు వారు క్రుద్ధులై శపింపకుండ శాంతింపజేయుటకు కృష్ణుడు పోయెను. అక్కడ ఉండగనే అశ్వత్థామ చేయు హత్యాకాండ కృష్ణుడు ప్రత్యక్షముగ చూచును. పాండవులు అశ్వత్థామచే దగ్ధు లగుదురు. నేను శీఘ్రముగ పోవలయు నని ధృతరాష్ట్రునితో ననగ మహాత్ములు పాండవులు వారిని కాపాడు మని ధృతరాష్ట్రుడనును. అతడు వచ్చునప్పటికి సౌప్తికము పూర్తి యయినది. చక్రము డ్డువేసి సూర్యాస్తమయమును కల్పించి సైంధవుని వధకు కారణ మైన కృష్ణుడు తన మాయాయోగశక్తిచే ఈ ఘోరవిశసనము నాపడా? ద్యూతకాలమున నేను సౌంభకవధలో నుండుటచే ఇట జూడ మాపలేకపోతిని అనెను. కాని అదే సమయమున ద్రౌపది ప్రార్థింపగ ఆమెను మానభంగమునుండి రక్షించెనే! అన్య కార్యవ్యాపృతు డైన సమయములో కూడ భగవంతుడు తన యోగమహిమచే భక్తులను కాపాడగలుగుట ఈ ఘట్టమున తెలియుచున్నది. మరి ఈసౌప్తికము నేల ఆపలేకపోయెను ? ఆప దలంపలేదు. ధర్మరాజు ప్రశ్నకు అశ్వత్థామ యంతటి శక్తిమంతు డగుటకు కారణముగ శివశక్తిని ఉట్టంకించెను. ఆ శివుడెవరు? తానేకదా! "తాను వేరు, శివుడు వేరు" అని కృష్ణుడు చెప్పునా? తాను ప్రత్య

క్షముగ సారథి యై యుద్ధతంత్రమును నడుపుచుండ మరి అర్జునుని శత్రు సంహారములో త్రిశూలధారి యై ఈశ్వరుడు శత్రుసంహారమును చేయుచుం "మ యై వై తే నిహతాః పూర్వ మేవ నిమిత్త మాత్రం భవ సవ్యసాచిన్" అన వ్యాఖ్యానము సరస మగుట గమనించినచో ఆ ఈశ్వరుడు తానే అయినట్లు అ మగుట లేదా? ద్యూతకాలమున "నేనున్నచో ఆపెడివాడను." అన్నదానికి అ మేమి? నన్ను తలంచినచో నే నట్లు చేసి యుండెడివాడను అని. కనుక పాండవు సర్వాత్మనా కృష్ణు నాశ్రయించినారనుట తగదు. కృష్ణుని ధర్మరాజు పిలచి యంశమున నియోగించెనో ఆ యంశమువరకు సంరక్షింపబడినది. ద్యూతవిషయ మున పాండవులు కృష్ణుని స్మరింపలేదు. దాని ఫల మనుభవించిరి. అభిమన్యు పద్మవ్యూహములో జొనుపుటకు కృష్ణుని స్మరించి అతడు నీకు రక్షకు డని అ లేదు. అందుల కతడు చనిపోయెను. ధర్మరాజు యుద్ధభూమిలో రక్షణబాధ్యత ప్రస్తావింపక యే గాంధారీధృతరాష్ట్రుల దగ్గరకు పంపును. దాని ఫలితమున అనుభవించిరి.

అగుచో పాండవులకు అశ్వత్థామ హానిచేయుచున్నాడని పరిగెత్తుకొనివచ్చెనే అప్పుడు తలంచిరా? "యేన వినా య దనుపపన్నం తత్ తేనాఽఽక్షిప్యతే" ఏ లేక,ఏది ఉండదో,అది దానిని తప్పక ఆకర్షించును. పాండవులు స్మరించిరికనుక వచ్చినాడు. వచ్చి అశ్వత్థామబారినుండి పాండవులను కాపాడినాడు. అదికూడ వ్యాస మహర్షిని అడ్డువేసుకొని కాపాడినాడు. అశ్వత్థామమీద కోపముచే ఉత్తరాగర్భమును రక్షింపతలంచెను. ఆ ఉత్తర కనినపుడు మొత్తము యావన్మంది, కుంతి, సుభద్ర, ఉత్తరతో సహా ప్రార్థించి శరణు పొందగ అప్పుడు తన ప్రతిజ్ఞానుసారము పరీక్షి త్తును బ్రతికించెను కాని ఈవంశములో పాండవులు తప్ప అందరు చచ్చి రని చెప్పుటయే. చచ్చినవానిని బ్రతికించుట యుదాహరణము. కనుక కౌరవపాండవ పక్షములను రెంటినికూడ కృష్ణుడు నిరూపుమాపమై భస్మీపటలము చేసెను. పాండవ సమక్షములో సంజయునితో. దుర్యోధను డను మన్యుమయమహాద్రుమమునకు ధృతరాష్ట్రుడు మూలము. ధర్మరాజను ధర్మమయమహాద్రుమమునకు నేను బ్రహ్మ బ్రాహ్మణులు అని చెప్పెను. అనగా నీ రెండువంశములు కాలపక్వ లై ప్రళయకాలవాయువీచికలకు వేళ్ళు బయట పడినవి ఈ రెండు వృక్షములు కూలి పోవును ధృతరాష్ట్రుడుమనీషి వైరమునందు భావ ముంచినాడు. నేనును అంతే సంజయా! గ్రహింపుము. అని చెప్పెను వృష్ణివంశమునకు బ్రాహ్మణశాపము వలన నాశన మగును. అని సూచించుటయు కలదు.

వనం రాజా ధృతరాష్ట్రః సపుత్రో
వ్యాఘ్రాస్తే వై సంజయ పాండుపుత్రాః ।
మా వనం ఛింధి సవ్యాఘ్రం
మా వ్యాఘ్రా నీనశు ర్వనాత్ (ఉ 28-55)
నిర్వనో వధ్యతే వ్యాఘ్రో నిర్వ్యాఘ్రం ఛింద్యతే వనమ్ ।
తస్మా ద్వ్యాఘ్రో వనం రక్షే ద్వనం వ్యాఘ్రం చ పాలయేత్ ।
(28-56)

అను ధృతరాష్ట్రునికి ఇందులో ఎంత నీతి, బెదరింపు ఉన్నవో, అంతా పాండవులకును, కౌరవులు నశించిన మీరు నశింతురు అన్నదే సారం. "ధృతరాష్ట్రో మనీషీ" సంజయా! ధృతరాష్ట్రుడు మనీషి ; ఆత డెరుగును; ఈ విషయమున నీవు బాధ పడకుము అని తాత్పర్యము. వ్యాఘ్రవనములు రెండు కాపాడబడితేనే తప్ప ఇందులో ఒక దానికి రక్షణ, ఇంకొకదానికి భక్షణ అన్నది లేదు.

లతాధర్మాః ధార్తరాష్ట్రాః సాలాః సృంజయ పాండవాః ।
న లతా వర్ధతే జాతు మహాద్రుమ మనాశ్రితా ॥ (ఉ 28-56)

లతాధర్మలు కౌరవులు; మహాద్రుమధర్మలు పాండవులు. ధార్తరాష్ట్రులు పాండవుల నాశ్రయించిన బ్రతుకుదురు. వాచ్యార్థ మిది. లత ఉపలక్షణము. చిగుళ్ళు వగైరాలు ధార్తరాష్ట్రులు. అవి పోయిన మ్రాను నిరుపయోగము. వంటచెరకునకే పనికివచ్చును. శాఖా,పత్ర, పల్లవ పుష్ప, ఫలసమృద్ధి పోయిన చెట్టు ఉన్నా నశించి నట్లే. పాండవుల విషయమిది. చివరకు మిగిలినది ఇంతియ కదా! ఎండిన మోడులు పాండవులు. కృష్ణభావము ఇది. అతని కర్తవ్య మిది. కృతమును ఇదే కదా! పాండవులు బ్రతికి రనుకొనుచున్నాముకాని, ఇంచుమించు వారును చచ్చినట్లే. "ఆత్మా వై పుత్రనామాసి. తస్మాత్పుత్రో హి హృదయం. ప్రజయాహి మనుష్యః పూర్ణః ।" మున్నగు వేదవాక్యముల సారము కనుగొనుచో పాండవులు శారీరకముగ ప్రత్యక్షముగ బ్రతికినను, మానసికముగ పరోక్షముగ వారి చావు వారు చచ్చిరి. కావుననే ధ్వన్యాలోకకర్త చతుర్థోద్యోతమున భారతమున పరమార్థము శాంతరస మని చెప్పుచూ,ఆ ఒక్క పరమాత్మయే సత్యము,నిత్యము అని చెప్పెను. పరాశ్రమములయందు, గుణములయందు బుద్ధిని ఉంచుటకూడ అప్రయోజకమే. కేవలము భగవంతునియందే దృష్టి నుంచుట పరమార్థ మని వ్యాసభారతతాత్పర్య ముగ నిర్ణయించెను. ఈయంశము సమర్థించుటకు వృష్ణిపాండవావసానదశను కూర్చ గమన్నింప దగు నని పేర్కొనెను.

"శాస్త్రరూపే కావ్యచ్ఛాయాన్వయిని వృష్ణిపాండవవిరసావసానవైమనస్యదాయినీం సమాప్తి ముపనిబధ్నతా మహామునినా వైరాగ్యజననతాత్పర్యం ప్రాధాన్యేన స్వప్రబంధస్య దర్శయతా మోక్షలక్షణః పురుషార్థః శాంతో రసశ్చ ముఖ్యతయా వివక్షితవిషయత్వేన సూచితః। అనేన హ్యాయ మర్థో వ్యంగ్యత్వేన వివక్షితః:- యదత్ర మహాభారతే పాండవాదిచరితం య త్కీర్త్యతే త త్సర్వం అవసానవిరసం అవిద్యాప్రపంచరూపం చ పరమార్థస్వరూప స్తు భగవాన్ వాసుదేవోఽత్ర కీర్త్యతే, తస్మాత్ తస్మిన్నేవ పరమేశ్వరే భగవతి భవత భావితచేతసః, మాభూత్ విభూతిషు నిస్సారాసు రాగిణో గుణేషు వా నయవినయపరాక్రమాది ష్వమీషు కేషు చి త్సర్వాత్మనా ప్రీతినివిష్టధియః ॥" (ధ్వన్యాలోక - 4 ఉద్యోతము)

అర్జునవిషాదయోగము నిజముగ అర్జుని దుఃఖమును చెప్పునదియే యగుచో అది కేవలము యుద్ధభూమిలో తన శత్రువు లగు ధార్తరాష్ట్రులను చూచినపుడు కలిగినది కాదు. కుమారాస్త్రప్రదర్శనములో కర్ణుడు మేఘగంభీరస్వనమున రంగమున ప్రవేశించినప్పుడే అర్జునునియందు హ్రీక్రోధములు ప్రవేశించినవి. ద్రోణుడు కర్ణునకు అనుమతి నిచ్చెను. అప్పుడు దుర్యోధనుడు కర్ణునితో సఖ్యము చేసెను. అనాహూతోపదిష్టులు, అనాహూతోపజల్పితు లగువారలకు ఏలోకములువచ్చునో ఆ లోకములకు నిన్ను పంపుదు నని అర్జునుడు ప్రతిజ్ఞ చేసెను. ఈ ప్రతిజ్ఞయే భావిభారత సంగ్రామమునకు పునాది. ఇంద్రుడు మేఘములతో కలసి ప్రదర్శనమును చూచుటకు రాగా, సూర్యుడు కర్ణుని వైపునుండి ఆ మేఘములను అర్జునునిమీదకు మరలించెను. ఇది అతని జీవితములో విషాదము. ఇచట ఇంద్రదత్తమైన శక్తిని కర్ణుడు అర్జునునిపై ప్రయోగించుట అను అర్థమునకు స్ఫోరకము. కృష్ణుడు దానినితొలగించును. ఇదంతయు నీ ఘట్టములో మనకు స్ఫురించును. యుద్ధభూమిలో నితడు విషాదము నొందినది తన శత్రువు లగు ధార్తరాష్ట్రులను చంపుటయందు కాదు; ఈ యుద్ధమునకు ఫలితముగ వృష్ణియాదవవంశములుకూడ నశించిపోవునని గమనించెను. కనుక అర్జునుడు విషాదము పొందెను. కృష్ణుడు విశ్వరూపము చూపి అతడు యుద్ధము చేసినను, యుద్ధము చేయకున్నను తా నీ సర్వక్షత్రియసమూహమును నశింపజేయ సమకట్టితి నని నీవు తప్ప నింకెవరు మిగలరు అనువాక్యమువలన తెలియజేసెను. నీవు తప్ప ఈ విశ్వరూపము నెవ్వరు చూడలే దని చెప్పినదానికర్థము అసలు విశ్వరూపమునే చూడలేదని కాదు. కౌరవసభలో చూపిన విశ్వరూపము కురుపాండవవీర వినాశనప్రదర్శనాత్మకమే, కాని అర్జునునకు చూపిన విశ్వరూపములో కౌరవపక్షము పాండవపక్షముల వీరుల వినాశముతో బాటు వృష్ణియాదవవంశవినాశము, బలరామనిర్యాణము కృష్ణనిర్యాణము మొదలైనవన్నియు చూపెను. అందుకే అతనికి

దివ్యచక్షువు నొసంగెను. అర్జునుడు మరల ఆ రూపమును చూపు మనగ గీతార్థమును మాత్రమే చెప్పెను కాని, ఆ రూపమును చూపలేదు. చూపలేననుట నిజమే యగుచో ఉదంకునకు ఏల చూపెను? కావున అర్జునుకు ఏ దుష్ఫలితముల నూహించి విషాదము నందెనో వాటన్నింటికి ఈ యుద్ధమును మానినంత మాత్రమున పరిష్కారము కాదని, సమస్త వీరులు కురుపాండవవృష్ణివంశములలోని వారందరు నశించుటను ఎవ్వరూ ఆపలేరు. అని విశ్వరూపమును చూపి, ప్రబోధించిన తర్వాత అర్జునుడు మోహము తొలగిన దని తాను కృష్ణునితోబాటే భూభారహరణార్థ మవతరించిన నరాంశ మని స్మృతిని పొంది తా నీయుద్ధమును మానినంత మాత్రమున వీరు బ్రతుకుదు రేమో, లేక తానీయుద్ధమునకు కర్తనేమో, లేక, తాను సంపాదించిన అస్త్రశస్త్రాదులవలన ధర్మజాదులు పౌరుషమును చూపి యుద్ధమును చేయ బూనుచున్నారు; తాను మానిన ఈ యుద్ధముమానునేమో మున్నగునవెన్నియో సందేహములు అతని మనస్సులో తండోపతండములుగ వరలె ననియు, పోగా, గతసందేహుడై తాను యుద్ధము బుద్ధిపూర్వకముగ చేయకున్నను భగవంతుడు యుద్ధము చేయించియే తీరును. నారాయణాంశము యుద్ధప్రవృత్తమై క్షత్రియక్షయకారకమై తదున్ముఖమై యుండ ఆ నారాయణాంశములో నారాయణావతారమునకు చెందిన ఆ ప్రకృతిలో ఒక భాగము పొంది భూభారహరణార్థము అవతరించిన ప్రకృతి తనను వివశము గావించి యుద్ధము చేయించు నని "మిథ్యైష వ్యవసాయస్తే ప్రకృతి స్త్వాం నియోక్ష్యతి" అన్న వాక్యమువలన నిర్ధారణము చేసికొని "కరిష్యే వచనం తవ" అని యుద్యోన్ముఖుడైనాడు. కాని అతనిలో నున్న విషాదము తొలగలేదు. ప్రతి విషయములోను భీష్మ, ద్రోణ, సౌమదత్తి, ప్రతి జయద్రథకర్ణవధలలో "కరిష్యే వచనం తవ" అని మరలమరల అనుచు ఆ యుద్ధవీరులను మడియించెను. ధర్మరాజు గాండీవమును అవమానమొనర్చినపుడు తన ప్రతిజ్ఞను వివరించి ధర్మరాజు నిపుడు చంపవలయునుకదా! "కథం త్వం కృష్ణ మన్యసే" అని కృష్ణుని వచనమునే తాను పాటింపదలచినట్లువివరించి ఆ సందర్భమున కృష్ణుడు వివరించునట్లు చేసెను. దుర్యోధన - భీమగదాయుద్ధములో అన్యాయముగనే భీముడు దుర్యోధనుని చంపగలడుకాని న్యాయముగ చంపలేడు. భీమునకు సంజ్ఞ చేయుము. తొడలు విరుగకొట్టి ప్రతిజ్ఞానుసారముగ భీమునికి దుర్యోధనుని చంపుమని సూచించుము. అనగ అట్లే చేసి ఆఘట్టమున కృష్ణవచనకారిత్వమును చేసెను. అపాండవ మగుగాక అని అశ్వత్థామ అస్త్రము ప్రయోగించినపుడు దానికి బదులుగ కృష్ణవచనానుసారమే మరల అస్త్రమును ప్రయోగించెను. కృష్ణానుమతుడై అక్కడకు వచ్చిన భగవదభిన్నుడే యగు కృష్ణద్వైపాయనుని వచనాను

సారము అస్త్రమును ఉపసంహరింపు మనగా ఉపసంహరించుకొనును. ఉదంకోపాఖ్యానములో ఉదంకుడు పౌష్యమహారాజును శపించుట, పౌష్యమహారాజు ఉదంకుని శపించుట జరిగినది. ఆఘట్టములో ఉదంకుడు శాపమును ఉపసంహరించుకొనెను. కాని రాజగు పౌష్యుడు శాపము నుపసంహరింపలేదు. అచట "రాజుయొక్క మాటలో మెత్తదనము, మనస్సులో కాఠిన్య ముండును. బ్రాహ్మణుని మాటలో కాఠిన్యము, మనస్సులో మెత్తదనము ఉండు" నని చెప్పుటవలన బ్రాహ్మణుడు శాపోపసంహరము చేయ గలిగెను, కఠినచిత్తు డగు రాజు అన్నది మరలించుకోలేడు. అన్న అంశమును పరిశీలించినపుడు క్షత్రమూర్తి యగు అర్జునుడు నిజమునకు అస్త్రము నుపసంహరించువాడు కాదు. వ్యాసవచనానుసారముగ కృష్ణున కిచ్చిన మాటప్రకారముగ అర్జునుడు ఆ అస్త్రము నుపసంహరించుట ఆతని "కరిష్యే వచనం తవ" అనుదానికి పరమోదాహరణము.

ధృతరాష్ట్రుడు పదహారు సంవత్సరముల తర్వాత భీష్మాదులకు, దుర్యోధనాదులకు శ్రాద్ధక్రియలు జరిపి అరణ్యములకు పోదు ననగ భీముడు సుతరామూ అంగీకరింపలేదు. అర్జునుడు :- "ధృతరాష్ట్రుడు రాజర్షి, వృద్ధుడు, ఆతడు కోరిన ధన మిమ్ము; అపకారములను స్మరింపరాదు." అని ఎంత చెప్పినను వినలేదు. కాని అర్జును డట్లు చెప్పుటకు హేతువేమి? భీమునివలె అతడును కష్టములను పొందినవాడు కదా! కాని కృష్ణుడు ద్వారకకు పోవుచు "పూర్వవిషయములను స్మరించి బాధపడవల" దని ధర్మరాజునకు చెప్పి వెడలెను. అదిగాక, ధృతరాష్ట్రుడు చనిపోదు నన్నప్పుడు వ్యాసుడు "నీవు చనిపోవలదు; పాండవుల మేలు కోరుచూ ఇక్కడనే ఉండు" మని చెప్పగ ధృతరాష్ట్రుడు అట్లే యుండెను. కృష్ణవచనానుసారము, కృష్ణద్వైపాయనవచనానుసారము ప్రవర్తింప వలసియుండగ భీముడు తద్విరుద్ధముగ ప్రవర్తించుచున్నను, అర్జునుడు మాత్రము అట్లే ఉండుట కృష్ణవచనకారిత్వమునకు ఉదాహరణము.

ముప్పదిఅయిదు సంవత్సరములు గడిచినవి. అర్జునుడు ద్వారకకు పోయి అక్కడ జరిగిన సమస్తవిషయములు తెలిసికొనెను.

యత్ర సర్వక్షయం కృత్వా తౌ పుత్రౌ రామకేశవౌ । (ఆ. 2-350)
నాతిచక్రమతుః కాలం ప్రాప్తం సర్వహరం మహత్ ॥
తతోఽర్జునో ద్వారవతీ మేత్య వృష్ణివినాకృతామ్ ।
దృష్ట్వా విషాద మగమత్ పరాం చార్తిం నరర్షభ ॥ (ఆ. 2-351)
దృష్ట్వా నిర్వేద మాపన్నో వ్యాసవాక్యప్రచోదితః ।
ధర్మరాజం సమాసాద్య సన్న్యాసం సమరోచయత్ ॥ (352)

యత్ర రాజ్యం పరిత్యజ్య పాండవాః పురుషర్షభాః ।
ద్రౌపద్యా సహితా దేవ్యా మహాప్రస్థాన మాశ్రితాః ॥ (359)
యత్ర తేఽగ్నిం దదృశిరే లౌహిత్యం ప్రాప్య సాగరమ్ ।
యత్రాఽగ్నినా చోదిత శ్చ పార్థ స్తస్మిన్ మహాత్మనే ॥ (360)
దదౌ సంపూజ్య త ద్దివ్యం గాండీవం ధను రుత్తమమ్ ।

ఈవాక్యములవలన కాలవశులై రామకృష్ణులు సర్వక్షయమును బూర్తి చేసి వారునూ ఆ కాలగర్భములో కలసిపోయిరి. అర్జునుడు శూన్య మగు ద్వారకను పొంది విషాదార్తులను పొందును. ఆ సందర్భములో అర్జునుని సర్వశక్తులు నశించినవి. గాండీవము పట్టు తప్పినది. తాను సంపాదించిన అస్త్రము లన్నియు నిరుపయోగము లైనవి. వృష్ణికళత్రములను రక్షింపలేకపోయెను. ప్రభావ మనిత్య మని తెలిసికొనెను. వ్యాసవాక్యములవలన ధర్మరాజును చేరి సన్న్యాస మును పొంద గోరెను. పాండవు లందరు కూడ ద్రౌపదీసహితులై మహాప్రస్థా నము చేసిరి. అగ్నిచోదితుడై గాండీవము నగ్ని కిచ్చివేసెను.

ఈ ఘట్టమునకు అర్జునవిషాదఘట్టము స్ఫోరకము. అస్త్రశస్త్రములను విడచి, రథోపస్థు డగుటకు భవిష్యత్తున తాను చేయ బోవు గాండీవత్యాగమున కుపలక్షణము. ఆత డక్కడ ప్రదర్శించిన ఘట్ట మంతయు భవిష్యదర్థస్ఫోరకము. కనుక కర్ణనిరాకతో ఆరంభమైన విషాద మేఘావరణము అర్జునుని జీవితమంతయు వ్యాపించి చివరకు కృష్ణనిర్యాణమున పరిపూర్ణమై చివరకు మహాప్రస్థానమున పూర్తియైనది. కనుక అర్జునుడు అస్త్రశస్త్రాదులను పొందినప్పటినుండి మరల అతడు వాటిని వదలిపెట్టునంత వరకు అర్జునవిషాదయోగమే.

ఈ మహాయుద్ధమునకు కాని, మధ్యమధ్యలో జరిగిన ఇన్ని వైపరీత్యము లకుగాని ప్రేరకుడు భగవంతుడు. కర్ణార్జునులు దైవాసుర సంపదలకు ప్రతీకలు. వారు భూభారహరణకార్యములో నిమిత్తమాత్రులై యున్నారు. దీనిలో పాచికలుగ ఉపయోగపడినవారు దుర్యోధనాదులు. కర్ణుడు చనిపోవునప్పుడు "నేను రథచక్ర మును ఎత్తునంతవరకు యుద్ధ మాపుము" అని అడిగినపుడు కృష్ణుని వచనములు దుర్యోధనుడు భీమునకు విషము పెట్టిన దాదిగా తత్క్షణపర్యంతము జరిగిన ప్రతి విపరీతకృత్యమునకు కర్ణుడు మూలకారణ మని నిరూపించెను. నిజమునకు దైవా సుర సంపదలకు ప్రతీక లగు అర్జునకర్ణులు ఒక తల్లి బిడ్డలే. కావున అర్జునశబ్ద మును చెప్పుచున్నప్పుడు ఆ అర్జునశబ్దముతో కర్ణుని గూడ గ్రహించుచుండవల యును. కృష్ణార్జును లన్నప్పుడు కృష్ణశబ్దసాహచర్యముచే అర్జునుని గ్రహించి

నట్లు, రామరావణు లన్నప్పుడు విరోధిధర్మముచే దశరథరాముని గ్రహించునట్లు అర్జునశబ్దముచే ఇక్కడ కర్ణుని గ్రహించుచుండవలయును. అందుకే వ్యాసమహర్షి కర్ణుని విషముగ చెప్పెను అర్జునవిష మనగ అర్జునుడు, కర్ణుడు వాడిద్వారా భూభారహరణార్థప్రయోజక మగు క్షత్రియవంశనాశనము అర్జునవిషాదమున కర్థము. లేక అర్జునవిషణ్ణ అనగ అర్జున, కర్ణులకొరకే అదనార్థము అనగ భక్షణార్థము యోగము అనగ యుద్ధము అర్జునవిషాదయోగము.

కనుక అర్జునవిషాద మనగ కేవలము కురుపాండవసంగ్రామాదిలో అర్జునుడు విషణ్ణుడై ప్రకటించిన భావములను చెప్పు గ్రంథభాగమును గీతాప్రథమాధ్యాయమునకు మాత్రమే చెందినదిగ భావింపరాదు. అర్జునవిషాదశబ్దము పూర్వగ్రంథమునకు, ఉత్తరగ్రంథమునకు సేతువై యున్నట్లు వ్యాఖ్యానింపవలయును.

అస లింతకు అర్జునుడు దుఃఖించినాడా? అన్నది ప్రధానాంశము. అర్జునుడు మహావీరుడు మహాభారతసంగ్రామతంత్రమునయుద్ధనాయకుడు. ఇందులకు—

సేనాపతిపతిం చక్రే గుడాకేశం ధనంజయమ్ ।
అర్జునస్యాపి నేతా చ సంయంతా చైవ వాజినామ్ ॥ ఉ 156-15
స కర్షణానుజః శ్రీమాన్ పరబుద్ధి ర్జనార్దనః । ఉ. 156-16

ఇత్యాదిశ్లోకములు ప్రమాణములు. నాయకునియందు కావ్యశాస్త్రము ననుసరించి ఉత్తమలక్షణము లన్నియు తగియున్నవి. జరుగబోవునది మహాసంగ్రామము ఇందు భీష్మాదులవంటి వృద్ధులు, ద్రోణాదులవంటి గురువులు, అశ్వత్థామ మొదలగు గురువు లట్లు పూజింపదగిన గురుపుత్రులు, ఇంకను ఇతర బంధువర్గము, మిత్రవర్గమును ఇరుపాగులందు యుద్ధసన్నద్ధులై తృణీకృతప్రాణులై యున్నారు. వీరులందరును ఈ యుద్ధమున పాల్గొనిరి.

శూన్యా చ పృథివీ సర్వా బాలవృద్ధావశేషితా ।
నిరశ్వపురుషే వాసీ ద్రథకుంజరవర్జితా ॥ (భీ-1-7.)

కారణాంతరముచే బలరాముడు, రుక్మి యుద్ధమున పాల్గొనలేదు.

ద్వా వేవ తు మహారాజః తస్మా ద్యుద్ధా దపేయతుః (ఉ - 157-38-39)
రౌహిణేయ శ్చ వార్ష్ణేయో రుక్మీ చ వసుధాధిప ॥

యుద్ధముదుష్టము:—ఇట్టి సందర్భములో రెండంశములు అర్జునునికికన్పట్టినవి. తన స్వార్థమునకై ఇంతమ దిని చంపవలసినదేనా? ఇది పాపహేతువే యగుచున్నది. కానిక్షత్రియులకు యుద్ధము కర్తవ్య మైనను, విధివిహిత మైనను, దోషస్పృష్టము కాదని చెప్పుటకు వీలు లేదు. భగవంతుడుకూడ యుద్ధమును దుష్టముగనే చెప్పెను,

"సదోష మపి న త్యజేత్" భ. 18-18 అని చెప్పెను. ఈ దోషమును ప్రథమతః అలోచింప తగినదిగా తలంచినాడు అర్జునుడు.

యుద్ధము కులక్షయకరము :– ఇంక రెండవ యంశము. ఇంతకు ముందు ఏ యుద్ధములోను వీర్యవత్తరమయిన జాతియే పూర్తిగా అడుగంటిపోవు స్థితి రాలేదు. ఇప్పు డట్లు గాదు. ఇప్పుడు సమాగతులైన ఈ వీరు లందరిలో యుద్ధమునుండి తిరిగి వెళ్ళువారు ఎవరును లేరు. అందరును శూరులే. మహేష్వాసులే, క్షత్రియధర్మనిర్వహణ ధౌరంధర్యులే. మరి వీరందరు చనిపోయినచో ఈ జాతిలో నున్నట్టి స్త్రీలందరు దుష్టలగుట యనివార్య మగును. అందుచే క్షత్రియ జాతియే గాక "రాజా కాలస్య కారణమ్" అనియు, "యథా రాజా తథా ప్రజాః" అనియు చెప్పబడియున్నందున సమస్త ప్రపంచము రాజరక్షితమై వెలుగొందు చున్నందున రక్షకుడైన రాజే లేకపోయినచో, రాజవంశమే నశించిపోయినచో సకలవర్ణములు అధోగతి పాలై వర్ణసంకరము కలుగును. ఇట్టిది లోకవ్యవస్థకే తీరని నష్టము కల్గించును. తత్కార్తలమైన మాకును, దుర్యోధనాదులకును పాపము వచ్చును. అని అర్జునుడు దుఃఖించినాడు.

కాని, ఈ విషయమును ఆవైపున ఉన్న దుర్యోధనుడు గాని, తక్కినవారు గాని ఆలోచింపరాదా? యని అనరాదు. అందుచేతనే మనమైనను ఈ పాపమునుండి తొలగి చనవలెను గదా అని అర్జునుడు చెప్పినాడు.

ఈ దృష్టితో అర్జునుని యాలోచన ధర్మసంబద్ధమైనదా? దుష్టమైనదా? అని ఆలోచించినవారే అగుపడుటలేదు. ఎంతసేపును అర్జునునియందు శోకమోహాము లున్నవి. అందువల్లనే స్వధర్మమును విడిచి, పరధర్మమైన భిక్షాచరణము చేయుటకు సంకల్పించినాడు. ఇత్యాదిగా వ్యాఖ్యలు చేయుచున్నారు. ఇంకను కొంత మంది, "అర్జునుడు తీవ్రవైరాగ్యము పొందినాడు" అనిరి. "య దహ రేవ విరజే త్తదహ రేవ ప్రవ్రజేత్" అని ఉన్నందున విరక్తుడై అప్పుడే సన్న్యాస మును స్వీకరించినాడు. అందుచేత "సన్న్యస్య శ్రవణం కుర్యాత్" అను న్యాయము ననుసరించి జిజ్ఞాసువై "ముముక్షు ర్వై శరణ మహంప్రపద్యే" అన్నట్లు "శిష్య స్తేఽహం శాధి మాం త్వాం ప్రపన్నం" అని శరణు పొందినాడు. ఇంతే కాదు, దీర్ఘ శరణాగతి పొందినాడు. ఇందుకు తగ్గ సాధనచతుష్టయసంపత్తి అంతయు మొత్తముగ ఈ యర్జునునిలో నెక్కొనియున్నది. అనుచు వ్యాఖ్యాన పరంపరలు కొల్లలుగా సాగించుచున్నారు,

నిజమును ఆలోచించిన అర్జునుడు స్వధర్మమును విడువలేదు. పరధర్మమును ఆశ్రయింపనులేదు 'భైక్ష్య మ పీహ లోకే' అన్నాడు. అదైనను మేలుగానే కన్పడుచున్నది అన్నాడు. దీనిలో ప్రధానాంశమే మనగా కులముకొఱకు తనను గ్రామముకొఱకు కులమును, రాష్ట్రముకొఱకు గ్రామమును త్యాగము చేయవలెను.

త్యజే దేకం కుల స్యార్థే గ్రామ స్యార్థే కులం త్యజేత్ ।
గ్రామం జనపద స్యార్థే హ్యాత్మార్థే పృథివీం త్యజేత్ ॥ ఆ 115-39

ఈ భారతధర్మబోధ హృదయమునకు తాకగా ఇంత మహావ్యవస్థ నశించి పోవుటకన్నను నేను, నావారు పతనమైపోయిన వచ్చు నష్టమేమిటి? అన్న దృష్టితో ఈతని ప్రసంగము ప్రవర్తిల్లినది. ఇది ధర్మము కాదని ఎవరైన అన్నచో "తేభ్యో మహద్భ్యో నమః" ఇట్టి వారిని గూర్చిన భర్తృహరిసూక్తి స్మరణీయము.

అజ్ఞః సుఖ మారాధ్యః సుఖతర మారాధ్యతే విశేషజ్ఞః ।
జ్ఞానలవదుర్విదగ్ధం బ్రహ్మాపి నరం న రంజయతి ॥

అర్జునుడు స్వధర్మత్యాగపూర్వకముగ పరధర్మము నాశ్రయించినచో

కార్పణ్యదోషోపహతస్వభావః
పృచ్ఛామి త్వాం ధర్మసమ్మూఢచేతాః ।
య చ్ఛ్రేయ స్స్యా న్నిశ్చితం బ్రూహి త న్మే
శిష్య స్తేఽహం శాధి మాం త్వాం ప్రపన్నమ్ ॥ (భ-2-7)

అనుచు శ్రేయోదాయక మగు ధర్మము నుపదేశింపు మని శిష్యుడై కృష్ణు నాశ్రయింపడు. కనుక అర్జునునకు ధర్మమునందు ఆస్థ కలదు అనియే చెప్పవలయును. శోకమోహము లున్నవాడని చెప్పు నవకాశము లేనే లేదు. కాని శోకమోహములు అర్జునునియం దున్నట్లు వాచ్యముగనే యున్నది కదా! అని అందు రేమో? భారతము కావ్యము అను విషయము మరువరాదు. కావ్యము దేనినైనను వాచ్యముగా చెప్పినంతమాత్రమున చాలదు. ఆ యర్థము వ్యంగ్యవిలసితము కావలయును. అప్పుడే దానికి ప్రామాణ్యము.

<u>అర్జునునకు శోకమోహములు లేవు</u> :- స్వధర్మత్యాగము, పరధర్మగ్రహణము, శోకమోహములు కలవారి లక్షణములు;- స్వధర్మత్యాగము, పరధర్మగ్రహణ మనునవి అర్జునునియందు నిరూపితము లగుచో అతనియందు శోకమోహములు కూడ నిరూపితము లగును. కాని అట్లు చెప్పుటకు అవకా

శమే లేదు. తీవ్రముగా యుద్ధపరిణామములు విచారించునప్పటికి అర్జునునకు చేతులు వణకినవి. ఒడలు గగుర్పాటు చెందినది గాండీవము జారినది. అబ్బా! యని చతికిలబడినాడు. ఇది దుఃఖముకాదా? కాదు. ధర్మాభినివేశమే ఇందలి పరమార్థము. అందుచేత అర్జునుని దుఃఖమునే ప్రధానముగ జేసికొని ఈ అధ్యాయమునకు విషాదయోగ మని పేరు పెట్టినచో అవిచారితరమణీయమే.

ధర్మసంశయయోగము :-

గీత ప్రథమాధ్యాయమును ధర్మసంశయయోగ మని చెప్పుట సముచితమై యుండును. ఈ అధ్యాయము "ధర్మక్షేత్రే" అని "ధర్మ" శబ్దముతో ప్రారంభించుటకు ధర్మవిషయికమైన తీవ్రసంశయములిందు ప్రకటీకృతములగుట హేతువుగా పేర్కొనతగును. ప్రతివచనము ప్రశ్నానుకూలముగా నుండుట శాస్త్రీయపద్ధతి.

"న హ్యశ్వత్థా నాప్పృష్టః కోవిదారా నాచష్టే।"
"ధృతరాష్ట్ర స్తు ధర్మజ్ఞో న వధ్యః కురుసత్తమః ।" (ఉ-54-9)

అని ధర్మజ్ఞుడుగా కీర్తింపబడిన ధృతరాష్ట్రుడు, 'ధర్మక్షేత్రే' అని ప్రారంభించి అడుగుచున్నా డనగా ఆ విషయము ధర్మసంబంధిగా నుండునే కాని తద్భిన్నముగ నుండదు ఒక్క విషయము ధృతరాష్ట్రుని యందు గమనార్హము. "పాండవులకై దుర్యోధనుని విడువను కాని ధర్మము జయించును అని చెప్పెదను" అనెను.

సర్వం త్వ మాయతీయుక్తం భాషసే ప్రాజ్ఞసమ్మతమ్।
న చోత్సహే సుతం త్యక్తుం యతో ధర్మ స్తతో జయః॥ (ఉ-37-9)

వేయి భగవద్గీతలు కాని, భీష్ముడు చెప్పిన శాంత్యానుశాసనిక పర్వవ్యాప్త ధర్మకోటులు కాని దీనికి సరిరావు.

అట్టి ధృతరాష్ట్రుడు "వారు ధర్మవిషయిక మగు చర్చ ఏమైనను జరిపి యుద్ధము చేసిరా;" అని అడుగును.

అప్పటికిని ధృతరాష్ట్రుడు కుమారునకు నీతి చెప్పకపోలేదు

దుర్యోధన! హృషీకేశం ప్రపద్యస్వ జనార్దనమ్ ।
ఆప్తో న స్సంజయ స్తాత! శరణం గచ్ఛ కేశవమ్ ॥ (ఉ-68-6)

అని ధృతరాష్ట్రుడు విదురినితో అనుట అతని ధర్మబుద్ధికి తార్కాణము. 'న చైవ శక్యం సంయంతుం యతో ధర్మ స్తతో జయః' (భీ-2-13) అను వ్యాసమహర్షి వచనము ధృతరాష్ట్రుని వాక్యమువలెనే భవితవ్యమును ఎవ్వరును ఆపలేరని, ధర్మము మాత్రమే జయించు నని వ్యక్తము చేయుచున్నది. కావున ధర్మాభినివేశ

ము కలవాడు అగు ధృతరాష్ట్రుడు, 'ధర్మక్షేత్రే' ఇత్యాదిగా ప్రశ్నించిన విధానము చూడ 'ధర్మవిషయికమైన ప్రసంగమును చెప్పు' మనియే అతడు సంజయునిఅడుగ నని తెలియును. తదనుగుణముగానే సంజయుడును ధర్మవిషయకప్రసంగమును చెప్పుటకే ఉపక్రమించెను.

మా మ కాః పా ం డ వాః :-

"మామకాః పాండవా శ్చైవ" అని తనవారిని, పాండవులను విడదీసి అడుగుటలో ధృతరాష్ట్రుని మమకారము "మామకాః" అన్న పదమువలన వ్యక్తమగుచున్న దని "పాండవాః" అన్నపదమువలన పాండవులు తన వారితో యుద్ధము చేసి గెలువగలరాః నావారు నూర్గురు, వారు ఐదుగురు. నావారి సైన్యము పదకొండు అక్షౌహిణులు, పాండవులది ఏడు అక్షౌహిణులు. వారు నావారిని గెలువ గలరాః అన్న అహంకారము వ్యక్తమగుచున్నదని వ్యాఖ్యానించుచున్నారు.

కాని ఈ అర్థమును వివరించుటకు ముందు ధృతరాష్ట్రుని ప్రశ్నశ్లోకములోని అన్ని పదములు పరిశీలింపవలెను. 'సమవేతాః' అను పదము కలదు. ఈ పదము ఉభయపక్షములను చెప్పును. ఈ "సమవేత" పదము ఎంత అర్థసంవలితమో గ్రహింపవలెను. "సుహృదః సమవేతాన్ మంత్రివతః వరాన్ ప్రహిణుయాత్" అని వివాహమునందు వరుడు తనకై 'కన్య నన్వేషింపు' డని ఎటివారిని పంపవలెనో వివరించు సూత్రము. ఇందులో సమవేతు లన, మనోవాక్కాయకర్మలలో ఇసుమంతయు భేదము లేనివారు అని అర్థము. ఈ కురుక్షేత్రమున యుయుత్సులై చేరిన వీరు లందరు క్షత్రియునికి యుద్ధము ముఖ్యధర్మమై యున్నది అని నమ్మి అట్టి యుద్ధము చేయ వలెనని పెండ్లికుమారులవలె వచ్చిన వారే. ఇందులో ఎవరికిని అధర్మబుద్ధి లేదు. అన్నభావమే.

అనేక స్థలములలో "కురుక్షేత్ర సంగ్రామములో పాల్గొన్న మహా వీరులందరు తమ తమ వర్ణానుకూలముగ స్వధర్మములను ఆచరించినవారే" అని చెప్పబడుట గమనార్హము. ఇది ధృతరాష్ట్రునికి తెలియదనుకొనుట మన అజ్ఞానమును నిరావరణముగా చూపుట. కనుక 'నావారుకాని, పాండవులు కాని ధర్మవిషయికముగా ఏమి చేసి' రని ధృతరాష్ట్రుని ప్రశ్నసారముగా గ్రహింపదగును.

మామకాః పాండవా శ్చైవ కి మకుర్వత సంజయః (గీత 1-1)

'మామకాః పాండవాః' పదములు ప్రయోగించుటలో ధృతరాష్ట్రుని ఆశయము ఇక్కడ కిక్కడ అవసరమైనేవేద్య, లేక, గ్రహణస్నాన, లేక, ప్రాణాపాయ

సమయభక్షణ-న్యాయానుసారముగ వ్యాఖ్యానింపబూనుట తగదు. సంజయునికి ధృతరాష్ట్రునికి ఇంతకుముందు జరిగిన చర్చలను పురస్కరించుకొని విమర్శింప వలయును.

విమర్శకమ్మన్యులు :-

విమర్శకు లెంత వింతగా నున్నారో తెలియవలె ననుకున్నచో ఒక ఉదాహరణము చాలును. "సంజయుడు జ్ఞాని, కనుక ఇంటిలో ఉండే అన్ని యుద్ధతంత్రములను దివ్యదృష్టితో ప్రత్యక్షముగా చూచి చెప్పెనని ప్రచారము చేయుచున్నారు. ఇది అజ్ఞానవిలసితము.

యుయుత్సువులై ఇరువాగులవారు కురుక్షేత్రమున చేరగా ధృతరాష్ట్రుని కడకు వ్యాసుడు వచ్చెను. వ్యాసునివైశంపాయనుడు —

'ప్రత్యక్షదర్శీ భగవాన్ భూత భవ్యభవిష్యవిత్' (భీ-2-2) అనును.

'శోచంత మార్తం ధ్యాయన్తం పుత్రాణా మనయం తదా' (భీ-2-3)

అనగా తన పుత్రుల అనయము వలననే ఈ యుద్ధము వచ్చినదని, పాండవులు నయపరులేయని ధృతరాష్ట్రుని ఆశయము గదా!

రాజన్! కాలపరీతా స్తే పుత్రా శ్చాన్యాశ్చ పార్థివాః ।
తే హింసం తీవ సంగ్రామే సమాసా ద్యేతరేతరమ్ ॥ (భీ-2-4)
తేషు కాలపరీతేషు వినశ్యత్స్వేవ భారత ।
కాలచక్రం సమాజ్ఞాయ మా స్మ శోకే మనః కృథాః ॥ (-5)
యది చేచ్ఛసి సంగ్రామే ద్రష్టు మేతా న్విశాంపతే ॥
చక్షు ర్దదామి తే పుత్ర యుద్ధం తత్ర నిశామయ ॥ (-6)

యుద్ధమును చూడగల శక్తి నిచ్చెదనని వ్యాసు డనగా చూడను కాని విందునని ధృతరాష్ట్రు డనును.

న రోచయే జ్ఞాతివధం ద్రష్టుం బ్రహ్మర్షిసత్తమ ।
యుద్ధ మేత త్త్వశేషేణ శృణుయాం తవ తేజసా ॥ (భీ-2-7)

అందుకే 'వింటే భారతం వినాలి. తింటే గారెలే తినాలి' అని సామెత వెలసింది. అవును మరి ఇంతమంది చచ్చిన దెక్కడ? ఒక్కసారి ఇంతమందికి పారలౌకికకర్మలు జరిగిన దెక్కడ? సరే! ధృతరాష్ట్రుడట్లనగ వ్యాసుడు సంజయునకు వర మిచ్చెను.

ఏష తే సంజయో రాజన్! యుద్ధ మేత ద్వదిష్యతి ।
ప్రకాశం వాఽప్రకాశం వా దివా వా యది వా నిశి ॥ (భీ-2-10)

మనసా చింతిత మపి సర్వం వేత్స్యతి సంజయః ।
నైనం శస్త్రాణి ఛేత్స్యంతి నైనం బాధిష్యతే శ్రమః ॥
గావల్గణి రయం జీవన్ యుద్ధా దస్మా ద్విమోక్ష్యతే। (11)

వరమువలన సంజయుడు శస్త్రాస్త్రాలకు అతీతుడు కదా।

అథ గావల్గణి ర్విద్వా న్సంయుగా దేత్య భారత ।
ప్రత్యక్షదర్శీ సర్వస్య భూతభవ్యభవిష్యవిత్ ॥ (భీ-13-1)
అస్త్రై రసంగో యుద్ధేషు వరదానా న్మహాత్మనః (భీ-15-9)

ఇంకను ఎన్నో ఉదాహరణము లున్నవి వీటివలన సంజయుడు యుద్ధభూమిలో ఉన్నా డని స్పష్ట మగుచున్నది.

సంజయుడు యుద్ధములో ఉన్నాడనుటకు ధృతరాష్ట్రుడు వేసిన అతి స్వరసమైన ఒక తమాషాప్రశ్నవలన తెలియును. "ఇంద్రదత్తమైన శక్తిని ఘటోత్కచుని మీద ప్రయోగించెను. కృష్ణార్జునులమీద ప్రయోగింపవలె నని ఎన్నిపర్యాయము లనుకొనినను ఎవరికిని గుర్తు వచ్చుట లేదు. కృష్ణుడట్లు తన శక్తిచేత పార్థుని రక్షించెను." అని సంజయుడు చెప్పగ, ధృతరాష్ట్రు డిట్లనును :-

విరోధీ చ కుమంత్రీ చ ప్రాజ్ఞమానీ మమాత్మజః ।
య స్యైష సమతిక్రాంతో వధోపాయో జయంప్రతి ॥ (ద్రో-183-17)
స వా కర్ణో మహాబుద్ధిః సర్వశస్త్రభృతాం వరః ।
న ముక్తవా న్కథం సూత తా మమోఘాం ధనంజయే ॥ (ద్రో-183-18)
త్వాపి సమతిక్రాంత మేత ద్గావల్గణే కథం ।
ఏన మర్థం మహాయుద్ధే యత్త్వయా నావబోధితః ॥ (ద్రో-183-19)

"తెలివి మాలిన నాపుత్త్రుడు, బుద్ధిశాలి కర్ణుడు, జయకరమగు అస్త్రమును మరపుచే ప్రయోగింపలేదు పో। సరే నీవు మేధానిధివి కదా। సంజయా। కర్ణునికి గుర్తుచేయక పోయావా। నీబుద్ధికిని మరుపు కలిగినదా।" అనును. దీనినిబట్టి సంజయుడు యుద్ధము జరుగుచుండగా ఆయుద్ధభూమిలోనే ఉన్నట్లు స్పష్టము అగుచున్నది గదా।

ఇంతటి విషయమును కూడ గమనింపలేనివారు భగవద్గీతను ప్రచారము చేయుచుండుట, వారిని మనము మహాత్ములనుట మనవిజ్ఞానభాస్కరుని కాలమేఘము లావరించుట కాక మరేమి? కావున పూర్వాపరసందర్భశుద్ధి కలిగిననేగాని, విమర్శ తథ్యమును వెలువరింపదు, ప్రకృతమునకు అవతరింతుము.

సేనాముఖేషు స్థాస్యంతి మామకానాం నరర్షభాః ।
బలీయః సర్వతో దిష్టః పురుషస్య విశేషతః ॥ (ఉ-50-47)
పశ్య న్నపి జయం తేషాం న నియచ్ఛామి య త్సుతాన్ ।
తే పురాణం మహేష్వాసాః మార్గ మైంద్రిం సమాశ్రితాః ॥ (48)
త్యక్ష్యంతి తుములే ప్రాణాన్ రక్షంతః పార్థివం యశః ।
య థైషాం మామకాః తాత! త థైషాం పాండవా అపి ॥ (49)

భీష్మద్రోణకృపులు ముగ్గురు నావారి సైన్యముఖముల నుందురు; కాని దిష్టము బలీయము, పాండవులదే జయ మని తెలియును. నావారు పురాణ మగు నైంద్రిమార్గ మాశ్రయించిరి. పార్థివ మగు యశము కాపాడు యుద్ధమున ప్రాణములను త్యజింతురు. భీష్మద్రోణకృపులకు నావా రెట్లో పాండవులు నట్లేకదా! అని ధృతరాష్ట్రుడు సంజయునితో అనును.

ప్రియాతు నో భవా నగ్రే దేవానా మివ పావకిః ।
వయం త్వా మనుయాస్యామ సౌరభేయా ఇవర్షభమ్ ॥ (ఉ-155-15)

అని దుర్యోధనుడు భీష్మునితో అనగా భీష్మ డిట్లనును-

ఏవ మేత న్మహాబాహో యథా వదసి భారత ।
య థైవ హి భవంతో మే తథైవ మమ పాండవాః ॥ (ఉ-155-16)
అపి చైవ మయా శ్రేయో వాచ్యం తేషాం నరాధిప ।
సంయోద్ధవ్యం తవార్థాయ యథా మే సమయః కృతః ॥ (ఉ-155-17)
న త్వేవోత్సాదనీయా మే పాండోః పుత్రా జనాధిప ।
తస్మా న్యోధా న్హనిష్యామి ప్రయోగే ణాయుతం సదా ॥ (ఉ-155-21)

దుర్యోధనునితో భీష్ముడు పలికిన ఈవచనములవలన ధృతరాష్ట్రుడు పైన సంజయునితో చెప్పిన భావాలు కేవలోహామాత్రకల్పితములు కాక యథార్థవచనములని తెలియును. ఇట్లే తక్కినవారును చెప్పిరి.

కనుక సర్వధర్మవిదులగు వృద్ధవీరత్రయము నా పక్షమువారికి నాయకత్వము వహించినందున, పాండవులును వీరికి కావలసినవారే అగుట వలన, నావారు కాని, పాండవులుకాని ఈ వీరత్రయమును అవమానింపలేదు కదా! సంజ్ఞయా! యుద్ధమునందు ఎవరు గెలిచినను, ఎవరు ఓడినను అది దైవికమే.

దిష్టమేవ పరం మన్యే పౌరుషం చా ప్యనర్థకమ్ । (ఉ-158-4)

ధర్మక్షేత్రమునగదా యుద్ధము జరుగుచున్నది. అందును మాపూర్వపురుషుడును, ధర్మస్వరూపుడును అగు కురువు పేరగదా ఆ క్షేత్రమువెలసినది. 'మామకాః

పాండవాః' భీష్మాదిత్రియమునకు కావలసినవా రగుటవలన ధర్మపద్ధతి నవలంబించిరా, లేదా? అన్నదే ధృతరాష్ట్రుని ప్రశ్నసారము. మామకాః అని ధృతరాష్ట్రుడు దుర్యోధనుని, తదనుజులను నిందించుచుండును. 'పాండవాః' అని వారి మహత్త్వము కీర్తించుచుండును. మామకులు జనార్దనుని ఆశ్రయింపలేదు. చెడుచున్నారు. "మమ ప్రాణా హి పాండవాః" అని పాండవులుకృష్ణునిచే ఆదరింపబడుచున్నారు. సంజయుడు ప్రశ్నానుకూలముగా సమాధానము చెప్పెను. నీవారు, పాండవులుకూడ యుద్ధమారంభించుటకు ముందుపెద్దలఅనుమతిని, ధర్మానుసారముగా పొందిరి. అని వివరించెను. దుర్యోధనుడు పెద్దల అనుమతి బడసెను.

దృష్ట్వా తు పాండవానీకం వ్యూఢం దుర్యోధన స్తదా ।
ఆచార్య ముపసంగమ్య రాజా వచన మబ్రవీత్ ॥ (భీ-1-2)

ద్రోణుని "ఆచార్య" పదమున చెప్పుటవలన దుర్యోధనుని చేరిక "ఉపసంగమ్య" అనుటవలన గురుశిష్యులకు విద్యాగ్రహణకాలమున ఉండురీతి ఇందు గోచరించుచున్నది. దుర్యోధనుడు ఆచార్యుని చేరి తన విద్యామహిమను అతిశయింప చేసికొనినట్లు తెలియును.

త చ్ఛ్రుత్వా త్వరితః పార్థ శ్శుచి ర్భూత్వా సమాహితః ।
ఉపసంగమ్య విశ్వేశం అధీ ష్వే త్యథ సోఽబ్రవీత్ ॥ (అర. 40-19)

నరుడు శివునివలన అస్త్రమును పొందినపుడు "ఉపసంగమ్య" అన్న ప్రయోగము గమనార్హము.

దుర్యోధనుడు ద్రోణు నేల చేరెను?

'పశ్యైతాం' అని మొదలు "అయనేషుచ" అను శ్లోకము వరకు (గీ 1-3-11) దుర్యోధనుడు చెప్పిన వచనములు విని ఏమియు సమాధాన మొసంగనందున ద్రోణుడు దుర్యోధనుని నిర్లక్ష్యము చేసినాడు అనియు, దుర్యోధనునకు యుద్ధ ధర్మము తెలియదు అనియు, అట్లు తెలిసినచో సర్వసేనానాయకుడగు భీష్ముని చేరక పరిమితసేనానాయకు డగు ద్రోణుని చేరునా? అనియు వ్యాఖ్యానములు చేయుచున్నారు. దుర్యోధనుడు భీష్ముని చేరక ఆచార్యుని చేరుటలో అతని నీతి తెలియును. కొన్ని కారణముల వలన భీష్ముని సర్వసేనానాయికునిగా చేసినను దుర్యోధనునికి, అతడు నమ్మిన నెచ్చెలి కర్ణునికి కూడ ద్రోణుడు నాయకుడు అగుట సమ్మతము. అర్జునుని ద్రోణుడు తన పుత్రునికన్న మిన్నగా భావించెనని, అందరు అంగీకరించిన నగ్నసత్యమే. కాని పాంచాలురమీద నున్న ద్వేషమున కావచ్చును,లేక కౌరవుల కూడు తిన్నందులకు ఈ శరీరము వారి దన్న భావముకావ

చ్చును. కారణమేమైనను, ద్రోణుడు తనశక్తినిదాపరికము లేక దుర్యోధనహితార్థము వినియోగించెననుటకు ఒకటి పది కాదు; వందకు మించి ఘటనలు నిరూపకములుగ ఉన్నవి. ఒక సందర్భములో ఇతడు పాంచాలురను చంపక కవచము విడువను అను ప్రతిన గొనును. నేను చంపగా మిగిలిన పాంచాలురను మిగిలిన వారిని చంపుమని, అశ్వత్థామకు చెప్పుమని సుయోధనునితో చెప్పును

"నాఽహత్వా సర్వపాంచాలా న్కవచస్య విమోక్షణమ్ ।
కర్తాఽస్మి సమరే కర్మ ధార్తరాష్ట్రహితం వచః ॥ (ద్రో 161-34 .
రాజ న్ప్రియా స్సుతం మే త్వ మశ్వత్థామాన మాహవే ।
న సోమకాః ప్రమోక్తవ్యా జీవితం పరిరక్షతా ॥ (ద్రో 35)
య చ్చ పిత్రానుశిష్టోఽసి తద్వచః పరిపాలయ ।
అనృశంస్యే దమే సత్యే ఆర్జవే చ స్థిరో భవ ॥ (-36)
ధర్మార్థ కామ కుశలో ధర్మార్థా వప్యపీడయన్ ।
ధర్మప్రధానకార్యాణి కుర్యా శ్చేతి పునః పునః ॥ (-37)

ద్రోణుడు శస్త్రము విడుచుచు కర్ణకృపసుయోధనులను సంబోధించి ఇట్లనును.

"సంగ్రామే క్రియతాం యత్నో బ్రవీ మ్యే ష పునః పునః ।
పాండవేభ్యః శివం వోఽస్తు శస్త్ర మభ్యుత్సృజా మ్యహమ్ ॥ (ద్రో. 193-44)

సంజయుడు దౌత్య మొనరించిపోవుచు ధర్మజాదులను, జనార్దనుని ఆమంత్రించి ఇట్లనును. "ఆమంత్ర్య గచ్ఛామి శివం సుఖంవః సౌమ్యేన మాం పశ్యత చక్షుషా నృపాః (ఉ 9-?.) ఇత్యాదులందు పాండవులకై అందరిచేత శివము ధ్యానింపబడెను. ఆ శివము పాండవులనుండి మీకు లభించును సుయోధనుడు ద్రోణుని చేరినందుకు ఫలము చూచితిరా! ఇంక ద్రోణాత్మజుడగు అశ్వత్థామ సుయోధనునకు చేసినది కనుడు.

సుయోధన జీవసి త్వం వాక్యం శ్రోత్రసుఖం శ్రుణు ।
సప్త పాండవత శ్శేషా ధార్తరాష్ట్రా స్త్రయో వయమ్ ॥ (సౌ. 9-49)
తే చైవ భ్రాతరః పంచ వాసుదేవోఽథ సాత్యకిః ।
అహం చ కృతవర్మా చ కృపః శారద్వత స్తథా ॥ (సౌ- 9-50)
కృతే ప్రతికృతం పశ్య హతపుత్త్రా హి పాండవాః। (సౌ-9-51)

ఇట్లు అశ్వత్థామ తాను చేసిన కృత్యము వివరించెను.

దుర్యోధన స్తు తాం వాచం నిశమ్య మనసః ప్రియాం ।
ప్రతిలభ్య పున శ్చేత ఇదం వచన మబ్రవీత్ ॥

న మేఽకరో త్త్వద్గాంగేయో న కర్ణో న చ తే పితా ।
య త్త్వయా కృపభోజాభ్యాం సహితే నాద్య మే కృతమ్ ॥
స చ సేనాపతిః క్షుద్రో హత స్త్వర్థం శిఖండినా ।
తేన మన్యే మఘవతా సమ మాత్మాన మద్య వై ।
స్వస్తి ప్రాప్నుత భద్రం వః స్వర్గే నః సంగమః పునః ॥

ఈ ఘట్టమువలన అతడు ఆచార్యుని ఎందుకు చేరెనో అర్థ మగును. రాజనీతి మాత్రమే కాదు. ధార్మికమగు విషయమును గ్రహించుటకు సుయోధనుడు ద్రోణుని చేరెను.

బలరాముడు సుయోధనుని పక్షము :–

సుయోధనుడు బలరాముని తనకు సహాయము చేయు మని ప్రార్థింపగా నాతడు ఉభయపక్షములకు దూరముగా నుండ తలంచుటను వివరించి,

జాతోఽసి భారతే వంశే సర్వపార్థివపూజితే ।
గచ్ఛ యుధ్యస్వ ధర్మేణ క్షాత్రేణ భరతర్షభ ॥ (ఉ–6–31)

అని చెప్పెను. ఇందు వేయి గీతలయినను లీన మగును. ఇంతటి పరమబోధను బలరామునివలన సుయోధనుడు పొందెను. కృష్ణుడు పూర్ణావతారు డగుచో అంశావ తారుడు బలరాముడని కదా। పూరాణవిదుల భాషితము. ఈ అంశావతారరూపము సుయోధనుని పక్షము.

దుర్యోధనుడు ధర్మాత్ముడు :–

జలస్తంభవిద్యవలన సుయోధనుడు సాధించినదేమో తెలియునా? తన యోగమహిమచే అవతారమూర్తిని బలరాముని ఆకర్షించెను. ఈ రహస్యము ఆ ఘట్టమున వ్యక్త మగుచున్నది. ఇది తెలియని మహాత్ములు సుయోధనుని పిరికి తనముగా వ్యాఖ్యానింతురు పాపము వారి తప్పేమి ఉన్నది. చదువెంత ఉన్నను ఆర్షగ్రంథముల సార మెరుగు నేర్పు తక్కువ. "తా స్ప్రీతినైష యత్నః" బల రాముడు వచ్చి భీమ దుర్యోధనుల గదాయుద్ధమున సుయోధనునిది ధర్మ మని ప్రకటించినాడు. పాండవులది అధర్మమనియు చెప్పినాడు ఆ మొత్తము ఘట్టము చూచినచో బలరాముని తీర్పునకు పాండవులతోబాటు కృష్ణుడును అవనతశిరస్కు డైనాడు. సుయోధనుడు తాను స్వర్గమునకు పోదు ననగానే మహాత్ములు, పుణ్య పురుషులు చనిపోవునప్పుడు జరుగు గొప్పవింతలు, పుష్పవర్షము కురియుట మున్నగున వన్నియు సంభవించినవి సుయోధను డిట్లనును;

అధీశం విధివ ద్దత్తం భూః ప్రశాస్తా ససాగరా ।
మూర్ధ్ని స్థిత మమిత్రాణాం కో ను స్వంతతరో మయా ॥ (శ-162-51)
య దిష్టం క్షత్రబంధూనాం స్వధర్మ మనుపశ్యతామ్ ।
య దిదం నిధనం ప్రాప్తం కో ను స్వంతతరో మయా ॥ (52)
దేవార్హా మానుషా భోగాః ప్రాప్తా అసులభా నృపైః ।
ఐశ్వర్యం చోత్తమం ప్రాప్తం కో ను స్వంతతరో మయా ॥ (53)
ససుహృ త్సానుజ శ్చైవ స్వర్గం గంతాహ మచ్యుత ।
యూయం నిహతసంకల్పాః శోచంతో వర్తయిష్యథ ॥ (54)

ఈవచనములు సుయోధనుడు పలుకగా జరిగిన విషయమును సంజయుడు ధృతరాష్ట్రునితో చెప్పెను.

అస్య వాక్యస్య నిధనే కురురాజస్య ధీమతః ।
అపత త్సుమహ ద్వర్షం పుష్పాణాం పుణ్యగంధినాం ॥ (55)
అవాదయంత గంధర్వా వాదిత్రం సుమనోహరమ్ ।
జగు శ్చాప్సరసో రాజ్ఞో యశస్సంబద్ధ మేవ చ ॥ (56)
సిద్ధా శ్చ ముముచు ర్వాచ స్సాధు సాధ్వితి భారత ।
వవౌ చ సురభి ర్వాయుః పుణ్యగంధో మృదు స్సుఖః ॥ (57)
వ్యరాజం శ్చ దిశ స్సర్వా నభో వైదూర్యసన్నిభమ్ ।
అత్యద్భుతాని తే దృష్ట్వా వాసుదేవపురోగమాః ॥ (58)
దుర్యోధనస్య పూజాం తు దృష్ట్వా వ్రీడా ముపాగమన్ ।
హతాం శ్చాధర్మత శ్శ్రుత్వా శోకార్తా శుశుచు ర్హి తే ॥ (59)

సంజయునికి వ్యాసమహర్షి ప్రసాదించిన దివ్యదృష్టి దుర్యోధనుడు దివంగతుడు కాగా పోయినదట.

"తవ పుత్రే గతే స్వర్గం శోకార్తస్య మమానఘ ।
ఋషిదత్తం ప్రణష్టం త ద్దివ్యదర్శిత్వ మద్య వై ॥" (సౌ-9-63)

దీనివలన తెలియున దేమిః సుయోధనుడు పుణ్యపురుషు డగుటవలన ధార్మికు డగుటవలన ఆతని సన్నిధానములో నాకు ఆ దివ్యదర్శిత్వ మున్నది. అది ఆ ధర్మ స్వరూపుడు పోగా గతించినదన్న భావమే సంజయునిది. వ్యాసుని ఉద్దేశ్యము కూడ ఆసుయోధనుని ధార్మికబుద్ధిని వెలుగొందచేయుటయే కనుక వ్యాసుడు అట్లు నిరూపించుటకు ఆ మాట సంజయుని నోట పలికించెను.

తే పురాణం మహేష్వాసాః మార్గ మైంద్రం సమాశ్రితాః । (ఉ-50-13)

అని ధృతరాష్ట్రుడు తనవారిని గురించి సంజయునితో అనుటయు,

"తేన మన్యే మఘవతా సమ మాత్మాన మద్య వై ।" (సౌ-9-56)

అని సుయోధనుడు ద్రౌణితోననుటయు ఏకముఖముగా నున్నవికనుక సుయోధనుని ఇంద్రమార్గసమాశ్రయణము ఏకరీతిగా, ఏకోన్ముఖముగ నెక్కడను కుంటుపడక నడిచినదని మనకు భారతమంతయు వరుసగా చదువుచో నరము కాగలదు. సుయోధనుడు అట్లు ఐంద్రమార్గాశ్రయముననే తాను ఇంద్రసమానుడనైతి ననుచు మరణించెను.

ఇట్టి దుర్యోధనుడు యుద్ధమునకు ముందుగా "ఆచార్య ముప సంగమ్య" (గీ. 1-2) అనుటవలన ఎంత మహార్థమున్నదో "ఆచార్య" పదము వలన, "ఉపసంగమ్య" అను పదమువలన వ్యక్తము గావింపబడినది తత్త్వార్థ ప్రకాశనార్థమె అట్లు చేరె నన్నదే సారము. ఇది సరసులకు తప్ప అన్యుల కేల అవగతమగును?

శబ్దార్థశాసనజ్ఞానమాత్రేణైవ న వేద్యతే ।
వేద్యతే స తు కావ్యార్థతత్త్వజ్ఞై రేవ కేవలమ్ ॥

అని ధ్వన్యాచార్యులవారి సరససారస్వతమధురోదారసూక్తి. ఆచార్యుని మౌనభావమేమి? అందుకా। "గురోస్తు మౌనవ్యాఖ్యానం శిష్యాస్తు ఛిన్నసంశయాః ॥" అన్న సూక్తి పరమార్థమే. అందులకే-

"తస్య సంజనయ న్హర్షం కురువృద్ధః పితామహః ।
సింహనాదం వినద్యోచ్చైః శంఖం దధ్మౌ ప్రతాపవాన్ ॥ (గీ- 1-2)

అట్టి ఆచార్యోపసదనము చేసి ధర్మమార్గ మవలంబించినందుల కట్టి ధార్మికునికి, పరమాత్మజ్ఞానికి హర్షము కలిగింప భీష్ముడు సింహనాదము చేసెను. "కురువృద్ధః పితామహః" "ప్రతాపవాన్" అను భీష్మగతః విశేషణములు ఏమహార్థమును చెప్పునో ముందు వివరింపబడుచున్నవి. సింహనాదశబ్దముచేత పరమాత్మ విషయకజ్ఞానమే వ్యక్తీకరింపబడిన దనియు ముందు వివరింపబడును.

ఇట్లు సుయోధనుడు కౌరవపక్షమున యుద్ధధర్మప్రకారముగా పెద్దల అనుమతి నొంది సదాచారమునకు మార్గదర్శి కాగా, ఆచార్యుడు మౌనముతో హర్షమును జనింప జేయగా, సదాచారమును పాటించినందులకు కేవల మౌనముననేకాక సింహనాదము చేసి భీష్ముడు మరింత హర్షింపచేసెను. "జనయన్" అనుపదమునకు "సమ్" అను ఉపసర్గను చేర్చుట గమనింపదగినదికదా। ద్రోణుడు సుయోధనునకు

హర్షము "జనయన్" కలిగించుచుండ, భీష్ముడు "సంజనయన్" మరింత ఆహర్షము నతిశయింపచేసె ననుభావము తరలి వరలును

అర్జునుడు ధర్మచర్చ చేయుటకును, ధర్మరాజు శస్త్రాదులు విడిచి పాదచారియై భీష్మాదులను చేరుటకును కూడ ఈ సుయోధనుని సన్మార్గమే నిదాన మనదగును. బలరామునివలన సుయోధనుడు ఏమి ఉపదేశము నంది వచ్చెనో అది తానుకూడ పొంద తలంపుతో "శిష్య స్తేఽహం శాధి మాం త్వాం ప్రపన్నమ్॥" (గీ-2-7) అని అర్జునుడు కృష్ణునికి శిష్యుడైనా డనుట తగును.

అర్జునుని ప్రవృత్తికి కారణము ధర్మసంశయము :-

నరుని ప్రవృత్తికి కారణము తెలియని ప్రతిభోజ్జ్వలమతులు "అర్జునుడు ధర్మమునకు విముఖుడై క్లైబ్యకశ్మలత్వములను పొందెను" అని చెప్పి తమ భావములకు అనువుగా చేయు వ్యాఖ్యానము పరమాన్నము కత్తిపీటవలె నుండును అని నిరూపించిన వాఖ్యానమువలె నుండును.

ఒక యూరిలో నొక గుడ్డివాడు కలడు. అతడొకనాడొక బాలుని సహాయముతో మార్గమున పోవుచుండగా ఒకచోట రోదనధ్వని విని కారణమెరుగ బాలుని పంపెను. మరలివచ్చిన యాబాలుడు పరమాన్నము తిని ఒకబాలుడు మరణించె నని, కావున వాని బంధువులు ఏడ్చుచుండి రని చెప్పెను. పరమాన్న మనగా ఎట్లుండు నని గుడ్డివాడు అడిగెను. తెల్లగా ఉండునని బాలుడు సమాధాన మిచ్చెను. తెలు పెట్లుండును? కొంగవలె నుండును. కొంగ ఎట్లుండును? అని ప్రశ్నించగా ఎట్లుచెప్ప వలెనో తెలియక ఆబాలుడు చివరకు దగ్గరలోనున్న ఒక కత్తిపీటనుతెచ్చి తాకించి ఇట్లుండు నని చెప్పెను అప్పుడాగుడ్డివాడు ఇంతటి పరమాన్నమును తిన్నందున బాలుడు మరణింప కెట్లుండును? అని ఆశ్చర్యమును ప్రకటించెను. ఇట్టి వ్యాఖ్య వలెనే బాల బుద్ధుల వ్యాఖ్యలు కూడ విసర్జింపతగినవే యున్నవి.

అర్జునుడిదివరకు యుద్ధములుచేసినాడు. అవి ధర్మపరిరక్షణకై చేసినాడు. అందులో ఒక భాగము ఆత్మరక్షణము. ఆయాత్మరక్షణకొఱకు పరులను చంపుట జరిగినది. కాని ఏ యుద్ధమును ఇతరుల చంపుటయే ప్రధానముగ చేయ డు. ఉదాహరణకు ఉత్తరగోగ్రహణము. అక్కడ ఈ దుర్యోధనాదులు ఉండనే ఉన్నారు. అందు వీరిలో నెవరినీ చంపలేదే. ఆవచ్చినవారు చావో, బ్రతుకో తేల్చుకొనుటకు రాలేదు. వారొక ఉద్దేశ్యముతో వచ్చినారు. అర్జును డొకదృష్టితో యుద్ధము చేసినాడు. ఇందులో కొంతమంది మరణించుట జరిగినది. జాతి జాతే

నశించు యుద్ధమే జరుగలేదే: లోకవ్యవస్థను రక్షించు క్షత్రియజాతి నశించిపోవు స్థితి రాలేదే! అట్టి యుద్ధము జరుగలేదే!

### కురుక్షేత్రము – తపఃక్షేత్రము :—

ఇప్పుడో : ఇది ధర్మక్షేత్రము, కురుక్షేత్రము. ఇందెవ్వరును తిరిగిపోరు. అందరును చావవలసినవారే. ఏతత్ఫలితమే అర్జును డాలోచించినది. కురుక్షేత్రములో నున్నందుననే అతని కీ ఆలోచన కలిగినది. కురుక్షేత్రము తపఃక్షేత్రము. తప మనగా ఆలోచించుటయేకదా! "తప ఆలోచనే" అని ధాతువు. "కురుక్షేత్రే తపఃక్షేత్రే" అని జనమేజయుడు కురుక్షేత్రమును తపఃక్షేత్రముగా వర్ణించినాడు. ఆలోచించినమాత్రమున యుద్ధము చేయుటకు విముఖు డనతగదు. "కార్పణ్యాదోషోపహతస్వభావః పృచ్ఛామి త్వాం ధర్మసమ్మూఢచేతాః" (గీ–2–7) అని మాత్రమే కదా అర్జును డనినాడు.

"న సంశయ మనారుహ్య నరో భద్రాణి పశ్యతి" అని ఉన్నందున ఏది ధర్మమో, ఏది అధర్మమో సంశయము కలిగినకాని పెద్దల నడిగి తెలిసికొనుట జరుగదు ఈ మహాయుద్ధ మనేటి "మహాధికరణమునకు విషయము–సంగతి–సంశయము– పూర్వపక్షము – సిద్ధాంతములను నిర్ణయించుకొనుట సత్పురుషుల లక్షణములు తెలిసికొనకుండుట కృపణలక్షణము.

ఏత దేవ హి కార్పణ్యం సమగ్ర మసమీక్షితమ్ ।
య చ్ఛే త్సమీక్ష యైవ స్యా ద్భవే త్తస్మిన్ తతో గుణః ॥ (శాం–152–6)

సమగ్రముగా నాలోచింపకుండుటయే కార్పణ్యము; ఆలోచించి ధర్మవిషయక సంశయనిరాసము నొందుటయే అర్జునుని ముఖ్యాశయము. తనకు కలిగిన ధర్మసంశయములు వ్యక్తము చేయుటయే అర్జునుని వాక్యముల పరమార్థము. ఇట్లు సంశయములను వ్యక్తముచేయునట్టి యవకాశము ఇదివరకు రాలేదు. ఈ విషయముపై చర్చ పూర్వము జరుగలేదు. సర్వసంశయచ్ఛేదకుడైనట్టి కృష్ణుని గూఢాశయము తెలిసికొనవలె ననుటయే ఇందలి పరమార్థము

ఏతం మే సంశయం కృష్ణ ఛేత్తు మర్హ స్యశేషతః ।
త్వదన్య స్సంశయ స్యాస్య ఛేత్తా న హ్యుపపద్యతే ॥ (గీ–6–39)

అను అర్జునుని వాక్యము ఈ భావమును బలపరుచుచున్నది. యేదేని ఒక పనీ చేయునప్పుడు దాని మంచిచెడ్డలను ముందుగా సమగ్రముగ సాకల్యముగ పెద్దల నడిగి తెలిసికొని ఆకార్యమున ప్రవేశించుట వివేకుల లక్షణము. అట్లు

అడుగుట, తెలిసికొని ప్రవర్తించుట ధర్మరక్షణలో భాగమే అగును. ఆ ధర్మరక్షణ దీక్షయే అర్జునునిలో సువ్యక్తమైనదిగా సరసులు గుర్తింపవలయును. అట్లడుగుటకు కలిగిన తీవ్రభావసంచలనమే అర్జునుని శరీరమందు స్వేదకంపాదులుగ, మనోవైకల్యముగ అభివ్యక్తమైనది. అందువలన ఈ అధ్యాయము నరుని ధర్మసంశయయోగ మని చెప్పవలెను.

సంశయములు మహాత్ములకు గలవు :-

అర్జుననకే కాదు; మహాపురుషులందరకును సంశయములు గలుగుచుండును. అప్పుడు మహాత్ము లెవరైనను అందుబాటులో నున్నచో వారివలన తమ సంశయములను బోగొట్టుకొందురు. లేక ఆ సంశయములను తామే హేతుబద్ధముగా తొలగించుకొందురు.

హనుమంతుడు :-

హనుమంతుడు లంకలో రావణాంతఃపురమున సీతను వెదుకుచు స్వేచ్ఛగ శయనించిన స్త్రీలను చూచుట అధర్మ మని సందేహించెను. స్త్రీలయందే ఒకానొక స్త్రీని వెదకుట సంభవము. కనుక తాను చేసిన పరిశీలనము అధర్మము కాదని నిశ్చయించుకొనెను. అంతేగాక తానట్లు పరిశీలించునపుడు తన మనస్సులో ఏ విధమగు వికారమును పొడచూపలే దనియు గుర్తించినవాడై తన ప్రవృత్తి ధర్మప్రవృత్తియే యనియు తీర్మానము చేసెను.

పరదారావరోధస్య ప్రసుప్తస్య నిరీక్షణమ్ ।
ఇదం ఖలు మ మాత్యర్థం ధర్మలోపం కరిష్యతి ॥ (సుం-8-37)
న హి మే పరదారాణాం దృష్టి ర్విషయవర్తినీ ।
అయం చాత్ర మయా దృష్టః పరదారపరిగ్రహః ॥ (38)
తస్య ప్రాదురభూ చ్చింతా పున రన్యా మనస్వినః ।
నిశ్చితైకాంతచిత్తస్య కార్యనిశ్చయదర్శినః ॥ (39)
కామం దృష్టా మయా సర్వా విశ్వస్తా రావణస్త్రియః ।
న హి మే మనసః కించి ద్వైకృత్య ముపపద్యతే ॥ (40)
మనో హి హేతు స్సర్వేషా మింద్రియాణాం ప్రవర్తనే ।
శుభాశుభా స్వవస్థాసు త చ్చ మే సువ్యవస్థితమ్ ॥ (41)

దుష్యంతుడు :-

శాకుంతలమున దుష్యంతుడు శకుంతలను ప్రథమవీక్షణముననే ప్రేమించి,

ఆ తర్వాత మునికాంతయందు తన మనస్సు లగ్నమగుట అధర్మము కాదా? అని సందేహాత్ముడై, ఆర్యమగు తన మనస్సు అధర్మపరము కాదు కనుక ఆమె ముని కాంత కాదనియు, క్షత్రియపరిగ్రహక్షమ యనియు నిర్ధారణ గావించెను. పిదప అనసూయవలన శకుంతలాకన్య వృత్తాంతమును విని తన నిశ్చయమును పరీక్షించుకొని యోగ్యమైనదిగా భావించెను.

ప్రవరుడు :—

మనుచరిత్రమున ప్రవరుడు "పిన్నతనముననే అల్పకాలమున నమస్త దేశాటనము చేసి వచ్చితి" ననిన సిద్ధుని వాక్యమును సంశయింపగ అట్లు సంశయించుట దోషము కానేర దని సిద్ధుడు నుడుపును. "సందియమ్ము దెలియ నడుగుట దప్పా?" (మను—1-74)

కావున సంశయములు గలుగుట, వాని నివృత్తికై తమ మనస్సుపై ఆధారపడుట, లేక మహాత్ములను పరిపృచ్ఛ చేయుట మహాత్ములకైనను సహజమే. కావున అర్జునుడు శ్రీకృష్ణుని అడుగుట అసహజము కాని, అసమంజసము కాని కాబోదు. అట్లు అడుగుట అజ్ఞానమువలన కాదనియు తెలియవలయును.

కృష్ణుడును సంశయాత్ము డయ్యెను :—

శిశుపాలుని చంపుటకని ఇంద్రుడు నారదునిచేత కృష్ణునకు సందేశ మంపెను. "రాజసూయము చేయుచున్నాను రమ్ము" అని ధర్మజుడు కృష్ణుని ఆహ్వానించెను. కార్యద్వయాకులుడైన కృష్ణుడు ఉద్ధవబలరాములతో మంతనము జరుప వారితో సమావేశము ఏర్పాటు చేసి తన మతము చెప్పి, ఇట్లనును:—

మమ తావ న్మత మిదం శ్రూయతా మంగ వా మపి ।
జ్ఞాతసారోఽపి ఖ ల్వేక స్సందిగ్ధే కార్యవస్తుని ॥ (శిశు—2-12)

ఇట "జ్ఞాతసారోఽపి" అన్న పదము నిదానించి చూడదగినది. కనుక అర్జునుడు ఇంత మహాయుద్ధము ప్రారంభము చేయుచు పలికిన ఆ పలుకులు అజ్ఞాన ప్రకాశములు కాకపోగా, మీదుమిక్కిలి అతడి సమయజ్ఞతకు నిదర్శనములు.

అర్జునుడు యుద్ధము నుండి విరమింపవలెను :—

అర్జునునకు అజ్ఞానము ఎంత పేరుకొనిన దనగ—కృష్ణుడు మరల మరల ఒక్క తీరున కాక అనేక రీతులలో బోధించిన గాని ఆ అర్జునునకు అజ్ఞానము నివృత్తము కాలేదు. కనుక అర్జునుడు శోకమోహవిష్టచేతస్కుడై

క్షత్రియధర్మము మరచి బంధువధ చేయుటకు వైముఖ్యము చూపి యుద్ధమునుండి విరమించుటకు సిద్ధపడినాడు- అని వ్యాఖ్యానించుట సరికాదు పలుమార్లు హెచ్చరింపబడవలసి వచ్చుట దోషము కాదు.

తాటకావధ :—

రామాయణములో తాటకావధ ఘట్టము నొకింత పరికింతము తాటక లోక కంటకముగా నున్నందున ఆమెను చంపు మని విశ్వామిత్రుడు రాముని ప్రబోధించెను. స్త్రీని చంపుట యధర్మమని రాముడు సంశయించెను. ఆమెను చంపుటకు బదులు కర్ణనాసికలు కోసి విరూప మొనరించి వదలుట మేలు అని భావించెను. కాని విశ్వామిత్రుడు పలుమార్లు తాటకను చంపుట తప్పు దని ప్రబోధింపగ చివరకు ఒప్పుకొని ఆమెను చంపును.

ఏనాం రాఘవ! దుర్వృత్తాం యక్షీం పరమదారుణామ్ ।
గోబ్రాహ్మణహితార్థాయ జహి దుష్టపరాక్రమామ్ ॥ (బా. కాం. 25-14)
న హి తే స్త్రీవధకృతే ఘృణా కార్యా నరోత్తమ ।
చాతుర్వర్ణ్యహితార్థాయ కర్తవ్యం రాజసూనునా ॥ (16)
నృశంస మనృశంసం వా ప్రజారక్షణకారణాత్ ।
పాతకం వా సదోషం వా కర్తవ్యం రక్షతా సతా ॥ (17)
రాజ్యభారనియుక్తానాం ఏష ధర్మ స్సనాతనః ।
అధర్మ్యం జహి కాకుత్స్థ ధర్మో హ్యస్యా న విద్యతే ॥ (18)
మునే ర్వచన మక్లీబం శ్రుత్వా నరవరాత్మజః ।
రాఘవః ప్రాంజలి ర్భూత్వా ప్రత్యువాచ దృఢవ్రతః ॥ (2?-1)
పితు ర్వచననిర్దేశా త్పితుర్వచనగౌరవాత్ ।
వచనం కౌశిక స్యేతి కర్తవ్య మవిశంకయా ॥ (2)
సోఽహం పితు ర్వచ శ్శ్రుత్వా శాసనా ద్బ్రహ్మవాదినః ।
కరిష్యామి న సందేహ స్తాటకావధ ముత్తమమ్ ॥ (4)
గోబ్రాహ్మణహితార్థాయ దేశ స్యాస్య సుఖాయ చ ।
తవ చై వాప్రమేయస్య వచనం కర్తు ముద్యతః ॥ (5)
ఏనాం పశ్య దురాధర్షాం మాయాబలసమన్వితామ్ ।
వినివృత్తాం కరో మ్యద్య హృతకర్ణాగ్రనాసికామ్ ॥ (11)
న హ్యేనా ముత్సహే హంతుం స్త్రీస్వభావేన రక్షితామ్ ।
వీర్యం చాస్యా గతిం చాపి హనిష్యా మీతి మే మతిః ॥ (12)

అలం తే ఘృణయా రామ! పాపైషా దుష్టచారిణీ ।
యజ్ఞవిఘ్నకరీ యక్షీ పురా వర్ధతి మాయయా ॥ (21)
వధ్యతాం తావ దేవైషా పురా సంధ్యా ప్రవర్తతే । (22)
శరేణోరసి వివ్యాధ సా పపాత మమార చ ॥ (25)

### రాముడజ్ఞాని అయినచో అర్జునుడు అజ్ఞానియే :-

ఈ సందర్భములో రాముని సంశయములు అజ్ఞానవిలసితముగ విమర్శకులు భావించినచో అర్జునుని సంశయము కూడ అట్టిదే యగును. కాని వా రట్లు చేయక ఒకే విధ మగు రెండు ఘట్టములను వేర్వేరు విధములుగ విమర్శింపబూనుట సద్విమర్శకుని లక్షణము కాదు. రాముని సందేహము వలెనే అర్జునుని సందేహము కూడ ధర్మవిషయకమే కాని మోహజుష్టము కాదు.

### గోబ్రాహ్మణ రక్షణార్థమే యుద్ధము చేయవలయును.

అర్జునుడు గురుబంధుమిత్రాదులను చంపుటకు వెనుకాడుటలో ఎంతో సరసమైన నిగూఢాశయము కలదు. క్షత్రియధర్మ మగు యుద్ధము నిర్వహింపవలసి వచ్చినపుడు కేవలము రాజ్యకాంక్షయే ప్రధానాంశముగ నుండరాదు. ఆ యుద్ధము వలన గోబ్రాహ్మణాదులకు మేలు కలుగ నున్నప్పుడే ఆ యుద్ధఫలము ధార్మిక మగు నని విదురుడు ధృతరాష్ట్రునకు చెప్పిన నీతులలో సూచించుట గమనార్హము.

అధీత్య వేదా న్పరిసంస్తీర్య చాగ్నీ నిష్ట్వా యజ్ఞైః పాలయిత్వా ప్రజా శ్చ ।
గోబ్రాహ్మణార్థే శస్త్రపూతాంతరాత్మా హత స్సంగ్రామే క్షత్రియస్స్వర్గమేతి ॥"
(ఉ-39-26)

### భారత యుద్ధ మధర్మము

కామక్రోధప్రదీప్తమైన ఈ యుద్ధమువలన అధర్మమే కల్గినది కాని ధర్మము సంభవింప లేదని, ఇట్టి యుద్ధమువలన లభించిన రాజ్యమును నేను పరిపాలింపను అని ధర్మరాజు శాంతిపర్వములో చెప్పుటయు గమనార్హము. 7వ అధ్యాయములో 3 నుండి 27వ శ్లోకమువరకు, 28వ అధ్యాయములో 1 నుండి 12వ శ్లోకము వరకు పరిశీలించిన భారతయుద్ధము అధర్మమే యని ధర్మరాజుయొక్క సుదృఢాభిప్రాయ మని తెలియును.

యుద్ధమువలన భూమి, మిత్రము, హిరణ్యము సంభవించిననే ఆ యుద్ధము ధర్మఫలము అన్న విషయము మన సారస్వతమునందంతయు, పరమాత్మ ప్రపంచమంతయు వ్యాపించియున్న విధమున, "ఇందుగల డందు లేడని

సందేహమువలదు చక్రి సర్వోపగతుండు" అని ప్రహ్లాదు డన్నవిధమున, వ్యాపించి యుండుట సద్విమర్శకులకు తెలియనిదికాదు.

అథోచ్చకై స్తోరణసంగభంగభయావనమ్రీకృతకేతనాని ।
క్రియాఫలా నీవ సుసీతిభాజాం సైన్యాని సోమాన్వయ మన్వయు స్తమ్ ॥
(శిశు-3-26)

ఈ ను శ్లోకములో "క్రియాః సామాద్యుపాయప్రయోగాః, తాసాం ఫలాని హిరణ్య భూమిత్రాది లాభాః" అని మల్లినాథుని వాఖ్యయు గమనార్హము.

భూమి ర్మిత్రం హిరణ్యం చ విగ్రహస్య ఫలం త్రయమ్ ।
య దైత న్నిశ్చితం భావి కర్తవ్యో విగ్రహ స్తదా ॥ (హితోపదేశము)

కృతఘ్నత, మిత్రద్రోహము నరకహేతువులు.

భూమి, మిత్రము, హిరణ్యము ఇవి లభించుటకై యుద్ధ మొనరింపవలయు నని ఈ పైప్రమాణములు తెల్పుచున్నవి. ప్రస్తుతయుద్ధము మిత్రద్రోహమునే కల్పించునదై, మిత్రలాభము నుద్దేశించి ప్రవర్తింపవలసిన యుద్ధకర్మలో విపరీత ప్రయోజనము కలిగించుచున్నది యగుటవలననే 'మిత్రద్రోహే చ పాతకం' (గీ. 1-38) అని అర్జునుడు చెప్పెను. ఇది అజ్ఞానము కాదు.

మిత్రద్రోహీ కృతఘ్న శ్చ యః ప్రోక్త స్త ద్వదస్వ మే" (శా. 168-28) అని ధర్మరాజు అడుగగా భీష్ముడు గౌతము డను బ్రాహ్మణుడు కృతఘ్నుడు, మిత్రద్రోహి అని వాని కథ చెప్పి చివర ఇట్లు ముగింపు చేయును.

క్రవ్యాదా అపి రాజేంద్ర కృతఘ్నం నోపభుంజతే ।
బ్రహ్మఘ్నే చ సురాపే చ చోరే భగ్నవ్రతే తథా ॥ (శా. 172-25)
నిష్కృతి ర్విహితా రాజ న్కృతఘ్నే నాస్తి నిష్కృతిః ।
మిత్రద్రోహీ కృతఘ్న శ్చ నృశంస శ్చ నరాధమః ॥ (శా. 172-26)
కుతః కృతఘ్నస్య యశః కుత స్థానం కుత స్సుఖం (శా. 173-20)
అశ్రద్ధేయః కృతఘ్నో హి కృతఘ్నే నాస్తి నిష్కృతిః ।
మిత్రద్రోహో న కర్తవ్యః పురుషేణ విశేషతః । (శా. 173-21)
మిత్రధృ జ్నరకం ఘోరం అనంతం ప్రతిపద్యతే ॥ (శా. 173-22)
మిత్రద్రోహీ కులాంగారః పాపకర్మా నరాధమః ॥ (శా. 173-24)

రామాయణమున కృతఘ్నమిత్రద్రోహములు నిందింపబడెను.

పూర్వం కృతఘ్నో మిత్రాణాం న త త్ప్రతికరోతి యః ।
కృతఘ్న స్సర్వభూతానాం స వధ్యః ప్లవగేశ్వర ॥ (కి. 34-10)

బ్రహ్మఘ్నే చ సురాపే చ చోరే భగ్నవ్రతే తథా ।
నిష్కృతిః విహితా సద్భిః కృతఘ్నే నాస్తి నిష్కృతిః ॥ (కి 34-12)

ఈశ్లోకము బ్రహ్మ చెప్పినట్లు లక్ష్మణుడు సుగ్రీవునితో ననెను. "ఉప కారఫలం మిత్రం అపకారోఽరిలక్షణం" అన్నన్యాయానుసారము కృతఘ్నుడు మిత్రఘ్నుడు ఇద్దరూ సమానులే.

## మిత్రసంగ్రహము

స్వధర్మం యః పరిత్యజ్య పరార్థ మనుతిష్ఠతి ।
మిథ్యా చరతి మిత్రార్థే య శ్చ మూఢ స్స ఉచ్యతే ॥ (ఉ. 32-36)
అమిత్రం కురుతే మిత్రం మిత్రం ద్వేష్టి హినస్తి చ ।
కర్మ చారభతే దుష్టం త మాహు ర్మూఢచేతసమ్ ॥ (ఉ. 32-38)
సుహృ న్మిత్రం న లభతే త మాహు ర్మూఢచేతసమ్ ॥ (ఉ. 32-40)

ఈ విదురవాక్యములవలన మిత్రసంపాదన మెంత ముఖ్యమో గమనించి నచో అర్జునుని భావము శోకజుష్టము కాదని తెలియును.

## బంధుప్రీతి

కులవృద్ధిం చ రాజేంద్ర తస్మా త్సాధు సమాచర ।
శ్రేయసా మోక్ష్యతే రాజన్ కుర్వాణో జ్ఞాతిసత్క్రియామ్ ॥ (ఉ. 38-19)
నిర్గుణా హ్యపి సంరక్ష్యా జ్ఞాతయో భరతర్షభ । (ఉ. 38-20)
జ్ఞాతిభి ర్విగ్రహ స్తాత! న కర్తవ్య శ్శుభార్థినా ॥ (ఉ. 38-23)
సుఖాని సహభోజ్యాని జ్ఞాతిభి ర్భరతర్షభ ।
సంభోజనం సంకథనం సంప్రీతి శ్చ పరస్పరమ్ ॥ (ఉ. 38-24)
జ్ఞాతిభి స్సహ కార్యాణి న విరోధః కదాచన ।
జ్ఞాతయ స్తారయం తీహ జ్ఞాతయో మజ్జయంతి చ ॥ (ఉ. 38-25)
సువృత్తా స్తారయం తీహ దుర్వృత్తా మజ్జయంతి చ ।
సువృత్తో భవ రాజేంద్ర! పాండవా న్ప్రతి మానద ॥ (ఉ. 38-26)

ఈశ్లోకములలో విదురుడు ధృతరాష్ట్రునకు వివరించిన భావము, ఒక్క-ధృతరాష్ట్రునకు మాత్రమే వర్తించు ననుకొనరాదు. ధర్మపరు లందరకు వర్తించును. అందుకే అర్జునుడు ఈ భావములను సంగ్రహించునట్లు ఇట్లు అనెను.

తస్మా న్నార్హా వయం హంతుం ధార్తరాష్ట్రా న్స్వబాంధవాన్ ।
స్వజనం హి కథం హత్వా సుఖిన స్స్యామ మాధవ ॥ (గీ. 1-37)

యద్యప్యేతే న పశ్యంతి లోభోపహతచేతసః ।
కులక్షయకృతం దోషం మిత్రద్రోహే చ పాతకమ్ ॥ (గీ. 1-38)
కథం న జ్ఞేయ మస్మాభిః పాపా దస్మా న్నివర్తితుమ్ ।
కులక్షయకృతం దోషం ప్రపశ్యద్భి ర్జనార్దన ॥ (గీ. 1-39)

### ఆతతాయులను చంపవలయును.

గురుం బాలం తథా వృద్ధం బ్రాహ్మణం వా బహుశ్రుతం ।
ఆతతాయిన మాయాంతం హన్యా దేవాఽవిచారయన్ ॥ (మను. 8-350)

ఆతతాయులను తప్పక చంపవలయు నని, విచారింపరా దని రాజధర్మము కదా।

నాతతాయివధే దోషో హంతు ర్భవతి కశ్చన । (మను. 8-351)

ఆతతాయులను చంపినందున హంతకునకు ఏ దోషమును రాదు అని మనువు చెప్పుటవలన వీరు గురువులు వీరు బంధువులు అని సామాన్యధర్మము గూడ పాటింప నక్కరలేదు అన్న విశేషము గోచరించుచున్నది.

### ఆతతాయు లెవరు?

అగ్నిదో గరదశ్చైవ శస్త్రపాణి ర్ధనాపహః ।
క్షేత్రదారాపహారీ చ షడేతే హ్యాతతాయినః ॥ (వశిష్ఠస్మృతి 1-19)

ఆతతాయులెవరో ఈ శ్లోకము వివరించుచున్నది.

### దుర్యోధనాదులు ఆతతాయులు

దుర్యోధనాదులు వారణావతమున పాండవగృహమును దహించుట, భీమునకు విషము పెట్టుట, ద్రౌపదిని సభలో వస్త్రాపహారము గావించి అవమానించుట, మున్నగు పాపకృత్యము లొనరించుటచే ఆతతాయు లగుట నిస్సంశయము. మరి ఇట్టి ఆతతాయులగు దుర్యోధనాదులను చంపిన—

"పాప మే వాశ్రయే దస్మాన్ హత్వైతా నాతతాయినః" (గీ. 1-36)

అని అనుట అర్జునుని విపరీతబుద్ధికి తార్కాణము కాదా? కాదు.

### ఆతతాయులనుచంపితీరవలయునని లేదు. రాముని ప్రవృత్తి

భార్య నపహరించినవాడును ఆతతాయియే కదా? శ్రీరాముని భార్యను అపహరించిన రావణుడును ఆతతాయియే. విభీషణ శరణాగతిసందర్భములో విభీషణుని స్వీకరింపవచ్చునా। స్వీకరింపరాదా? అన్న చర్చలో జాంబవంతుడు మున్నగువారు పలుపోకడలు పోవుచుండిరి. అప్పుడు రాముడు ఇట్లనును—

మిత్రభావేన సంప్రాప్తం న త్యజేయం కథంచన ।
దోషో యద్యపి తస్య స్యా త్సతా మేత దగర్హితమ్ ॥ (యు. 18-3)
సకృదేవ ప్రపన్నాయ త వాస్మీతి చ యాచతే ।
అభయం సర్వభూతేభ్యః దదా మ్యేత ద్వ్రతం మమ ॥ (యు. 18-34)
ఆన యైనం హరిశ్రేష్ఠ దత్త మ స్యాభయం మయా ।
విభీషణో వా సుగ్రీవః యది వా రావణ స్స్వయం ॥ (యు. 18-35)

"మిత్రభావముతో వచ్చినవారిని, నేను నీవాడను అన్నవానిని నేనువిడువను. వానియందు ఆతతాయిత్వదోషమున్నను సత్పురుషుల కది గర్హణీయము కాదు. విభీషణు డేమి, రావణుడైనను వచ్చినచో నేను గ్రహింతును" అని రాము డనును. అగుచో శరణాగతిని పొందవలెను గదా! అందు రేమో రావణుడు యుద్ధములో రామునిచేత నిరాయుధుడుగా హతసారధుడుగా చేయబడినాడు. అప్పుడు రాము డిట్లనెను.

కృతం త్వయా కర్మ మహ త్సుభీమం
హతప్రవీర శ్చ కృత స్త్వయాహమ్ ।
తస్మా త్పరిశ్రాంత ఇవ వ్యవస్య
న త్వాం శరై ర్మృత్యువశం నయామి ॥ (యుద్ధ. 59-142)
గచ్ఛానుజానామి రణార్దిత స్త్వం
ప్రవిశ్య రాత్రించరరాజ! లంకామ్ ।
ఆశ్వాస్య నిర్యాహి రథీ చ ధన్వీ
తదా బలం ద్రక్ష్యసి మే రథస్థః ॥ (యుద్ధ. 59-143)

భార్య నపహరించిన ఆతతాయి రావణుడు చేతికి చిక్కినను రాముడు విడిచిపెట్టెను. శరణాగతి పొందకున్నను ఒక అవకాశము కల్పించినచో శరణు వేడు నేమో అని రాముడు రావణున కవకాశము మిచ్చె నని ఇట పెద్దలు వ్యాఖ్యానించుచున్నారు.

అట్లే అర్జునుడు తాను చూపు బంధుప్రీతిని పురస్కరించుకొని దుర్యోధనాదులును మారవచ్చునేమో అన్నదే అర్జునుని భావముగ మనము గ్రహింపవలయును. అట్టి భావము కలిగించుటకు ధను వెక్కుపెట్టి సేనలనడుమకు రథము పోనిచ్చి గురుబంధుమిత్రవర్గము ఈయుద్ధమున అధర్మముగ వధింపబడుచున్న దని ఏలుగెత్తి చెప్పి ధనుర్బాణములను విడచి రథోపస్థమున ఉపవిష్టు డయ్యెను.

ఈ సందర్భమున అర్జునుడు భయంకర మగు శత్రువాహినిని చూచి పిరికి వాడై యుద్ధము చేయ నని బిచ్చ మెత్తుకొని యైనను బ్రతుకవచ్చు నని అర్జునుని భావముగ వ్యాఖ్యానించుచున్నారు.

యది మా మప్రతీకార మశస్త్రం శస్త్రపాణయః
ధార్తరాష్ట్రా రణే హన్యు స్తన్మే క్షేమతరం భవేత్ ॥ (గీ. 1-46)

ఇందులో గమనింపదగు భావమున్నది. "అశస్త్రు"డ నగు నన్ను వీరు చంపవచ్చు నేమో కాని శస్త్రముకల నన్ను ఎవరును ఏమియు చేయలేరు అన్న వీరోచితభాషిత మిది. ఇట్టి భావమును ప్రకటించి తన సామర్థ్యమును వెలువ రించుచునే కేవలము ధర్మదృష్టిని పురస్కరించుకొనియే అహితులకును హితము సూచించుటకే ఇట్లు చెప్పి ధనుర్బాణములు విడచెను. అర్జునునియందు గురుబంధు కృతముగ కలిగిన శోకము లేక కృప అస్థానపతితము, అందువలన అజ్ఞానమే నర వర్యునిది అనుట కూడ తప్పే.

లంకనుండి తిరిగివచ్చిన హనుమవలన సీతావృత్తాంతము వినిన వానర వాహిని శత్రువులను నాశనమొనరింతు మని సమరోత్సాహము ప్రకటి చుచున్నను శ్రీరాముడు శోకమును అధైర్యమును ప్రకటించెను గీతలో అర్జునుడు శోకా క్రాంతచిత్తుడై ప్రకటించిన భావము లన్నియు ఆ సందర్భమున రాముని వాక్య ములలో రాముని ఓదార్చిన సుగ్రీవాదులవాక్యములలో స్పష్టముగ నున్నవి. రాముని శోకము అస్థానపతిత మనగలమా?

## అర్జునుని ప్రసంగఫలము ధర్మము

సరే! అర్జునుని ప్రసంగ మంతయు ధర్మసంబద్ధమే అగుచో దానిఫలమేమి? రాముడు శోకించి నట్లు అగుపడునే కాని నిజమునకు ఆ శోకము ధర్మమే జీవముగ కలది. కనుకనే ఆసందర్భములో—

"విభీషణ స్తు ధర్మాత్మా న తు రాక్షసచేష్టితః"

అని శూర్పణఖచేతను కీర్తినందిన విభీషణుడు అన్నను విడచి రామునితో చేరెను. అట్లే అర్జునుని విషాదము ధర్మమేజీవముగకలది. దుర్యోధనుని తమ్ముడు యుయు త్సుడు పాండవపక్షమునకు తరలివచ్చెను. రాముడు ఆవచ్చిన విభీషణునకు అప్పటి కప్పుడే లంకారాజ్యమును పట్టము కట్టెను. అట్లే ఆవచ్చిన యుయుత్సునకు ధర్మ రాజుకూడ దుర్యోధనునిస్థానమును పట్టము కట్టెను.

త్వయి తంతు శ్చ పిండ శ్చ ధృతరాష్ట్రస్య దృశ్యతే । (భీష్మ. 43_93)

అని ధర్మరాజు యుయుత్సునితో అనుట ప్రత్యేకపరిశీలనార్హము కదా!

తం తథా కృపయావిష్ట మశ్రుపూర్ణాకులేక్షణమ్ ।
విషీదంత మిదం వాక్య మువాచ మధుసూదనః ॥ (గీ. 2-1)

అశ్రుపూర్ణాకులేక్షణు డగుట అర్జునుని ధర్మాభినివేశమునకు నిదాన మగునా? పరిశీలించిన ధర్మమే అని తెలియును.

"జీవాగ్ం రుదంతి వియయన్త్యేఽధ్వరే దీర్ఘా మను ప్రసితిం దీధియుర్నరః" అని. వివాహ మంత్రములలో గలదు. వివాహము అధ్వరము. ఈ సందర్భమున నిజమునకు దుఃఖింపరాదు కాని కన్యాబంధువులు కన్య తమను విడచిపోవుచున్న దని విమనస్కులై ఏడ్చుచుందురు. ఆమెయు దీర్ఘకాలిక మగు బంధువులతో గల సంబంధము తెగిపోవుచున్నదే యని రోదించునట.

"కన్యాదానే న మ మేతి న వాచ్యం".

ఏ వస్తువు నైనను దాన మిచ్చుచో ఆ వస్తువునందు దాత స్వామ్యమును "న మమ" అని త్యజించును. కన్యావాత మాత్రము స్వత్వమును త్యజింపరాదు. అట్టి సందర్భమున దుఃఖించుట కవకాశమే, లేదు. కాని బంధువులు దుఃఖితురు.

ఇది సంసారలంపటులకు మాత్రమే, జ్ఞానులు దుఃఖింప రనుట తగదు. శాకుంతలమున కులపతి శ్వాశతబ్రహ్మనిష్ఠుడు కణ్వుడు శకుంతలను పంపుచు ఇట్లనుకొనును.

యాస్య త్యద్య శకుంత లేతి హృదయం సంస్పృష్ట ముత్కంఠయా
కంఠస్తంభితబాష్పవృత్తి కలుష శ్చింతాజడం దర్శనమ్ ।
వైక్లబ్యం మమ తావ దీదృశ మహో స్నేహా దరణ్యౌకసః
పీడ్యంతే గృహిణః కథం ను తనయావిశ్లేషదుఃఖై ర్నవైః ॥

ఎవరైనను కణ్వుని ఈ ఆవేశమును శోక మోహకృతమని అనగలరా? శోకము కలిగినంతమాత్రమున ఆతనిలో ధర్మబుద్ధి నశించినది. అని చెప్పుచో వాల్మీకిమహర్షి క్రౌంచపక్షులజంటనుండి బోయవాడుమగపక్షిని చంపగ అది నెత్తుటిలో పొర్లాడుచుండ దానిని చూచి ఆడపక్షి భర్తృవియోగమునకు, అట్లు చనిపోవుచుండుటకు దుఃఖించుచుండ ఆ దుఃఖము తనదిగా భావించి ఆ బోయవానిని శపించెను. అచ్చట వాల్మీకియే తన గురించి ఇట్లనును.

"ఋషే ర్ధర్మాత్మన స్తస్య కారుణ్యం సమపద్యత"

"శ్లోకత్వ మాపద్యత యస్య శోకః" అని భోజమహారాజు చంపూరామాయణమున చెప్పును. దీనినిబట్టి చూడ శోకావేగాశ్రుపాతాదులు కేవలాజ్ఞానాధర్మ సంజనితములు మాత్రమే కాదు. సత్త్వగుణసంపన్నులగువారికి పరదుఃఖదుఃఖి

త్వము సహజము అదియే అర్జునునిలో ధర్మాత్ముడగు కృష్ణుని ఎదుట ఆవిష్కృత మైనది.

## శోకమోహములలో ధర్మ ముండునా?

శోకమోహావేశమందు ధర్మ ముండునా? అని అకృతమతులకు సందియము కలుగుట సహజము. ఇట్టివారిని గూర్చియే భగవానుడు "సంశయాత్మా వినశ్యతి" అనెను.

సంజయుని ఈ వాక్యములు చూడుడు.

కుంతీపుత్ర స్తు తం మంత్రం స్మర న్నేవ ధనంజయః ।
ప్రతిజ్ఞా మాత్మనో రక్షన్ ముమోహాచింత్యవిక్రమః ॥ (ద్రో 80-1)
తం తు శోకేన సంతప్తం స్వప్నే కపివరధ్వజమ్ ।
ఆససాద మహాతేజా ధ్యాయంతం గరుడధ్వజః ॥ (ద్రో. 80-2)
ప్రత్యుత్థానం చ కృష్ణస్య సర్వావస్థో ధనంజయః ।
న లోపయతి ధర్మాత్మా భక్త్యా ప్రేమ్ణా చ సర్వదా ॥ (ద్రో 80-3)
ప్రత్యుత్థాయ చ గోవిందం స తస్మా ఆసనం దదౌ ।
న చాసనే స్వయం బుద్ధిం బీభత్సు ర్వ్యదధా త్తదా ॥ (ద్రో 80-4)
తతః కృష్ణో మహాతేజా జానన్ పార్థస్య నిశ్చయమ్ ।
కుంతీపుత్ర మిదం వాక్య మాసీనః స్థిత మబ్రవీత్ ॥ (ద్రో 80-5)
మా విషాదే మనః పార్థ కృథాః కాలో హి దుర్జయః ।
కాల స్సర్వాణి భూతాని నియచ్ఛతి పరే విధౌ ॥ (ద్రో 80-6)
కి మర్థం చ విషాద స్తే త ద్బ్రూహి ద్విపదాం వర ।
న శోచ్యం విదుషాం ! పార్థశోకః కార్యవినాశనః ॥ (ద్రో 80-7)
య త్తు కార్యం భవే త్కార్యం కర్మణా త త్సమాచర ।
హీనచేష్టస్య యః శోకః స హి శత్రు ర్ధనంజయ ॥ (ద్రో 80-8)
శోచ న్నందయతే శత్రూన్ కర్శయ త్యపి బాంధవాన్ ।
క్షీయతే చ నర స్తస్మా న్న త్వం శోచితు మర్హసి ॥ (ద్రో 80-9)

ఈశ్లోకములవలన తెలియ వలసిన దేమనగ శోకమోహావిష్టుడైనను ధర్మాత్మ క్రాంతుడు కా డనుట. శోకమోహము లున్నంతమాత్రమున ధర్మహీను డగుచో నిట అర్జునునకు శోకమోహములున్నట్లు వాచ్యముగచెప్పియు, ధర్మాత్మా అని విశేషణము మహర్షి వ్యాసుడు ప్రయోగింపడు. మరొకవిషయము-ధర్మహీనుడే యగుచో అర్జునుడు ధర్మస్వరూపు డగు కృష్ణుడు ఆతనికి సాక్షాత్కరింపడు.

## ధర్మజునకును విషాదము కలదు

యుద్ధానంతరము ధర్మజుడు కూడ ఇట్టి భావమునే ప్రకటించెను.

బహుకల్యాణసంయుక్తా నిచ్ఛంతి పితర స్సుతాన్ ।
తపసా బ్రహ్మచర్యేణ సత్యేన చ తితిక్షయా ॥ (శాం 7-13)
ఉపవాసై స్త థేజ్యాభిః వ్రతకౌతుకమంగళైః ।
లభన్తే మాతరో గర్భాం స్తాన్ మాసాన్ దశ బిభ్రతి ॥ (శాం 7-14)
యది స్వస్తి ప్రజాయన్తే జాతా జీవంతి వా యది ।
సంభావితా జాతబలా స్తే దద్యు ర్యది న స్సుఖమ్ ॥ (శాం 7-15)
ఇహ వా ముత్ర వా చేతి కృపణాః ఫలహేతుకాః ।
తాసా మయం సమారంభో నివృత్తః కేవలోఽఫలః ॥ (శాం 7-16)
య దాసాం నిహతాః పుత్రా యువానో మృష్టకుండలాః ॥ (శాం 17)
అభుంక్త్వా పార్థివాన్ భోగాన్ ఋణా న్యనపహాయ చ ।
పితృభ్యో దేవతాభ్య శ్చ గతా వైవస్వతక్షయమ్ ॥ (శాం. 7-18)
య దైషా మంబ పితరౌ జాతకామా వృథా వపి ।
సంజాతబహురూపేషు త దైవ నిహతా నృపాః ॥ (శాం. 7-19)
సంయుక్తాః కామమన్యుభ్యాం క్రోధహర్షాసమంజసాః ।
న తే జయఫలం కించి ద్భోక్తారో జాతు కర్హిచిత్ ॥ (శాం. 7-20)
వయ మే వాస్య లోకస్య వినాశే కారణం స్మృతాః ।
ధృతరాష్ట్రస్య పుత్రై స్తు త త్పూర్వం ప్రతిపత్స్యతి ॥ (శాం. 7-22)

యుద్ధమువలన లోకక్షయమునకు తామే కారణ మని ధర్మజుడు అంగీకరించుచు, ఆ యుద్ధమువలన తల్లీబిడ్డలకు శాశ్వతవియోగము సంభవించిన దని కుందును. అధ్వరమున అనగా వివాహమున తాత్కాలికవియోగమునకే విషణ్ణత నొందుట ధర్మము అయినచో శాశ్వతవియోగకర మగు యుద్ధాధ్వరమున అర్జునుడు విషాదము నందుట అధర్మము కా దని నిరూపించుటకు ధర్మరాజవచనములు కూడ పరమప్రమాణమూర్ధన్యములై అలరారుచున్నవి.

## ఆత్మగుణాష్టకములోని కృపవేరు – ఈ కృప వేరు.

అర్జునునియందు కల్గిన కృప సామాన్యముగ అందరియందును తప్పక ఉండదగిన ఆత్మగుణాష్టకములోని కృప కాదు.

"దయా సర్వభూతేషు క్షాంతి రనసూయా శౌచ మనాయాసో మంగళ మకా ర్పణ్య మస్పృ హేతి అష్టా వాత్మగుణాః" (గౌతమధర్మసూత్రం 8-24) ఇందు దయ చాల ప్రధానమైనది.

అష్టా వాత్మగుణా యే హి తేషా మాదౌ దయా ద్విజ ।
తాం కరోషి కథం న త్వం మయి సద్ధర్మపాలక ॥

అని వరూధిని మార్కండేయపురాణమున ప్రవరునితో అనును. ఈదయాప్రధానమగు ఆత్మగుణములు అందరియందును సాధారణముగ నుండతగినవి. అర్జునుని యందు ప్రకృతమున్నదయ ప్రత్యేకమయినది. "పరయా కృపయాఽఽవిష్టః" అని. అందుకే కృపకు "పరా" యను విశేషణము ప్రయుక్తమైనది. ఇట్టి కృప అధర్మ ప్రవృత్తునియందు కలుగు ననుటకు అవకాశము లేదు. అగుచో "విషీదంతం "శోకసంవిగ్నమానసః" మున్నగు పదములు ప్రచురముగ ప్రయోగింపబడి నందున అర్జునునియందు ప్రత్యేకముగ దుఃఖమే కాని, ధర్మము లేదు అని శంకింప రాదు. ఈ విషాదదుఃఖము లున్నంతమాత్రమున అధర్మము, అజ్ఞానము వాని యందున్నదని నిరూపించ ప్రయత్నించినచో ఒక్క అర్జునుడే కాదు, కృష్ణుడును అట్టివాడే యగును.

## కృష్ణునకు శోకదుఃఖములు కలవు.

తాం నిశాం శోకదుఃఖార్తౌ నిశ్శ్వసంతా వి వోరగౌ।
నిద్రాం నైవోపలభతే వాసుదేవధనంజయౌ ॥ (ద్రో. 77-1)
నరనారాయణౌ క్రుద్ధౌ జ్ఞాత్వా దేవా స్సవాసవాః ।
వ్యథితా శ్చింతమాయాసుః కింస్వి దేత ద్భవిష్యతి ॥ (ద్రో. 77-2)

కృష్ణార్జునులే కాక వాసవాదిదేవతలు కూడ వ్యథితులైనా రని చెప్పిన ఈ వాక్యము వలన వారును అజ్ఞానులే అనవలసివచ్చును.

అర్జునుని దుఃఖము అసాధారణము; అది నిజమైన విషాదము. అట్టి యథార్థ విషయమును నివారించుటకై భగవంతుడు పలుమార్లు అతనిని హెచ్చరించవలసి వచ్చెను." అని అందురేమో అట్లనుట తగదు.

హ్రదస్థుడగు దుర్యోధనుని పిలచి ధర్మజుడు "నీవు ఎవ్వరితో నైనను యుద్ధము చేయుము. ఏ ఒక్కరిని నీవు గెలచినను జయము నీదే" యని అనగ అప్పుడు కృష్ణు డలిగి ఇట్లనును; —

ధర్మరాజాపరాధేన భయం నః పున రాగతమ్ ॥ (శ. 59-10)
త దేవ విజయః ప్రాప్తః పునః సంశయితః కృతః ।

అబుద్ధి రేషా మహతీ ధర్మరాజస్య పాండవ ॥ (శ 59-12)
య దేకవిజయే యుద్ధం ఫణితం ఘోర మీదృశమ్ ।
సుయోధనః కృతీ వీర ఏకాయనగత స్తథా ॥ (శ. 59-13)

గదాయుద్ధ దగు దుర్యోధనుని ఎవ్వరును గెలువలేరు. ధర్మరాజా! నీవు కాని, నకులసహదేవులు కాని, అర్జునుడు కాని సుయోధనుని గెలువలేరు.

న త్వం భీమో న నకులః సహదేవోఽథ ఫాల్గునః ।
జేతుం న్యాయేన శక్తో వై కృతీ రాజా సుయోధనః ॥ (శ. 34-12)
స కథం వదసే శత్రూన్ యుద్ధ్యస్వ గద యేతి హి ।
ఏకం చ నో నిహ త్యాజౌ భవ రా జేతి భారత ॥ (శ 34-13)
వృకోదరం సమాసాద్య సంశయో వై జయే హి నః ।
న్యాయతో యుధ్యమానానాం కృతీ హ్యేష మహాబలః ॥ (శ. 34-14)
ఏకం వాస్మా న్నిహత్య త్వం భవ రా జేతి వై పునః ।
నూనం న రాజ్యభాగేషా పాండోః కుంత్యాశ్చ సంతతిః ॥
అత్యంతవనవాసాయ సృష్టా భైక్షాయ వా పునః ।

కుంతీ-పాండురాజుల సంతతిలో రాజ్యమును పొందు భాగ్యములేదు. వనవాసము చేయుచు బిచ్చమెత్తుకొనుటకే వారు సృష్టింప బడిరి. ఇది నిశ్చయము. కృష్ణుని నిందావాక్యములను వినిన భీము డిట్లనును.

మధుసూదన మాకార్షీః విషాదం యదునందన ।
అద్య పారం గమిష్యామి వైరస్య భృశదుర్గమమ్ ॥ (శ. 34-17)
అహం సుయోధనం సంఖ్యే హనిష్యామి న సంశయః ।
విజయో వై ధ్రువః కృష్ణః ధర్మరాజస్య దృశ్యతే ॥ 18
అత్యర్థేన గుణే నేయం గదా గురుతరీ మమ ।
న తథా ధార్తారాష్ట్రస్య మా కార్షీ ర్మాధవ వ్యథామ్ ॥ 19

ఈ శ్లోకములయందు కృష్ణుడు అర్జునుని విషాదము చెందవద్దు, నేను నీ యోగక్షేమములను చూతును. అన్నట్లు,కృష్ణునివిషాదముపొందవద్దు,వ్యథచెందవద్దు అని భీముడు అనును. దీనినిబట్టి కృష్ణుడు కూడ శోక మోహావిష్టచేతస్కుడై నందున అధర్మాజ్ఞానదోషజుష్టుడై భీముని యుపదేశము వలన విశదమనస్కుడాయె ననుట తగునా? కావున సందర్భము ననుసరించి నరనారాయణులు కార్యగౌరవమును, భీభత్సములను, యుద్ధపరిణామములను మనస్సులో నిడుకొని విషణ్ణు లగుచున్నా రని తెలియుచున్నది,

అర్జునుడు కృష్ణునివలెనే జ్ఞాని. భూతభవిష్యద్వర్తమానములను తెలిసినవాడే. ధర్మరాజు ఏ అంశములలో యుద్ధానంతరము దుఃఖించునో వాటిని కొంత ఇటుఅటుగా ఉట్టంకించి వివరించినాడు.

స రాజా పుత్త్రపౌత్త్రాణాం సంబంధి సుహృదాం తథా ।
స్మర న్నుద్విగ్నహృదయో బభూ వోద్విగ్నచేతనః ॥ (శా 6-12)
తత శ్శోకపరీతాత్మా సధూమ ఇవ పావకః ।
నిర్వేద మగమ ద్ధీమా న్రాజా సంతాపపీడితః ॥ (శా 6-13)
యుధిష్ఠిర స్తు ధర్మాత్మా శోకవ్యాకులచేతనః ।
శుశోచ దుఃఖసంతప్తః స్మృత్వా కర్ణం మహారథమ్ ॥ (శా. 7-1)
ఆవిష్టో దుఃఖశోకాభ్యాం నిశ్వసం శ్చ పునఃపునః ।
దృష్ట్వాఽర్జున మువా చేదం వచనం శోకకర్శితం ॥ (శా. 7-2)

ఈశ్లోకములలో ధర్మరాజు శోకించుట ఉద్విగ్నహృదయుడగుట ఉద్విగ్న చేతనుడగుట అతని అజ్ఞానవిలసిత మని అనగలమా? ఇట్లు శోకించుచు ధర్మరాజు అర్జునుని గురించి పలికె ననుటలో ఎంతో మహార్థమున్నది. అర్జునా! నీవు యుద్ధారంభమున ప్రకటించిన యుద్ధవైముఖ్యము ఎంత దూరదృష్టితో కూడినది. అన్న అర్థము. అర్జునుడు అజ్ఞానకృతముగా శోకింపలే దని తెలియును.

## అర్జునుడు దుఃఖమును నటించెను.

పుత్త్ర స్సఖా వా భ్రాతా వా పితా వా యది వా గురుః । (ఆది-140-52)
రిపుస్థానేషు వర్తంతః కర్తవ్యా భూతి మిచ్ఛతా ।
శపథే నా ప్యరిం హన్యా దర్థదానేన వా పునః ॥ (53)
విషేణ మాయయా వాపి నోపేక్షేత కథంచన ।
ఉభౌ చే త్సంశయోపేతౌ శ్రద్ధావాం స్తత్ర వర్ధతే ॥ (54)
గురో ర ప్యవలిప్తస్య కార్యాకార్య మజానతః ।
ఉత్పథం ప్రతిపన్నస్య న్యాయ్యం భవతి శాసనమ్ ॥ (55)
క్రుద్ధోఽ ప్యక్రుద్ధరూపః స్యాత్ స్మితపూర్వాభిభాషణః ।
న చాప్యన్య దపధ్వం చే త్కదాచి త్కోపసంయుతః ॥ (56)
ప్రహరిష్యన్ ప్రియం బ్రూయాత్ ప్రహర న్నపి భారత ।
ప్రహృత్య చ కృపాయీత శోచేత చ రుదేత చ ॥ (57)
ఆశ్వాసయే చ్చాపి పరం సాంత్వధర్మార్థవృత్తిభిః ।
అథాస్య ప్రహరే త్కాలే యదా విచలితే పథి ॥ (58)

ఈ శ్లోకములు కణికుడు ధృతరాష్ట్రునకు చెప్పినవి. ఎవరు ఎవరికి చెప్పిరీ అన్నది కాదు. ఇవి రాజనీతికి సంబంధించిన ముఖ్యసూత్రములు.

న శాతేః స్తంబకరితా వక్తు ర్గుణ మపేక్షతే"

అన్న న్యాయము సరసులు మరువరానిది. కణికుడు చెప్పినాడు. కావున ఈ నీతులు అపఖ్యాతి పొలగుట తగదు. నరుడు ఇట్టి నీతుల నెన్నింటినో ఆకళించుకొని జీర్ణించుకొనినాడు. మహానీతిజ్ఞు డగు కృష్ణుని నెచ్చెలి ఎదుటివారిని లోగొనుటకు ఎన్ని కపటనాటకము లాడవలయునో అన్నియు నాడుటలో కృష్ణుని చెప్పి వెంటనే అర్జునుని చెప్పవలెను.

## కృష్ణుని భేద నీతి.

కృష్ణుడు దూతకృత్యము భంగమైన మరుక్షణమే కర్ణుని ఏకాంతమునకు పిలచి ఆతని జన్మరహస్యము వివరించి,—

"షష్ఠే త్వాం చ తథా కాలే ద్రౌపద్యుపగమిష్యతి ॥" (ఉ. 139-15)

వంతుల ప్రకారము 6 వ వంతులో నిన్ను కూడ ద్రౌపది ఉపగమించు నని చెప్పను. కాని నిజముగ నిది జరుగునా? ఇక్కడ కృష్ణుడు కర్ణుని యందు భేదోపాయమును ప్రయోగించెను. అంతే. అట్టి కృష్ణునితో నొక్క రథములో కూర్చుని, అతని సారథ్యమున నడచిన అర్జునుడు దుఃఖించునా? విషాద మందునా? క్లైబ్యమందునా? ఇది ఒక నాటకము. ఒక నీతి ప్రయోగము. కృష్ణుడు దౌత్యమునరింపబోవునపుడు, రుక్మి తనంతట తానుగ వచ్చి "నీవు కర్ణుని చంపలేకపోయి నచో నాకు చెప్పుము, నేను చంపుదును' అని చెప్పినప్పుడు, దుర్యోధనుడు ఉలూకుని రాయబారిగ పంపినపుడు అర్జునుడు భీష్మద్రోణులను మొదటి ముద్దలుగ కబళింతు నని నొక్కినొక్కి గట్టిగ విస్పష్టముగ చెప్పియున్నాడు. ఎక్కడను అర్జునుడు భీతు డగుట కాని, వారిని పడగొట్టుట యందు వెనుకంజ వేయు భావము కాని ఈషణ్మాత్రముగ నైనను పలుకలేదు. కృష్ణుడుకూడ అర్జునుని ధైర్యస్థైర్య పరాక్రమాతిశయములను సహస్రముఖములుగ ఎలుగెత్తి చాటినాడు. ఇక ధర్మరాజు ఏ మాట అన్నను — పార్థుని గొప్పతనమును కీర్తించుటకు భీష్మాదు లందరు ఆతని బాణాగ్నికి ఆహుతి కాగల రని ప్రకటించుటకు ఉద్దేశింపబడుచూ ఉన్నది. ఇట్టి సందర్భములలో ఎక్కడను ఒక్కసారియైనను సూచనామాత్రముగ నైనను అధైర్యమును, యుద్ధవైముఖ్యమును కాని ప్రకటింపలేదు. అట్టి నరుడు యుద్ధారంభమున ఇట్లు ప్రవర్తించె ననగ "త న్నరస్య నరత్వమ్" అనగ అతని జ్ఞానమునకు, సమయజ్ఞతకు నిదర్శనము, ప్రతిపక్షీయులను తన వశము చేసి

కొనుటకు వేసిన పెద్ద ఎత్తు. తానెవరితో యుద్ధము చేయవలయునో ఆ మహా వీరులను చూడ నెంచి "సేనామధ్యమునకు రథము నడుపు" మని హృషీకేశునితో ననగ అత డట్లు చేసి భీష్మద్రోణాదుల యెనుట రథమును నిలపినాడు. ఇప్పుడు ఉన్నట్లుండి అర్జునునకు పిరికితనము కాని, బంధువధ దూష్య మన్న భావము కాని కలిగిన దనుట అసహజము. ఇంతకు ముందే ధర్మరాజు భీష్మవ్యూఢమైన పర సైన్యమును చూచి విషాదము నందగ ఆ విషాదమును మాన్పి ఆతనిని అర్జునుడు ఉత్సాహ పరచెను. అటువంటి సవ్యసాచి అంతలోనే ఇంత వింతగ మారె ననుటకు కారణము లేదు. అర్జునుని మనోనిశ్చయము, గుండెనిబ్బరము, దాని వెనుక దాగిన రాజనీతి తెలియకపోవుటయే అర్జును డేడ్చెనా దనుటకు మూలము. మన అజ్ఞానమును, మన పిరికితనమును అర్జునుని యందారోపించి ఆనందించుట మాత్రమే ఈ వ్యాఖ్యానఫలము.

దుర్యోధనుడు ఆచార్యుని చేరి స్వపరబలాబలముల నుసమీక్షించి ఒక విధముగ ఆ సంగ్రామారంభమున కొందరిని ఆకట్టుకొనెను. దానికి ప్రతిక్రియ కొంత చేసిన కాని కొందరి మనస్సులు తమ వైపున ఆర్ద్రము కావు అని భావించిన అర్జునుడు ఇరువాగులకు మధ్యగ, ముఖ్యముగ భీష్మద్రోణుల ఎదుటకు రథమును నడపించెను. అక్కడ నిర్యవనికముగ ఒక నాటక మాడెను.

ప్రహరిష్యన్ ప్రియం బ్రూయాత్ ప్రహర న్నపి భారత ।
ప్రహృత్య చ కృపాయీత శోచేత చ రుదేత చ ॥

ఈ నీతిని చక్కగ నటించినాడు.

'కృపయా పరయావిష్టః' 'శోకసంవిగ్నమానసః' 'అశ్రుపూర్ణాకులేక్షణః,' ఇత్యాదిగ విశేషణము లన్నియు వరుసగ "కృపాయీత, శోచేత, రుదేత చ" అన్న వాటికి సరిపోవును. దీని ఫలము యుద్ధమునందు అర్జునుడు బహుముఖముగ పొందెను.

ఈ ప్రసంగమంతయు కణికనీతు లాధారముగ చెప్పబడినది కావున అప్రమాణ మని కొందరు తలంపవచ్చును కాని భీష్ముడు ధర్మజునకు చేసిన నీతిబోధలో కూడ ఈవిషయము గలదు. గమనింపుడు. ధర్మరాజు భీష్ముని ప్రశ్నించును.

జేతాః కాని చ రూపాణి భవంతి భరతర్షభ ।
పృతనాయాః ప్రశస్తాని తాని చేచ్ఛామి వేదితుమ్ ॥ (శా. 102-1)

భీష్ముడు సమాధానము చెప్పుచు ఇ ట్లనును:—

ప్రహరిష్యన్ ప్రియం బ్రూయాత్ ప్రహర న్నపి భారత ।
ప్రహృత్యచ కృపాయీత శోచ న్నివ రుద న్నివ ॥ (శా. 102-34)

ఇది కణికనీతిలోని శ్లోకమునకు ప్రతిరూపమే కదా! కావున యుద్ధనీతి ఎవరు చెప్పినను ఏకరూపమే.

ఇది అర్జునునకు బాగుగా తెలియును. అందువలననే అట్లు విషాదమును నటించెను

## ఎందుల కీ నటన?

అసలీ నాటక మెందుల కాడవలసివచ్చినది? అన్నచో కారణ మిది.

భీష్ముడు, ద్రోణుడు, కృపుడు, అశ్వత్థామ, వీరు ముఖ్యముగ పాండవ పక్షపాతులు.

సభలలోను, ఏకాంతముగాను, దుర్యోధనునితోను ఈభావమును వీరు పలుమార్లు ప్రకటించిరి. ప్రత్యేకముగా అర్జునుని పరాక్రమము నుగ్గడించుచు అతడీశ్వరునకు నజేయు డని ప్రశంసించుచు పుత్రవాత్సల్యమును ప్రకటించుచు అతనిని నొప్పించుటకు ఏ పరిస్థితులలోను తమ వ్యతిరేకతనే చూపిరి. అవునా ఇట్టి పరిస్థితులలో అర్జునుడు ఒక్కసారి కూడ ఒక్కమాట కూడ సూచనాప్రాయముగ నైనను వా రజేయులని గాని. వారిని నొప్పించుట తప్పనిగాని అనలేదు. ఇది అతనికి మనస్సులో నున్న భావము. ఇప్పుడిక్కడ వా రెదుట నుండగ తగినకాలమని తగినసమయమని. నరుడు భావించినాడు. వారియందు తనకును అట్టిభావమే కలదని సూచింపదలచినాడు. అంతమాత్రమే నరుని ఆశయము.

అగుచో గురుబంధువధాదికమునకు అర్జునుడు వెగటు నొందలేదా? లేదు. దుర్యోధనుని చూడగనే కృష్ణార్జును లిర్వురికిని సమముగనే క్రోధరసము పెల్లుబుకుచు నుండును. అతని పక్షమువారు కూడ అతనియట్లే శిక్షింపదగినవారను భావము కృష్ణార్జును లిర్వురును అనేకపర్యాయములు సువ్యక్త మొనరించిరి.

"క్షణక్షణములో జవరాండ్ర చిత్తముల్" అన్నట్లుగ కృష్ణార్జునుల మనస్సులు మారునవి కావు. వారిద్దరును ఒకే హృదయము, రెండు శరీరముల యందు విభక్తమైయున్నట్లున్నవారని చెప్పిన వాక్యమున కెక్కడను లొసుగుబాటు లేదు. ఇరువురు వ్యక్తులు తనలో తాను చర్చించుకొనునప్పుడు ఎంతటి విలువ ఆ చర్చకు కలదో, అంతే ఈ కృష్ణార్జునుల గీతా రూపచర్చకును విలువ. అంతకు మించి ఇందు ఒకరు బోధ, మరియొకడు బోధ్యుడు అన్న భేదభావమును చెప్పుచో కృష్ణార్జునులు నరనారాయణు లన్న పరమసత్యము పరమ సత్యము కాక తప్పదు.

## అర్జునుడు నీతిజ్ఞుడు

అర్జునుడు నీతిప్రయోగకుశలుడు అగుట ఆతడు యుద్ధసందర్భమున కేవల నీతినే ప్రయోగించె ననుట మనము గమనింప వలెనన్నచో కొన్ని ఘట్టములు పరీక్షింప దగి యున్నవి.

సైంధవవధ దినమున కృష్ణానుమతుడై ద్రోణునితో "నీవు అశ్వత్థామతో నన్ను సమానముగ చూచితివి. ఆ ద్రోహిని చంప నేను ప్రతిన పట్టితిని. నా కనుజ్ఞ ఇమ్ము" అనును. గురు డనుమతించును. ఇది మొదటి రోజున ఆడిన నాటకమునకు ఫలమే అగును. ద్రోణుడు రాత్రియందును యుద్ధమును పొడిగించినాడు. ఆ సందర్భమున ఉభయసేనావాహినులు సుక్కుచూ సోలుచూ నిలువలేకపోయినవి. అప్పుడు సమయము కని పెట్టి యుద్ధమును కొంతకాలము నిలుపుమని ఆజ్ఞాపించినాడు. ఆ సందర్భములో స్వపక్షవీరులే కాదు, పరపక్షవీరులు అర్జునుని కృపావిలాసమును వేనోళ్ళ పొగడిరి.

అసత్య మాడి గురువధకు కారణమైన ధర్మరాజును వాలివధఘట్టము రామున కెట్లు శాశ్వతాపకీర్తికరమో నీకును అది అట్లే అని క్రుద్ధుడై పలుకును. అశ్వత్థామ పితృవధజనితామర్షమున సింహగర్జనము చేయగ పాడలిన ధర్మరాజునకు అశ్వత్థామ ప్రతాపాదికమును వివరించుచు ధృష్టద్యుమ్నుని కాపాడుకొను మనును. కాని వెంటనే యుద్ధమునందు అశ్వత్థామ నెదుర్కొని "నీకు గల దుర్యోధనపక్షపాతము, అస్త్రశస్త్రబలము ఎంత గలదో చూపుము, చూతము" అని యుద్ధమున పాలుగొనును ఇదియును ఒక నీతియే. అంతకుమునుపు దుర్యోధనుడు అశ్వత్థామతో ద్రోణవధ వివరించి చెప్పుచూ ధృష్టద్యుమ్నుని దుష్టకృత్యమును వివరించి అర్జునుడు తప్ప తక్కినవారు ఆ విధానమునకు ఆమోదించి రని అశ్వత్థామతో చెప్పును. ఈ ఘట్టమున నేమి తేలును? అర్జును డెక్కడి కక్కడ తనవైపుకు పాపపంకిలము రాకుండ కాపాడుకొనుచున్నా డనుట నిశ్చయము చేయదగును. ఆ దుర్యోధనుడు అట్లు మెచ్చుకొనుట కూడ అర్జునునకు ఆకాంక్షితమే. తదర్థమే అర్జునుడు అన్న ధర్మజునితో వివదించెను. అట్లు కన్పట్టుచునే కృత్యమును విస్మరింపకపోగా మరింత ఉద్ధృతి మొనరించుచుండును. అదే అశ్వత్థామను అంతకు ముందుకన్న పరుషోక్తు లాడుటగ మనము కనుగొనవచ్చును. అర్జును డనిన మాటలు సంజయుడు చెప్పగా వినిన ధృతరాష్ట్రుకు నిర్భ్రాంతబోయి అదిరిపడి "ఏమి అర్జునుడు గురుపుత్త్రు నింత ఘాట అనెనా?" అని ప్రశ్నించెను

శల్యపతనానంతరము కృష్ణుడు గురరిపుదళము మధ్య నున్న దుర్యోధనుని చూపి వీనిని చంపినచో నీకు గల పగ తీరును. కృతకృత్యుడ వగుదువు.

ఏత ద్బల మభూత్ శేషం ధార్తరాష్ట్రస్య మాధవ!
మోక్షో న నూనం కాలా త్తు విద్యతే భువి కస్యచిత్ ॥ (శ. 28-18)
అపనేష్యామి గాంధారం ఘాతయిత్వా శితై శ్శరైః ।
నికృత్యా వై దురాచారో యాని రత్నాని సౌబలః ॥ 22
సభాయా మాహర ద్ద్యూతే పున స్తా న్యాహరా మ్యహమ్ ।
అద్య తా అప్య వేక్ష్యంతి సర్వా నాగపురస్త్రియః ॥ 23
శ్రుత్వా పతీం శ్చ పుత్రాం శ్చ పాండవై ర్నిహతా న్యుధి ।
సమాప్త మద్య వై కర్మ సర్వం కృష్ణ! భవిష్యతి ॥ 24
అద్య దుర్యోధనో దీప్తాం శ్రియం ప్రాణాం శ్చ మోక్ష్యతి । 25

ఈ వాక్యములలో అర్జునునియందు గల నిగూఢమైన భావరత్నములు వెలుగొందును. సౌబలుడు జూదములో ఏ రత్నములను గెలిచెనో వాటిని మరల స్వీకరింతు ననును. ఆతని కోపతీవ్రత ఎంత కలదో "నాగపురస్త్రీలు తమ పతి పుత్రులు పాండవనిహతు లైరని విని వారును పాండవు లెట్టివారో తెలిసికొన గలరు" అన్నమాట వ్యక్తీకరించును దుర్యోధనుడు ప్రదీప్త మగు సిరిని, ప్రాణములను విడచును. అన్న మాటలో అతనికి దుర్యోధనునియందు గల పగ, అర్జునునకు గల రాజ్యరత్నాదిగ్రహణేచ్ఛ వెల్లడి కాగలదు. ఇట్టి మాటలు నిజముగ గురుపుత్రవధాదిక[illegible]నకు దుఃఖించినవాడే అగుచో నరుడు అనగలడా? నరుని కోపము దుర్యోధనాదులయ దే కాక వారల అంతఃపురస్త్రీలయందును కలదు. ఇట్టి అర్జునుడు నిజముగ కృపాయత్తచిత్తుడైనా డనుట తగదు. అట్లు అయి కృష్ణుని చేత బోధింపబడి "కామః క్రోధ స్తథా లోభ స్తస్మా దేత త్త్రయం త్యజేత్" అన్న వాక్యము నిర్విణ్ణహృదయుడై ఉపదిష్టుడే యగుచో ఇట్టిట్టి పలుకులు పలికియే ఉండడు.

దుఃఖము అహంకారమమకారప్రేరితమై తమోగుణప్రధానమై యున్నదా? లేక కామరాగప్రేరితమై రజోగుణవిశిష్టమై యున్నదా? లేక ఏ ధర్మముకొఱకు ప్రయత్నము జరుగుచున్నదో ఆ ధర్మమే నశించిపోవుచున్నదే యని సత్త్వగుణ ప్రధాన మగు విషాదముతో ధర్మహానిని మాత్రమే దృష్టియం దిడుకొని ప్రవర్తించినదా? అని విచారింపవలయును. సత్త్వగుణప్రేరిత మగుచో దుఃఖముకూడ ధర్మమే యగును. కనుక అట్టి దుఃఖముగలవాడు ధర్మనిరతుడు కాడనుటకు వీల్లేదు,

## దుఃఖము కూడ ధర్మ్యమే

దుఃఖము అహంకారమమకారప్రేరితమై తమోగుణప్రధానమై యున్నదా? లేక కామరాగప్రేరితమై రజోగుణవిశిష్టమై యున్నదా? లేక ఏ ధర్మముకొఱకు ప్రయత్నము జరుగుచున్నదో ఆ ధర్మమే నశించుపోవుచున్నదే యని సత్త్వగుణ ప్రధాన మగు విషాదముతో ధర్మహానిని మాత్రమే దృష్టియం దిడుకొని ప్రవర్తించినదా? అని విచారింపవలయును. సత్త్వగుణప్రేరితమగుచో దుఃఖము కూడ ధర్మమే యగును. కనుక అట్టి దుఃఖముగలవాడుధర్మనిరతుడు కాడనుటకు వీలు లేదు.

అర్జునవిషాదయోగములోని 'అర్జున' శబ్దము అతని యందలిసత్త్వగుణమును ప్రధానముగ సూచించు నని పూర్వమే వివరించితిమి. మరియు యుద్ధము ధర్మహానికరమని భావించుటచేతనే యతనకి ధర్మవిషయకవిషాదము కలిగినది. అందువలన అర్జునుని ధర్మనిరతి అసందిగ్ధముగ వెల్లడి యగుచున్నది.

## సామాన్యవిశేషధర్మములు

కాని, కృష్ణుని గీతోపదేశము అర్జునునకు ధర్మము గరపుటకు ఉద్దేశించినది కదా! కృష్ణుడు విశేషధర్మముల నాశ్రయించి తద్ద్వారా ధర్మబోధ గావించెను. అర్జునుడు సామాన్యధర్మములను మాత్రమే విమర్శించుచు విషణ్ణు డయ్యెను. శాస్త్రప్రకారముగ విశేషధర్మము సామాన్యధర్మమును వ్యావృత్త మొనరించును.

"అపవాదై రివోత్సర్గాః కృతవ్యావృత్తయః పరైః" (కు. 2-27) అని కాళిదాసు. కనుక విశేషధర్మ మున్నచో సామాన్యధర్మమును పరిగణింప వీలులేదు. విశేషధర్మమునే పాటింపవలయును. అట్లు పరికించినచో స్వధర్మమగు విశేషధర్మమును ఉజ్జగించి సర్వసామాన్యధర్మమును మాత్రమే పురస్కరించుకొని విషణ్ణు డగుచున్న అర్జునుని ప్రవృత్తి ధర్మప్రవృత్తియే కాదు. కనుక అర్జునుడు ధర్మనిరతుడు కాడు. అతని యందలి దుఃఖము ధర్మరాహిత్యమువలన కలిగినదేఅని చెప్పుదురేమో, అట్లనుటకు అవకాశము లేదు.

సామాన్యధర్మములు పరామర్శించి బంధుమిత్రవధ మున్నగునవి పాపములని అర్జునుడు భావించెను. విశేషధర్మముల నుట్టంకించి ఆతతాయులు, లోకవినాశహేతువులు అగువారు బంధువులైనను, మిత్రులైనను వధార్హులే యని కృష్ణుడు ఉపదేశించెను. కాని అర్జునునకు సంశయచ్ఛేదము కాలేదు.

కథం భీష్మ మహం సంఖ్యే ద్రోణం చ మధుసూదన। (గీ 2-4)

అనుచు పూజార్హు లగు భీష్మద్రోణులను చంపుట ఏ శాస్త్రమును సమ్మతింపదు కదా! యని కృష్ణుని ప్రశ్నించును.

గురో ర ప్యవలిప్తస్య కార్యాకార్య మజానతః ।
ఉత్పథం ప్రతిపన్నస్య కార్యం భవతి శాసనమ్ ॥

అను సూక్తి ననుసరింతు మన్నచో భీష్మద్రోణులు ఆసూక్తి యందలి లక్షణముల కతీతులై యున్నారు. వారు ధర్మపరులు. కార్యాకార్యవిచక్షణులు; సత్పథగాములు. మరియు వారికి అర్జునునిపై ప్రీతి మెండు.

శుశ్రూష మనసూయుం చ బ్రహ్మణ్యం సత్యవాదినమ్ ।
ప్రతియోత్స్యమహే. పార్థ మతో దుఃఖతరం ను కిమ్ ॥ (ఉ. 138-3)
అశ్వత్థామ్ని యథా పుత్త్రే భూయో మమ ధనంజయే ।
బహుమానః పరో రాజన్ సన్నతి శ్చ కపిధ్వజే ॥ (4)
తం చ పుత్త్రా త్ప్రియతమం ప్రతియోత్స్యే ధనంజయమ్ ।
క్షాత్రధర్మ మనుష్ఠాయ ధి గస్తు క్షత్రజీవికామ్ ॥ (5)

అను భీష్మద్రోణవాక్యములలో అర్జునునిపై వారికి గల ప్రీతి తేటతెల్లమగుచున్నది. అట్టి వారిని చంపుట పాపము మూటకట్టుకొనుట కాక మ రింకే మగును? కావున సామాన్యశాస్త్రమువలెనే విశేషశాస్త్రముకూడ అకించిత్కరమే.

## భీష్మద్రోణులును ధర్మపరులు కారు.

కావున భగవంతునియుపదేశప్రయోజనము అర్జునునకు ధర్మముగరపుటకాదు.

యదా యదా హి ధర్మస్య గ్లాని ర్భవతి భారత ।
అభ్యుత్థాన మధర్మస్య తదాఽఽత్మానం సృజా మ్యహం ॥

అని కదా భగవంతుని యనుశాసనము. అనగా గీతాశాస్త్రము నాటికి ధర్మము గ్లాని బొందినది. అర్జునుడు చెప్పిన ధర్మములుగాని, ధర్మపరులుగాని, యథార్థమునకు ధర్మములు కావు. ధర్మపరులు కారు. అవి ధర్మాభాసములు మాత్రమే. అట్లే ధర్మపరులవలె కనబడు భీష్మద్రోణులు సైతము ధర్మపరులు కారు.

అర్థస్య పురుషో దాసో దాస స్త్వర్థో న కస్యచిత్ ।
ఇతి సత్యం మహారాజ బద్ధో స్మ్యర్థేన కౌరవైః ॥ (భీష్మ. 43-35)
అత స్త్వాం క్లీబవ ద్వాక్యం బ్రవీమి కురునందన!

అను భీష్మ వాక్యము అతని ధర్మోపేక్షను, అర్థాపేక్షను వెల్లడించుచున్నది. ద్రోణుడును ఈ వాక్యమునే అనువదించెను. కావున వీరును ధర్మపరులు కారనియు, ధర్మాభాసములవలన ధర్మపరులుగ కనిపించుచుండిరనియు స్పష్టము. ఈధర్మములు, ఈ ధర్మపరులు నశింపకతప్పదు. అప్పుడే యథార్థధర్మము ఉత్థానము నందును,

అట్లు ధర్మోత్థానము గావించుటకే భగవంతుడు భువియం దవతరించును. ఈవిషయమునే విశ్వరూపసందర్శనయోగమున వివరించుచున్నాడు.

భగవంతుని ప్రవృత్తిని అర్జునుడు ప్రశ్నించుచున్నాడు—

ఆఖ్యాహి మే కో భవా నుగ్రరూపో నమోఽస్తు తే దేవవర ప్రసీద ।
విజ్ఞాతు మిచ్ఛామి భవంత మాద్యం న హి ప్రజానామి తవ ప్రవృత్తిమ్ ॥
(11-31)

భగవంతు డాతని కిట్లు సమాధానము చెప్పుచున్నాడు—

కాలోఽస్మి లోకక్షయకృత్ ప్రవృద్ధో లోకా న్సమాహర్తు మిహ ప్రవృత్తః ।
ఋతేఽపి త్వాం న భవిష్యంతి సర్వే యేఽవస్థితాః ప్రత్యనీకేషు యోధాః॥ 11-32
తస్మా త్త్వ ముత్తిష్ఠ యశో లభస్వ జిత్వా శత్రూన్ భుంక్ష్వ రాజ్యం సమృద్ధమ్,
మయై వైతే నిహతాః పూర్వ మేవ నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్ ॥ 33
ద్రోణం చ భీష్మం చ జయద్రథం చ కర్ణం తథాఽ న్యానపి యోధవీరాన్ ।
మయా హతాం స్త్వం జహి మా వ్యథిష్ఠాః యుధ్యస్వ జేతాసి రణే సపత్నాన్॥

"ప్రత్యనీకేషు యోధాః, జిత్వా శత్రూన్" అను పదములతో సామాన్యాకారముగ దుర్యోధనాదులను వధ్యులనుగ తెలిపి, మరల "ద్రోణం చ భీష్మంచ" అను పదములతో భీష్మద్రోణులను కూడ వధ్యవీరులలో పరిగణించి,అర్జునుని "కథం భీష్మ మహం సంఖ్యే ద్రోణం చ మధుసూదన" అను సంశయమును పరాస్తమొనర్చుచున్నాడు. అంతేగాక, నిజముగ భీష్మద్రోణుల వధ దుఃఖకరమే యగుననియు, అయినప్పటికి దుఃఖింపవలదనియు, "మావ్యథిష్ఠాః" అని అనునయించుచున్నాడు. వారందరూ అంతకు పూర్వమే కాలపురుషునిచే నిహతులైనారనియు, యుద్ధమున వారిని చంపుట కేవలము వ్యవహారము మాత్రమే అనియు, అట్టి వ్యవహారమున నిమిత్తమాత్రుడుగా నుండుట తప్ప వేరు కర్తృత్వబాధ్యత అర్జునునకు లేదనియు వివరించుచున్నాడు. మరియు సామాన్యవిశేషవిధులనురెండింటిని ఖండించుటకే భగవంతుడు ఒకే కార్యమును — అందరూ చంపబడినారు — అనుదానిని "మయైవైతే నిహతాః పూర్వ మేవ" యనియు, "మయా హతాన్" అనియు వేర్వేరుగ చెప్పెను. అనగా సామాన్యవిశేషవిధుల నన్నింటిని ధ్వంసము గావించుటయే భగవంతుని కార్యమని తెలియుచున్నది. ఆ విధముగ ఆచరించిన గాని ధర్మమునకభ్యుత్థానము కలుగదు.

క్షేత్రము బలహీన మైనపుడు ఆ క్షేత్రములో అప్పటి కున్న పంటలను అట్లే పడగొట్టి దానిని దున్ని మరల పారవత్తరము చేయుదురు. కృషికర్మ తెలి

యనివారు 'అయ్యో! పంటను పాడు చేయుచున్నారే' అని విచారింపవచ్చును పం
లను పండించు విధము తెలిసిన కర్షకుడు కాని, తత్త్వము నెరిగిన వివేకి గ
అట్లనుకొనడు.

"శాపోఽప్యదృష్టతనయాననపద్మశోభే
సానుగ్రహో భగవతా మయి పాతితోఽయమ్ ।
కృష్యాం దహ న్నపి ఖలు క్షితి మింధనేద్ధః
బీజప్రరోహజననీం దహనః కరోతి॥" అను దశరథుని వాక్యములో

భావము స్పష్టమై యున్నది.

## సర్వధర్మపరిత్యాగము.

అందువలన కృష్ణుని యుపదేశసారము సర్వధర్మధ్వంసమే. కావున
"సర్వధర్మా న్పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ। అహం త్వా సర్వపాపేభ్
మోక్షయిష్యామి మా శుచః ॥" (గీ.,18-6

అని చెప్పెను. సర్వధర్మపరిత్యాగము సర్వధర్మధ్వంసమునకే అనగా స
ధర్మాభాసధ్వంసమునకే మరియొక పేరు. సర్వధర్మాన్ అనగ సామాన్య, విశే
రూపములగు వైయ్యక్తికముగ, సాముహికముగ దేశకాలాదిభేదములచేతను వి
రీతులలో నున్న ధర్మములు. ఆ ధర్మములన్నియు అర్జునునకు త్యాజ్యములే య
కృష్ణుని ప్రబోధము. 11వ అధ్యాయము 32, 33, 34 శ్లోకములలోని బహువ
పదములు- యోధాః, లోకాన్, శత్రూన్, యోధవీరాన్, సపత్నాన్- ఇ
అన్నియు ధర్మాన్ అను శబ్దమునందు సంగ్రహింపబడినవి.

ధర్మోద్ధరణకే యవతరించిన కృష్ణుడు సామాన్యవిశేషరూపముల
ధర్మము లన్నింటిని ధ్వంసము గావించుటకే ప్రవర్తించె ననియు, గీతోపదేశ
తదర్థకమే యనియు చెప్పుట అసమంజసము అందురేమో మందబుద్ధులు.

## కృష్ణుని ఉపదేశ సారమిది.

ధర్మ మనునది ఆచరించువారి శక్తిసామర్థ్యములను అనుసరించి, దృఢని
హము ననుసరించి నిలచును. ఇప్పటివరకు నున్నవా రందరుకూడ ధర్మమునకు
ద్ధముగనే నడచుకొనుచున్నారు. మొత్తము క్రిందినుండి పైదాక ఉత్తమమధ్యమాధ
వర్గములవా రందరు కూడ ధర్మరహితులు, అధర్మగ్రస్తులై యున్నారు. కన
అహంకారప్రేరితమైన కామక్రోధసమన్వితమైన ఈ జనసందోహ మంతం
వచ్చిననే గాని ధర్మ మనునది మరల నిలువదు. అట్టి స్థితిలోనే భగవంతుడు జని
చును.

స్వల్ప మ ప్యస్య ధర్మస్య త్రాయతే మహతో భయాత్ ।  (గీ. 2-40)

అన్న రీతిగా నేకొద్ది ధర్మము నాచరించు పరిస్థితు లీ భూలోకములో నున్నను భగవంతుని యవతారమునకు ప్రసక్తి కలుగదు.

"అల్పో హ్యేష జాతో మహాన్ భవతి" ఎండుకట్టెలలో పడిన నిప్పు కణికయు ప్రజ్వలించి యొప్పు నట్లు ఎచ్చటనో ఒక చోట అణుమాత్రముగ నిల చిన ధర్మము కూడ మహాకారమునొంది వరలి తరలనే తరలును. అట్టిదికూడ ఎక్కడను లేనేలేదు. ఈ ధర్మము పూర్తిగా నశించి అధర్మము పూర్తిగానెలకొన్న ఈ పరిస్థితులలో ఈ లోకములో భగవంతుడు కృష్ణస్వరూపమున జన్మించెను. ఎవరిలోనో ఏకొద్దిగానో ధర్మ మున్న ట్లున్నదే యని యనుకొనరాదు. అందరి యందున్న ధర్మములు ధర్మాభాసములే. "ధర్మ" శబ్దముచేనున్నవి పలురకములగు అధర్మములే. అందుచేత ఎల్లరియందున్న ధర్మాభాసములను పరిత్యజింపు మనియే. "సర్వధర్మాన్పరిత్యజ్య" అనువాక్యముద్వారా చేసిన ఉపదేశసారము. ఇంకొకవిషయము- "యదాయదా హి ధర్మస్య" అని చెప్పినప్పుడు "ధర్మ" శబ్దము ఏకవచనముననే గ్రహింపబడినది. ధర్మము నెలకొనియున్నచో సర్వత్ర ఏకస్వ రూపముగనే భాసించును.

అది బహువిధత్వమును పొందినది. దాని నందరు అన్నిరకములుగ నున్నట్లు భావించుచున్నారు. అది ధర్మము కాదు, తదాభాసమే అనిచెప్పుటకే "సర్వ ధర్మాన్" అని బహువచనము వాడబడినది. పరమాత్మ యెక్కడ నున్నను అద్వి తీయము, ఏకమే యై యున్నట్లు పరమాత్మాభిన్నమైన ధర్మము కూడ అద్వితీయ మై ఏకమై యుండును. నానావిధములుగ ఉండదు. "తస్మా ద్ధర్మం పరమం వదన్తి" అన్న వేదవాక్యము కూడ ధర్మము అద్వితీయ మనియే చెప్పుచున్నది. "తాని ధర్మాణి ప్రథమా న్యాసన్" అను వచనమునందు "ధర్మాణి" బహువచ నము కర్మపరము. కనుక అర్జునుడు ఏది ధర్మ మనుకొనునో అదంతయు విషాద ముగ భావింపదగియున్నది. అర్జునుడు ధర్మబుద్ధికలవాడు కదా! కాదన చెల్లదు. అంతవరకు లోకవ్యవహృతమైన పండితపామరజనప్రచారములో సామాన్యవిశేష రూపముగ నున్న ధర్మస్వరూపము నంతటిని యెఱిగినవాడే. కాని నిజమునకు అవి అన్నియు ధర్మాభాసములే యనియు, ధర్మాభాసములే ధర్మములుగ చెల్లుచూ లోకో పద్రవకరములు అగుచున్న వని అత డెరుగడు. అట్లు ధర్మాభాసములు ధర్మము నాక్రమించి, మించుసందర్భములోనే భగవంతుడు స్వాంశమును నిమిత్తమాత్ర ముగ ముం దిడుకొని కార్యోన్ముఖుడై దుష్టశిక్షణా, శిష్టరక్షణాకార్యములను నిర్వ

హించి, ధర్మప్రతిష్ఠను గావించును. అట్టి జన్మల నన్నింటిని భగవత్స్వరూపుడగు శ్రీకృష్ణుడు జ్ఞాపకముంచుకొనెను. నిమిత్తమాత్రులగు వివస్వంతుడు మున్నగు వారు విస్మరించుచుండిరి. అట్లే ప్రస్తుతనిమిత్తమాత్రుడగు అర్జునుడును విస్మరించగా దాని నాతనికి జ్ఞప్తికి తెచ్చుటయే భగవంతుని ఆశయమని "బహూనాం జన్మనా మంతే" అను శ్లోకము వలన తెలియవలయును. ఇంకను వివరము కోరినచో "ఇమం వివస్వతే యోగం" అను శ్లోకములో భగవంతుని వలన యోగోపదేశమును పొందిన వివస్వంతుడు–మనువు–ఇక్ష్వాకువుల పరంపర ప్రకృతనిమిత్తమాత్రమగు భగవదంశమైన అర్జునాత్మకమే తప్ప వేరుకాదు అని చెప్పవలెను. ఆ యా జన్మలలో భగవంతునినుండి యోగసారమును గ్రహించుచు, కార్యాంతమున మరచి పోవుచు, ప్రస్తుతము అర్జునరూపి యైన నిమిత్తాంశము మరల భగవదుపదేశకాంక్షియై మోహము పొందిన విధమున భాసించుచున్నది.

"ధర్మోద్ధరణము చేయుచుండగా ఆనుషంగికముగ భూభారహరణము జరుగుచున్నది. కనుక యుద్ధము చేయుమని అర్జునునకు ఉపదేశించుట కూడ ప్రధానబోధ కాదు–" అని చెప్పువారి వాదము సరి కాదు. ఎందు కనగా భూమి గోరూపమును ధరించి తా నీ భారమును మోయలేకున్నట్లు చెప్పగా భూభారహరణమునకు అవతార మెత్తినాడు భగవంతుడు భూమికి బరువు ఎక్కువమంది జనులుండుట వలన కానే కాదు. అందరు అధర్మపరులైనప్పుడే బరువగును. ఇందులో ఏ ఒక్కడు ధర్మపరుడైనను భూమాత బరువుగా భావింపనే భావింపదు. ఏ ఒక్కడు ధర్మపరుడుగా కనబడనందున వీ రందరిని నశింపజేయుటకే భూమి భగవంతుని ప్రార్థించినది. తదర్థమే భగవంతుని యవతారము. అహంకార మమకార విశిష్టమైనట్టి ధర్మ మాచరించుచున్నా మనుకొనుచున్నట్టివారు, ధర్మ మనేకరీతులుగా వ్యాఖ్యానించి అధర్మమునే ధర్మముగా వ్యాఖ్యానించుచున్నట్టివారును సకలజనులు నశింపవలసినదే. అందుకే సమస్తవీరపురుషవినాశకరమైన యుద్ధము సంభవించినది. తన్నిర్వహణార్థము భగవంతుడు పూనుకొనినాడు. అధర్మప్రవర్తకులైనవారివినాశము జరిగినచో స్వతఃప్రకాశమానమైన ధర్మము మబ్బులు తొలగిన నభోమణి వలె తేజరిల్లును. ధర్మసంస్థాపనము అనెడి భగవదవతారప్రయోజనము సుసంపన్న మగును.

అధర్మపరులను నాశనము చేయుట కర్తవ్యము.

అందుచేత ధర్మసంస్థాపనము గాదు ఇప్పుడు చేయవలసినది. ధర్మహానికి కారణభూతులైన అధర్మప్రవర్తకులను తొలగించుటయే ప్రస్తుతకర్తవ్యము. అది

క్షత్రియోచితమైన యుద్ధమునందు స్వాంశభూతుడగు నరుని ద్వారమున చేయింప నెంచెను. భగవంతుడు అనగా జ్ఞానస్వరూపుడే. కనుక భగవంతుడు మరువలేదు.

"పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్ ।
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే ।"

ఈ శ్లోకమును ఇట్లు వ్యాఖ్యానింపవలెను:—ధర్మసంస్థాపనాప్రయోజనము సిద్ధించుటకై దుష్కృతవినాశము సాధుపరిత్రాణము భగవత్కృత్యములు. దుష్కృతవినాశ, సాధు పరిత్రాణములు ప్రధానప్రయోజనములు. ఇది జరిగిన మరుగున పడిన ధర్మము ప్రకాశించును. కావున యుద్ధమే ముఖ్య కర్తవ్యము. అధర్మముల నాశ్రయించినవారిని మత్తిల్లజేసిన భీష్మాదులతో దుర్యోధనాదులవినాశము, సాధువులగు పాండవుల పరిత్రాణము చేయుటకు యుద్ధకర్మ ప్రధానము.

"మమ ప్రాణా హి పాండవాః" కావున పాండవపరిత్రాణము ఆత్మపరిత్రాణమే యగును. "నాత్మాన మవసాదయేత్" అని భగవంతుడు ఆచరణపూర్వకముగా ఉపదేశించెను.

"అపరం భవతో జన్మ పరం జన్మ వివస్వతః ।
కథ మేత ద్విజానీయాం త్వ మాదౌ ప్రోక్తవా నితి ॥ (గీ. 4-4)

అను అర్జునప్రశ్నమునకు—

"బహూని మే వ్యతీతాని జన్మాని తవ చార్జున ।
తా న్యహం వేద సర్వాణి న త్వం వేత్థ పరంతప ॥" (గీ-4-5)

అని భగవంతుడు చెప్పిన సమాధానము అర్జుననికి కృష్ణునికి జరిగిన జన్మ పరంపరలను గూర్చికాక, ఈసృష్టిస్థితిప్రళయముల యొక్క స్వరూపమును చెప్పుట యనియే తాత్పర్యముగ గ్రహింపవలయును.

అయితే ధర్మమునకు ఏ కొద్ది యాధారముగనో ఉన్న ఈ సకల వీరమహా పురుషులను నాశన మొనరించినచో ఆ కొద్దిపాటి ధర్మము ఉండదు కదా! అని ప్రశ్నింపజనను. ఈ విధమైన ప్రశ్న అల్పజ్ఞులకు కలుగునదే. ధర్మస్వరూపుడైన శ్రీకృష్ణుడుండగ ధర్మ మెక్కడికి పోవును. "ఈ భూతప్రపంచము నంతను కల్పాదియందు సృజించుచున్నాను. కల్పక్షయము కాగానే సంహరించుచున్నాను." అని చెప్పిన భగవంతుని వాక్యమునందు గురి ఉన్నచో భగవద్విలాసములో ఇది అణుమాత్రనిర్వహణమే అని వ్యక్తమగును. అందువలన ప్రకృతము ఎక్కడను

ధర్మమునకు తావు లేదు. అధర్మమునకే సంపూర్ణమగు నెలవై వీరపురుషుల మని విఱ్ఱవీగుచు ధర్మపరుల మని డబ్బాలు వాయించుకొనుచున్నవారందరిని కడ తేర్చుటయే భగవంతుని యవతారప్రయోజనము.

అర్జునునకు విషాదము అప్పటికప్పుడే కల్గినది కాదు.

ఆసలు అర్జునునకు విషాదము ఇప్పటి కిప్పుడే పుట్టినదా! పూర్వము నుండియే అతని మనస్సులో దాగియున్నదై అవకాశము వచ్చినప్పుడు ప్రబుద్ధమైనదా! అని కొంత యోచింపవలయును. ఏదియును హఠాత్తుగా ఆవిర్భవింపదు. దానివెనుక ఎంతో గ్రంథము జరుగును అట్లే అర్జునుని వైరాగ్యస్థితికి స్వజన హత్యలో పాపానుదర్శనమునకు వెనుక ఎంతో కారణ మున్నది.

"కార్పణ్యదోషోపహతస్వభావః ।
పృచ్ఛామి త్వాం ధర్మసమ్మూఢచేతాః ॥"

అనుచోట పూర్వరంగము గోచరించును. "ధర్మసమ్మూఢచేతాః" అని అను కొనును. ధర్మమునందు అర్జునునికి మూఢచేతస్త్వము గాక సమ్మూఢచేతస్త్వము ఎందు కేర్పడవలయును. అని అలోచించినచో ఇదియును ఇప్పటి కిప్పుడు కలిగినది కాదు. అనగా ఈ యుద్ధమునందు వచ్చి నిలచుటకు ముందే అర్జునునిలో ధర్మ సమ్మూఢచేతస్త్వము, త దాధారముగ కార్పణ్యదోషోపహతస్వభావముకలిగిన దని మన మూహింపనగును.

అథ వ్యవస్థితాన్దృష్ట్వా ధార్తరాష్ట్రా న్కపిధ్వజః ।
ప్రవృత్తే శస్త్రసంపాతే ధను రుద్యమ్య పాండవః ॥ (గీత-1-20)
హృషీకేశం తదా వాక్యం ఇద మాహ మహీపతే ।
సేనయో రుభయో ర్మధ్యే రథం స్థాపయ మే ఽచ్యుత ॥ (గీ-1-21)
యావ దేతా న్నిరీక్షేఽహం యోద్ధుకామా నవస్థితాన్ ॥
కై ర్మయా సహ యోద్ధవ్య మస్మిన్ రణసముద్యమే ॥ (గీ-1-22)
యోత్స్యమానా నవేక్షేఽహం య ఏతేఽత్ర సమాగతాః ।
ధార్తరాష్ట్రస్య దుర్బుద్ధే ర్యుద్ధే ప్రియచికీర్షవః ॥ (గీ-1-23)

ఈ వాక్యములకు అందరును వాచ్యార్థమునే గ్రహించుచున్నారు. కాని భావార్థమును గ్రహించుట లేదు. ఈ వాక్యములను పర్యాలోచింపగా అర్జునుడు యుద్ధోత్సాహము కలవాడుగా పైకి అగపడుచున్నను యుద్ధోన్ముఖుడుగా లేడని తోచును.

శస్త్రసంపాతము ప్రవృత్తము కాగా ధను వెత్తి హృషీకేశునితో "రెండు సేనల మధ్యనా రథము నిలుపుము. వచ్చిన వారందరిని చూడ గలుగు చోటు ఏదో అక్కడ నా రథ ముంచుము" అన్నాడు. ఇచ్చట యావత్ శబ్దము నందు ఒక స్వారస్యము గలదు. మన మెంత కాలము ఇరుసేనల నడుమ ఉండ వలసి వచ్చునో అంతదనుక ఉండుటకు వీలగునట్లును, అందరిని వీక్షించుటకు వీలగు నట్లును. ఒక ప్రదేశమున ఉంచుము అని వ్యాఖ్యానించినచో అర్జునుని మనస్సులో యుద్ధభూమికి వచ్చుటకు ముందు అనేక సంశయములు ఘూర్ణమానము లగుచున్న వనియు, వాని నివృత్తి చేసుకొనుటకే అతడు సర్వసంశయచ్ఛేత్త యగు కృష్ణుని రథస్థాపనవ్యాజమున అడిగె ననియు, తెలిసికొనవలయును. కృష్ణుడును అర్జునుని మనోగతమును అవగాహన చేసికొనినవాడై భీష్మద్రోణుల ఎదుట రథమును ఉంచెను వారే కదా ఇరువాగుల యుక్తతరులు. ఎవరితో తాను యుద్ధము చేయ వలయునో చూడవలయును. తనతో యుద్ధము చేయుటకు యోగ్యత కలిగినవారు ఎవరును లేరనే యిందు తాత్పర్యము. ఎందువలన అనగా: ఇంతకు ముందే ఈ యోధు లందరు ఎప్పుడో,ఒకప్పుడు తన ఎదుట పడి ఓడి పలాయనము చిత్తగించిన వారే ఇంక నిలిచి యుద్ధము చేయదగినవారు ఇద్దరే ఇద్దరు.

ఒకడు భీష్ముడు; రెండవవాడు ద్రోణుడు. ప్రస్తుతయుద్ధములో ప్రధాన లక్ష్యము వీరు కాదు గదా! కనుక వీరితో యుద్ధము చేయు ప్రసక్తే లేదు. యుద్ధము దుర్యోధనుని తోనే చేయవలె దుర్యోధను డొక్కడేనా? తక్కిన వారం దరును ఏమైనారని ప్రశ్న కలుగకుండుటకై "ధార్తరాష్ట్రస్య దుర్బుద్ధేః" అని ఏకవచనము. దుశ్శాసనాదులు కూడ ఈతని దృష్టికి ఆనలేదు. ఒక్క దుర్యోధ నుడే మనసులో మెదిలినాడు వానికి ఈ వచ్చిన వారందరును హితైషులు కారు. ప్రియచికీర్షులు ప్రియము హితము అని రెండు గలవు. ప్రియ మనగా తాత్కాలికానందము. హిత మనగా శాశ్వతానందము. వీరు శాశ్వతానందము నిచ్చు వారు కారు. నశ్వరమైన తాత్కాలికమైన ప్రియమును చేకూర్చువారు దుర్యోధ నుని దుష్బుద్ధి కారణముగ కొందరు వచ్చిరి. కొందరు దుష్టబుద్ధి యగు దుర్యోధనుని దృష్టిలో పెట్టుకొని రాలేదు. ధృతరాష్ట్రుని పుత్త్రుడని వారు వచ్చిరి.

దుర్బుద్ధి - ధార్తరాష్ట్రుడు.

దుర్యోధనుని పేర్కొనుచు అర్జునుడు ధార్తరాష్ట్రు డనిచెప్పి ఆతనికి విశే షణముగా దుర్బుద్ధి యని విశేషణ మిచ్చెను. ఇచ్చట పెద్దలు;- జ్ఞానమున శిశువుల్లు,

ప్రతిభలో అల్పులు, సమయసందర్భములను గుర్తించుటలో మందప్రజ్ఞులు అ విమర్శకులు ఇట్లనుచున్నారు. దుర్యోధనునిలో ధృతరాష్ట్రుని అంధత్వము ప్ర శించినది. కనుక ధార్తరాష్ట్రశబ్దముచే వీడును గ్రుడ్డివాడే. అయితే దుర్యోధనుడు ఘున్న కబోది అని చెప్పి అంతటితో ఆగక దుర్బుద్ధి యని విశేషణముగూడ వా నాడు. కనుక దుర్యోధనుడు ధృతరాష్ట్రజనితు డగుటవలన అతని గ్రుడ్డితనమ దుర్యోధనునిలో వచ్చిన దనియు, అతనిలోని దుర్బుద్ధికూడ ఈతనిలో వచ్చిన ద యను అజ్ఞానవిలసితము లగు వ్యాఖ్యలు వెలయించుచున్నారు. తత్త్వ మిది కాదు అర్జునుడు దుర్యోధనుని, తదనుజులను నామ ముచ్చరించి పేర్కొనక "ధా ర్తరాష్ట్రస్య" "ధార్తరాష్ట్రాన్" "ధార్తరాష్ట్రాః" అని పేర్కొనుట అర్జునుని దృష్టిలో భావ మేమో సహృదయులు గమనింపదగియున్నది. పుణ్యనామసంకీర్తనముః పుణ్యము, పాపనామసంకీర్తనమువలన పాపము సంభవించును. అన్న పరమార్థము తెలిసిన అర్జునుడు దుర్యోధనుని పేరు ఉచ్చరింపలేదు. తప్పనిసరిగా గ్రహింపవలసి వచ్చినది కనుక ధృతరాష్ట్రస్మరణపూర్వకముగా వానిని పేర్కొనుచున్నాడు. అందుకే "ధార్తరాష్ట్రస్య" అని పేర్కొనుట యుక్తముగా నున్నది. ఎందుక కిట్లు అర్జునుడు దుర్యోధనుని,దుర్యోధనాదులను పేర్కొనలేదు? అనగా అర్జునునకు దుర్యోధనునిపై గల పగ అంతటిది.

కృష్ణునితో యుద్ధసందర్భమున మొదటిసారిగా చెప్పుచుండుటవలన అర్జును నకే గాక, కృష్ణునకును దుర్యోధనునియందే విరోధభావము మెండుగా నున్న దనియు తెలియుచున్నది.

అర్జునునకును, కృష్ణునకును దుర్యోధనునిపైగల విరోధభావము
భారతములో స్పష్టముగ వివరింపబడినది.

ఆత్రి క్రోధవిషం పార్థ! విముంచ చిరసంభృతమ్ ।
ఏష మూల మనర్థానాం పాండవానాం మహారథః ॥ (ద్రో. 102-5)
సోఽయం ప్రాప్త స్త్వాక్షేపే పశ్య సాఫల్య మాత్మనః ।
కథం హి రాజా రాజ్యార్థీ త్వయా గచ్ఛేత సంయుగమ్ ॥ 6
దిష్ట్యా త్విదానీం సంప్రాప్త ఏష తే బాణగోచరమ్ ।
యథాయం జీవితం జహ్యాత్ తథా కురు ధనంజయ ॥ 7
ఐశ్వర్యమదసమ్మూఢో నైష దుఃఖ ముపేయివాన్ ।
న చ తే సంయుగే వీర్యం జానాతి పురుషర్షభ ॥ 8

త్వాం హి లోకా స్త్రియః పార్థ! ససురాసురమానుషాః ।
నోత్సహంతే రణే జేతుం కిము త్వైక స్సుయోధనః ॥ 9

దుర్యోధనుడు ద్రోణునివలన కవచధారణవిద్యను గ్రహించి, కవచధారియై అర్జునునితో తలపడెను. ఆసమయమున నిరంతరపాండవద్వేషి యగు అతనిని చంపినచో ఆత్మసాఫల్యము గలుగు నని కృష్ణుడు పార్థునితో చెప్పెను. "చిర సంభృత మగు క్రోధవిషమును, మీకు కలిగిన సర్వానర్థములకు మూల మైన దుర్యోధనునిపై విడువుము.

తతః ప్రియాత్ త్వరన్ పార్థో దీర్ఘకాలం సుసంవృతమ్ ।
ముంచన్ క్రోధవిషం తీక్ష్ణం ప్రస్థరాధిపతిం ప్రతి ॥ (శ. 28-43)

శల్యపతనానంతరము కృష్ణు డర్జునునితో ని ట్లనెను—"నీశత్రువు లందరు నించుమించు నిహతు లైనారు. దుర్యోధనుని విడచిన కృతవర్మకృపాశ్వత్థామలు ముగ్గురు మహారథులు మాత్రమే మిగిలిరి. దుర్యోధనుడు రాజమధ్యమున నిలచి యున్నాడు. వీనిని చంపినచో కృతకృత్యుడ వగుదువు. కావున సుయోధనుని చంపుము.

దుర్యోధన మభిత్యజ్య త్రయ ఏవ వ్యవస్థితాః ।
కృప శ్చ కృతవర్మా చ ద్రౌణి శ్చైవ మహారథః ॥ (శ. 28-5)
అసౌ దుర్యోధనః పార్థ! వాజిమధ్యే వ్యవస్థితః ।
ఛత్రేణ ధ్రియమాణేన ప్రేక్షమాణో ముహుర్ముహుః ॥ 7
ప్రతివ్యూహ్య బలం సర్వం రణమధ్యే వ్యవస్థితః ।
ఏనం హత్వా శితై ర్బాణైః కృతకృత్యో భవిష్యసి ॥ 8
గజానీకం హతం దృష్ట్వా త్వాం చ ప్రాప్త మరిందమమ్ ।
యావ న్న విద్రవం త్యేతే తావ జ్జహి సుయోధనమ్ ॥ 9

దుర్యోధనుని చూచినంతనే కృష్ణార్జునులకు క్రోధవిషము పెల్లుబుకు చున్నది. అని దీనివలన తెలియును. కృష్ణు డిట్లు చెప్పగ "ధృతరాష్ట్రసుతు లందరు భీమనిహతులైరి. భీష్ముడు, ద్రోణుడు, కర్ణుడు, మద్రపతి, జయద్రథుడు కూడ నిహతులైరి. అశ్వత్థామ, కృపుడు, త్రిగర్తాధిపతి, ఉలూకుడు, శకుని, కృతవర్మ వీరు మాత్రమే మిగిలిరి" అని అర్జును డనును.

ఏత ద్బల మభూత్ శేషం ధార్తరాష్ట్రస్య మాధవ!
మోక్షో న నూనం కాలా త్తు విద్యతే భువి కస్యచిత్ ॥ (శ. 28-18)

అపనేష్యామి గాంధారం ఘాతయిత్వా శితైః శరైః ।
నికృత్యా వై దురాచారో యాని రత్నాని సౌబలః ॥ 22
సభాయా మాహర ద్ద్యూతే పున స్తా నాహరా మ్యహమ్ ।
అద్య తా అపి వేత్స్యంతి సర్వా నాగపురస్త్రియః ॥ 23
శ్రుత్వా పతీం శ్చ పుత్రాంశ్చ పాండవై ర్నిహతా న్యుధి ।
సమాప్త మద్య వై కర్మ సర్వం కృష్ణ భవిష్యతి ॥ 24
అద్య దుర్యోధనో దీప్తాం శ్రియం ప్రాణాం శ్చ మోక్ష్యతి । 25

అర్జును డిట్లు చెప్పగ కృష్ణుడు దుర్యోధనబలమువైపు రథము తోలెను. భీమార్జునసహదేవులు ముప్వురు దుర్యోధనుని చంపుటకు వెడలిరి. మధ్యలో సౌబలు డడ్డుపడెను. అర్జునుడు త్రిగర్తుల మీదకు పోయి సత్యకర్మను చంపెను. సుశర్మతో యుద్ధము చేసెను ప్రస్థరాధిపతిపైకి పోయెను.

అ ప్రస్థరాధిపతిపై దీర్ఘకాలసుసంవృత మగు తీక్ష్ణ మగు క్రోధవిషమును విడచెను.

ప్రకరణమును బట్టి కృష్ణార్జునుల సంభాషణవిషయము, అర్జునుడు భీమ సహదేవులతో కలసి యుద్ధము చేయబోవుట, సుయోధనుని దృష్టియందుంచుకొనియే జరిగినది. కాని మధ్యలో సౌబలు డడ్డుపడుటవలన అర్జునుడు త్రిగర్తులమీదకు పోవ లసివచ్చెను. దీర్ఘకాలసుసంవృతమును, దీక్ష్ణమును అగు క్రోధవిషమును దుర్యోధ నునిపై విడచుటయే అర్జునుని ఆశయము. అందువలననే 'ముంచన్' అని శతృ ప్రత్యయము నుపయోగించెను. నిజమునకు దుర్యోధనునిమీద వదలబోవు నీ క్రోధవిషము సత్యకర్మాదులమీదకు మళ్ళినది.

ఇంతకు చెప్పవచ్చిన దేమనగ కృష్ణార్జును లిర్వురును ప్రతిపక్షములోని వీరు లందరికంటె దుర్యోధనుని యందే క్రోధదీప్తులుగ నున్నా రనియు. అతని గాంచినంతనే ఆ క్రోధము విషమై వెలువడుచుండెననియు గ్రహింపవలయును.

సైంధవవధానంతరము కృపాశ్వత్థామలు అర్జును నెదుర్కొనిరి. వారిరు వురిచే పీడితుడైన నడుడు పరమార్తిని పొందియు గురువు-గురుపుత్రుడును వధింప తగినవారు కారు అని మృదువుగనే బాణములను ప్రయోగించెను.

అజిఘాంసు ర్గురుం సంఖ్యే గురో స్తనయ మేవ చ ।
చకా రాత్రీ వ్యకం తత్ర కుంతీపుత్రో ధనంజయః ॥ (ద్రో. 148-8)
అస్త్రై రస్త్రాణి సంవార్య ద్రౌణే శ్శారద్వతస్య చ ।
మందవేగా నిషూం స్తాభ్యా మజిఘాంసు రవాసృజత్ । (ద్రో. 147-7)

అథ శారద్వతో రాజ న్కౌంతేయశరపీడితః ।
అవాసీద ద్రథోపస్థే మూర్ఛా మభిజగామ హ ॥ (ద్రో. 147-9)
దృష్ట్వా శారద్వతం పార్థో మూర్ఛితం శరపీడితమ్ ।
రథ ఏవ మహేష్వాసః కృపణం పర్యదేవయత్ ॥ (ద్రో. 147-12)
అశ్రుపూర్ణముఖో దీనో వచనం చేద మబ్రవీత్ ।
పశ్య న్నిమం మహాప్రాజ్ఞం క్షత్తా రాజాన ముక్తవాన్ ॥ (ద్రో. 147-13)
కులాంతకరణే పాపే జాతమాత్రే సుయోధనే ।
నీయతాం పరలోకాయ సా ధ్వయం కులపాంసనః ॥ (ద్రో. 147-14)
అస్మా ద్ధి కురుముఖ్యానాం మహ దుత్పత్స్యతే భయమ్ ।
త దిదం సమనుప్రాప్తం వచనం సత్యవాదినః ॥ (ద్రో. 147-15)
శతస్కృతే హ్యద్య పశ్యామి శరతల్పగతం గురుమ్ ।
ధి గస్తు క్షాత్ర మాచారం ధి గస్తు బలపౌరుషం ॥ (ద్రో. 147-16)

ఇక్కడ గమనింపదగు భావము : దుర్యోధనుని చంపి యుంటినచో ఈఅనర్థము రాదుకదా ? విదురుడుదుర్యోధనుడుజన్మించినతక్షణమే, "దుర్యోధనునిచంపు" మని ధృతరాష్ట్రునితో అనును. అట్లు జన్మింపగనే చంపి యుండవలసినది. అన్నభావమే అర్జునుని వచనములో కన్పట్టుచున్నది. దుర్యోధనునిమీద అర్జునునకు ఎంత పగ ఉన్నదో కదా! అర్జునుడు, 'ధార్తరాష్ట్రస్య దుర్బుద్ధేః' అని అనుటకూడ తనకు ఆతనియందే శత్రుత్వము కల దని తక్కినవారియందు లే దని చెప్పుటకు ఉద్దేశించినది. ఇది ఒక్కటేకాక మొత్తము ప్రసంగ మంతయు ఈవిషయమునే వెల్లడించు నని స్పష్టము. ఆ ఒక్క దుర్యోధనునికొరకు ఇంతమందిని చంపవలయునా అని అర్జునుడు విషాదమును ప్రకటించెను.

దుర్యోధనునియందు పగ భీమునికి గలదు. అని ప్రసిద్ధి. కాని భారతము ఆద్యంతములు వరుసక్రమములో చూచినప్పుడు దుర్యోధనునియందు భీముని కున్న పగకన్న అర్జునునకు కృష్ణునకుగల పగ పెద్దది. అర్జునునకు దుర్యోధనునియెడ గల వైరము అధిక మనుటకు ఎన్నో ఉదాహరణములు అనేకఘట్టములలో ఈభారతమున వాచ్యవ్యంగములుగా మహర్షివ్యాసునిచే నిరూపింపబడినవి.

అంధకా యాదవా భోజా స్సమేతాః కంస మత్యజన్ ।
నియోగా త్తు హతే తస్మి న్కృష్ణే నామిత్రఘాతినా ॥ (స. 61-8)
ఏవం తే జ్ఞాతయ స్సర్వే మోదమానా శ్శతం సమాః ।
త్వన్నియుక్త స్సవ్యసాచీ నిగృహ్ణాతు సుయోధనమ్ ॥ (స 61-9)

నిగ్రహో దస్య పాపస్య మోదంతాం కురవ స్సుఖమ్ ।
కాకే నేమాం శ్చిత్రిబర్హా న్ శార్దూలాన్ క్రోష్టుకేన చ ॥ (స. 61-10)
క్రీణీష్వ పాండవా న్రాజ న్మా మజ్జీ శ్శోకసాగరే ।
త్యజే త్కులార్థే పురుషం గ్రామ స్యార్థే కులం త్యజేత్ ॥ (స. 61-11)
గ్రామం జనపద స్యార్థే హ్యాత్మార్థే పృథివీం త్యజేత్ ।
సర్వజ్ఞ స్సర్వభావజ్ఞ స్సర్వశత్రుభయంకరః । (స. 61-11)
ఇతి స్మ భాషతే కావ్యో జంభత్యాగే మహాఽసురాన్ ॥ (స. 61-12)

ఇందు కంసుని చంపిన కృష్ణుని అర్జునునకు ఉపమాన మగునట్లు చెప్పుట వలన కంసునియట్టివాడే దుర్యోధను డని తెలియుచున్నందున దుర్యోధనునిమీద పగ కృష్ణునకును కల దని సూచింపబడుచున్నది ఘోర మగు ద్యూతము ప్రవర్తిల్లుచుండ పాండవుల సర్వస్వము ఈద్యూతమున అపహరింపబడుచుండుటచూచి "సర్వసంశయనిర్మోక్త" (స. 61-1) అగు విదురుడు మహారాజు అగు ధృతరాష్ట్రునితో "దుర్యోధనుడు కులఘ్నుడు; దుర్యోధనునిరూపములో నీయింట నివసించుచున్న గోమాయువును నీవు తెలసికొనకున్నావు. అంధక యాదవ భోజులు కలసి కంసుని త్యజించి వానిని చంపుటకు కృష్ణుని నియోగించిరి అట్లే నీవు కూడ సుయోధన నిగ్రహార్థము సవ్యసాచి ని నియోగింపుము. కంసుని కృష్ణుడు చంపగా సుఖశాంతు లున్నట్లే, అర్జునునిచే దుర్యోధనుడు నిగ్రహింపబడగా కురువు లందరు సుఖముగా నుందురు. ఇట భీముడున్నాడు దుర్యోధనుని వధార్థము విదురుడు భీముని నియోగింపుమని ధృతరాష్ట్రునికి చెప్పక అర్జునుని నియోగింపుమనుటలో నర్థమేమి? అర్జునునికి సామ్యముగా కృష్ణుని చెప్పుటేమి? దుర్యోధనునికి సామ్యముగా కంసుని చెప్పుటేమి?

అసంఖ్యేయా గుణాః పార్థే తద్విశిష్టో జనార్దనః । (ఉ. 95-48)
నరనారాయణౌ యౌ తౌ తా వే వార్జునకేశవౌ ।
విజానీహి మహారాజ ప్రవరౌ పురుషోత్తమౌ ॥ (ఉ. 95-49)

"అ తోస్మి లోకే వేదే చ ప్రథితః పురుషోత్తమః" అని గీతలో చెప్పిన పురుషోత్తములే నరనారాయణులుగా అవతరించె నని వారే కృష్ణార్జునులుగా యుద్ధసమయమున జన్మించిన పురుషోత్తములుగా చెప్పుటచే దుర్యోధనునియందు కృష్ణునకు గల పగ అర్జునునకును గలదు. గనుకనే విదురుడు అర్జునునిచేత దుర్యోధనుని చంపింపు మని ద్యూతకాలమున చెప్పుటకు కారణమైనది.

అర్జునం కేశవ! బ్రూయా స్త్వయి జాతే స్మ సూతకే ।
ఉపోపవిష్టా నారీభి రాశ్రమే పరివారితా ॥ (ఉ. 136-1)
అ థాంతరిక్షే వా గాసీ ద్దివ్యరూపా మనోరమా ।
సహస్రాక్షసమః కున్తి భవిష్య త్యేష తే సుతః ॥ (ఉ. 136-2)
ఏష జేష్యతి సంగ్రామే కురూ న్సర్వా న్సమాగతాన్ ।
భీమసేనద్వితీయ శ్చ లోక ముద్వర్తయిష్యతి ॥ (ఉ. 136-3)
పుత్ర స్తే పృథివీజేతా యశ శ్చాస్య దివం స్పృశేత్ ।
హత్వా కురూం శ్చ సంగ్రామే వాసుదేవసహాయవాన్ ॥ (ఉ. 136-4)
పిత్ర్య మంశం ప్రణష్టం చ పున ర ప్యుద్ధరిష్యతి ।
భ్రాతృభి స్సహిత శ్శ్రీమాం స్త్రీ న్మేధా నాహరిష్యతి ॥ (ఉ 136-5)
స సత్యసంధో భీభత్సు స్సవ్యసాచీ యథాచ్యుతః ।
తథా త్వ మేవ జానాసి బలవంతం దురాసదం ॥ (ఉ. 136-6)
తథా త దస్తు దాశార్హ! యథా వా గభ్యభాషత ।
ధర్మ శ్చే దస్తి వార్ష్ణేయ! తథా సత్యం భవిష్యతి ॥ (ఉ. 136-7)
త్వం చాపి తత్తథా కృష్ణ! సర్వం సంపాదయిష్యసి ।
నాహం త దభ్యసూయామి యథా వా గభ్యభాషత ॥ (ఉ. 136-8)
నమో ధర్మాయ మహతే ధర్మో ధారయతే ప్రజాః ।
ఏత ద్ధనంజయో వాచ్యో నిత్యోద్యుక్తో వృకోదరః ॥ (ఉ. 136-9)

ఈ కుంతీవచనములు ఎన్ని విషయరత్నములనో మెరుగుతో వెలుగుతో వెలువరించును. భీమసేనద్వితీయుడు "వాసుదేవసహాయవాన్" అగు అర్జునుడు కురువులను నాశనము చేయును. అని ఆకాశవాణి అర్జునుడు పుట్టగా పలికినదట! సత్యసంధు డగునట్లు అర్జునుని కృష్ణుడు తీర్చిదిద్దవలె నని కుంతి చెప్పుచున్నది. అనగా అర్జునునికన్న కృష్ణునకే కురువంశనాశములో కర్తృత్వ మిచ్చుచున్నది. కనుక కృష్ణార్జునులిరువురూ కురువంశనాశనకారకులే యనియు, అందు ముఖ్యముగా దుర్యోధనుడు వీరల క్రోధమునకు ఆశ్రయ మయినా డనియు తెలియుచున్నది. కౌరవసభనుండి దుర్యోధనుడు క్రుద్ధుడై సానుగుడై వెడలిపోవును. అపుడు కృష్ణుడు ఇట్లు అనును:—

ప్రత్యక్ష మేత ద్భవతా య ద్వక్ష్యామి హితం వచః ।
భవతా మానుకూల్యేన యది రోచేత భారతాః ॥ (స. 27-36)

భోజరాజస్య వృద్ధస్య దురాచారో హ్యనాత్మవాన్ ।
జీవతః పితు రైశ్వర్యం హృత్వా మృత్యువశంగతః ॥ (స. 2-37)
ఉగ్రసేనసుతః కంసః పరిత్యక్త స్స్వబాంధవైః ।
జ్ఞాతీనాం హితకామేన మయా శప్తో మహామృధే ॥ (స 27-38)
ఆహుకః పున రస్మాభిః జ్ఞాతిభి శ్చాపి సత్కృతః ।
ఉగ్రసేనకృతో రాజా భోజరాజ్యస్య వర్ధనః ॥ (స. 27-39)
కంస మేకం పరిత్యజ్య కులార్థే సర్వయాదవాః ।
సంభూయ సుఖ మేధంతే భారతాంధకవృష్ణయః ॥ (స. 27-40)
త్యజే త్కులార్థే పురుషం గ్రామ స్యార్థే కులంత్యజేత్ ।
గ్రామంజనపదస్యార్థే హ్యాత్మార్థే పృథివీం త్యజేత్ ॥ (స. 27-49)
రాజన్ దుర్యోధనం బద్ధ్వా తత స్సంశామ్య పాండవైః ।
త్వత్కృతే న వినశ్యేయుః క్షత్రియాః క్షత్రియర్షభ ॥ (స. 2'-50)

విదురుడు సభాపర్వమునందు చెప్పిన వచనములతో ఈ కృష్ణవచనములు సరి తూచి చూచినచో విదురుని భావమే కృష్ణునిదైనట్లు తోచుచున్నది విదురుడు అర్జునునిచే దుర్యోధనుని నిగ్రహింపు మని చెప్పినాడు. కృష్ణుడు దుర్యోధన నిగ్రహమున కర్తను పేర్కొనలేదు. అర్జునుడే కర్త యని ఫలితార్థము. ఆసందర్భమంతయు చూచిన తెలియును. కృష్ణు డీమాటలు చెప్పినతరువాత ధృతరాష్ట్రుడు సర్వధర్మజ్ఞు డగు విదురుని పిలచి ఇట్లు అనును;-

గచ్ఛ తాత! మహాప్రాజ్ఞాం గాంధారీం దీర్ఘదర్శినీమ్ ।
ఆన యేహ తయాసార్ధ మనునేష్యామి దుర్మతిమ్ ॥ (స. 128-2)
యది సాపి దురాత్మానం శమయే దుష్టచేతసమ్ ।
అపి కృష్ణస్య సుహృద స్తిష్ఠేమ వచనే వయమ్ ॥ (స. 128-3)
అపి లోభాభిభూతస్య పంథాన మనుదర్శయేత్ ।
దుర్బుద్ధే ర్దుస్సహాయస్య శమార్థం బ్రువతీ వచః ॥ (స. 128-4)
అపి నో వ్యసనం ఘోరం దుర్యోధన ! కృతం మహత్ ॥
శమయే చ్చిరరాత్రాయ యోగక్షేమవ దవ్యయమ్ ॥ (స. 128-5)

ఈవాక్యములు పరిశీలించినపుడు కృష్ణుని సుహృత్తునిగా పేర్కొన్న ధృతరాష్ట్రుని అర్జునుడు నిందించి ఆతని పుత్రుడు దుర్యోధనుడు తండ్రివలె దుష్టుడే అని నిందింపనెంచియే "ధార్తరాష్ట్రస్యదుర్బుద్ధేః" అని అర్జునునిమాటకు వ్యాఖ్యా

నము చేయుట ధార్తరాష్ట్రునియందు దుర్బుద్ధిని అర్జునుడు పేర్కొనెను. అన్న దానికన్న ఈవ్యాఖ్యాతలు దుర్బుద్ధులని చెప్పుట తప్పేమి? ఒప్పే అగును. భీష్ముడు అర్జునునితో యుద్ధము చేయుచున్నాడు. ఆతని అస్త్రలాఘవమును ఇట్లు పొగడు చున్నాడు

సాధు పార్థ మహాబాహో : సాధు భో పాండునందన । (భీ. 59-57)
త్వ య్యే వైత ద్యుక్తరూపం మహత్కర్మ ధనంజయ ।
ప్రీతోఽస్మి సుదృఢం పుత్ర కురు యుద్ధం మయా సహ ॥ (భీ. 59-58)

ఇట్లు ప్రశంసించి భీష్ముడు విజృంభించెను. కాని అర్జునుడు మృదుయుద్ధము చేయుచుండెను. భీష్ముని యుద్ధమునకు "యౌధిష్ఠిరబలము ఒక్కరోజులోనే అంత మగు నని అర్జునుడు భీష్మగౌరవముచే కర్తవ్యమెరుంగ కున్నా డని తాను పూను కొననిగాని ఫలితముదక్కదు." అని కృష్ణుడు భావించి భీష్మునిమీదికి పోయెను. అట్లువచ్చుచున్న చక్రధారిని చూచి శాంతను వుడి ట్లనుచున్నాడు.

ఏ హ్యే హి దేవేశ! జగన్నివాస! నమోఽస్తు తే శార్ఙ్గగదాసిపాణే ॥
(భీ. 9-97)
ప్రసహ్య మాం పాతయ లోకనాథ రథో త్తమా ద్భూతశరణ్య! సంఖ్యే ।
త్వయా హత స్యేహ మ మాద్య కృష్ణ శ్రేయః పరస్మి న్నిహ చైవ లోకే॥
(భీ. 59-98)

సంభావితో స్మ్యంధకవృష్ణినాథ! లోకై స్త్రిభి శ్చ ప్రథితప్రభావః ।
శ్రుత్వా వాచ శ్శాంతనవస్య కృష్ణో వేగేన ధావంత మథాఽభ్యువాచ ॥(భీ59-99)

ఈ శాంతనవుని వాక్యములు విని కృష్ణు డిట్లు అనుచున్నాడు. :-

త్వం మూల మ స్యేహ భువి క్షయస్య దుర్యోధనం చాద్య సముద్ధరిష్యసి ।
దుర్ద్యూతదేవీ నృపతి ర్నివార్యః సుమంత్రిణా ధర్మపథి స్థితేన ॥ (భీ. 59-100)
త్యాజ్యోఽథ వా కాలపరీతబుద్ధి ర్ధర్మాతిగో యః కులపాంసన స్స్యాత్ ।
భీష్మ స్త దాకర్ణ్య యదుప్రవీరం రాజా పరం దైవత మి త్యువాచ॥ (భీ59-101)

కృష్ణుడు భీష్ముని క్షయమునకు మూలముగా దుర్యోధనుని సముద్ధరించు వాడుగా నున్నా డని ఎత్తిపొడిచి ధర్మపథము నందున్న మంత్రి దుర్ద్యూతదేవి యగు రాజును నివారింపవలయును. లేక కులపాంసనుడు కాబోవు నట్టి విపరీతబుద్ధిని విడువ నైనను విడువవలయును. అని అనగా భీష్ముడు ఆకృష్ణవచనములు విని "రాజా పరం దైవతం" అనగా రాజు ఉత్తమ మైనదైవము అని చెప్పి, మరియు నిట్లనుచున్నాడు, భీష్ముని దృష్టిలో దుర్యోధనుడు రాజే అని భీష్మ డెప్పుడు, ఎన్న్న

సందర్భములలో ఎన్నినీతులు ఎన్నిబోధలు గరపినను దుర్యోధనునియందు రాజబుద్దిని చూపుచు ఆతడిని ధర్మానుసారముగ దైవ మనియే భావించెనని తెలియుచున్నది.

త్యక్త స్తు కంసో యదుభి ర్హితార్థే సంబోధ్యమానో న బుబోధ రాజా ।
క్లేశాయ దైవా ద్విపరీతబుద్ధిః శ్రోతా హితం యస్య న కశ్చిదస్తి ॥

(భీ. 59-102)

యదుపులచేత కంసుడు త్యజింపబడె నని నీచేత ప్రబోధింపబడియు, విపరీతబుద్ధి యగు రాజు వినలేదు అనెను. ఇచ్చట రాజశబ్దముచే ధృతరాష్ట్రుని చెప్పబూనుట తగదు. దుర్యోధనునే చెప్పవలెను. ధృతరాష్ట్రునికూడ చెప్పినను తప్పులేదు. కాని "దుర్ద్యూతదేవీ నృపతిః" అన్న కృష్ణవచనమువ-న దుర్యోధనునే చెప్పకతప్పదు. మొత్తముమీద ఈ సందర్భములో కంసునివలె దుర్యోధనుడు త్యాజ్యు డని కృష్ణుడు కౌరవసభలో చెప్పినదానిని భీష్ముడు ఈ సందర్భమున ప్రసక్తమొనరించి చెప్పుచున్నా డనగ దుర్యోధనునికి కంససామ్యము అనేక సందర్భములలో స్వీకరింపబడుచున్న దనుట తథ్యము.

పరీక్షిత్తుని జీవింపచేయ కృష్ణు డిట్లు ప్రతిజ్ఞ చేయును :-

ప్రతిజజ్ఞే చ దాశార్హః తస్య జీవిత మచ్యుతః ।
అబ్రవీ చ్చ విశుద్ధాత్మా సర్వం విశ్రావయ న్జగత్ ॥ (అశ్వ. 69-17)
న బ్రవీ మ్యుత్తరే! మిథ్యా సత్య మేత ద్భవిష్యతి ।
ఏష సంజీవయా మ్యేనం పశ్యతాం సర్వదేహినాం ॥ (అశ్వ. 69-18)
నోక్తపూర్వం మయా మిథ్యా స్వైరే ష్వపి కదాచన ।
న చ యుద్ధా త్పరావృత్త స్తథా సంజీవతా మయా ॥ (అశ్వ. 69-19)
యథా మే దయితో ధర్మో బ్రాహ్మణా శ్చ విశేషతః ।
అభిమన్యో స్సుతో జాతో మృతో జీవ త్వయం తథా ॥ (అశ్వ 69-20)
యథాహం నాభిజానామి విజయేన కదాచన ।
విరోధం తేన సత్యేన మృతో జీవ త్వయం శిశుః ॥ (అశ్వ. 69-21)
యథా సత్యం చ ధర్మ శ్చ మయి నిత్యం ప్రతిష్ఠితౌ ।
తథా మృతః శిశు రయం జీవతా మభిమన్యుజః ॥ (అశ్వ. 69-22)
యథా కంస శ్చ కేశీ చ ధర్మేణ నిహతౌ మయా ।
తేన సత్యేన బాలోఽద్య పున స్సంజీవతా మయం ॥ (అశ్వ. 69-23)

ఇత్యుక్తో వాసుదేవేన స బాలో భరతర్షభ ।
శనై శ్శనై ర్మహారాజ ప్రాస్పందత సచేతనః ॥ (అశ్వ. 69-24)

ఇందు ముఖ్యముగా "కంసుడు, కేశి ధర్మముగా నాచే చంపబడినచో ఈ బాలుడు బ్రతుకుగాక, అన్న ప్రతిజ్ఞానంతరము శిశువు బ్రతుకును. ఇదేమి? ఈ భారతయుద్ధమునందు పాండవులు ధర్మయుద్ధము చేసినచో శిశువు బ్రతుకు నని గదా ప్రతిజ్ఞ చేయవలయును లేక నాచే ప్రేరితులై పాండవులు కౌరవులను చంపిరి. నాకారయిత్వత్వమునందు ధర్మము ఉన్నచో ఈ బాలుడు బ్రతుకు నని యైనను చెప్పవలయును కంసప్రసక్తి తెచ్చుట యేల? ఆర్షవచనములలోని, మహాకవుల వాక్యములలోని సారము గ్రహింపవలె నన్న నిరంతరపరిశ్రమ, పూర్వాపరసందర్భములను పరిశీలించెడి ఓర్పు, పువ్వుకందకతుమ్మెద మకరందము గ్రహించునట్లు సారాంశమును గ్రహించు నేర్పు, ఉన్నగాని యథార్థము గ్రహింపబడదు. గ్రంథము చదువరు. చదివినదైనను సరిగా గ్రంథార్థమేమో జిజ్ఞాసతో చదువరు. ఎవరో ఏదో ఉబుసుపోకకు వంచనాపర మగు బుద్ధిలో చెప్పినమాటలను వినియో, అట్టివారు చేసిన విమర్శలలోని కొన్నిభాగములను తస్కరించి వానితో సత్కారము పొందవలె నన్న దుర్మేధస్కులు రసజ్ఞులై సహృదయులు కాగలరా? సరే,

"యథాఽహం నాభిజానామి విజయేన కదాచన ।
"విరోధం" అహం కదచనవిజయేవిరోధం నాభిజానామి । (21)

అనగా నేను విజయునియందు ఎప్పుడు విరోధభావ మెరుగను. "తేన సత్యేన మృతో జీవ త్వయం శిశుః॥ (24)" ఆసత్యముతో మృతుడగు నీశిశువు బ్రతుకుగాక అనుచున్నాడు. అనగా అర్జునునకు నాకు ఎప్పుడు విరోధభావము అనగా భేదభావము లేకపోయినచో అనగా నర్థమేమి? నాకు అర్జునుడు గాని, అర్జునునకు నేను గాని ఏరూపమున వేరైనను ఈబిడ్డ బ్రతుకడు. దీనినిబట్టి కృష్ణార్జునులు శరీరమున వేరుగా నున్నను ఆత్మయం దైకాత్మ్యలే ఏకమనస్కులే ఏకక్రియావ్యగ్రులే అని తెలుచున్నది.

ఇంతకుముందు అనేకపర్యాయములు కంసదుర్యోధనులకు త్యాజ్యత్వమున, వధ్యత్వమున సామ్యము చెప్పబడినది. ఇక్కడ తనకు అర్జునునకు అభేదము చెప్పుచూ కంసవధ ధర్మ్య మగుచో శిశువు బ్రతుకుగాక అనుచున్నాడు. అనగా నర్థమేమి? నేను చేసిన కంసవధవలె అర్జునుడు చేసిన లేక అర్జునసహాయముతో భీముడుచేసిన ధార్తరాష్ట్రవధ ధర్మ్యమైనచో ఈ శిశువు బ్రతుకుగాక యన్న వ్యంగ్యార్థ మిందు పరిమళించుచున్నది. కనుక నాకు కంసు డెంత ద్వేష్యుడో నా

కఠిన్ముడగు అర్జునునకు దుర్యోధను డంత ద్వేష్యుడు అని తెలుచున్నది. పాండవ శత్రువులు నాశత్రువులు; నాశత్రువులు పాండవశత్రువు లని ఇదివరకు చెప్పుట వలన అనేక పర్యాయములు అర్జునునివలననే తాను పాండవప్రాణుడ నని నిరూపించుటవలన పాండవద్వేషి యగు దుర్యోధనుడు తనకు కంసునివలె ద్వేష్యుడగుటవలన అర్జునసహాయముతో తాను కంసశబ్దముచే నిగీర్ణ మొనరించి చెప్పబడిన దుర్యోధనుడు ధర్మబద్ధముగా చంపబడినచో ఈబిడ్డ బ్రతుకునుగాక అన్నసారాంశమే ఇందు విలసిత మగుచున్నది.

కనుక దుర్యోధనుడు కృష్ణార్జునులకు ద్వేష్యుడైనంతగా ఇతరులకు ద్వేష్యుడు గాలేదు ఈ అర్థమును అంతను సంగ్రహించునదే "ధార్తరాష్ట్రస్య దుర్బుద్ధేః" అన్న అర్జునవాక్యము. కనుక ఇది నైనను నిమర్శకమూర్ధశిఖామణులు దుర్యోధనుని దుర్బుద్ధికి ధృతరాష్ట్రజనితత్వము నిరూపింప వ్యర్థప్రయాసము చేయరని అట్లు చేసిన పశ్చాత్తప్తు లగుదు రని నమ్మవచ్చునా?

దుర్యోధనవధసందర్భమున కృష్ణప్రేరితుడైన అర్జునుడు భీమునకు దుర్యోధనుని చంపువిధానము సూచన చేయగా భీముడు దుర్యోధనుని చంపును. కనుక దుర్యోధనవధలో భీముడు ప్రధానకర్తయైనను ప్రేరణకర్తలు కృష్ణార్జునులు. హత్య చేసినవానికన్న హత్యచేయించినవాడే ఎక్కువ నేరస్థుడు అన్న చట్టమునకు ఇదే మూలమేమో? భీష్ముడు, ద్రోణుడు, కృపుడు వీరల విషయములో ధర్మరాజుయొక్క దృష్టి వేరు. అర్జునునియొక్క దృష్టి వేరు. గౌరవమునందు వీరిరువుర దృష్టి భీష్మాదులయందు ఏకాకారమైయున్నను ధర్మజుడు భీష్మాదులు వధార్హులే యని భావించువాడు. అర్జునుడు వారు వధార్హులు కాదు; అని భావించువాడు. అర్జునుని దృష్టిలో ఒక్క దుర్యోధనుడు, అతనికి బాసటగా నిలచిన కర్ణుడు వీరిరువురే ముఖ్యముగా వధార్హు లని భారతము అంతయు చదివిన తెలియును.

ధృతరాష్ట్రుడుకూడ అర్జునునిభావముతో భీష్మాదులట్లే గౌరవార్హుడని భారతమంతయు చదివిన తెలియును. కనుక ధృతరాష్ట్రుని అర్జునుడు నిందింపడు. "ధార్తరాష్ట్రస్య దుర్బుద్ధేః" అనినప్పుడు ధృతరాష్ట్రునివలెనే ధృతరాష్ట్రపుత్రుడైన దుర్యోధనుడు అంధుడు-జ్ఞానాంధుడు, దుష్టబుద్ధి అన్నభావము అర్జునునిభావమైనట్లు వ్యాఖ్యానించుట వ్యాఖ్యాతల అజ్ఞానాంధత్వమునకు నిదర్శనము. అర్జునునిభావమును తెలిసికొనలేని పామరబుద్ధికి తార్కాణము. వ్యాసహృదయమును చిక్కబట్టలేని నిస్సారభావమునకు నిదానము. సద్విమర్శ చేయుటలో అలసత్వ మొంది ఏదో చెప్పెదము. అన్న దుర్బుద్ధికి నిదానము.

తాన్ సదోపగతాన్ దృష్ట్వా జవే నోద్యతకార్ముకాన్ ।
ఉవాచ దేవకీపుత్రం కుంతీపుత్రో ధనంజయః ॥ (శ. 25-15)
చోద యాశ్వా నసంభ్రాంతః ప్రవి శైనం బలార్ణవమ్ ।
అంత మద్య గమిష్యామి శత్రూణాం నిశితై శ్శరైః ॥ (16)
అష్టాదశ దినా న్యద్య యుద్ధ స్యాస్య జనార్దన ।
వర్తమానస్య మహతః సమాసాద్య పరస్పరమ్ ॥ (17)
అనంతకల్పా ధ్వజినీ భూత్వా హ్యేషాం మహాత్మనామ్ ।
క్షయ మద్య గతా యుద్ధే పశ్య దైవం యథావిధమ్ ॥ (18)
సముద్రకల్పం చ బలం ధార్తరాష్ట్రస్య మాధవ ।
అస్మా నాసాద్య సంజాతం గోష్పదోపమ మచ్యుత ॥ (19)
హతే భీష్మే తు సంధ్యా చ్ఛివం స్యా దిహ మాధవ ।
న చ తత్కృతవాన్ మూఢో ధార్తరాష్ట్ర స్సుబాలిశః ॥ (20)
ఉక్తం భీష్మేణ య ద్వాక్యం హితం పథ్యం చ మాధవ ।
తథాపి నాసౌ కృతవాన్ వీతబుద్ధి స్సుయోధనః ॥ (21)
తస్మిం స్తు తుములే భీష్మే ప్రచ్యుతే ధరణీతలే ।
న జానే కారణం కిం ను యేన యుద్ధ మవర్తత ॥ (22)
మూఢాం స్తు సర్వథా మన్యే ధార్తరాష్ట్రాన్ సుబాలిశాన్ ।
పతితే శంతనోః పుత్రే యేఽకార్షు స్సంగరం పునః ॥ (23)
అనంతరం చ నిహతే ద్రోణే బ్రహ్మవదాం వరే ।
రాధేయే చ వికర్ణే చ నైవాఽశామ్యత వైశసమ్ ॥ (24)
అల్పావశిష్టే సైన్యేఽస్మిన్ సూతపుత్రే చ పాతితే ।
సపుత్రే చ నరవ్యాఘ్రే నైవాఽశామ్యత వైశసమ్ ॥ (25)
శ్రుతాయుషి హతే వీరే జలసంధే చ పౌరవే ।
శ్రుతాయుధే చ నృపతౌ నైవాఽశామ్యత వైశసమ్ ॥ (26)
భూరిశ్రవసి శల్యే చ సాల్వే చైవ జనార్దన ।
ఆవంత్యేషు చ వీరేషు నైవాఽశామ్యత వైశసమ్ ॥ (27)
జయద్రథే చ నిహతే రాక్షసే చాప్యలాయుధే ।
బాహ్లీకే సోమదత్తే చ నైవాఽశామ్యత వైశసమ్ ॥ (28)
భగదత్తే హతే శూరే కాంభోజే చ సుదక్షిణే ।
దుశ్శాసనే చ నిహతే నైవాఽశామ్యత వైశసమ్ ॥ (29)

దృష్ట్వా చ నిహతాన్ శూరాన్ పృథ క్ష్మాండలికా న్నృపాన్ ।
బలిన శ్చ రణే కృష్ణ! నై వాఽశామ్యత వైశసమ్ ॥ (30)
అక్షౌహిణీపతీన్ దృష్ట్వా భీమసేనేన పాతితాన్ ।
మోహా ద్వా యది వా లోభా న్నై వాఽశామ్యత వైశసమ్ ॥ (31)
కో ను రాజా కులే జాతః కౌరవేయో విశేషతః ।
నిరర్థకం మహ ద్వైరం కుర్యా దన్య స్సుయోధనాత్ ॥ (32)
గుణతోప్యధికం జ్ఞాత్వా బలత శ్శౌర్యతోపి వా ।
అమూఢః కో ను యుధ్యేత జానన్ ప్రాజ్ఞో హితాహితమ్ ॥ (33)
య న్న తస్య మనో హ్యాసీ త్త్వ యో క్తస్య హితం వచః ।
ప్రశమే పాండవైః స్సార్థం సోఽన్యస్య శృణుయా త్కథమ్ ॥ (34)
యేన శాంతనవో వీరో ద్రోణో విదుర ఏవ చ ।
ప్రత్యాఖ్యాతా శ్శమ స్స్యార్థే కిన్ను తస్యాద్య భేషజమ్ ॥ (35)
మౌర్ఖ్యా ద్యేన పితా వృద్ధః ప్రత్యాఖ్యాతో జనార్దన ।
తథా మాతా హితం వాక్యం భాషమాణా హితైషిణీ ॥ (36)
ప్రత్యాఖ్యాతా హ్యసత్కృత్య స కస్మా ద్రోచయే ద్వచః ।
కులాంతకరణో వ్యక్తం జాత ఏష జనార్దన ॥ (37)
త థాస్య దృశ్యతే చేష్టా నీతి శ్చైవ జనార్దన ।
నైవ దాస్యతి నో రాజ్య మితి మే మతి రచ్యుత ॥ (38)
ఉక్తోహం బహుశ స్తాత విదురేణ మహాత్మనా ।
న జీవన్ దాస్యతే భాగం ధా ర్తరాష్ట్ర స్తు మానద ॥ (39)
యావ ద్ధరిష్యతి ప్రాణాన్ ధా ర్తరాష్ట్ర స్తు దుర్మతిః ।
తావ ద్యుష్మా స్వపాపేషు ప్రచరిష్యతి పాతకమ్ ॥ (40)
న చ యు క్తోఽన్యథా జేతు మృతే యుద్ధేన మాధవ ।
ఇ త్యబ్రవీ త్సదా మాం హి విదుర స్సత్యదర్శనః ॥ (41)
త త్సర్వ మద్య జానామి వ్యవసాయం దురాత్మనః ।
య దుక్తం వచనం తేన విదురేణ మహాత్మనా ॥ (42)
యో హి శ్రుత్వా వచః పథ్యం జామదగ్న్యా ద్యథాతథమ్ ।
అనాదృత్య దుర్బుద్ధి ర్ధ్రువం నాశ ముపస్థితమ్ ॥ (43)
ఉక్తం హి బహుశ స్సిద్ధైః జాతమాత్రే సుయోధనే ।
ఏనం ప్రాప్య దురాత్మానం క్షయం క్షత్రం గమిష్యతి ॥ (44)

తదిదం వచనం తేషాం నిరుక్తం వై జనార్దన ।
క్షయం గతా హి రాజానో దుర్యోధనకృతే భృశమ్ ॥ (45)

సోఽద్య సర్వాన్ రణే యోధా న్నిహనిష్యామి మాధవ ।
క్షత్రియేషు హతే ష్వాశు శూన్యే చ శిబిరే కృతే ॥ (46)

వధాయ చాత్మనోఽస్మాభి స్సంయుగం రోచయిష్యతి ।
తదంతం హి భవే ద్వైర మనుమానేన మాధవ ॥ (47)

ఏవం పశ్యామి వార్ష్ణేయ చింతయన్ ప్రజ్ఞయా స్వయా ।
విదురస్య చ వాక్యేన చేష్టయా చ దురాత్మనః ॥ (48)

తస్మా ద్యాహి చమూం వీర యావ ద్ధన్మి శితై శ్శరైః ।
దుర్యోధనం మహాబాహో వాహినీం చాస్య సంయుగే ॥ (49)

క్షేమ మద్య కరిష్యామి ధర్మరాజస్య మాధవ ।
హ త్వైత ద్దుర్బలం సైన్యం ధార్తరాష్ట్రస్య పశ్యతః ॥ (50)

దుర్యోధనుని దుష్టబుద్ధి యని ఎందు కనెనో ఈ గ్రంథసందర్భమును బట్టి తెలియుచున్నది. "ధార్తరాష్ట్రస్య" అనినప్పుడు దుర్యోధనుని దుర్బుద్ధికి ధృతరాష్ట్రునివలన జన్మించుట కారణముగా అర్జునుడు భావింప లేదనియు, ఈ గ్రంథ సందర్భమును బట్టియే గ్రహింపవచ్చును. భీష్ముడు, ద్రోణుడు, విదురుడు చెప్పినను వినలేదు. కృష్ణుడు చెప్పినను వినలేదు. తండ్రిధృతరాష్ట్రుడు, తల్లి గాంధారి చెప్పినను వినలేదు; అని దుర్యోధనుని అర్జునుడు నిందించుచున్నాడు. ఈసందర్భములో భీష్మాదులు, కృష్ణుడు చెప్పినట్లు ధృతరాష్ట్రుడు గాంధారీ కూడ దుర్యోధనునికి హిత ముపదేశించినవారే, అన్నభావమువలన కృష్ణభీష్మాదులతో సమానముగనే ధృతరాష్ట్రునికూడ సద్భావముతోనే అర్జునుడు చూచెను. ఇట్టి ప్రమాణము లెన్నియో భారతమున ఉన్నవి. ఒక్క ఘట్టము నందైనను అర్జునుని భావము ధృతరాష్ట్రునియందు ఎట్లున్నదో, వ్యాసుడు అర్జునుని దృష్టిలో ధృతరాష్ట్రుని పాత్రను ఎట్లు చిత్రించెనో, ఇంచుమించుకయైనను పరిశీలింపకయే తమ అజ్ఞానాంధత్వమును ధృతరాష్ట్రునియందు పులిమెడు ఉబలాటముతోనే ఉన్న విమర్శకశిఖామణుల వ్యాఖ్యలవలన ఆర్షధర్మ మెంత కలుషిత మైనదో, కశ్మల మైనదో ఆలోచించిన ధర్మబద్ధమగు మనస్సు ఎంత కుందునో గదా!

దుర్యోధనుని చూచినంతనే అర్జునుని మనస్సులో చిరకాలసంవృతమై యున్న క్రోధవిషము ఉద్బుద్ధ మగుచున్నది. ఆ విషమును కక్కుటకు యుద్ధమే

శరణ్యము. అదే ప్రవృత్త మగుచున్నది. తత్సంబంధమగు యోగమే అర్జున విషాదయోగము. శబ్దవిభజన మి ట్లుండవలయును-

"అర్జునస్య విషం క్రోధవిషం అర్జునవిషం అర్జునవిషం అత్తి నాశయతి ఇతి అర్జునవిషాదః సంగ్రామః తస్మై యోగః - అర్జువిషాదయోగః."

యోగ మనగా కర్మకౌశలము. 'యోగః కర్మసు కౌశలం' దుఃఖసంయోగవియోగము. "తం విద్యా ద్దుఃఖసంయోగవియోగం యోగసంజ్ఞితమ్" ఇరెండు నిర్వచనములు భగవద్గీతలో వివరింపబడినవి. ఇవిరెండును ప్రకృతార్థమునుపరిపోషించును. ఎట్లనగా దుఃఖరూప మగు దుర్యోధనసంయోగవియోగము ఈ యద్ధమువలన కలుగును. మరియు ఆత్మక్షేమము కూడ సిద్ధించును. అనగ అర్జునవిషాద మనగ యుద్ధమనియు అరునవిషాదయోగమనగా ఆ యుద్ధమువలన లభించబోవు యోగములని, యోగము లనగా (1)దుఃఖరూపమగు దుర్యోధనునితోడి సంగమవియోగము, (2)స్వకౌశలము ఈరెండును సిద్ధించు నని తెలియవలయును

## ధృతరాష్ట్రుని పుత్రప్రీతి

భారతమునందు ధృతరాష్ట్రుని పుత్రప్రీతి పలుసార్లు ప్రస్తావింపబడినది. ఆతడు పుత్త్రప్రీతికలవాడనుట నిజమే. అయితే అది తప్పేనా?

"అంగా దంగా త్సంభవసి హృదయా దధిజాయసే।
ఆత్మా వై పుత్రనా మాసి స జీవ శరద శ్శతమ్ ॥"
"తస్మా త్పుత్రో హి హృదయమ్"
"ప్రజయా హి మనుష్యః పూర్ణః"

ఇట్లు వేదము పుత్రవిషయమున చెప్పుచున్నది. అయితే పుత్రుడు దుష్టుడగుచో వానిని త్యజింపవలెను. రామాయణమున "ఘాతయేయు స్సుతా నపి" అని ఉన్నది. ప్రజారక్షణమున దుష్టుడు పుత్రుడైనను విడచుట కర్తవ్యము.

స చ జ్యేష్ఠో నరశ్రేష్ఠః సగర స్యాత్మసంభవః ।
బాలా న్గృహీత్వా తు జలే సరయ్వాం రఘునందన ॥ (బా. 38-20)
ప్రక్షిప్య ప్రహస న్నిత్యం మజ్జత స్తా న్సమీక్ష్య వై ।
ఏవం పాపసమాచారః సజ్జనప్రతిబాధకః ॥ (బా. 38-21)
పౌరాణా మహితే యుక్తః పిత్రా నిర్వాసితః పురాత్ ।
తస్య పుత్రోంశుమా న్నామ అసమంజస్య వీర్యవాన్ ॥ (బా. 38-22)
సమ్మత స్సర్వలోకస్య సర్వ స్యాపి ప్రియంవదః ॥ (బా. 38-23)

రామాయణమున ఈ కథవల్ల తండ్రి తప్పుడువాడైనను కొడుకు ధర్మపరుడు కావచ్చును. అసమంజుని కొడుకు అంశుమంతుడు యోగ్యుడైనాడు. పుత్రుడు ఎంత అయోగ్యుడైనను వాడికి సంతానము కలుగువరకు విడువరాదు. ఎంత చెడ్డవాడైనను దేశమునుండి తోలిన చాలును. అన్న విషయములు "ఘాతయేయు స్సుతా నపి" అన్న సూత్రమునకు ఉదాహరణముగా సగరునిచర్య నిరూపించుచున్నది.

దుర్యోధనజననమైనంతనే ధృతరాష్ట్రుడు సభచేసి, "ధర్మరాజు తనగుణము వలన రాజ్యము నొందెను. అనంతరము దుర్యోధనుడు రాజు కాగలడా?" అనెను. వెంటనే విదురుడు దుర్యోధనుని విడువుము. నీకు తొంబదితొమ్మదిమంది చాలును. అని చెప్పెను. పుట్టగనే ఏ తండ్రి యైనను కొడుకు నుదుర్మార్గుడుగా రూపొందును. అని విడిచినఘట్టమున్నదా? అది ధృతరాష్ట్రునియందు దోషము కానేరదు. ఆ దుర్యోధనుడు చెడ్డవాడో, మంచివాడో, ఏది చేసినను తండ్రి అనుమతి లేనిదే చేసినది ఒక్కఘట్టము లేదు. పాండవుల అరణ్యాజ్ఞాతవాసానంతరమే ధృతరాష్ట్రుని మాట కాదనెను.

పుత్రస్నేహ శ్చ బలవా న్ధృతరాష్ట్రస్య మాధవ ।
స పుత్రవశ మాపన్నః ప్రణిపాతం ప్రహాస్యతి॥ (ఉ. 71-76)

ఇది, రాయబారినిగా కృష్ణుని పంపుచు ధర్మజుడు మాధవునితో అన్నవచనము. ఇంక ననేకస్థలముల పుత్రప్రీతి ధృతరాష్ట్రునియందు కలదని నిరూపించు వచనము లున్నవి. ధృతరాష్ట్రుడు పుత్రప్రీతి తనయందు ఇంతగా వర్ణనీయమగుట తెలిసికొని ఒక్కమాట, ఒక్క మాటగా, కొట్టి పారవేసినాడు.

ఆత్మజేషు పరం స్నేహం సర్వభూతాని కుర్వతే ।
ప్రియాణి చైషాం కుర్వన్తి యథాశక్తి హితాని చ॥ (ఉ. 59-8)

దుర్యోధనునితో ధృతరాష్ట్రుడు "సర్వభూతములు పుత్రులయందు ప్రీతి చూపును. ప్రియములు వారికి కలుగజేయును." అని చెప్పెను. "ధర్మరాజాదులు దేవపుత్రులు. దేవతలు వారివలన ప్రయోజనముల నందిరి. కావున దేవతలు పాండవులకు సహాయము చేతురనెను.

దీనికి ఉదాహరణములు కోకొల్లలుగా భారతమునందు కలవు. ఒకఘట్టము చూడుడు.

కర్ణార్జునులు ద్వంద్వయుద్ధము నకై రంగమునకు దిగిరి.

భ్రాతా భ్రాతర మజ్ఞాతం సావిత్రిః పాకశాసనిం (ఆది. 136-8)

వీ రిద్దరు ముందే సూర్యేంద్రపుత్రులుగా పేర్కొనఁబడిరి.

తత స్స విద్యుత్స్తనితై స్సేంద్రాయుధపురోగమైః ।
ఆవృతం గగనం మేఘై ర్బలాకాపంక్తి హాసితైః ॥ (ఆది. 136-23)
తత స్స్నేహా ద్ధరిహయం స్నేహా ద్రంగావలోకినమ్ ।
భాస్కరోప్యనయ న్నాశం సమీపోపగతా న్ఘనాన్ ॥ (ఆది. 136-24)
మేఘచ్ఛాయోపగూఢ స్తు తతోఽ దృశ్యత ఫాల్గునః ।
సూర్యాతపపరిక్లిన్నా కర్ణోఽపి పరిదృశ్యత ॥ (ఆది. 136-25)

ఇందులో వ్యంగ్యముచాలకలదు. ఇంద్రుడు మేఘములచే కర్ణుని ముంచెత్తెను. సూర్యుడు వాటిని తొలగించెను. అవి అర్జునుని ఆవరించినవి. కావున పుత్రప్రీతి సూర్యేంద్రులయందును కలదు. మహాభారముతనందు అన్ని గ్రంథములందువలెనే, ఏవిషయమునందైనను, ఉపక్రమోపసంహారములు చక్కగా నిర్వహింపబడినవి. ఇతరగ్రంథములలో పరిమితమైన కథావస్తు వుండుటచేతను అవాంతరకథలు, అవాంతరవిషయములు ఆ పరిమితపరిధిలోనే పొందుపరుపబడియున్నవి. కాని మహాభారతము అనేకపాత్రలతోకూడిన, అనేకవిషయములతోకూడిన పెద్దకథయగుటచే ఇందు అవాంతరవిషయములు ఆట్లే సుదీర్ఘముగా పెరిగినవి. అందువలన విమర్శకులు చాల తెలివితో ఓర్పుతో స్ఫురణాత్మకబుద్ధివైభవముతో ప్రత్యుత్పన్నమతి కలిగి పూర్వాపరసందర్భస్ఫురణ కలిగి యుండకపోయినచో వ్యాసమహర్షియొక్క హృదయము పాత్రచిత్రణమునందు విషయనిర్ధారణమునందు ఎట్టిదో అవగతముకాదు. పుత్రప్రీతి అను విషయమునందు వ్యాసమహర్షి మహాభారతమున అనేకస్థానములలో వాచ్యవ్యంగ్యరూపమున ఎంతోవిషయమువివరించెను. కొన్నిస్థలములలో వాచ్యముగ ధృతరాష్ట్రుడీపుత్రప్రీతికి వశుడైనట్లు నిరూపించెను కాని అతడిచేతనే ఈపుత్రప్రీతి అందరకును కలదని నిరూపించెను. కడకు పుత్రప్రీతిని త్యజించినవాడుకూడ ఈ మహాభారతమునందు ఒక్క ధృతరాష్ట్రుడే అన్న పరమసత్యముకూడ చక్కగ వివరించెను. పుత్రగృద్ధుడని ధృతరాష్ట్రుడు వాచ్యముగనే నిరూపింపబడినాడు. ఆ ధృతరాష్ట్రునిచేతనే దేవతలకును ఇది కలదని వాచ్యముగ చెప్పించినాడు. కర్ణార్జునపరిశ్రమసమాగమము ఇందు కుదాహరణముగ కనుగొంటిమికదా! ఆకర్ణార్జునులయొక్క చివరిసమావేశములో ఈ పుత్రప్రీతి బహుచమత్కారముగ చక్కని నాటకములో చూపినాడు. "ఆత్మజేషు పరాం ప్రీతిం సర్వభూతాని కుర్వతే" అన్న ధృతరాష్ట్రవచనమునకు ఈ క్రింది ఘట్టము ఉదాహరణము. విష్ణుపీర్య

సములు, భవనములు, అగు కృష్ణార్జునులు ఉభయులు శ్వేతహయులు. ఉత్తమ సారథులు కలవారు. మహారథులు వారిని చూచి సిద్ధచారణసంఘములును విస్మయముల నందినవి. కౌరవపక్షమున కర్ణుడు గ్లహము పాండవపక్షమున అర్జునుడు గ్లహము. కృష్ణార్జునులు ద్యూతసమాసక్తులైరి. అన్యోన్యవధకాంక్షులై పోరాడుచుండిరి.

తతోఽంతరిక్షే సాక్షేవా వివాదా భరతర్షభ । (కర్ణ. 88-36)
మిథో భేదా శ్చ భూతానా మాస న్కర్ణార్జునాంతరే ।
వ్యభూ్రియంత మిథో భిన్నా స్సర్వలోకా స్తు మారిష ॥ (క. 88-37)
దేవదానవగంధర్వాః పిశాచోరగరాక్షసాః ।
ప్రతిపక్షగ్లహం చక్రుః కర్ణార్జునసమాగమే ॥ (88-38)
ద్యౌ రాసీ త్సూతపుత్రస్య పక్షే మా తేవ ధిష్ఠితా ।
భూమి ర్ధనంజయ స్యాసీ న్మా తేవ జయకాంక్షిణీ ॥ (క. 88-39)
గిరయ స్సాగరా శ్చైవ నద్య శ్చ జలదా స్తథా ।
వృక్షా శ్చౌషధయ శ్చైవ వ్యాశ్రియంత పరస్పరమ్ ॥ (క. 88-40)
అసురా యాతుధానా శ్చ గుహ్యకా శ్చ పరంతప ।
తే కర్ణం సమపద్యన్త హృష్టరూపా స్సమంతతః ॥ (క. 88- 1)
మునయ శ్చారణా స్సిద్ధా వైనతేయా వయాంసి చ ।
రత్నాని నిధయ స్సర్వే వేదా శ్చాఖ్యానపంచమాః ॥ (క. 88-42)
సోపవేదోపనిషద స్సరహస్యా స్ససంగ్రహాః ।
వాసుకి శ్చిత్రసేన శ్చ తక్షకో మణిక స్తథా ॥ (క. 88-43)
సర్పా శ్చైవ తథా సర్వే కాద్రవేయా శ్చ సాన్వయాః ।
విషవంతో మహారాజ! నాగా శ్చార్జున తోఽభవన్ ॥ (క. 88-44)
ఐరావతా స్సౌరభేయాః వైశాలేయా శ్చ భోగినః ।
ఏ తేఽభవ న్నర్జునతః క్షుద్రసర్పా శ్చ కర్ణతః ॥ (క 88-45)
ఈహామృగా వ్యాలమృగా మాంగల్యా శ్చ మృగద్విజాః ।
పార్థస్య విజయే రాజ న్సర్వా ఏవాభిసంవృతాః ॥ (క. 88-46)
వసవో మరుత స్సాధ్యా రుద్రా విశ్వేశ్వినౌ తథా ।
అగ్ని రింద్ర శ్చ సోమ శ్చ పవనోఽథ దిశో దశ ॥ (47)
ధనంజయస్య తే పక్షే ఆదిత్యాః కర్ణతోఽభవన్ ।
విశ శ్శూద్రా శ్చ సూతా శ్చ యే చ సంకరజాతయః ॥ (48)

సర్వశ స్తే మహారాజ! రాధేయ మభజం స్తథా ।
దేవా స్తు పితృభి స్సార్ధం సగణా స్సపదానుగాః ॥ (49)
యమో వైశ్రవణ శ్చైవ వరుణ శ్చ యతో౽ర్జునః ।
బ్రహ్మ క్షత్రం చ యజ్ఞా శ్చ దక్షిణా శ్చార్జునం శ్రితాః ॥ (50)
ప్రేతా శ్చైవ పిశాచా శ్చ క్రవ్యాదా శ్చ మృగాండజాః ।
రాక్షసా స్సహ యాదోభి శ్శ్వసృగాలా శ్చ కర్ణతః ॥ (51)
దేవబ్రహ్మనృపర్షీణాం గణాః పాండవ తో౽భవన్ ।
తుంబురుప్రముఖా రాజన్ గంధర్వా శ్చ యతో౽ర్జునః ॥ (52)
ప్రాలేయా స్సహ మౌనేయా గంధర్వాప్సరసాం గణాః ।
ఈహామృగాః పక్షిగణాః ద్విపా శ్చ రథపత్తిభిః ॥ (53)
ఉహ్యమానా స్తథా మేఘైః వాయునా చ మనీషిణః ।
దిదృక్షవ స్సమాజగ్ముః కర్ణార్జునసమాగమం ॥ (54)
దేవదానవగంధర్వా నాగయక్షాః పతత్రిణః ।
మహర్షయో వేదవిదః పితర శ్చ స్వధాభుజః ॥ (55)
తపోవిద్యా స్తథౌషధ్యో నానారూపబలాన్వితాః ।
అంతరిక్షే మహారాజ నినదంతో౽వతస్థిరే ॥ (56)
బ్రహ్మా బ్రహ్మర్షిభి స్సార్ధం ప్రజాపతిభి రేవ చ ।
భవ శ్చైవ స్థితో యానే దివ్యం తం దేశ మాగమత్ ॥ (57)
సమేతౌ తౌ మహాత్మానౌ దృష్ట్వా కర్ణధనంజయౌ ।
అర్జునో జయతాం కర్ణ మితి శక్రో౽బ్రవీ త్తదా ॥ (58)
జయతా మర్జునం కర్ణ ఇతి సూర్యో౽భ్యభాషత ।
హత్వా౽ర్జునం మమ సుతః కర్ణో జయతు సంయుగే ॥ (59)
హత్వా కర్ణం జయ త్వద్య మమ పుత్రో ధనంజయః ।
ఇతి సూర్యస్య చైవాసీ ద్వివాదో వాసవస్య చ ॥ (60)
పక్షసంస్థితయో స్తత్ర తయో ర్విబుధసింహయోః ।
ద్వైపక్ష మాసీ ద్దేవానా మసురాణాం చ భారత ॥ (61)
సమేతౌ తౌ మహాత్మానౌ దృష్ట్వా కర్ణధనంజయౌ ।
అకంపంత త్రయో లోకాః సహదేవర్షిచారణాః ॥ (62)
సర్వే దేవగణా శ్చైవ సర్వభూతాని యాని చ ।
యతః పార్థ స్తతో దేవాః యతః కర్ణ స్తతో౽సురాః ॥ (63)

రథయూథపయోః పక్షే కురుపాండవవీరయోః ।
దృష్ట్వా ప్రజాపతిం దేవాః స్వయంభువ మచోదయన్ ॥ (64)
కోఽనయో విజయో దేవ కురుపాండవయోధయోః ।
సమోఽస్తు విజయో దేవ ఏతయో ర్నరసింహయోః ॥ (65)
కర్ణార్జునవివాదేన సర్వం సంశయితం జగత్ ।
స్వయం భో బ్రూహి న స్తథ్య మేతయో ర్విజయం ప్రభో ॥ (66)
స్వయం భో బ్రూహి త ద్వాక్యం సమోస్తు విజయోఽనయోః ।
త దుప శ్రుత్య మఘవా ప్రణిపత్య పితామహం ॥ (67)
విజ్ఞాపయతి దేవేశ మిదం మతిమతాం వరం ।
పూర్వం భగవతా ప్రోక్తం కృష్ణయో ర్విజయో ధ్రువః ॥ (68)
త త్తథాస్తు నమ స్తేఽస్తు ప్రసీద భగవ న్మమ ।
బ్రహ్మేశానా వథో వాక్య మూచతు స్త్రిదశేశ్వరం ॥ (69)
విజయో ధ్రువ ఏ వాస్య విజయస్య మహాత్మనః ।
ఖాండవే యేన హుతభు క్తోషిత స్సవ్యసాచినా ॥ (70)
స్వర్గం చ సమనుప్రాప్య సాహాయ్యం శక్ర తే కృతం ।
కర్ణ శ్చ దానవః పక్షః అతః కార్యః పరాజయః ॥ (71)
ఏవం కృతే భవే త్కార్యం దేవానా మేవ నిశ్చితం ।
ఆత్మకార్యం చ సర్వేషాం గణయ స్త్రిదశేశ్వర ॥ (72)
మహాత్మా ఫాల్గున శ్చాపి సత్య ధర్మరత స్సదా ।
విజయ స్తస్య నియతం జాయతే నాత్ర సంశయః ॥ (73)
తోషితో భగవా న్యేన మహాత్మా వృషభధ్వజః ।
కథం వా తస్య న జయో జాయతే శతలోచన ॥ (74)
యస్య చక్రే స్వయం విష్ణుః సారథ్యం జగతః ప్రభుః ।
మనస్వీ బలవా న్శూరః కృతాస్త్రోఽథ తపోధనః ॥ (75)
బిభర్తి చ మహాతేజాః ధనుర్వేద మశేషతః ।
పార్థ స్సర్వగుణోపేతో దేవకార్య మిదం యతః ॥ (76)
క్లిశ్యంతే పాండవా నిత్యం వనవాసాదిభి ర్భృశం ।
సంపన్న స్తపసా చైవ పర్యాప్తః పురుషర్షభః ॥ (77)
అతిక్రమేణ మహతా దిష్ట మర్థస్య పర్యయమ్ ।
అతిక్రాంతే చ లోకానా మభావో నియతం భవేత్ ॥ (78)

న విద్యతే వ్యవస్థానం కుస్త్రిద్ధయోః కృష్ణయోః క్వచిత్ ।
స్రష్టారౌ జగతశ్చైవ సతతం పురుషర్షభౌ ॥ (79)

నరనారాయణౌ వేతౌ పురాణౌ వృషిసత్తమౌ ।
అనియమ్యౌ నియంతారౌ వేతౌ తస్మాత్పరంతపౌ ॥ (80)

నైతయోఽస్తు సమః కశ్చిద్దివి వా మానుషేషు వా ।
అనుగమ్య త్రయో లోకా స్సహదేవర్షిచారణైః ॥ (81)

సర్వే దేవగణాశ్చాపి సర్వభూతాని యాని చ ।
అనయోస్తు ప్రభావేన వర్తతే నిఖిలం జగత్ ॥ (82)

కర్ణో లోకా నయం ముఖ్యా నాప్నోతు పురుషర్షభః ।
కర్ణో వై కర్తన శ్శూరో విజయ స్త్వస్తు కృష్ణయోః ॥ (83)

వసూనాం సమలోకత్వం మరుతాం వాస మాప్నుయాత్ ।
సహితో ద్రోణభీష్మాభ్యాం నాకలోక మవాప్నుయాత్ ॥ (84)

ఇత్యుక్తో దేవదేవాభ్యాం సహస్రాక్షోఽబ్రవీ ద్వచః ।
ఆమన్త్ర్య సర్వభూతాని బ్రహ్మశాసనం ॥ (85)

శ్రుతం భవద్భి ర్యత్ప్రోక్తం భగవద్భ్యాం జగద్ధితం ।
తత్తథా నాన్యథా తద్ధి తిష్ఠధ్వం విగతజ్వరాః ॥ (86)

ఇతి శ్రుత్వేంద్రవచనం సర్వభూతాని మారిష ।
విస్మితా న్యభవ న్రాజన్ పూజయాం చక్రిరే తదా ॥ (87)

ఇందులో తనకొడుకు గెలువవలెనని గెలుచునని వాసవుడు, తన కొడుకే గెలువవలె నని గెలుచు నని సూర్యుడు, కర్ణార్జునయుద్ధసందర్భమున వివరించుకొనిరి. ఈసందర్భములో సర్వభూతప్రకృతి పుత్రగుద్ధులైన వాసవ సూర్యుల పక్షమును చేరినది. అనగా కర్ణుడు గెలువవలెనని కొందరు, అర్జునుడు గెలువవలెనని కొందరు అట చేరిరి. కర్ణునిపక్షమును, అర్జునునిపక్షమును చేరిన ఈ భూతప్రకృతివర్గమంతయు కేవలము కర్ణార్జునులను దృష్టియందుంచుకొని వారి వారి పక్షము చేరలేదు, వాసవసూర్యులను దృష్టియందుంచుకొని కొందరటు, కొందరిటు జేరిరి. వాచ్యముగ పుత్రప్రేమ వాసవసూర్యులదే యైనను పుత్రప్రేమాకృష్టులై నటువంటి వాసవసూర్యులపక్షముతో చేరినటువంటి వీరియందుకూడ అది వ్యంగ్యముగా నుండకపోయినచో తద్విశిష్టులగు వాసవసూర్యులపక్షము వహించి

కర్ణార్జునులపక్షమునచేరియుండరు. కనుక సర్వభూతములు పుత్రప్రేమకలవే అన్న ధృతరాష్ట్రుని వచనమును సమర్థించుటకే ఈ ఘట్టమును వ్యాసమహర్షి నిర్మించెను.

నిజమునకు అర్జునునిది దైవపక్షము, కర్ణునిది రాక్షస అసురపక్షము కదా! దైవపక్షముధర్మపక్షము అసురపక్షము అధర్మపక్షముకదా! ధర్మమునుజయింపవలెను. అధర్మము నశింపవలెను అనుచు ధర్మాశ్రయుడైన అర్జునుడు గెలువవలెను అధర్మాశ్రయుడైన కర్ణుడు ఓటమిని పొందవలెను అని ఆసందర్భమున వాదవివాదములు జరిగిన బాగుండెడిది. నాకొడుకు జయించును. నాకొడుకు జయించును. అని త్రిలోకాధిపతి యైనటువంటిఇంద్రుడు, లోకబాంధవుడైనటువంటి సూర్యుడు ఇట్లు వివరించుకొనుటలో :—

ఆత్మజేషు పరాం ప్రీతిం సర్వభూతాని కుర్వతే ।

అన్న ధృతరాష్ట్రవాక్యపరమార్థమును నిరూపించుటకే వ్యాసమహర్షి ఈ ఘట్టము నింత వివరముగ నిర్మించె నని తెలియుచున్నది. "సర్వభూతాని" అన్న ఈ ధృతరాష్ట్రవాక్యములలోని సర్వభూతపుత్రప్రీతి చూపుటకే "సర్వభూతాని యాని చ" (63-82) శ్లోకములలో పునరుక్తముగా ఈఘట్టమునందు స్వీకరించెను. అర్జునవిజయార్థము ఇంద్రుడు పితామహునకు నమస్కరించి "కృష్ణులకు విజయము ధ్రువమైనట్లు భగవంతుడవైన నీచేత మున్ను చెప్పబడెను" అని—

"పూర్వం భగవతా ప్రోక్తం కృష్ణయో ర్విజయో ధ్రువః ।" అన్న వాక్యముచే స్మరింపచేయుట-అది అట్లే అగుగాక. భగవానుడా! నమస్కారము "త త్తథాఽస్తు నమ స్తేఽస్తు ప్రసీద భగవ న్మమ" అనుటచేత ఇంద్రుడు పితామహునివలన తన పుత్రుని విజయమును సాధించుకోనెంచుట, చూడగా ఆతనిలో పుత్రప్రీతి పరాకాష్ఠను పొందిన దని తెలియుచున్నది. దీనినిబట్టి పుత్రప్రీతి ఒక్కధృతరాష్ట్రునకే కాదు. అందరియందును. అది—

ఈశ్వర స్సర్వభూతాని హృద్దేశేర్జున తిష్ఠతి ।
భ్రామయ న్సర్వభూతాని యంత్రారూఢాని మాయయా ॥

అన్న శ్లోకమునందు సర్వభూతహృదయములయందు ఈశ్వరు డున్నట్లు వ్యాపించియున్నది. పుత్రుడే హృదయము. అన్న వేదవాక్యము ననుసరించి హృదయస్థానీయుడైన పుత్రునియందు హృదయమునందుగల ప్రీతి హృదయదేశ మందున్న ఈశ్వరుడే యని స్పష్టమగుచున్నది. ఇక్కడ "సర్వభూతాని" అన్న పదము ధృతరాష్ట్రుడు "ఆత్మజేషు" అన్న శ్లోకములో చెప్పిన "సర్వభూతాని" అన్నపదమును అర్థించును. ఆ సర్వభూతములయందు ఉన్న ఈశ్వరుడు సర్వభూతము

లను మాయతో త్రిప్ప ననగా ఈ పుత్రప్రీతితోనే త్రిప్ప నని చెప్పవలెను. ప్రకృతము అర్జునుడు హృదయదౌర్బల్యముతో నున్నా డని "క్షుద్రం హృదయ దౌర్బల్యం త్యక్త్వోత్తిష్ఠ పరంతప।" అన్న గీతాచార్యుని వాక్యముచే తెలియు చున్నది. అర్జునుడు ముఖ్యముగా ముక్కుపచ్చలారని తన పుత్రుడు అభిమన్యుడు, తన హృదయరూపమైన అభిమన్యుడు చనిపోవుననే యుద్ధమే ముఖ్యము చూపు టలో హేతువుగా భావింపవచ్చును. "అశోచ్యా నన్వశోచస్త్వం" అన్న వాక్యము నకు పరమార్థము అభిమన్యు వధాఘట్టమే అని విచారింపగా తెలియును.

అవితృప్త స్స సంగ్రామా దశోచ్యః పుణ్యకర్మకృత్ । (ద్రో. 49-39)

ఇందలి "అశోచ్య" శబ్దము "అశోచ్యా నన్వశోచ స్త్వ" అన్న చోట అశోచ్య శబ్దము నాకర్షించుచున్నది. దీనిని బట్టి అశోచ్యు లెవరు అనగా యుద్ధమునందు వెనుదీయక పోరాడినవారు. అని ఈ సందర్భమునుబట్టి తెలియును. ఈ సందర్భమున అనగా అభిమన్యు వధాసందర్భమున చెప్పిన కథలలో ముఖ్య ముగా పుత్రశోకార్తుల కథలు వారి బంధువులకు నారదాది మహర్షులు మున్నగు వారు ఆ మృతపుత్రులు అశోచ్యులు.

"తస్మా న్మృతాన్ నానుశోచంతి ధీరాః" (ద్రో. 54-51)

పుత్రా న్నష్టా చ్ఛోక మాశు త్యజస్వ ॥ (ద్రో. 54-52)

అని వివరించుట చూడగా అర్జునశోకము గీతాప్రథమాధ్యాయమున ద్వితీ యాధ్యాయములోను వాచ్యవిషయము లెట్లున్నను అంతరంగికముగా అర్జునుని హృదయములోని అభిమన్యువు మున్నగు కుమారులను మృతిని ఊహించుట వల నన్నే కలిగిన దని భారతమును పూర్తిగా చదివిన తెలియును. ద్రోణపర్వము 72 అధ్యాయములో 66 నుండి 74 శ్లోకములు చూడదగినవి.

వజ్రసారమయం నూనం హృదయం సుదృఢం మమ । (ద్రో.72-52)

వజ్రసారమయం నూనం హృదయం య న్న యాస్యతి । (ద్రో. 72-58)

ఈ రెండుశ్లోకములలోను అర్జునుడు కృష్ణునితో "క్షుద్ర మగు హృదయ దౌర్బల్యము విడువు మంటివి గదా. కృష్ణా! నా హృదయము వజ్రసారమయము" అని ఆగీతలో కృష్ణుడు చెప్పిన వాక్యమును ఎత్తి చూపుచున్న ట్లున్నది.

పుత్రశోకార్దితం పార్థం ధ్యాయంతం సాశ్రులోచనమ్ ।
నిగృహ్య వాసుదేవ స్తం పుత్రాధిభి రభిప్లుతం ॥ (ద్రో. 72-65)
మైవ మిత్యబ్రవీ త్కృష్ణ స్తీవ్రశోకసమన్వితమ్ ।
సర్వేషా మేష వై పంథా శ్శూరాణా మనువర్తి నామ్ ॥ (66)

క్షత్రియాణాం విశేషేణ యేషాం యుద్ధేన జీవికా ।
ఏషా వై యుధ్యమానానాం శూరాణా మనివర్తినాం ॥ (67)
విహితా ధర్మశాస్త్రజ్ఞై ర్గతి ర్మతిమతాం వర ।
ధ్రువం హి యుద్ధే మరణం శూరాణా మపలాయినామ్ ॥ (68)
గతః పుణ్యకృతాం ల్లోకా నభిమన్యు ర్న సంశయః ।
ఏత చ్చ సర్వవీరాణాం కాంక్షితం భరతర్షభ ॥ (69)
సంగ్రామేఽభిముఖో మృత్యుం ప్రాప్నుయా దితి మానద ।
స చ వీరా న్రణే హత్వా రాజపుత్రా న్మహాబలాన్ ॥ (70)
వీరై రాకాంక్షితం మృత్యుం సంప్రాప్తోఽభిముఖో రణే ।
మా శుచః పురుషవ్యాఘ్ర పూర్వై రేష సనాతనః ॥ (71)
ధర్మకృద్భిః కృతో ధర్మః క్షత్రియాణాం రణే క్షయః ।
ఇమే తే భ్రాతర స్సర్వే దీనా భరతసత్తమ ॥ (72)
త్వయి శోకసమావిష్టే నృపా శ్చ సుహృద స్తవ ।
ఏతాం శ్చ వచసా సామ్నా సమాశ్వాసయ మానద ॥ (73)
విదితం వేదితవ్యం తే న శోకం కర్తు మర్హసి ।
ఏవ మాశ్వాసితః పార్థః కృష్ణే నాద్భుతకర్మణా ॥ (74)

ఇందులో ముఖ్యముగా "మా శుచః" "న శోకం కర్తు మర్హసి" అన్న కృష్ణునివచనములు గీతలోని "న త్వం శోచితు మర్హసి" "మా శుచః సంపదం దైవీం అభిజాతోఽసి పాండవ" మున్నగు వాక్యముల నాకర్షించుచున్నవి. అర్జునుడు రాబోవు ఘోరసంగ్రామమునందు గతవయస్కులు ఎవరెట్లు పోవుదు రన్నది కాక తన పుత్రులగు అభిమన్యుడు మున్నగువారు చనిపోవుదు రని ఊహించియే యుద్ధవైముఖ్యమును చూపెను. శోకించెను.

"యా నేవ హత్వా న జిజీవిషామః ।
తేఽవస్థితాః ప్రముఖే ధార్తరాష్ట్రాః ॥"

ఎవరిని చంపిన మనము బ్రతుకమో అట్టిధార్తరాష్ట్రులు ఎదుట నున్నారు. అన్నది వాచ్యార్థము. వ్యంగ్యార్థమును కూడ ఈ వాక్యమున గ్రహింప తగును. ధార్తరాష్ట్రులు ఎన్నో అపకారములు చేసినవారు. వారిని చంపిన అట్లు బ్రతుకిలేమని ఎట్లు చెప్పగలము? ముఖ్యముగా బ్రతుకలేము అని "న జిజీవిషామః" అన్న వచనములో కృష్ణునికూడ కలుపుకొనినట్లున్నది. కనుక అభిమన్యుడు చనిపోయి నప్పుడే కృష్ణుడు కూడ శోకార్తుడైనాడు. ఇంతకు చెప్పునదేమనగ అర్జునునియందున్న

ఈపుత్రప్రీతి ఉన్నది. అభిమన్యుడు చనిపోయినపుడు, ఘటోత్కచుడు చనిపోయినపుడు ధర్మరాజు పొందిన శోకము ఇంతింతనరాదు. ఏకచక్రపురమున బకాసురుని చంపిన భీముని చూచి ధర్మరాజు కుంతితో అనిన పుత్రప్రీతి పురస్కృతమైన వచనములు ఆతని పుత్రగృద్ధిని వెల్లడించును. ఇట్లు మహాభారతమునందంతయు ఎక్కడచూచిన అక్కడ ఎవరినిచూచిన వారియందే ఈ పుత్రగృద్ధి జ్ఞానికి సర్వత్ర పరమాత్మ కనపడినట్లు కనపడును.

కనుక పుత్రప్రీతి కలవాడని ధృతరాష్ట్రుని నిందించుచు అట్టివాని కొడుకే అయిన దుర్యోధనుడు అనేక విధములుగా దుష్టుడు దుర్బుద్ధి అని చెప్పుటకే "ధార్తరాష్ట్రస్య దుర్బుద్ధేః" అని అర్జునుడు చెప్పినని వ్యాఖ్యానించుట అవిచారితరమణీయము. కనుక సర్వభూతములయందు సమానముగనుండు పుత్రప్రీతి నింద్యము కాదు. ధృతరాష్ట్రుడు దుర్యోధనుని విడువకుండుట దోషము కాదు. మరి, దుర్యోధనుడు దుష్టకార్యములు చేసిన యనంతరము వీని దౌష్ట్య మెత్తిచూపి శిక్షింపుమని చెప్పుచో ధృతరాష్ట్రుడు వినియుండెడివాడేమో. అటుకాక పుట్టగనే చంపుమన్నచో ఎంత ధార్మికుడైనను అట్లు చేయునా? అప్పటి నుండి ధృతరాష్ట్రుని మనస్సులో దుర్యోధనుని యెడల కొందరు అకారణవైరము కలిగియున్నారని నాటుకొనినది. అందువలన దుర్యోధనుని తప్పులు ధృతరాష్ట్రునకు అంతగ కన్పింపలేదేమో!

నిజ మాలోచింపగా సమస్తత్యాగములలోను పుత్రత్యాగమే నచికేతోపాఖ్యానఫలముగా కన్పట్టుచున్నది. అంత గొప్ప వాజశ్రవుడు పీతోదకములు, జగ్ధతృణములు, దుగ్ధదోహములు అగు గోవులను దాన మిచ్చునా? అట్లు దానమిచ్చుటలో వాజశ్రవుని భావము ఏమై యుండును. ఇట్లు చేసినచో కుమారుడు నచికేతుడు యేదియైనను అనును. ఆ సాకుతోనే ఆపుత్రుని త్యజింపవచ్చును అనియేకదా! నచికేతుడు తండ్రి భావమును తెలిసిన వాడగుటచే పుత్రుడైన తాను త్యక్తుడు కానిదే తండ్రికి త్యాగఫలము లభింపదని తదనుగుణముగ ప్రశ్నించి తండ్రి తనను త్యజించునట్లుగా చేసికొనెను. "న కర్మణా న ప్రజయా ధనేన త్యాగే నైకే అమృతత్త్వమానసుః" అన్న ఉపనిషన్మంత్రార్థమగు పుత్రరూపమైన ధనత్యాగమువలననే అమృతత్వము లభించును. కనుకనే పుత్రరూపధన త్యాగమును వాజశ్రవుడు చేసెను. అట్టి త్యాగమును చేయుటకు తగిన వాతావరణమును పుత్రుడు కలిగించెను.

ప్రకృతము ధృతరాష్ట్రుడు నిజముగా పుత్రత్యాగ మొనరించి అమృతత్వ మొందిన మహామనీషి.

సర్వా న్వ స్తాత! శోచ్యామి త్యక్తో దుర్యోధనో మయా ।
యే మంద మనుయాస్యధ్వం యాంతం వైవస్వతక్షయమ్ ॥ (ఉ. 57-19)

రాయబారిగా పోయిన సంజయుడు తిరిగివచ్చి కొన్ని పరుషోక్తులాడి ధర్మరాజుయొక్క సభలో తాను తెలిసికొనివచ్చిన విశేషములు మరుచటి రోజు ఉదయము సభలో చెప్పగలను. అని వెడలిపోగా దిక్కుతోచని ధృతరాష్ట్రుడు విదురుని పిలిపించుకొని అనేక నీతులను వినెను. మనస్సు ఇంకను కుదుటపడలేదు. సనత్సుజాతుని వలన వేదాంతమును వినెను. ఆపిమ్మట సంజయుడు తాను పోయి వచ్చిన విషయములను వివరించెను. ధృతరాష్ట్రుడు ఇట్లనెను ;—

న సన్తి సర్వే పుత్రా మే మూఢా దుర్ద్యూతదేవినః ।
యేషాం యుద్ధం బలవతా భీమేన రణమూర్ధని ॥ (ఉ. 56-26)
రాజానః పార్థివా స్సర్వే ప్రోక్షితాః కాలధర్మణా ।
గాండీవాగ్నిం ప్రవేక్ష్యంతి పతంగా ఇవ పావకమ్ ॥ (ఉ. 56-27)
విద్రుతాం వాహినీం మన్యే కృతవైరైర్మహాత్మభిః ।
తాం రణే కేऽనుయాస్యన్తి ప్రభగ్నాం పాండవైర్యుధి ॥ (28)
సర్వే హ్యతిరథాః శూరాః కీర్తిమంతః ప్రతాపినః ।
సూర్యపావకయో స్తుల్యా స్తేజసా సమితింజయాః ॥ (29)
యేషాం యుధిష్ఠిరో నేతా గోప్తా చ మధుసూదనః ।
యోధౌ చ పాండవౌ వీరౌ సవ్యసాచివృకోదరౌ ॥ (30)
తాన్ సర్వగుణసంపన్నా నమనుష్యప్రతాపినః ।
క్రోశతో మమ దుష్పుత్రో యోద్ధు మిచ్ఛతి సంజయ ॥ (35)

ఈవిధముగా ధృతరాష్ట్రుడు చెప్పగా దుర్యోధనుడు ;—

ఉభౌ స్వ ఏకజాతీయౌ తథోభౌ భువిగోచరౌ ।
అథ కస్మా త్పాండవానా మేకతో మన్యతే జయమ్ ॥ (36)

ఇత్యాదిగా దుర్యోధనుడు ధృతరాష్ట్రవాక్యములను నిరాకరించెను. తరువాత ధృతరాష్ట్రుడు ఇంకను చెప్పవలసినది చెప్పగా, కడకు దుర్యోధను డిట్లు చెప్పెను.

నాహం భవతి న ద్రోణే నాऽశ్వత్థామ్ని న సంజయే ।
చ భీష్మే న చ కాంభోజే న కృపే న చ బాహ్లికే ॥ (ఉ 57-10)
సత్యవ్రతే పురుమిత్రే భూరిశ్రవసి వా పునః ।
అన్యేషు వా పావకేషు భారం కృత్వా సమాహ్వయే । (57-11)

అహం చ తాత కర్ణశ్చ ప్రాణయజ్ఞం వితత్య వై ।
యుధిష్ఠిరం పశుం కృత్వా దీక్షితౌ పురుషర్షభౌ ॥ (57-12)
రథో వేదీ స్రువః ఖడ్గో గదా స్రుక్కవచం సదః ।
చాతుర్హోత్రం చ ధుర్యా మే శరదర్భా హవి ర్యశః ॥ (57-13)
ఆత్మయజ్ఞేన నృపతే ఇష్ట్వా వైవస్వతం రణే ।
విజిత్య చ సమేశ్యావో ష్యావోహతామిత్రౌ శ్రియా వృతౌ ॥ (57-14)
అహం చ తాత! కర్ణశ్చ భ్రాతా దుశ్శాసనశ్చ మే ।
ఏతే వయం హనిష్యామః పాండవాన్ సమరే త్రయః ॥ (57-15)
అహం హి పాండవా న్హత్వా ప్రశాస్తా పృథివీ మిమామ్ ।
మాం చ హత్వా పాండుపుత్రా భోక్తారః పృథివీ మిమామ్ ॥ (57-16)
త్యక్తం మే జీవితం రాజ్యం ధనం సర్వంచ పార్థివ ।
న జాతు పాండవై స్సార్థం వసేయ మహ మప్యుత ॥ (57-17)
యావద్ధి సూచ్యాః తీక్ష్ణాయా విధ్యే దగ్రేణ మారిష ।
తావ దప్యపరిత్యాజ్యం భూమే ర్నః పాండవా న్ప్రతి ॥ (57-18)

ఈ శ్లోకములలో దుర్యోధనుడు, ధృతరాష్ట్రుడు తనను త్యజించు విధానము కల్పించెను. వెంటనే ధృతరాష్ట్రుడు "త్యక్తో దుర్యోధనో మయా" అని దుర్యోధనుని త్యజించెను. ఈ ఘట్టమునందు వాజస్రవ నచికేతుల కథాసంవిధాన పరమార్థము ప్రకాశమాన మగుచున్నది. కనుక "ధార్తరాష్ట్రస్య దుర్బుద్ధేః" అని నప్పుడు సర్వాత్మనా పుత్రత్యాగ మనుసరించిన ధృతరాష్ట్రుని నిందింప నవకాశము లేదు. అట్టి భావము నరునకు ఉండదు. వ్యాసుడు ధృతరాష్ట్రుని నిందించుటకే ధృతరాష్ట్రపుత్రులగు దుర్యోధనుని "ధార్తరాష్ట్రస్య" అని అర్జునుడు పేర్కొనినట్లు రచింపడు. కావున ఇట భావము వేరే రీతిలో స్వీకరింపవలెను. మహానుభావుడగు ధృతరాష్ట్రునియొక్క పుత్రుడై కూడ దుర్బుద్ధిగా నున్నాడే అన్నదే అర్జునుని భావముగా గ్రహింపవలయును. కావున గీత చదువునప్పుడు వ్యాసమహర్షి ఏ పాత్రను ఎట్లు పోషింప నెంచెనో పూర్వాపరసందర్భవిచారణాపుర [illegible]ముగా గ్ర[illegible]ంప కున్నచో గీత చదువుట వ్యర్థము. అట్లు వ్యర్థముగ చదివి [illegible] ననుసరించు కుమతుల దుష్టభావములను సహృదయులు చెవిని పెట్టుకుందురుగాక.

[illegible] ఘటములో దుర్యోధను[illegible] ధృతరాష్ట్రుడు త్యజించువరకు దుర్యోధ[illegible] ప్రత్యక్షముగ కాను [illegible]న్న [illegible]డు. అందువలన దుర్యోధనుడు

తండ్రిచేయి బిడ్డగనే ఉన్నా డనుట నిశ్చయము. కృష్ణవచనములకు సమాధానము చెప్పుచు దుర్యోధనుడు పలికిన ఈ క్రిందివచనములు తిలకింపుడు —

స్వధర్మ మనువశ్యన్తో యది మాధవ సంయుగే ।
అస్త్రేణ నిధనం కాలె ప్రాప్స్యామ స్స్వర్గ మేవ తత్ ॥ (ఉ. 126-15)
ముఖ్య శ్చైవైష నో ధర్మః క్షత్రియాణాం జనార్దన ।
య చ్ఛయీమహి సంగ్రామే శరతల్పగతా వయమ్ ॥ (ఉ. 126-16)
తే వయం వీరశయనం ప్రాప్స్యామో యది సంయుగే ।
అప్రణమ్యైవ శత్రూణాం న న స్తప్స్యతి మాధవ ॥ (ఉ. 126-17)
క శ్చ జాతు కులే జాతః క్షత్రధర్మేణ వర్తయన్ ।
భయా ద్వృత్తిం సమీక్ష్యైవ ప్రణమే దిహ కర్హిచిత్ ॥ (ఉ. 126-18)
ఇతి మాతంగవచనం పరీప్సన్తి హితేప్సవః ।
ధర్మాయ చైవ ప్రణమే ద్బ్రాహ్మణేభ్య శ్చ మద్విధః ॥ (19)
అచింతయన్ కించి దన్యం యావ జ్జీవం తథా చరేత్ ।
ఏష ధర్మః క్షత్రియాణాం మత మేత చ్చ మే సదా ॥ (20)
రాజ్యాంశ శ్చాభ్యనుజ్ఞాతో యో మే పిత్రా పురాభవత్ ।
న స లభ్యః పున ర్జాతు మయి జీవతి కేశవ ॥ (21)
యావ చ్చ రాజా ధ్రియతే ధృతరాష్ట్రో జనార్దన ।
న్యస్తశస్త్రా వయం తే వా ప్యుపజీవామ మాధవ ! ॥ (22)
అప్రదేయం పురా దత్తం రాజ్యం పరవతో మమ ।
అజ్ఞానా ద్వా భయా ద్వాపి మయి బాలే జనార్దన! ॥ (23)
న త దద్య పున ర్లభ్యం పాండవై ర్వృష్ణినందన ।
ధ్రియమాణే మహాబాహో మయి సంప్రతి కేశవ ॥ (24)
యావద్ధి తీక్ష్ణయా సూచ్యా విద్ధ్యే దగ్రేణ కేశవ ।
తావ ద ప్యపరిత్యాజ్యం భూమే ర్నః పాండవా న్ప్రతి ॥ (25)

ఈశ్లోకములు ఇంతవరకు జరిగిన యావద్విషయసంగ్రాహకములు. ముఖ్యముగా పాండవులకు రాజ్యార్హత లేకున్నను వారు తమ తండ్రి ధృతరాష్ట్రునివలన భాగమును పొందిరి. దానిని వారు పొందకుండగా తాను చేయలేకపోతి నని అందుకు తన అజ్ఞానముగాని, పాండవులు బలవంతు లన్న భయముకాని ఈరెంటికి కారణమైన తన బాల్యమువలనగాని పొందిరి. సరే దానిని వారు జూదమున ఓడగా నేను పొందితిని. ఇప్పుడు అది వారికి లభ్యము కాదు. ద్యూతమున అనుకున్న ప్రకార

ముగా వారు నియమపాలనము చేయలేదు అన్న భావము ఇంతకు ముందే నిరూపిత చరము. అయినందున దానిని వాచ్యముగ చెప్పక వ్యంగ్యముగా క్షత్రియులకు ధర్మ మైన యుద్ధమును తాను సమర్థించుచున్నట్లు చెప్పెను.

ఇందు ముఖ్యముగా గమనింపదగిన భావము తండ్రిమాట విని పాండవులకు రాజ్యాధికారము లేకపోయినను వారలకు తన తండ్రి రాజ్య మిచ్చుచుండగా దుర్యోధనుడు ఊరకుండుట "బాల్యాత్" అన్న శబ్దము పెద్దవాడు చెప్పుచుండగా పిల్లవాడు వినవలెను. అన్న సిద్ధాంతప్రకారముగానే నేను వింటిని అన్న భావమే.

ఇక్కడ విమర్శకపండితులు దుర్యోధనుడు "బాల్యాత్" అనుట దుర్యోధనుడు అబద్ధము చెప్పినట్లుగా వ్యాఖ్యానించిరి. కర్ణుడికి అంగరాజ్య మిచ్చుట మున్నగు పెద్దకార్యములు చేసియు, తన బాల్యమును చెప్పుకొనుట, అబద్ధముగాక మరేమగును? అని వారి భావన కాని తాము ఎంత పెద్దవార మన్న భావ మున్నను నిజముగ పెద్దవా రైనను వినయవిధేయతలు కలవారు పెద్దవారి ఎదుట తాము బాలురమే అని వచింతురు. ఇట్లు చెప్పుట దుర్యోధనునియందు తగనితనమే అగుచో విదురుడు ధృతరాష్ట్రునితో పాండవులను గురించి చెప్పుచు "నీవు వృద్ధుడవు; వారు శిశువులు" అని చెప్పెను.

పితాఽసి రాజన్ పుత్రాస్తే వృద్ధస్త్వం శిశవః పరే।
వర్తస్వ పితృవత్తేషు వర్తన్తే తే హి పుత్రవత్॥ (ఉ. 86-15)

ఈ శ్లోకములో విదురుడు పాండవులను శిశువులుగా చెప్పుచున్నాడే, ఇది విదురునియందలి అసత్యానౌచిత్యములను నిరూపించునా? కనుక తండ్రివద్ద బిడ్డ లెప్పుడు బాలురుగా శిశువులుగా చెప్పబడుట పండితులకు ఏల అనిపించినదో వారు తప్ప దీనికి మరొకరు సమాధానము చెప్పలేరు కదా?

"తత్సూక్తిసహస్రద్యోతితాత్మనాం మహాత్మనాం దోషోద్ఘోషణం ఆత్మన ఏవ దూషణం భవతి" అన్న ధ్వన్యాచార్యులవారి హితోక్తిని స్మరించి ముందుకు సాగుదము.

దుర్యోధనుడు ఏది చేసినను దానిని తండ్రిచే నంగీకరింపజేసి చేయుచుండును. ఈక్రింది ధృతరాష్ట్రవచనములే దుర్యోధనుని సత్ప్రవృత్తికి నిదర్శనములు.

తథాపి నికృతిప్రజ్ఞం పుత్రం దుర్ద్యూతదేవినం।
న శక్నోమి నియంతుం వా కర్తుం వా హిత మాత్మనః॥ (ఉ.158-5)
భవత్యేవ హి మే సూత బుద్ధి ర్దోషానుదర్శినీ।
దుర్యోధనం సమాసాద్య పున స్సా పరివర్తతే॥ (ఉ. 158-6)

సా తు బుద్ధిః కృతా పేృవం పాండవా న్ప్రతి మే సదా ।
దుర్యోధనం సమాసాద్య పున ర్విపరివర్తతే ॥ (ఉ. 39–31)

ఈ శ్లోకములవలన ధృతరాష్ట్రుడు ఏది అనుకున్నను దుర్యోధనుడు తన వినయవిధేయతలచే తండ్రిని తనకు అనుకూలపరచుకొనుచుండెడివాడు. అందుచేత ధృతరాష్ట్రుడు పుత్రుని చర్యలను గర్హించుచున్నను పుత్రుని విడువలేక పోయెను. అంతమాత్రమున ధృతరాష్ట్రుని పుత్రగృద్ధుడని నిందింపబూనుట గొడ్డుమోతుల లక్షణము. పాండవులకు–ధార్తరాష్ట్రులకు కలిగిన తగవులలో ప్రతి తగవునకు, లేక దుర్యోధనుడు చేసిన ప్రతి అకృత్యమునకు పాండవులే కారణము. ఈవిషయము వివరముగా గీతోపదేశతత్త్వము రెండవభాగములో చూడగలరు. కనుక ధృతరాష్ట్రుడు పుత్రుని విడువలేదు. అన్నఅపనిందపాలుకావలసినవాడుకాడు.

సముచ్ఛేదం హి నః కృత్స్నం వాసుదేవ శ్చికీర్షతి ॥ (ఉ. 54–8)
ఋతే చ విదురా స్సర్వే యూయం వధ్యా మతా మమ ।
ధృతరాష్ట్ర స్తు ధర్మజ్ఞో న వధ్యః కురుసత్తమః ॥ (ఉ. 54–9)

ఈ వాక్యములలో ధృతరాష్ట్రుడు ధర్మజ్ఞుడుగా, అవధ్యుడుగా కురుసత్తముడుగా కృష్ణుడు చెప్పెను. అని దుర్యోధనుడు ధృతరాష్ట్రుని ఎదుట అనువదించెను. కృష్ణుని దృష్టిలో ధర్మజ్ఞుడుగా నవధ్యుడుగా కీర్తింపబడిన ధృతరాష్ట్రుని దుష్టునిగా దుర్బుద్ధినిగా చిత్రింప నెంచి "ధార్తరాష్ట్రస్య దుర్బుద్ధేః" అని అర్జునుడు అనునా?

అగుచో "ధార్తరాష్ట్రస్య దుర్బుద్ధేః" అనుట ఏల? కథాపి ఖలు పాపానాం అల మశ్రేయసే యతః। (శిశు.2–40)ఇత్యాదివచనములు దుర్మార్గులపేర్లు ఉచ్చరింపరాదని వచించుచున్నవి. కావున దుర్యోధనుని "ధార్తరాష్ట్రస్య" అని ధర్మజ్ఞుడగు ధృతరాష్ట్రుని అపత్యముగా పేర్కొనుచున్నాడు. "ధార్తరాష్ట్రస్య" అంతమాత్రమే అన్నచో ధృతరాష్ట్రునియందలి ధర్మజ్ఞత దుర్యోధనునియందుకూడ నను వర్తించు నేమో యని దుర్బుద్ధేః అని విశేషణము చేర్చినాడు. శత్రువును పేరున పేర్కొన్నచో మిత్రమగు నని వైదికరహస్యము. దుర్యోధనునితో యుద్ధము చేయ నెంచిన అర్జునుడు దుర్యోధన శబ్దముచే పేర్కొనలే దని చెప్పుటయు సమంజసము. దీనిని బట్టి కూడ అర్జునుడు యుద్ధవైముఖ్యము చూపలేదని తెలియును కాగా "ధార్తరాష్ట్రస్య" అన్నపదమును అర్జునుడు ధృతరాష్ట్రుని నిందించుటకుగా గ్రహింపలేదు. "ధార్తరాష్ట్రస్య దుర్బుద్ధేః" "ధార్తరాష్ట్రాన్ స్వబాంధవాన్" అని రెండు ప్రయోగములను అర్జునుడే ప్రయోగించెను. ఏకవచనమువలన ఒక్క

దుర్యోధనుడే, అతని కభిన్నుడై అతని యథావచనకారి యగు దుశ్శాసనుడు వధింపతగు నని సూచింపబడుచున్నది. "ధార్తరాష్ట్రాన్ అన్న పదముతో" "స్వబాంధవాన్" అన్నపదము కలుపుచున్నాడు కనుక వికర్ణాదిదుర్యోధనసోదరు లందరు అవధ్యులని కూడ అర్జునుని ఆశయముగా గ్రహించవచ్చును. కనుక ఒక్క దుర్యోధనునియందే కృష్ణార్జునులు ఎక్కువ వైరము చూపిరి.

అగుచో కారణమందు లేని గుణములు కార్యమునం దుండునా? సంప్రదాయము ననుసరించి పుత్రుడు కారణమైన తండ్రిగుణములు కలిగియే యుండు నని ప్రసిద్ధి.

రూపం త దోజస్వి తదేవ వీర్యం
తదేవ నైసర్గిక మున్నతత్వమ్ ।
న కారణా త్స్వా ద్బిభిదే కుమారః
ప్రవర్తితో దీప ఇవ ప్రదీపాత్ ॥ (ర. 5-37)

ఇత్యాది మహాకవి వాక్కులు తండ్రికి కొడుకు అన్నిట నకలు అన్న విషయము నిరూపించుచున్నది. ఈ మహార్థమున భారతమున శకుంతలోపాఖ్యానము వలన ప్రదీప్త మగుచున్నది.

వేదే ష్వపి వదం తీమం మంత్రగ్రామం ద్విజా యతః ।
జాతకర్మణి పుత్రాణాం తవాపి విదితం తథా ॥ (ఆ. 74-63)
అంగా దంగా త్సంభవతి హృదయా దధిజాయసే ।
ఆత్మా వై పుత్రనామాసి స జీవ శరద శ్శతమ్ ॥ (ఆ. 74-64)
జీవితం త్వ దధీనం మే సంతాన మపి చాక్షయమ్ ।
తస్మా త్త్వం జీవ మే పుత్ర సుసుఖీ శరదాం శతమ్ ॥ (ఆ. 74-65)
త్వ దంగేభ్యః ప్రసూతోఽయం పురుషా త్పురుషోఽపరః ।
సరసీ వామలేఽఽత్మానం ద్వితీయం పశ్య వై సుతం ॥ (ఆ. 74-66)
యథా హ్యాహవనీయోఽగ్ని ర్గార్హపత్యా త్ప్రణీయతే ।
తథా త్వత్తః ప్రసూతోఽయం త్వా మేక స్స న్ద్విధా కృతః ॥ (ఆ 74-67)

ఈ శకుంతలావచనములు పితాపుత్రుల అభేదమును సూచించుచున్నవి. కావున దుర్యోధనునియందలి దుష్టబుద్ధికి ధృతరాష్ట్రుడు కాదన చెల్లదు. ఇంత మాత్రముచేత కొడుకుయందున్న దుర్గుణములకు తండ్రి కారణము అని సిద్ధాంతము చేయ సాహసింపరాదు.

"కుపుత్రో జాయేత క్వచి దపి కుమాతా న భవతి ।" అన్న శంకరవచనము కూడ పై వాదమునకు అపవాదము. ఇక్కడ మాతృశబ్దము ఉపలక్షణము, తండ్రిని గూడ చెప్పును. కనుక కొడుకునందు గల దుర్గుణములను పురస్కరించుకొని తండ్రి కూడ ఇట్టివాడే-అనుట అసంగతము. కావున "ధార్తరాష్ట్రస్య దుర్బుద్ధేః" అన్నప్పుడు ఈ యర్జునుడు ధృతరాష్ట్రనిందాపూర్వకముగా దుర్యోధనుని నిందించెననుట అవిచారితరమణీయము.

"పాండవు లమనుష్యప్రతాపులు, సర్వగుణసంపన్నులు. వారలతో యుద్ధము చేయవలదని నే నాక్రోశించుచున్నను దుష్పుత్రుడైన దుర్యోధనుడు వినుటలేదు. అని ధృతరాష్ట్రుడు పలుకుచున్నను—

ఉభౌ స్వ ఏకజాతీయౌ తథోభౌ భువి గోచరౌ ।
అథ కస్మా త్పాండవానాం ఏకతో మన్యసే జయమ్ ॥ (ఉద్యో. 56-36)

దుర్యోధనుడు దుర్బుద్ధి కాకపోయినచో మాతో సమానముగా తనను పేర్కొనునా? అమనుష్యప్రతాపులనుగా తండ్రి మమ్ములను చెప్పుచున్నను వినలేదే? అట్టి యీ దుర్బుద్ధి ధృతరాష్ట్రునకు దుఃఖప్రదుడే కదా! అన్నదే అర్జునుని భావము.

అస్మాకం తు విశిష్టా యే తా న్నిబోధ ద్విజోత్తమ । (గీత. 1-7)

ఇందు దుర్యోధనుడు ద్రోణుని "ద్విజోత్తమ" అని సంబోధించెను. ఈ "ద్విజోత్తమ" పదము ద్రోణునికి ఇష్టము. ద్రోణుడు పరశురామునిచేరి యిట్లనును—

భరద్వాజా త్సముత్పన్నం తథా త్వం మా మయోనిజమ్ ।
ఆగతం విత్తకామం మాం విద్ధి ద్రోణం ద్విజోత్తమమ్ ॥ (ఆ-131-57)

ఇందు అస్త్రవిద్యను పొందదలచి పరశురామునితో తనను గురించి తానే ద్విజోత్తము డను అని పరిచయముచేసికొనెను. ఈ ద్విజోత్తమపదము ద్రోణునికి ఇష్టమైన దని ఆపదముతోనే దుర్యోధనుడు ద్రోణుని సంబోధించెను మరియు అట్టు పరిచయము చేసికొని పరశురామునివలన అస్త్రవిద్యను పొందెను. ఈ పదముచే ద్రోణుని దుర్యోధనుడు సంబోధించుటలో నీతి యేమి? ఆచార్యోత్తమ! నీవు పరశురామునివలన ఏ అస్త్రవిద్యను సంపాదించితివో ఆ అస్త్రవిద్యను ఉపయోగించి నాకు జయమును కలగింపుమని భావము.

ద్రోణుని "ఆచార్య" అని సంబోధించెను. గురువు శిష్యునియందు పుత్రవాత్సల్యమును చూపును. నీవు నాకు ఆచార్యుడవు. నీకు నేను శిష్యుడను. నీవు

సర్వథా కాపాడతగుదువు. అన్న భావ మీ పదమువల్ల వ్యంగ్యము.

వ్యూఢాం ద్రుపదపుత్రేణ తవ శిష్యేణ ధీమతా ।

పాండవసైన్యము దక్క గా వ్యూఢమై యున్నది. ద్రుపదపుత్రుడు దీని నిట్లు పన్నెను. ఈ దుర్యోధనవాక్యములో "ద్రుపదపుత్రేణ, తవ శిష్యేణ ధీమతా" అన్న పదములలో "ధీమంతుడు, శిష్యుడు" అన్న రెండుపదములు కూడ ద్రుపదపుత్రునికి విశేషణములుగ వ్యాఖ్యాతలు భావించుచున్నారు. కాని ఆనాటి సైన్యవ్యూహరచన పాండవపక్షమున అర్జును డొనరించినదే.

అక్షౌహిణీం దశైకాం చ వ్యూఢాం దృష్ట్వా యుధిష్ఠిరః ।
కథ మల్పేన సైన్యేన ప్రత్యవ్యూహత పాండవః ॥ (భీ-19-1)
యో వేద మానుషం వ్యూహం దైవం గాంధర్వ మాసురం ।
కథం భీష్మం స కౌంతేయః ప్రత్యవ్యూహత సంజయ ॥ (2)

అని ధృతరాష్ట్రుడు సంజయుని ప్రశ్నించెను. ఈ ప్రశ్నలో "యుధిష్ఠిరః" పాండవః, కౌంతేయః," అన్న పదము లున్నవి. దీనిని బట్టి అల్పసైన్యముగల యుధిష్ఠిరుడు, మానుషము - దైవము, గాంధర్వము, ఆసురము అను వ్యూహములు తెలిసిన - భీష్మని వ్యూహమునకు ప్రతివ్యూహమును ఎట్లు పన్నెను? అని ధృతరాష్ట్రుని ప్రశ్న. ఈ ప్రశ్నవలన భీష్మ డొనరించిన వ్యూహమునకు ధర్మ రాజెట్లువ్యూహము పన్నెను? అని అర్థము వచ్చుచున్నది. ఈపైపున సేనానాయకుడగు భీష్ముడు వ్యూహమును పన్నగ ఆ పైపున ధర్మరా జెట్లు పన్నును. సేనా నాయకుడే గదా వ్యూహ మొనరించును. కావున కౌంతేయశబ్దమును పురస్కరించుకొని అర్జునుడే వ్యూహరచయితగ ధృతరాష్ట్రప్రశ్నలో ఉండునని గ్రహింపవలయును. ధర్మరాజు ఏ డక్షౌహిణులకు ఏడుగురు నాయకులను నియముంచి ఆసేనలకు సేనాపతిగా ధృష్టద్యుమ్నుని నియమించి ఆధృష్టద్యుమ్నునికి పైన అర్జునుని అటుపైన సర్వమునకు కృష్ణుని నాయకునిగ చేసిన టిదివరకే వివరింపబడినది. కనుక కౌంతేయుడు సేనాపతి - పతి కనుక ఆత డెట్లు భీష్మ డొనరించిన వ్యూహమునకు ప్రతివ్యూహము నొనరించె ననియే ధృతరాష్ట్రుని ప్రశ్నమునకు సారముగ గ్రహింపదగును. ఈవిషయము సంజయుని సమాధానములో స్పష్టమగును.

ధార్తరాష్ట్రా న్యనేకాని దృష్ట్వా వ్యూఢాని పాండవః ।
అభ్యభాషత ధర్మాత్మా ధర్మరాజో ధనంజయమ్ ॥ (3)
మహర్షే ర్వచనా త్తాత వేదయన్తి బృహస్పతేః ।
సంహతా న్యోధయే దల్పాన్ కామం విసరయే ద్బహూన్ । (4)

సూచీముఖ మనీకం స్యా దల్పానాం బహుభి స్సహ ।
అస్మాకం చ తథా సైన్య మల్పీయ స్సుతరాం పరైః ॥ (5)
ఏత ద్వచన మాజ్ఞాయ మహర్త్తే ర్వ్యూహపాండవ ।
ఏత చ్ఛ్రుత్వా ధర్మరాజం ప్రత్యభాషత పాండవః ॥ (6)
ఏష వ్యూహామి తే వ్యూహం రాజసత్తమ ! దుర్జయం ।
అచలం నామ వజ్రాఖ్యం విహితం వజ్రపాణినా ॥ (7)
య స్స వాత ఇవోద్భూతః సమరే దుస్సహః పరైః ।
స నః పురో యోత్స్యతే వై భీమః ప్రహరతాం వరః ॥ (8)
తేజాంసి రిపుసైన్యానాం మృద్నన్పురుష సత్తమః ।
అగ్రేగ్రణీ ర్యోత్స్యతి నో యుద్ధోపాయ విచక్షణః ॥ (9)
యం దృష్ట్వా కురవ స్సర్వే దుర్యోధన పురోగమాః ।
నివర్తిష్యన్తి సన్త్రస్తాః సింహం క్షుద్రమృగా యథా ॥ (10)
తం సర్వే సంశ్రయిష్యామః ప్రాకార మకుతో భయాః ।
భీమం ప్రహరతాం శ్రేష్ఠం దేవరాజ మివామరాః ॥ (11)
న హి తోఽస్తి పుమా న్లోకే యః సంక్రుద్ధం వృకోదరం ।
ద్రష్టు మత్యుగ్రకర్మాణం విషహేత నరర్షభం ॥ (12)
ఏవ ముక్త్వా మహాబాహు స్తథా చక్రే ధనంజయః ।
వ్యూహ్య తాని బలా న్యాసుఽపర్యయాౌ ఫాల్గున స్తథా ॥ (13)

ఈశ్లోకములవలన వజ్రాఖ్యమగు అచలవ్యూహమును పన్నినది అర్జునుడే కదా! "వ్యూఢాం ద్రుపద పుత్రేణ" అని ఎట్లనును. ఏది ఎవరు చేసినను సామాన్యాకారముగ అది సేనాపతికి దక్కును అనంతర మది నాయకునికి చెందును. అవునా! సామాన్యాకారముగ ద్రుపదపుత్రుడు సేనానాయకు డగుటవలన "ద్రుపదపుత్రేణ" అని అనును. "తవ శిష్యేణ, ధీమతా" అన్న పదములచేత అర్జుననే చెప్పెను. నిజమునకు ద్రోణునకు అందరూ శిష్యులైనను శిష్యుడన్న భావముతో చూచినది అర్జునుని మాత్రమే "ధీమతా" అన్న పదము అర్జునుని మాత్రమే చెప్పును కాని ద్రుపదపుత్రుని చెప్పదు. కనుక నీకు నిజమైన శిష్యుడగు ధీమంతుడైన అర్జునునిచే వ్యూఢమైన సైన్యమును చూడమనియే దుర్యోధనవచనతాత్పర్యమనియే భావింపవలయును. లేకున్న ప్రకరణమునకు అర్థము సరిపడదు. ద్రుపదపుత్రుని పేర్కొని దుర్యోధనుడు "తవ శిష్యేణ, ధీమతా" అని ద్రోణునితో ప్రాణము పోయినను అనడు. ఇచట విమర్శకులు ద్రోణుని రెచ్చకొట్టుటకు నిన్న

చంపుటకు పుట్టిన ద్రుపద పుత్రుడు నీకు శిష్యుడైనాడు. ఆచార్య! వాడెంత ధీమంతుడో కదా! ఇత్యాది ఆస్వారస్యమైన వ్యాఖ్యలు వెలయించుచున్నారు. ద్రుపద పుత్రశబ్దము వాచ్యముగ ధృష్టద్యుమ్నుని చెప్పుచున్నను వ్యంగ్యముగ అర్జునునే చెప్పును. పంచపితరులలో మామకూడ ఒకడే. ద్రుపదుని కట్టి పట్టి తెచ్చిన అర్జునునియందు ద్రుపదుడు వాత్సల్యమును చూపెనేగాని, ద్వేషమును చూపలేదు. "పుత్రా దిచ్ఛే త్పరాజయమ్" అన్న న్యాయానుసారము ఆతనిని పుత్రసదృశునిగా చేసికొనుటకు గానే ద్రుపదుడు అర్జునుని వరించు కన్యను పొందుటకు కారణమైనది కనుక ద్రుపదునికి పుత్రసదృశుడు నీకు నచ్చిన శిష్యుడైన ధీమంతుడగు అర్జునుని చే వ్యూఢమైన ఈసేనను చూడుము' అని స్వారస్యము.

నీకు పుత్రవాత్సల్య మెంత యున్నను ద్రుపదుడు ద్రుపదపుత్రులు ఆవైపున ఉన్నారుకనుక నీవు నన్ను శిష్యునిగ భావించి నావైపున జయము సిద్ధించునట్లు చూడవలయు నని దుర్యోధనుడు ద్రోణునికి వివరించినట్లు గ్రహింపదగును.

నిజమునకు అర్జునుడు ద్రోణుని "ఆచార్య, ద్విజోత్తమ" అని సంబోధించి నాకు మేలు చేకూర్పుమని అడుగవలసియున్నది ద్రుపదుని పట్టి తెచ్చి గురుదక్షిణ సమర్పించి విద్యాఫలము నందినవా డొక్క అర్జునుడే. ఇట్లుండగా ఈ దుర్యోధనుడు ద్రోణుని తన వైపునకు ఆకర్షించుటకు, అనుకూలపరచుకొనుటకు చేయు యత్నము చూచి అర్జునుడు దుర్యోధనుని దుర్బుద్ధిగా భావించినాడు. నిజమునకు ద్రోణుడు దుర్యోధనుని చూచి యుద్ధమునకు రాలేదు. ఆతడు ధృతరాష్ట్రపుత్రుడని అతనికి సాహ్యము చేయను. పాంచాలురమీద తనకు గల ద్వేషమును రూపుమాపుకొనుటకు ఈ యుద్ధములో అర్జునుని ఎదిరించుటకును సిద్ధపడినాడు. అర్జునుని దృష్టియందుంచుకొని ద్రోణుడు యుద్ధమును అనేక పర్యాయములు గర్హించెను. కనుక ధార్తరాష్ట్రస్య ,దుర్బుద్ధేః అన్నదానికి అర్థ మిట్లు చెప్పదగును. దుర్బుద్ధి యగు దుర్యోధనుడు తనయందు ద్రోణునికి గల వాత్సల్యమును కూడ తన ధృతరాష్ట్రపుత్రత్వమును మాత్రమే ఎరగా పెట్టి సాధింపనెంచినాడు- అన్న భావమే.

అగుచో ధృతరాష్ట్రునియం దర్జునునకు పగ లేదందురా? లేదు. మీదు మిక్కిలి ధృతరాష్ట్రుని మిత్రుడుగా అర్జునుడు భావించె ననినను సరియే యగును. "మిత్రద్రోహే చ పాతకమ్" అని అర్జును డనిన మాట ఎవరిని దృష్టియందుంచుకొని అనెనో యోచించుకొనవలెను. తమతండ్రి చనిపోయిన తరువాత తమ్ము పెంచిన ధృతరాష్ట్రుడు మైత్రిని చూపెను. ఆతనికి ప్రత్యుపకారము

చేయుట ధర్మము. సంజయుని రాయబారమునందు "మా దుర్యోధనుడు రాజ్య మిచ్చినచో స్వీకరింపుడు, లేకున్న అరణ్యములకే పొండు"— అన్నభావము ధృతరాష్ట్రుడు వ్యక్తముగ చేసెను. ధృతరాష్ట్రుడు తానంతకుముందు చేసినదానికి ప్రతిఫల మిట్లుకోరుచున్నాడు. అనవలయును. ప్రతిఫల మీయకుండుట, ద్రోహ మొనరించుట, కృతఘ్నత యగును. కృతఘ్నే నాస్తి నిష్కృతిః" అని రామాయణ మునందు గలదు. ఇంద్రునకు కూడ వృత్రాసురుని చంపినందున "మిత్రధ్రుక్" అను అపకీర్తి తప్పినది కాదని వేదము చెప్పుచున్నది. కావున మిత్రద్రోహము మహాదోషము.

కనుక పెద్దలతో యుద్ధప్రసక్తే లేదు ధృతరాష్ట్రుని దృష్టియం దుంచుకొనినచో స్వజనులైన స్వబాంధవులైన ధార్తరాష్ట్రులతో యుద్ధావకాశమే లేదు. వారు ధృతరాష్ట్రపుత్రు లగుటచేతను ఇంతకు ముందు యుద్ధమునందు ఓడి పారిన పిరికిపంద లగుటచేతను వీరలతో యుద్ధావకాశము లేదు. ఇంక నే నెవ్వరితో యుద్ధము చేయవలె? అని అర్జునుడు అడుగుచున్నాడు.

కాని అతడు ధనస్సు ఎందుకు ఎక్కుపెట్టినట్లు? ధనస్సు చేతబూనక, యుద్ధోన్ముఖులను చూడక, "నేను యుద్ధము చేయు నవకాశమే లేదు. శత్రు వనువాడే లేడు. గురువులు బంధువులు ఉన్నారు. నాకు శత్రువులు వుండినకదా నేను యుద్ధము చేయునది" అని అర్జునుడు చెప్పినచో ఎల్లరును హాస్య మొనరింతురు. కనుక ధను వెత్తి యుద్ధము చేయవచ్చిన వారందరిని కలయజూచి "నాకు శత్రువే లే" దని కడకు తేల్చినాడు. అందుకే ఎవరితోడను యుద్ధము చేయు నవకాశమే లేదను భావమే "కైర్మయా సహ యోద్ధవ్యం" అన్న పదముతో అర్జునాశయముగా గ్రహింపవలయును. ఈ అంశము బలపడుటకు చాల ఉపపత్తులు గలవు.

1). ధృతరాష్ట్రుని యనుగ్రహముతో తమకు అర్ధరాజ్యము లభించుట.

2). ఆరాజ్యమును ధర్మరాజు జూదములో ఓడి తమ్ముల గూడ ఓడుట. ఆపైన తాము ద్రౌపదీవరములచే విడుదల పొంది ధృతరాష్ట్రానుగ్రహముచేతనే రాజ్యము మరల పొందుట.

3). అజ్ఞాతవాసము పూర్తియైన దనుటకు అధికమాసగణనము భీష్ముడొనరించినదే గాని ధర్మబద్ధమా అన్న సందేహము అట్లే యుండుట.

4). దుర్యోధనుడు భీష్ముని గణనమును ధర్మబద్ధముగా నెంచక సూచ్యగ్రము నిలుపు స్థలముకూడ ఈయననగా భీష్ముడు మాటలాడక దుర్యోధనుని వైపున నుండి యుద్ధము చేయనిశ్చయించుట.

పునర్ద్యూతమునందు నియమ మిట్లు ఏర్పరుచబడినది. ఈ నియమమును శకుని ప్రకటించెను.

అముంచత్ స్థవిరో దుర్యోధనం పూజిత మేవ తత్ ।
మహాధనం గ్లహంత్వేకం శృణు వో భరతర్షభ ॥ (ఉ. 75-9)
వయం వా ద్వాదశాబ్దాం స్తు యుష్మాభి ర్ద్యూతనిర్జితాః ।
ప్రవిశేమ మహారణ్యం రౌరవాజికవాససః ॥ (-10)
త్రయోదశం చ సజనే అజ్ఞాతాః పరివత్సరమ్ ।
జ్ఞాతాశ్చ పున రన్యాని వనే వర్షాణి ద్వాదశ ॥ (-11)
అస్మాభి ర్నిర్జితా యూయం వనే ద్వాదశ వత్సరాన్ ।
వసధ్వం కృష్ణయా సార్ధం అజినైః ప్రతివాసితాః ॥ (-12)
త్రయోదశే చ నిర్వృత్తే పున రేవ యథోచితమ్ ।
స్వరాజ్యం ప్రతిపత్తవ్య మితరై రథవై తరైః ॥ (-13)
అనేన వ్యవసాయేన సహాస్మాభి ర్యుధిష్ఠిర ।
అక్షా నుప్త్వా పునర్ద్యూత మేహి దీవ్యస్వ భారత ॥ (-14)
అథ సభ్యా స్సభామధ్యే సముచ్ఛ్రితకరా స్తదా ।
ఊచు రుద్విగ్నమనసః సంవేగా స్సర్వ ఏవ హి ॥ (-15)

అంతట యుధిష్ఠిరు డిట్లనును.

కథం వై మద్విధో రాజా స్వధర్మ మనుపాలయన్ ।
ఆహూతో వినివర్తేత దీవ్యామ శకునే త్వయా ॥ (-19)

ఇట్లనగ—శకుని మరల చెప్పెను.

గవాశ్వం బహు ధేనూక మపర్యంత మజావికమ్ ।
గజాం కోశో హిరణ్యం చ దాసీదాసా శ్చ సర్వశః ॥ (-20)
ఏష వో గ్లహ ఏవైకో వనవాసాయ పాండవాః ।
యూయం వయం వా విజితా వసేమ వన మాశ్రితాః ॥ (-21)
త్రయోదశం చ వై వర్ష మజ్ఞాతా స్సజనే తథా ।
అనేన వ్యవసాయేన దీవ్యామ పురుషర్షభాః ॥ (-22)
సముత్క్షేపేణ చైకేన వనవాసాయ భారత ।
ప్రతి జగ్రాహ తం పార్థో గ్లహం జగ్రాహ సౌబలః ॥ (-23)
జిత మిత్యేవ శకునిః యుధిష్ఠిర మభాషత ॥ (-24)

ఈ ప్రసంగమువలన పునర్ద్యూతమున ఓడిన పాండవులు ద్రౌపదీసహితులైన పాండవులు పదిరెండు సంవత్సరములు అరణ్యముననే ఉండవలయును. పదమూడవసంవత్సరమున సజనప్రదేశమునందు అనగ నగరమైనను కావచ్చును, గ్రామమైనను కావచ్చును. అజ్ఞాతముగ నుండవలయు నని నియమము పాటింపవలసిన వారైరి. సామాన్యముగ వనవాసము అనినచో ఎక్కడ నున్నను బాధ లేదు. పదమూడవసంవత్సరమున సజనప్రదేశముననే అజ్ఞాతవాస మని నిర్దేశించుటచేత పన్నెండు సంవత్సరములు అరణ్యముననే ఉండవలయు నని విధి కనబడుచున్నది. మరియు అజినవాసులై యుండవలయు ననియు నిర్ణయింపబడినది. ఈ అజినవాసిత్వము అరణ్యాజ్ఞాతవాససామాన్యధర్మము. ఈ నియమమునకు బద్ధులై పాండవు లుండిరా యను విషయము యోచింపవలయును.

అర్జునుడు అయిదు సంవత్సరములు స్వర్గములో నుండెను. స్వర్గయోగ్యమైన వస్త్రాద్యలంకారములతో నుండెను. ఇది నియమవిరుద్ధము కాదా?

ద్రౌపదీవిషయమున ఏర్పరచుకొనిన నియమము ననుసరించి ఎవరైనను ఒకరితో ద్రౌపది యుండగ మరియొకరు అక్కడ ప్రవేశించినచో బ్రహ్మచర్యవ్రతము పాటించుచు తీర్థయాత్ర చేయవలయు నని నియమ మున్నది. అర్జునుడు అట్టి నియమమును భంగ మొనర్చి తీర్థయాత్రలు చేసెను. ఆ సందర్భములో ధర్మరాజు గోబ్రాహ్మణ రక్షణకై నియమోల్లంఘన మాచరించుట తప్పు కాదని చెప్పినను అర్జునుడు నియమానుసారము ప్రవర్తించుటకే ప్రవర్తిల్లెను. నాగకాంత ఉలూపి అర్జునుని తన లోకమునకు తోడ్కొనిపోయి తనతో భోగింపుమని అడిగినప్పుడుబ్రహ్మచర్యవ్రతనియమ విషయమును తెలిపెను. అప్పు డామె ఆనియమము ద్రౌపదీవిషయమే కాని అన్యకాంతావిషయము కాదని వివరించెను. తదనుసారముగ అర్జును డామెతో రమించెను. ఆవిధముగనే చిత్రాంగద వృత్తాంతముకూడ. ఆసందర్భములోనే సుభద్రను కూడ పరిణయ మాడెను. ఈ ఘట్టములో ధర్మరాజు చెప్పినట్లు కాని, ఉలూపి నిరూపించిన విధమునగాని ధర్మభంగము జరుగలేదు.

ఇవ్విధమగు కల్పన చేయుటకు అరణ్యవాసములో నున్న అర్జునుడు స్వర్గలోకమునకు పోయినపుడు కలదా? లేదనే చెప్పవలయును. అయినచో వ్యాసుడు నియమించినందువలన అర్జును డట్లు పోయెను. అని చెప్పుట తగదు. అగుచో వ్యాసుడు పాండవులకు గల నియమమును భంగముచేసినవా డని కల్పించుటయు తగదే!

కొంతవంది యుండిన చాలును. అందరును ఉండకపోయినను నియమము భంగము కాదను అవకాశమేమైనను పునర్ద్యూతగ్రహప్రసంగమున కలదేమో అని ఆలోచించిన అట్టి అవకాశ మేమియు కన్పించుటలేదు.

కనుక, నియమము పాటింపబడలే దనుట స్పష్టము. మిన్ను విరిగి మీద పడినను ధర్మము తప్పని ధర్మరాజు కాని, భగవదవతారస్వరూపుడైన మహర్షి వ్యాసుడుకాని యిట్టి యధర్మమున కేల యొడిగట్టిరి? అన్నచో రాబోవు మహాసంగ్రామమున భీష్మద్రోణాదుల నెదుర్కొనగల దివ్యాస్త్రసంపద సంపాదించుట అధిక ధర్మమని భావించియుందురు. భవితవ్యత అట్లు వారిని వశపరచుకొన్నది ఇది ధర్మనిర్వహణ మనుటకు అవకాశము లేదు.

అజినవాసిత్వము అరణ్యాజ్ఞాతవాస సమానధర్మమని కదా భావించితిమి. విరాటనగరమున వీరు అజినవాసులేనా? కాదు. కావున ఈనియమము భంగమైనది. సజనదేశమునకదా యజ్ఞాతవాసము. ఆసజనవాసిత్వము తత్ప్రదేశానుగుణమగు వస్త్రధారణము నాకర్షించునని భావించి ధర్మలోపము జరుగలేదని చెప్పినను స్వర్గలోకములో అర్జునుడుండుట మాత్రమే వనవాసవ్రత భంగమే యని చెప్పక తప్పదు. కావున ధర్మదృష్టికల అర్జునునియందు యుద్ధవైముఖ్యమున కిదియును కారణమైయుండనోపును. కనుకనే అర్జునునకు కృష్ణుడు 'సర్వధర్మా న్పరిత్యజ' చెప్పుటకు హేతువు కన్పట్టుచున్నది.

ద్రుపద పురోహితుడు దుర్యోధనుని దృష్టియందు విగ్రహమునకు హేతువున్నను దానిని తలంపరాదు. పరులు బలవంతులు, అని చెప్పుట గమనార్హము.

యశ్చాపి ధార్తరాష్ట్రస్య హేతుః స్యాద్విగ్రహం ప్రతి ।
స చ హేతు ర్న మంతవ్యో బలీయాంస స్తథా హి తే ॥

ఈ శ్లోకములో "తే బలీయాంసః" తథాహి - ఈ పదములు ఇతర హేతువులను పాటింపకుండుటకు హేతువుగ చెప్పుచున్నాడు. తే యన్న తచ్ఛబ్దము ఏకారణమువలన నియమ భంగముచేసిరని దుర్యోధనుడు చెప్పబోవునో ఆది పాండవులకు బలమును చేకూర్చుకొనినది. ఆహేతువువలన నియమము భంగమైనదని చెప్పుచో ఆహేతుభంగముద్వారా బలమును చేకూర్చుకొనినవారు ధార్తరాష్ట్రులను ధ్వంసముచేయుదురు. అని చెప్పును.

సామాన్యాకారముగ ఈ వైపున ఏకాదశాక్షౌహిణులు, అవైపున సప్తాక్షౌహిణులు ఉన్నారని వివరించి ఆ వైపునసున్న ఇతర పురుషులు సహస్రాక్షౌహిణీసములు. అని చెప్పి పదకొండక్షౌహిణుల సైన్య మొక్కవైపున, ధనంజయు డొక్క వైపున నున్నచో ధనంజయుడే అధికము అని వివరించును,

ఏకాదశైతాః పృతనా ఏకతశ్చ సమాగతాః ।
ఏకతశ్చ మహాబాహుః బహురూపో ధనంజయః ॥ (ఉ 19-15)
యథా కిరీటీ సర్వాభ్యః సేనాభ్యోఽప్యతిరిచ్యతే। (-18)

ద్రుపద పురోహితుడు ధార్తరాష్ట్రునకు విగ్రహకారణ మున్నను పాండవులు బలవంతులుకాన గమనింపరాదు అన్న వచనమునకు అతని స్వర్గవాసమే హేతువని చెప్పుటకు వివరణము కలదు. ధనంజయుని "బహురూపో ధనంజయః" అని బహురూప శబ్దముచే విశేషించుచున్నాడు. ఇది ఇంద్రుని చెప్పును. "ఇంద్రో మాయాభిః పురురూప ఈయతే" అన్న వచనమును బహురూపశబ్దము సమీకరించుచున్నది. ఈ శబ్దము ఇంద్రుని చెప్పుచూ ఇంద్రునితో ఇంద్రలోకవాసత్వము ధనంజయునకు బలసంపాదకమైనదని నిరూపించుచున్నది. దుర్యోధనుడు ప్రశ్నించిన ఈ స్వర్గవాసిత్వము నియమభంగమునకు హేతువుగ చెప్పదలంచుట ద్రుపద పురోహితుడు గమనించియే ఇట్లు పలికెను. కావున నియమప్రసక్తిని విడచి సంధి చేయుమనియే తాత్పర్యము. అర్జునుడు ఇంద్రలోకమువలన ఇంద్రు నంతటి శక్తి సంపాదించి సర్వసేనలను చూచుటవలననే కాన—

ఏవమేవ మహాబాహుర్వాసుదేవో మహాద్యుతిః । (-19)

అన్నవాక్యము కూడ అతని ఇంద్రలోకవాసిత్వమునే సంగ్రహించుచున్నది ఏవమేవ అన్న పదము గమనార్హము. వాసుదేవుడు ఇంద్రానుజుడు గదా: అతని బలము అర్జునునకు గలదు. ఇట్లు వివరించుటచే కూడ అర్జునుడు నియమభంగము చేసినట్లు స్పష్టమగుచున్నది.

నియమభంగము అరణ్యాజ్ఞాతవాసములలో పాక్షికముగ కన్పట్టుచున్నది. కాలపరిగణనమునందు ఉభయపక్షసమ్మతమైన పద్ధతి పాండవు లనుసరింప లేదన్నది దుర్యోధనప్రశ్నమునకు భీష్ముడు కాలమును సరిపుచ్చి చెప్పుట దానిని దుర్యోధనుడామోదింపకుండుట ఇందులకు నిదర్శనము.

ఉత్తరగోగ్రహణము జరిగిన యనంతరము పాండవులు తామెవరో వెంటనే విరాటునకు తెలుపలేదు. ఉత్తరునకు అర్జునునివలన పాండవులు తమ నగరములో నున్న కంకుభట్టాదులే యని, అర్జునుడు బృహన్నలయే యని తెలిసినది. ఉత్తరుడు గోవులను విడిపించు కార్యమునందు దివ్యకుమారుడు సాహ్యమొనరించె నని అర్జునుని వచనానుసారము విరాటునకు వివరించెనుకాని అప్పటికి వారు అజ్ఞాతముగనే ఉండిరి.

తత స్తృతీయే దివసే భ్రాతరః పంచ పాండవాః ।
స్నాతాః శుక్లాంబరధరాః సమయే చరితవ్రతాః ॥ (వి. 70-1)
యుధిష్ఠిరం పురస్కృత్య సర్వాభరణభూషితాః ।
ద్వారి మత్తా యథా నాగాః భ్రాజమానా మహారథాః ॥ (-2)
విరాటస్య సభాం గత్వా భూమిపాలాసనే ష్వథ ।
నిషేదుః పావకప్రఖ్యాః సర్వే ధిష్ణ్యే ష్వివాగ్నయః ॥ (-3)

ఈ శ్లోకములను బట్టి ఈఉత్తరగోగ్రహణము జరిగిన మూడవరోజుననే వారు తమను వెల్లడించికొనిరి. స్నాతాః, శుక్లాంబరధరాః సమయే చరితవ్రతాః అని చెప్పుటచే ఆరోజుననే వారు దీక్షాంతస్నానము చేసి శుక్లాంబరధరు లైరి. సమయే చరితవ్రతాః అనుటచే అప్పటికి వారికి అరణ్యాజ్ఞాతవాసనియమము పూర్తి అయిన దని విశద మగుచున్నది. దీనివలన అర్జునుడు దుర్యోధనునకు అగుపించునప్పటికి సమయవ్రతము పూర్తి అయినదా।

అరణ్యాజ్ఞాతవాసనియమములో - అజ్ఞానవాసకాలములో "అజ్ఞాత" శబ్దము గమనార్హము. ప్రత్యక్షముగా అగుపింపకపోయినప్పటికి వారి ఉనికి జ్ఞాతమైనను నియమభంగమైనట్లే. అర్జునుడు దుర్యోధనునకు ప్రత్యక్షమైన సమయమునకు ముందే, దుర్యోధనుడు కొన్ని హేతువులనుబట్టి విరాటనగరమున పాండవు లున్నారని తెలిసికొనెను. దీనివలన నియమభంగము అయినట్లే లెక్క.

అందుకే ద్రుపదపురోహితుడు చాల నిశితముగ విషయమును వివరించెను. "అజ్ఞాతవాససమయము పూర్తయినది. నియమము ననుసరించి వారు వారి రాజ్యమును పొంద అరులై యున్నారు" అని చెప్పలేదు. ధృతరాష్ట్రుడు పాండువు ఒకరి కొడుకులుగ ప్రసిద్ధి చెందిరి. అందు ఇరువురకు పైతృకద్రవిణము సమాన మగుట సంశయింపరానిది. ధార్తరాష్ట్రులు తమ పైతృకమును పొందిరి. పాండుపుత్రు లెందుకు పొందరు? పాండవులు తమ పైతృకమును ముందు పొందలేదు - ప్రాణాంతకోపాయములచే పాండవులు ధార్తరాష్ట్రులచే నాశనము చేయబడక ఎట్లో కడకు తమ రాజ్యమును పొందిరి. అది మరల సౌబల సహాయముతో ధార్తరాష్ట్రులచే గ్రహింపబడినది. పదమూడు సంవత్సరములు నియమము ననుసరించి కాలము గడిపిరి. అని ద్రుపదపురోహితుడు చెప్పెను. ఈ సందర్భములో —

వాసితా శ్చ మహారణ్యే వర్షాణీహ త్రయోదశ । (ఉ. 19-6)

ఈవాక్యమునందు గమనింపదగిన విశేషము గలదు. పన్నెండు సంవత్సరములు అరణ్యవాసము, ఒక సంవత్సరము అజ్ఞాతవాసము విభజించి చూపుచో

అజ్ఞాతవాసము సంవత్సరము అయిన దని చెప్పుటకు కారణములు గలవు. అరణ్యవాసము పన్నెండు సంవత్సరములు విభజించి చూపుటకు సాక్షికమైన పరిగణనమును లెక్కపెట్టినగాని కుదరదు. అర్జునుని ఐదుసంవత్సరముల స్వర్గలోకవాసము ఒకవిధముగ నియమభంగసూచకము. అజ్ఞాతవాసము, వర్షభోగ్యమైన ఊర్వశీశాపమువలన ధర్మదేవతావరముననుా, అది నిరూపించకల్గినను, అరణ్యవాసము అట్లు నిరూపించుటకు వీలులేని కారణముచే పదమూడు సంవత్సరములును అరణ్యవాససామాన్యమున కొట్టి పారవైచినాడు.

తథా విరాటనగరే యో న్యంతరగతై రివ ।
ప్రాప్తః పరమసంక్లేశో యథా పాపై ర్మహాత్మభిః ॥ (ఉ. 19-11)

అని విరాటనగరమున వారి యునికి చాల కష్టముగ నుండె నని వివరించెను. నియమసమయమున సామాన్యాకారముగ నైనను పదమూడు సంవత్సరము లరణ్యవాసమని చెప్పి 12సంవత్సరములు అట్లు, ఒకసంవత్సరము ఇట్లు అనిచెప్పక సుస్పష్టముగ 12 సంవత్సరములట్లు, ఒకసంవత్సరము ఇట్లు అని వేర్వేరుగ చెప్పబడినది. కనుకనే ద్రుపదపురోహితుడు అరణ్యవాసము సక్రమముగ జరుగ లేదని ధార్తరాష్ట్రుడు ప్రశ్నించుటకు హేతువు కలదని భావించి బలీయులవట్ల ఆ హేతువు పనికి రాదని తిరస్కరించినాడు. భీష్ముడు ద్రుపదపురోహితుని వాగ్విధానము తప్ప మరొక మార్గము తప్పదని గమనించి—

భవతా సత్య ముక్తం తు హ్యేవ మేత న్న సంశయః ।
అతితీక్ష్ణం తు తే వాక్యం బ్రాహ్మణ్యా దితి మే మతిః ॥ (ఉ. 20-4)

అనిపలుకును. అనగ బలవద్విరోధము కూడదని ఘటభేదనమువలె పురోహితుడు చెప్పిన వాక్యమునకు ధార్తరాష్ట్రు లాగ్రహింతు రని ఇట్లు ఆతని వాక్యముల వాడిని, ధార్తరాష్ట్రులు గుర్తింపకుండుటకై ఆవాడికి కారణము ఆతని బ్రాహ్మణత్వము సర్ది చెప్పినట్లున్నది. భీష్మవాక్యములలో నైనను వారు నియమము పాలించి, వారు పూర్వ మనుభవించుచున్న రాజ్యమును పాండవులు పొందనర్హులు అని చెప్పక—

ప్రాప్తా శ్చ ధర్మత స్సర్వం పితు ర్ధన మసంశయమ్ ॥ (ఉ. 20-5)

అని చెప్పెను. అసంశయముగ వారు పితృధనము పొందుట కర్హులు కాని నియమ పాలనముచేసి పూర్వస్థితి అనగ ద్యూతమునకు ముందున్న తమ రాజ్యమును పొందుటకు అనర్హులే యని నిర్ణయించెను.

అట్లయిన వారికి పూర్వ మనుభవించుచున్న భాగము తండ్రికి రావలసిన అర్ధరాజ్యమే పొంది యనుభవించుచున్నారు. ఆ అర్ధభాగమునే ఇప్పు డడుగు చున్నారు అని ఈయుక్తి చేయవచ్చును. కాని ఒకరికి ఒక వస్తువును పంపకము చేసిన వెనుక అది ఎవరైనను ఏకారణము చేతనైనను స్వాధీనము చేసికొన్నప్పుడు ధర్మ మనుసరించి అన్యాధీనమైన ఆ ద్రవ్యమును మాత్రమే అడుగుదురు. కాని మరల మొదటి దశకు వచ్చి ధర్మమున మొదట రావలసిన దెంతయో అంత ఇండు. అని అడుగరు- అట్లు ఇవ్వమనకూడదు. పంపకమైన వెనుక ఒకరు పొందిన భాగము హాని వృద్ధులను పొందును. అన్యాక్రాంతమైనపుడు నియమానుసారముగ ఆ హానివృద్ధులు పొందిన స్థితిలో నున్న ఆ పూర్వభాగమునే అడుగవలయును. ఇచ్చువాడును అట్లు ఇవ్వవలయును. ఈ స్థితి ఇక్కడ కనబడుటలేదు. ఇచ్చట "స్వకం" అన్న పదమువలన వారి పూర్వ మనుభవించు భాగమునే ఈయవలయు నని ద్రుపదపురోహితుని భావమై యుండు నని చెప్పుదు రేమో.

తే భవంతో యథా ధర్మం యథా సమయ మేవ చ ।
ప్రియచ్ఛంతు ప్రదాతవ్యం మా వః కాలోఽత్యగా దయమ్ ॥ (ఉ. 19-21)

ఈవాక్యమువలన వారు ధర్మ మాచరించి రని, సమయమును పరిపాలించి రని కావున వారి కీయవలసినది ఇమ్మని ద్రుపదపురోహితుని హితముగా చెప్పెద రేమో?

ప్రాప్త శ్చ ధర్మత స్సర్వం పితు ర్దన మసంశయమ్ । (ఉ. 20-5)

అన్న భీష్మవాక్యమువలవ తండ్రికి రావలసిన యర్ధరాజ్యమును వీరు పొంద వలసినవారని నియమానుసారముగ నియమమును పాలించి పూర్వస్థితిని పొంద నర్హులు కారని ద్రుపదపురోహితుని వాక్యముల కంతటికి సారమని సర్వధర్మవేత్త భీష్ముడు చెప్పెను. అగుచో విరాటపర్వమునందు ఉత్తరగోగ్రహణములో అర్జు నుడు కనబడినపుడు దుర్యోధనాదులు సమయభంగము అయినదని పల్కుచుండగ భీష్ముడు కాలపరిగణనము చేసి రాజ్య మిత్తువా, యుద్ధము చేతువా? అనగ యుద్ధము చేయుదును అని చెప్పెను. ఆ సందర్భములో భీష్ముని హృదయము నందు ఏదో ఒకవైపున ధర్మసందేహము లేనిదే ఈ యధర్మయుద్ధము నేను చేయను అని చెప్పడా! మరియు ద్రుపదపురోహితుని రాక సందర్భములో కూడ పాండవులు బలవంతులు, వారిని గెలచుట యసాధ్య మనియే చెప్పెను. ఆ మాటలు వినిన కర్ణుడు ఇట్లనును.

న తత్రాఽవిదితం బ్రహ్మన్ లోకే భూతేన కేన చిత్ ।
పునరుక్తేన కిం తేన భాషితేన పునః పునః ॥ (ఉ. 20-6)

దుర్యోధనార్థే శకుని ర్ద్యూతే నిర్జితవాన్ పురా ।
సమ యేన గతో ఽరణ్యం పాండుపుత్రో యుధిష్ఠిరః ॥ (ఉ. 20-10)
స తం సమయ మాశ్రిత్య రాజ్యమిచ్ఛతి పైతృకమ్ ।
బల మాశ్రిత్య మత్స్యానాం పాంచాలానాం చ మూర్ఖవత్ ॥ (ఉ. 20-12)
యథాప్రతిజ్ఞం కాలం తం చరంతు వన మాశ్రితాః ॥ (ఉ. 20-13)
అధార్మికం తు మా బుద్ధిం మౌర్ఖ్యాత్ కుర్వంతు కేవలామ్ ॥ (ఉ. 20-14)
అథ తే ధర్మ ముత్సృజ్య యుద్ధ మిచ్ఛంతి పాండవాః ।
ఆసా ద్యేమాన్ కురుశ్రేష్ఠాన్ స్మరిష్యంతి వచో మమ ॥ (ఉ. 20-15)

ఇట్లు రాధేయుడు పలుకగ భీష్ముడు రాధేయుని వాక్యారత్వమును నిరసించెను. కాని పాండవులు ధర్మమును పాలించిరి. ఏమట్లందువు? అని చెప్పలేదు. అయితే ఇదివరకు చెప్పినదానినే వీరు విననప్పుడు మరల చెప్పుట ఏల? అని మానె నందు రేమో? ప్రకృతము ఈ చర్చ ధృతరాష్ట్రుని సమక్షములో జరుగుచున్నది. కాలపరిగణనము విరాటనగరమున దుర్యోధనునకు చెప్పినది. అతడు వినలేదు. ధృతరాష్ట్రుని ఎదుట చెప్పవలెనుగదా? అడుగనిదే చెప్పరాదు. అన్న వాద మొక టున్నది. భీష్ముడు కల్పించుకొని చెప్పిన మాట లన్నియు ఎవరు అడిగి రని చెప్పుచున్నాడు. భీష్మునిది తాటస్థ్యవిధాన మన్నచో కర్ణుని పలుకుల కేల సమాధానము చెప్పవలయును? విననివారికి సమాధానము చెప్పరాదు. అన్నది కూడ సన్మార్గముకాదు. ఆపద్ధతిలో భీష్ముడు లేనూ లేడు. ధృతరాష్ట్రుడు, దుర్యోధనుడు, కర్ణుడు వినని విషయములు భీష్మడే శతాధికపర్యాయములు చెప్పిన ఘట్టములు భారతమునందు కలవు. కనుక ఈనిస్సారమైన వాదము ధర్మవిషయికచర్చలో పనికిరాదు.

ప్రకృతము ధర్మరాజు తన పూర్వస్థితిని పొందుటకు తగిన మార్గములో తానుగాని తనపక్షమున మాట్లాడు కృష్ణుడుకాని-మాట్లాడిన మాటలవలన, లేదని తెలియుచున్నది. ఇన్ని వాదోపవాదములు చేయుచున్నారు. తమ పక్షమునందు బల మెంతో అనేకవిధములుగ వివరించి వివరించి విసుగుచెందించునట్లు వివరించుచున్నారు. కాని తాము సక్రమముగా సమయము పాలించితిమి. అని నిక్కచ్చిగ నిష్కర్షగ నిస్సంశయముగ నొక్కి చెప్పరేమి? కనుక నియమభంగము నియమ భంగమే.

మరి ధర్మము ధర్మ మనుచున్నారే. అది ఏమి? క్షత్రియుడు బలవంతుడుగ నుంటుటయే ధర్మము. ఆ ఉద్దేశ్యముతోనే ధర్మము ధర్మమని ఘోషించు

చున్నారు. ఒక విధముగ చూచిన ఇది ధర్మమే కావచ్చును. కాని నియమము పాటించి ధర్మపరుల మని చెప్పవలసివచ్చినపుడు పాండవులది అధర్మ మనుటకు సందేహములేదు. కనుకనే అరణ్యమునందు పడిన అజ్ఞాతవాసమునందు పడిన కష్టములనే పలుమార్లు పలుతీరులలో పలుపురిచేత పలుకబడుచున్నవి కాని ఎవరి నోట నిస్సందిగ్ధముగ నియమపాలన రూపధర్మము విప్పి చెప్పబడలేదు. కృష్ణుడు కూడ వారి పైతృకమగు భాగమును ఇమ్మనునే కాని వారి పూర్వపురాజ్య మిమ్మని చెప్పలేదు. కాని ధర్మరాజు ఇంద్రప్రస్థము కావలయును· అనుచునే మా భాగము మాకిండు లేక అయిదుగురకు అయిదు గ్రామములు ఇండు. అనుటలో కూడ తమ లోపము గుర్తించనే గుర్తించెను. కనుక ఈ విషయము లన్నియు పర్యాలోచింపగ అర్జునునికి యుద్ధమునందు వైమనస్య మేర్పడినది.

రాజ్యము అన్నదమ్ములలో పెద్దవాడే పొందును. తక్కినవారు కలసి యున్నచో సరిపోవును. లేకున్న వారికి కొంతపోషణార్థము రాజ్యము ఇచ్చుటగాని లేక అట్టి సౌకర్యములు కలిగించుటగాని చేయవలయును. ధృతరాష్ట్రుడు సగము రాజ్యమునే ముందు ఇచ్చివేసెను. దానిని పోగొట్టుకొనియున్న ధర్మరాజు ప్రస్తుతము ఆ అర్ధరాజ్యమును తండ్రిభాగముగ తమ కిమ్మని, లేకున్న అయిదుగురు బ్రతుకుటకు అయిదు గ్రామములు ఇచ్చినచో చాలునని చెప్పెను. ఈ సందర్భములో ధర్మరాజు కృష్ణుని దూతగ పంపుచు చెప్పిన ఈ మాటలు చూడుడు—

హ్రీర్హతా బాధతే ధర్మం ధర్మో హంతి హతశ్రియమ్ ।
శ్రీర్హతా పురుషం హన్తి పురుషస్యాధనం వధః ॥ (ఉ. 71-19)
అధనా ద్వినివర్తంతే జ్ఞాతయస్సుహృదో జనాః ।
అపుష్పా దఫలా ద్వృక్షాత్ యథా కృష్ణ! పతత్త్రిణః ॥ (ఉ. 71-20)
ఏత చ్చ మరణం తాత! య న్మత్తః పతితా దివ ।
జ్ఞాతయో వినివర్తంతే ప్రేత సత్త్వాదివాసవః ॥ (ఉ. 71-21)
నాతః పాపీయసీం కాంచి దవస్థాం శంబరోఽబ్రవీత్ ।
యత్ర నైవాద్య న ప్రాతః భోజనం ప్రతి దృశ్యతే ॥ (ఉ. 71-22)
ధనమాహుః పరం ధర్మం ధనే సర్వం ప్రతిష్ఠితమ్ ।
జీవంతి ధనినో లోకే హతా యే త్వధనా నరాః ॥ (ఉ. 71-23)
యే ధనా దపకర్షంతి నరం స్వబల మాస్థితాః ।
తే ధర్మమర్థం కామంచ ప్రబధ్నంతి నరం చ తమ్ ॥ (-24)

ఏతా మవస్థాం ప్రాప్యైకే మరణం వవ్రిరే జనాః ।
గ్రామా యైకే వనా యైకే నాశా యైకే ప్రవవ్రజుః ॥ (ఉ. 71-25)
ఉన్మాద మేకే పుష్యంతి యా న్త్యన్యే ద్విషతాం వశమ్ ।
దాస్య మేకే చ గచ్ఛంతి పరేషా మర్థహేతునా ॥ (ఉ. 71-26)
ఆపలే వాస్య మరణాత్ పురుషస్య గరీయసీ ।
శ్రియో వినాశ స్త ద్ధ్యస్య నిమిత్తం ధర్మకామయోః ॥ (ఉ. 71-27)
య దస్య ధర్మ్యం మరణం శాశ్వతం లోకవర్త్మ తత్ ।
సమంతా త్సర్వభూతానాం న త దత్యేతి కశ్చన ॥ (ఉ. 71-28)
న తథా బాధ్యతే కృష్ణః ప్రకృత్యా నిర్ధనో జనః ।
య థా భద్రాం శ్రియం ప్రాప్య తయా హీన స్సుఖై ధితః ॥ (ఉ. 71-29)
స తదాత్మాపరాధేన సంప్రాప్తో వ్యసనం మహత్ ।
సేంద్రాన్ గర్హ యతే దేవా నాత్మానం చ కథంచన ॥ (ఉ. 71-30)
న చాస్య సర్వశాస్త్రాణి ప్రభవంతి నిబర్హణే ।
సోఽభిక్రుద్ధ్యతి భృత్యానాం సుహృద శ్చాభ్యసూయతి ॥ (ఉ. 71-31)
త త్తదా మన్యు రేవేతి స భూయః సంప్రముహ్యతి ।
స మోహ వశ మాపన్నః క్రూరం కర్మ నిషేవతే ॥ (ఉ. 71-32)
పాపకర్మతయా చైవ సంకరం తేన పుష్యతి ।
సంకరో నరకాయైవ సా కాష్ఠా పాపకర్మణామ్ ॥ (ఉ 71-33)
న చే త్ప్రబుధ్యతే కృష్ణః నరకాయైవ గచ్ఛతి ।
తస్య ప్రబోధః ప్రజ్ఞైవ ప్రజ్ఞా చక్షు స్తరిష్యతి ॥ (ఉ 71-34)
ప్రజ్ఞాలాభే హి పురుషః శాస్త్రాణ్యేవాఽన్వవేక్షతే ।
శాస్త్రనిష్ఠః పున ర్ధర్మం తస్య శ్రీరంగ ముత్తమమ్ ॥ (ఉ. 71-35)
హ్రీమాన్ హిపాపం ప్రద్వేష్టి తస్య శ్రీ రభివర్ధతే ।
శ్రీమాన్ స యావ ద్భవతి తావ ద్భవతి పూరుషః ॥ (ఉ. 71-36)
త దిదం మయి తే దృష్టిం ప్రత్యక్షం మధుసూదన ।
యథా రాజ్యా త్పరిభ్రష్టో వసామి వసతీ రిమాః ॥ (ఉ. 71-40)
తే వయం న శ్రియం హాతుః అలం న్యాయేన కేనచిత్ ।
అత్ర నో యతమానానాం వధ శ్చే దపి సాధు తత్ ॥ (ఉ. 71-41)

ఈవాక్యములు 42 నుండి, 72వరకు గల శ్లోకములును పరిశీలించిన బ్రతుకు తెరువునకై ధన మవసరమని, ఆధనము లేక జీవితము సాగదని చెప్పుటవలన

రాజ్యము పొందు సర్వత లేకపోయినను సుఖజీవితమునకు చాలినంత ధన మున్నచో చాలును. ఆదృష్టితోనే అవిస్థలము వృకస్థలము, మాకంది, వారణావతము, మరియొకటి ఏదైనను ఇచ్చిన చాలు నని ప్రకటించుటచే జీవనార్థమే ధర్మరాజుయొక్క ప్రయత్న మని తేలుచున్నది. కాని యుద్ధము క్షత్రియునకు కర్తవ్యముకనుక యుద్ధము చేయుద మనియు చెప్పెను. కాని ఆ యుద్ధము నిట్లు వర్ణించెను—

తచ్ఛునా మివ సంపాతే పండితై రుపలక్షితమ్ ।
లాంగూలచాలనం క్ష్వేలా ప్రతివాచోఽతివర్తనమ్ ॥ (ఉ 71–71)
దంతదర్శన మారావః తతో యుద్ధం ప్రవర్తతే ।
తత్ర యో బలవాన్ కృష్ణ! జిత్వా సోఽత్తి తదాఽమిషమ్ ॥ (ఉ. 71–72)
ఏవమేవ మనుష్యేషు విశేషో నాస్తి కశ్చన ।
సర్వథా త్వేత దుదితా దుర్బలేషు బలీయసామ్ ॥ (ఉ. 71–73)

క్షత్రియుడు యుద్ధమును పరమధర్మముగ భావింపవలెను. శస్త్రపూతమై యుద్ధమున తనువును విడుచుచో స్వర్గము లభించును. కాని ధర్మరాజు యుద్ధమును కుక్కల పోట్లాటతో పోల్చి ఆకుక్కలలో నేది గెల్చిన ఆకుక్క ఆమిషమును తినును. అనుటచే కేవలము ధర్మరాజుయొక్క ప్రయత్న మంతయు పొట్టగడుపుకొనుటకే యని విదిత మగుచున్నది. మొత్తమీసందర్భ మంతయు ధర్మరాజుయొక్క ధార్మిక మగు దృష్టికి తార్కాణము కాదు. రాజ్యమునందు తమకు హక్కు లేదన్నభావమే ధర్మరాజుయొక్క హృదయములో నిల్చినది కనుక అర్జునుడు ఈ ఆమిషార్థము గురుబంధువధ చేసి ఈ వంశనాశనము, కులనాశనము, ధర్మనాశనము చేయుటకన్న ఈమాత్రపుతిండి బిచ్చ మెత్తుకొనిన దొరకు నని దీనికై తాను తపస్సు చేసి ఈశ్వరాదులను మెప్పించి సంపాదించిన అస్త్రపాండిత్యమును దుర్వినియోగము చేయుటయా! అని భావించెను. ఉద్యోగపర్వమునందలి 76వ అధ్యాయములో 94 శ్లోకములు గలవు. ఈవాక్యములన్నియు ఒకచోట పెట్టి అర్జునుడు చెప్పిన వచనము లన్నియు మరియొక వైపు పెట్టి చూచినచో ఈవాక్యములే అతనినోట వెల్వడిన వాక్యముల సార మని గ్రహింపవచ్చును. దీనికి సమాధానమున 72వ సర్గలో కృష్ణుడు చెప్పిన వచనముల సారమే కృష్ణుడు గీతలో అర్జునునకు చెప్పిన ప్రధానసారము.

న చైవం నైష్ఠికం కర్మ క్షత్రియస్య విశాంపతే ।
ఆహూ రాశ్రమిణ స్సర్వే న భైక్ష్యం క్షత్రియ శ్చరేత్ ॥ (ఉ. 72–3)

జయో వధో వా సంగ్రామే ధాత్రా దిష్ట స్సనాతనః ।
స్వధర్మః క్షత్రియ స్యైష కార్పణ్యం న ప్రశస్యతే ॥ (-4)
న హి కార్పణ్య మాస్థాయ శక్యా వృత్తి ర్యుధిష్ఠిర ।
విక్రమస్వ మహాబాహో। జహి శత్రూన్ పరంతప ॥ (-5)

గీతలో చెప్పిన సార మింతకాక ఏమి ఉన్నది?

కనుక అర్జునుడు విషాదము నొందుట ఆతని స్వబుద్ధికృతము కాదు. ధర్మరాజుయొక్క ప్రవృత్తి ఆతనిలో అట్లు ప్రవేశించి అట్లు పలికించినది. అందువలననే కృష్ణుడు—

"కుత స్త్వా కశ్మల మిదం విషమే సముపస్థితమ్ ।" అనెను.

"విషమే సముపస్థితం" అనగా విషమునియందు కుదురుపాటొందిన కశ్మలము నీ కెక్కడనుండి దాపురించినది। అనగ నీ భావము ఎరువుతెచ్చుకొన్న భావము. అని కృష్ణుడు చెప్పెను. దీనివలనకూడ అర్జునునియందలి విషాదము అర్జుననకు చెందినది కాదు. కనుక అతనిని అజ్ఞుడనుట తగదు

ఈయుద్ధము దుర్యోధనుని కారణమున సంభవించుచున్నదో భీష్ముడు యుద్ధోన్ముఖుడు కానే కాడు. అని అర్జునుడు భావించెను.

తమ పక్షము ధర్మపక్షమే యగుచో ధర్మరాజు తమ రాజ్యము తమకిమ్మని, లేకున్న యుద్ధమే కర్తవ్య మగు నని చెప్పక ఐదుగురకు అయిదూళ్ళిమ్మనుట. ఇట్టి ధర్మజుని కోరిక ధర్మబద్ధము కానేరదు. కావుననే అర్జునునకు వైముఖ్యము కలిగినది. ఈ అధర్మయుద్ధము చేయుటకన్న భైక్ష్యమే శ్రేయోదాయక మగు నను తలంపు ఆతనికి కలిగినది. అందువలననే;—

"శ్రేయో భోక్తుం భైక్ష్య మపీహ లోకే" అనెను.

## (6) తండ్రివల్లనే భైక్ష్యబుద్ధి.

ఈతని తండ్రి యగు పాండురాజుకూడ మృగవధాలబ్ధశాపసంతాపమువలన ప్రపంచమును రోసి భైక్ష్యము నాశ్రయించుటకు సంకల్పించెను

చరన్ భైక్ష్యం ముని ర్ముండః చరిష్యా మ్యాశ్రమా నిమాన్ ॥ (ఆ. 119-8)

దోషాచరణము తర్వాత ప్రతివారును ఇట్లనుకొనుట సామాన్యమే.

ఏకకాలం చరన్ భైక్ష్యం కులాని దశ పంచ వా । (12)
అసంభవే వా భైక్ష్యస్య చర న్ననశనవా నపి । (13)
నిర్ముక్త స్సర్వపాపేభ్యో వ్యతీత స్సర్వవాగురాః ।
న వశే కస్యచి త్తిష్ఠన్ సధర్మా మాతరిశ్వనః ॥ (19)

ఏతయా సతతం ధృత్యా చర న్నేవం ప్రకారయా ।
దేహం సంస్థాపయిష్యామి నిర్భయం మార్గ మాస్థితః ॥ (20)
నా౽హం సుకృపణే మార్గే స్వవీర్యక్షయశోచితే ।
స్వధర్మా త్సతతాపేతే చరేయం వీర్యవర్జితః ॥ (21)
సత్కృతో౽సత్కృతో వాపి యో౽న్యాం కృపణచక్షుషా ।
ఉపైతి వృత్తిం కామాత్మా స శునాం వర్తతే పథి ॥ (22)

ఇందు విశేష మేమి లేదు. స్వధర్మత్యాగము, పరధర్మాశ్రయణము గాని ఇట్టి సన్నివేశములకు కల్పించుటకు అవకాశము లేదు.

నిజమునకు భైక్ష్యము పాండవులకు క్రొత్త కాదు ఏకచక్రపురమున వారి జీవిక భైక్ష్యమేకదా।

"చేరు ర్భైక్ష్యం తదా తే తు సర్వ ఏవ విశాంపతే । (ఆ. 157-4)

శాంతిపర్వమున యుధిష్ఠురుని వచస్సరణియు ఏతత్పథానువృత్తియై విలసిల్లుట గమనింపవచ్చును.

య ద్భైక్ష్య మాచరిష్యామో వృష్ణ్యంధకపురే వయమ్ ।
జ్ఞాతీన్ నిష్పురుషాన్ కృత్వా నేమాన్ ప్రాప్స్యామ దుర్గతిం । (శాం. 7-4)

సుభద్రావివాహఘట్టమున అర్జునుని యతివేషము, అతని భైక్ష్యవృత్తి ప్రసిద్ధములే కదా।

"శ్రేయో భోక్తుం భైక్ష్య మపి" అన్నచోట "శ్రేయః" శబ్దము గమనింపవలయును.

"అన్య చ్ఛ్రేయో౽న్య దు తైవ ప్రేయ స్తే ఉభే నానార్థే పురుషగ్ం సినీతః ।"

అనగా శ్రేయస్సు, ప్రేయస్సు రెండును మోక్షప్రతిబంధకములే. యని కఠోపనిషత్తు చెప్పుచున్నది. "ప్రేయః" అనగా ఇహలోకభోగము. శ్రేయః అనగ పరలోకభోగము. ఇహలోకమునందు బిచ్చ మెత్తుకొన్న అనగా కష్టమైన తపస్సు చేసి కొన్నచో పరలోక మైన అనగా స్వర్గలోక మైనను లభించు నన్న భావము అర్జునుడు ప్రకటించెను. ఇదియు తండ్రిగారి భావమే. ఆయన ఇట్లను కొనెను.

"తాసు చా వ్యసనవస్థాసు త్యక్త సర్వేంద్రియక్రియః ।
సంపరిత్యక్తధర్మార్థః సునిరిక్తాత్మకల్మషః ॥ (ఆ 119-18)

భైక్ష్యమువలన పరధర్మాశ్రయదోషము లేదు.

ఇచ్చట "భైక్ష్య" (2-5) శబ్దమును వ్యాఖ్యానించును. ఇది పరధర్మమని అనగా "బ్రాహ్మణస్య ధనం భైక్ష్యం" అను వాక్యమువలన ఇది బ్రాహ్మణ

ధర్మ మని, క్షత్రియధర్మము కా దని కొందరు వ్యాఖ్యానించుచున్నారు అర్జునుడు స్వధర్మ మగు యుద్ధమునుండి విరతుడై పరధర్మ మగు బ్రాహ్మణధర్మమును ఆచరింపబూనినాడని, అందువలన తనకు శోకమోహములు గలవని వ్యాఖ్యానించుట అవిచారితరమణీయము. తత్త్వపరీక్ష చేయగా ఈ వాదము నిలువదు.

రామాయణసార మేమి? రామాదుల త్యాగశీలమే. రాముడు ధర్మబద్ధముగ రాజ్యపాలనము చేసి ప్రజలను కన్నబిడ్డలవలె పాలించి పిదప స్వర్గాదిసౌఖ్యములను కోరి విరక్తుడై వార్ధక్యమునందు అవలంబించవలసిన వన్యవృత్తిని చేపట్టెనా? లేదు. భరతునికై రాజ్యత్యాగము చేసి ధర్మబద్ధు డయ్యెను. వనమునందు భిక్షాచరణమే చేయలేదు కదా! కాదంబరిలో మహాశ్వేత భిక్షాపాత్రము చేతగొని చెట్లవెంట బోగా ఆ పాత్రము తత్ఫలపూర్ణ మైనట్లున్నది. ఇది తపోధర్మము, మునిధర్మము, ఋషిధర్మము అవునా? కాదా మరి రాముడు అరణ్యమున కేగుచు "విద్ధి మాం ఋషిభి స్తుల్యం కేవలం ధర్మ మాశ్రితమ్" అనినాడు కదా! ఇది ధర్మత్యాగము పరధర్మగ్రహణమును అగు నందురా? ఋషిధర్మాశ్రయణమే రామునియందు భైక్ష్యవృత్తిని స్థాపించును.

ఆపైన భరతుడు జటాధారియై వనమునందు రాము డున్నట్లు నందిగ్రామమున నున్నాడు కదా? ఇట్లు రాజుండ తగునా? స్వధర్మపరిత్యాగము, పరధర్మస్వీకరణమును ఇందు కల దందురా? రాముడు క్షత్రియధర్మోచితముగ యథాకాలము ప్రజారక్షణాదికార్యములను నిర్వర్తించి, విషయసుఖాభిలాషను క్రమక్రమముగ త్యజించి వార్ధక్యమున వన్యవృత్తి నాచరింపలేదు కదా! యౌవనముననే రాజ్యమును త్యజించి వనవాస మానరించెను కదా! అంతేగాక, "విద్ధి మాం ఋషిభి స్తుల్యం కేవలం ధర్మ మాశ్రితమ్" అనియు రామచంద్రు డుద్ఘోషింపలేదా? అనగా రాముడు పరధర్మము నాశ్రయించె నని చెప్ప నగునా? అతడు ధర్మమును అతిక్రమించె నని చెప్పుట పాడియగునా? కాదనియే సర్వుల ఏకాభిప్రాయము.

అటులనే అర్జునుడు యుద్ధముచేసి రక్తపుకూడు తినుటకంటె భైక్ష్యమైనను శ్రేయము అన్నంతమాత్రమున అతనియందు పరధర్మాశ్రయత్వదోష మారోపించుట సమంజసము కాదు. కనుక స్వజనదృష్టితో, స్వబంధుప్రీతితో, స్వసోదర ప్రీతితో అర్జునుడు అట్టి ధర్మము నాచరించెద నని చెప్పియున్నాడు.

న కాంక్షే విజయం కృష్ణ న చ రాజ్యం సుఖాని చ ।
కిం నో రాజ్యేన గోవిన్ద కిం భోగై ర్జీవితేన వా ॥ (1-32)

కాని రాముడు పితృవాక్యపాలన మనెడి ధర్మముచే బద్ధుడై అట్లు గావించె

నందు రేమో? అహో! ప్రజ్ఞావాదములు. తండ్రి తరువాత తండ్రి యంతటివాడు ధృతరాష్ట్రుడు. సంజయునివలన సందేశ మంపుచు "మా దుర్యోధనుడు రాజ్య మిచ్చిన గొనుడు. లేకున్న భిక్షాచరణ మైనను మీకు మంచిదే అగును సుమా!"

న తే భాగం కురవోఽన్యత్ర యుద్ధాత్
ప్రయచ్ఛేరన్ తుభ్య మజాతశత్రో।
భైక్ష్యేణ చర్యా మంధక వృష్ణిరాజ్యే
శ్రేయో మన్యే న తు యుద్ధేన రాజ్యమ్॥ (ఉ- 26-2)

అని సందేశ మంపలేదా? ధృతరాష్ట్రవాక్యపరిపాలనము కర్తవ్య మన జెల్లదా? కనుక అర్జునుడు స్వధర్మత్యాగము చేయలేదు. పరధర్మరతుడును కాలేదు. పదునాల్గు సంవత్సరములు మాత్రమే దశరథుని వచనానుసారము రాముడు రాజ్యమును విడచుట జరిగినది. తరువాత రాజధర్మమునే పాలించినాడు. కనుక నిది విశేషముగా రామునియందు స్వీకరింపనగును, అని అనరాదు. రాముడు భరద్వాజాశ్రమముననుండి హనుమంతుని భరతుని కడకు పంపి భరతాశయమును తెలిసికొని రమ్మనినాడు. అనగా భరతుడు రాజ్యకాంక్ష కలవా డగుచో తాను మరల అరణ్యముననే ఉందు నని కదా రాముని యభిప్రాయము. అది ధర్మబద్ధ మగునా? మరి!

అది కాదు గ్రహింపవలసినది. రామాయణములో సోదరులయందు సోదర ప్రీతి కండు. మరి యిచ్చట దుర్యోధనాదులు ఆతతాయులు. ఆతతాయులను రాజు "హన్యా దే వావిచారయన్" అన్న రీతిగా చంపవలసి యున్నది. కనుక వీరిని చంపకుండుట అధర్మ మగును.

ఏతా న్న హంతు మిచ్ఛామి ఘ్నతోఽపి మధుసూదన।
అపి త్రైలోక్యరాజ్యస్య హేతోః కిన్ను మహీకృతే॥ (గీ-1-35)
నిహత్య ధార్తరాష్ట్రాన్నః కా ప్రీతి స్స్యా జ్జనార్దన।
పాప మే వాశ్రయే దస్మాన్ హ త్వైతా నాతతాయినః॥ (1-36)
తస్మా న్నార్హా వయం హంతుం ధార్తరాష్ట్రాన్ స్వబాంధవాన్।
స్వజనం హి కథం హత్వా సుఖిన స్స్యామ మాధవ॥ (1-37)

ఈ శ్లోకములను సరిగా నిదానించి చూడుడు. అర్జునునకు శోకమోహములు కల వని వ్యాఖ్యానింప నెంచి, వానిని ముందుగా మీయందు ఆవహింపజేసికొని చూడకుడు సుమా! ఆతతాయులనుచంపు మని రాజునకు బోధ చేయుచున్నది ధర్మశాస్త్రము. ఏదృష్టితో చంపు మనుచున్నది? ధర్మదృష్టితో కాని, స్వసుఖాపేక్ష

కొరకుకాదు. రాజ్యమును పొందుటకై వారిని చంపు మని చెప్పుటలేదు. అవునా? ప్రకృతము దుర్యోధనుడు అర్ధరాజ్య మిచ్చివేసినచో పాండవులు ఆతతాయు లగు దుర్యోధనాదులను విడుతురా? లేదా? ఇదివరకు ప్రథమమున జూదమున ఓడిన ప్పుడు వీరు ఆతతాయు లని పేరుపెట్టి చంపివేసియుండవచ్చును గదా! అపుడు ధృతరాష్ట్రానుగృహీతులై రాజ్య మేల పొందిరి? ఆ రాజ్యము నేల పాలింప నెంచిరి? మరల నారాజ్యము నేల పణముగా నొడ్డిరి? అప్పుడు ప్రసక్తముగాని ఆతతాయివధ ఇప్పుడు ప్రసక్త మగుటలో ఔచిత్య మున్నదా?

కాక, దుర్యోధనాదులు ధర్మధ్వంసకులు, ఆతతాయులు అయినందున ఈ యుద్ధ మిప్పుడు ప్రసక్తము కాలేదే? ప్రకృతయుద్ధప్రసక్తి రాజ్యహేతుకమే యగుట నిశ్చయముకదా! అందువలన అర్జునుడు "త్రైలోక్యరాజ్యముకొరకైనను యుద్ధము చేసి వీరిని చంపను సరికదా! ఈ భూమికై చంపుదునా? అని చెప్పు చున్నాడు.

"పృథ్వీ రేణు రణుః పయాంసి కణికాః ఫల్గుః స్ఫులింగోఽనలః
తేజో నిశ్వసనం మరు త్తనుతరం రంధ్రం సుసూక్ష్మం నభః।
క్షుద్రా రుద్రపితామహప్రభృతయః కీటా స్సమస్తా స్సురాః
దృష్టా యత్ర స తావకో విజయతే భూమావధూతావధిః ॥

ఇత్యాదిభావానుసారము ఈ భూమి రేణువులో అణువు. అనగా అల్పా ల్పము. ఇంతకు ముందు వీరు ఆతతాయులయ్యును పాండవులు వీరిని స్వజనుల నుగా చూచివారు. ఘోషయాత్రలో ధర్మజుడు యజ్ఞదీక్షితుడై యుండ భీముడు, "దుర్మార్గులను శిక్షింపవలసినదే, ఆ పని గంధర్వులు చేయుచుండ మనకేల?" అని యనుచున్నను ధర్మవాక్యబద్ధుడై అర్జునుడు భీమాదుల సాహాయ్యముతో విడిపించి స్వజను లన్నప్రీతిని చూపించెను. అపుడే మంట గలిసినది దుర్యోధనాదుల ఆత తాయిత్వము.

"దోషో య ద్యపి తస్య స్యా త్సతా మేత దగర్హితమ్।
కార్యం కరుణ మార్యేణ న కశ్చి న్నాపరాధ్యతి ॥"

అన్నరీతిగా వారు ఆనా డాతతాయు లయ్యును, పిమ్మట పాండవులు చూపిన స్వబంధుప్రీతిచే— స్వజనదృష్టిచే అది పరాస్తమయినది. ఇప్పు డా విషయము నెత్తి మరల వారలను శిక్షించుటవలన పాపము కలుగును. ఆ యాతతాయుల యొక్క అధర్మఫలము ఇప్పుడు వారిని చంపిన మనల నాశ్రయించును.

"పాప మే వాశ్రయే దస్మా న్హ త్వైతా నాతతాయినః"

"ఒకసారి క్షమింపబడినవారిని మరల శిక్షించుట పాపము"

"ఏతాన్" అనగా పూర్వము మనచే స్వజనప్రీతితో చూడబడినవారు ఆతతాయిధర్మము మన మనస్సులయందు తుడిచి వేసికొనినట్లుగా మనచే ఒకప్పుడు సంరక్షితులైన వారు అని అర్థము. అట్లు ఒకసారి క్షమించినవారిని మరల ఆ ఆతతాయితాధర్మ పురస్సరముగా చంపినచో పాపమే వచ్చును అనగా స్వధర్మ మగు యుద్ధమునందు అధర్మపరులను చంపుటవలన పుణ్యము వచ్చును. కాని "మా హింస్యా త్సర్వా భూతాని" అన్న సామాన్యధర్మనీతిలో పాపము కూడా కొంత వచ్చును. ఒకసారి క్షమింపబడిన ఈ ఆతతాయులను ఇప్పుడు చంపుట వలన పాపమే వచ్చునని, పుణ్యము ఏరూపమునను రాదని "ఏవ" కారమువలన తెలియుచున్నది. మరియు మనచే అనుగృహీతులైన ఈ ఆతతాయులను చంపి నచో వారి పాపమే మనకు వచ్చునని, దానికి మన కర్తృత్వము కాక ఆ పాపము నకే ఆ కర్తృత్వమున్న దని అస్మ చ్ఛబ్దమును కర్మగను "పాప" శబ్దమును కర్త గనుచేసి అర్జునుడు ప్రయోగించినాడు.

## (7) పాండవులుకూడ ఆతతాయులే,

"హ త్వైరా నాతతాయినః" అనుచు అర్జునుడు కౌరవులను ఆతతాయు లనుగ వర్ణించినాడు. వారిని చంపుట తమకు పాపమే కల్గించుననియు ఖేదపడి నాడు. నిజమునకు తాము కూడ ఆతతాయులే అను భావము అర్జునునకు కలదు. భారతములో శల్యపర్వములో "పాండవాన్ ఆతతాయినః" అను వాక్యము కలదు.

తాన్ ప్రేక్ష్య సహితాన్ సర్వాన్ జవే నోద్యతకార్ముకాన్ ।
సౌ లోఽభ్యదప్రవ ద్యుద్ధే పాండవా నాతతాయినః ॥ (శ-28-30)

ఇది సంజయుని వాక్యము. సంజయుడు పాండవులను ఆతతాయులు అని వర్ణించుచున్నాడు.

"పాప మే వాశ్రయే దస్మాన్ హ త్వైతా నాతతాయినః ।" అను గీతా వాక్యము నిట్లు వ్యాఖ్యానింపవలయును.

"ఏతాన్ ఆతతాయినః హత్వా అస్మాన్ పాప మే వాశ్రయేత్" ఆత తాయులగు వీరిని చంపినచో మనకే పాపము చుట్టుకొనును. ఇది ఒక అర్థము.

ఆతతాయినః అస్మాన్ హత్వా ఏతాన్ పాప మే వాశ్రయేత్ । ఆతతాయి లగు మమ్ములను చంపిన వీరికి పాపము చుట్టుకొనును అని మరియొకఅర్థము.

అగుచో ఎవరైనను తమను దుష్టులనుగ పేర్కొందురా! అన్నచో "స్వదోషపరదోషవిత్" అను రామవిశేషణము అర్జునునియందు సార్థకమైన దని చెప్పవలయును. అగుచో అగ్నిదాహాదికములచే ఆతతాయిత్వము సంభవించునుకదా। వీనిలో నే కారణముచే పాండవు లాతతాయు లగుదురు? అన్నచో—

భారతమును జాగ్రత్తగ పఠింపవలయును. అప్పుడు తెలియఁను.

భీముడు మిక్కిలి బలవంతుడు, ధూర్తుడు అగుటచే దుర్యోధనుడు మున్నగు వారిని చెట్టెక్కించి కూలద్రోసెను. ఇది ఒక ఉదాహరణముమాత్రమే. ఇట్టి కృత్యములు మ రెన్నియో కలవు. ఇవి దుర్యోధనునకు బాధాకరము లై అసూయను కలిగించి ఆతని అకృత్యములకు హేతువు లైనవి.

కర్తా కారయితా చైవ ప్రేరక శ్చానుమోదకః।
సుకృతే దుష్కృతే చైవ చత్వార స్సమభాగినః॥

అను న్యాయానుసారము దుర్యోధనుని తప్పుల కన్నింటికి భీముని బలమే హేతువు కావున భీమునకు, ఆతని సోదరులకు వారనుమోదకు లగుటవలన కూడ ఆతతాయిత్వము అంటక తప్పదు.

ద్యూతకృత్యమునందు ధర్మరాజు భార్యను పణముగ పెట్టుట, ద్రౌపది గర్హించినది. కర్ణుడు గర్హించినాడు. వికర్ణవచనమును విదురు డామోదించినాడు. ద్యూతమున కసలు కారణము భీమాదులు దుర్యోధనుని పరిహసించుట. ఈ విధమైన కృత్యములు, ఒకరకముగ చెప్పవలసివచ్చినచో. దుర్యోధనుని ప్రతిఅకృత్యమునకు పాండవులు కారణమగుట నిశ్చప్రచము. దుర్యోధనుడు హ్రదములో దాగియుండగ అతనిని బయటకు రప్పించుటకు ధర్మజు డాడిన మాటలను ఆక్షేపించుచు కృష్ణు డర్జునునితో పల్కిన పలుకులసారమును సమీక్షింపగ జూదము ధర్మజుని అకృత్య మనియే నిర్ధారణ చేసినట్లు తెలియును.

ఆతతాయు లనుటకు కొన్ని లక్షణములు గలవు. వానిలో శస్త్రపాణిత్వ మొకటి.

అథ వ్యవస్థితాన్ దృష్ట్వా ధార్తరాష్ట్రాన్ కపిధ్వజః।
ప్రవృత్తే శస్త్రసంపాతే ధను రుద్యమ్య పాండవః॥ (గీ 1-20)

"ధను రుద్యమ్య" అన్నది అర్జునుని యందలి ఆతతాయిత్వమునకు లక్షణమా? కావచ్చును. అప్పటికి ఎవ్వరును ఆయుధము లెత్తలేదు. శంఖములను మాత్రమే పూరించిరి. పెద్దల అనుమతి గ్రహింపలేదు. ఈరణయజ్ఞమునందు యుద్ధ మెట్లెట్లు చేయువలయునో కొన్ని కట్టడులను ఇరువాగులవారు చేసికొనినారు.

దీనినిబట్టి ఒక ధర్మపద్ధతిని యుద్ధ మారంభము కావలయును. వెంటనే
ధను వెత్తుట ఆతని తొందరపాటును సూచించును. కావుననే అతడు
సశరం చాపం' (గీ. 1-47) అధనుర్బాణములను విడచుటకు కారణ మైన
ఒకవిధముగ ఆతతాయిత్వమే ఈ విధముగ గీతాబోధ తర్వాత ధర్మరా
మునకు భీష్మాదుల అనుమతిని బడయుట చూడగ అప్పటికి యుద్ధము మొ
దని స్పష్టమేకదా: కనుక అర్జునుడు యుద్ధవైముఖ్యమును చూపుట తన
పాటును మరియొకరీతిన కప్పిపుచ్చుకొనుటే యగును అంతమాత్రమే
అర్జునుడు ధర్మ్య మైన, క్షత్రియోచిత మైన యుద్ధమును విరమించుట కొ
శత్రువులను చూచి క్లైబ్య మందుట కాని ఈ సందర్భముయొక్క తాత్పర్య
అగుచో అట్లు చేయుట తప్పేకదా. అందు రేమో? అర్జునుడు తప్పు
వెంటనే దానినిసరిదిద్దుకొనినాడు కనుక ఇది అధర్మమనుట చెల్లదు. ధర్మమే
కనుక అర్జునునిది విషాదయోగము కాదు. ధర్మయోగమే.

అధ్యేష్యతే చ య ఇమం ధర్మ్యం సంవాద మావయోః ।
జ్ఞానయజ్ఞేన తే నాహ మిష్ట స్స్యా మితి మే మతిః ॥ (గీ.

అన్న వాక్యములో "మా ఇర్వురయొక్క ఈ సంవాదము ధర్మ్య
కృష్ణు డనినాడు. అర్జునుని భావములు ధర్మానుసారములు గాకపోవుచో
ధర్మబోధ చేసియే యుండడు. కనుక కారణభూత మైన అర్జునవాక్యరచన
మైన కృష్ణబోధ రెండును ధర్మ్యములే. కావున అర్జునునిది ధర్మవిష
గమే కాని విషాదయోగ మనుట చెల్లదు.

సర్వాం స్త్వన్యా న్హనిష్యామి పార్థివా న్భరతర్షభ ।
యా న్సమేష్యామి సమరే న తు కుంతీసుతా న్నృప ॥ (ఉ-
అర్జునం వాసుదేవం చ యే చాన్యే తత్ర పార్థివాః ।
సర్వాం స్తా న్వారయిష్యామి యావ ద్రక్ష్యామి భారత ॥ (ఉ-1
పాంచాల్యం తు మహాబాహో నాహం హన్యాం శిఖండినమ్ ।
ఉద్యతేషు మధో దృష్ట్వా ప్రతియుద్ధ్యంత మాహవే ॥ (ఉ-1

అను నీ భీష్మని శ్లోకములను విన్న దుర్యోధనుడు, "ఆయుధ
శత్రువు నెదుర్కొనక నుండుటకు కారణ మేమి? అత డాతతాయికదా ।
ప్రశ్నించుటలో దుర్యోధనుని భావము, 'అతతాయిన మాయాంతం హన
విచారయన్" అను వచనమును భీష్మునికి గుర్తు చేయుటయే. దీనిని బట్టి
మెత్తినవాడు ఆతతాయి అని చెప్పబడును. ఈరూపమున చూచినప్పుడు

మర్జునుడు ధను వెత్తి కృష్ణుని "సేనామధ్యమున రథము నిలుపు" మని చెప్పి నప్పుడు ఆతతాయి యని స్పష్ట మగుచున్నది.

"అగ్నిదో గరద శ్చైవ" అన్న స్మృతి వచనానుసారము అర్జునుడు కూడ ఆతతాయిగ పేర్కొనబడుచున్నాడు. వారణావతమున దుర్యోధనుడు, పురోచనుని వశపరచుకొని వీనివలన లాక్షాగృహమును దగ్ధము కావించినందున దుర్యోధనుడు ఆతతాయిగా పేర్కొనబడుచున్నాడు.

ఈ అంశమును పురస్కరించుకొని దుర్యోధనుని ఆతతాయిగ నిరూపించుచో పాండవులను కూడ ఆతతాయులుగనే లెక్కింపవచ్చును.

తాం స్తు దృష్ట్వా సుమనసః, పరిసంవత్సరోషితాన్ ।
విశ్వస్తా నివ సంలక్ష్య, హర్షం చక్రే పురోచనః ॥ (ఆది-148-1)
పురోచనే తథా హృష్టే కౌంతే యోథ యుధిష్ఠిరః ।
భీమసేనార్జునౌ చోభే, యమౌ ప్రోవాచ ధర్మవిత్ ॥

వైశంపాయనుని వాక్యములవలన పురోచనుడు వచ్చినపని కావింపనున్నాడని యుధిష్ఠిరుడు గమనించి భీమాదులతో ఇట్లు అనుచున్నాడు.

అస్మా నయం సువిశ్వస్తా న్వేత్తి పాపః పురోచనః ।
వంచితోఽయం నృశంసాత్మా కాలం మన్యే పలాయనే ॥ (-3)
ఆయుధాగార మాదీప్య దగ్ధ్వా చైవ పురోచనం ।
షట్ప్రాణినో నిధాయేహ ద్రవామోఽనభిలక్షితాః ॥ (-4)

ఈ ధర్మరాజువాక్యములవలన ఆగృహమును తామే దగ్ధముచేసి తమకు బదులుగ ఆరుగురిని అక్కడ నిదర్శనముగ చంపి తప్పించుకొని పోదలచినట్లు స్పష్టమైనది గదా!

అథ దానాపదేశేన కుంతీ బ్రాహ్మణభోజనం ।
చక్రే నిశి మహారాజ హ్యాజగ్ముః తత్ర యోషితః ॥ (-5)
తా విహృత్య యథాకామం భుక్త్వా పీత్వా చ భారత ।
జగ్ము ర్నిశి గృహానేవ సమనుజ్ఞాప్య మాధవీమ్ ॥ (-6)
నిషాదీ పంచపుత్రా తు తస్మిన్ భోజ్యే యదృచ్ఛయా ।
అన్నార్థినీ సమభ్యాగాత్ సపుత్రా కాలచోదితా ॥ (-7)
సా పీత్వా మదిరాం మత్తా సపుత్రా మదవిహ్వలా ।
సహ సర్వై స్సుతై రాజం స్తస్మి న్నేవ నివేశనే ॥ (-8)

పాండవులయందు దుర్యోధనుడు దుర్బుద్ధిమోహములను ఆపాదించుచుండుట అనేకపర్యాయములు గమనింపవచ్చును. అది వారియందే కాక, తనయందును కలదే యని దుర్యోధనుడు తెలిసికొనును.

కావున గొప్పవా రెప్పుడును చేయుటకు ముందో, తర్వాతనో స్వదోషపరదోష విజ్ఞత్వమును ప్రకటించుచుందురు. కావుననే అర్జునుడును దుర్బుద్ధిమోహముల ఫలితముగనే ఇప్పు డీయుద్ధము సంప్రాప్త మైన దని కప్పిపుచ్చక ప్రకటించు చున్నాడు.

అథాస్తు వంతో వేదోక్తాన్ సంస్కారాన్ పాండవాస్తదా ।
నవ్యవర్ధంశ్చ భోగాం స్తే భుంజానాః పితృవేశ్మని ॥ (ఆది. 118-14)
ధార్తరాష్ట్రైశ్చ సహితాః క్రీడంతో ముదితా స్సుఖమ్ ।
బాలక్రీడాసు సర్వాసు విశిష్టా స్తేజసాఽభవన్ । (-15)
జవే లక్ష్యాభిహరణె భోజ్యే పాంసువికర్షణే ।
ధార్తరాష్ట్రాన్ భీమసేనః సర్వా న్స పరిమర్దతి ॥ (-16)
హర్షా త్ప్రక్రీడమానాం స్తాన్ గృహ్య రాజ న్నిలీయతే ।
శిరస్సు వినిగృహ్యైతాన్ యోధయామాస పాండవః ॥ (-17)
శత మేకోత్తరం తేషాం కుమారాణాం మహౌజసామ్ ।
ఏక ఎవ ని గృహ్ణాతి నాతికృచ్ఛ్రా ద్వృకోదరః ॥ (-18)
కచేషు చ నిగృహ్యైనా న్వినిహత్య బలా ద్బలీ ।
చకర్ష క్రోశతో భూమౌ ఘృష్టజానుశిరోంసకాన్॥ (-19)
దశ బాలాన్ జలే క్రీడన్ భుజాభ్యాం పరిగృహ్య సః ।
ఆస్తే స్మ సలిలే మగ్నో మృతకల్పా న్విముంచతి ॥ (-20)
ఫలాని వృక్ష మారుహ్య విచిన్వంతి చ తే యదా ।
తదా పాదప్రహారేణ భీమః కంపయతే ద్రుమాన్ ॥ (-21)
ప్రహారవేగాభిహతా ద్రుమా వ్యాఘూర్ణితా స్తతః ।
సఫలాః ప్రపతంతి స్మ ద్రుతం స్రస్తాః కుమారకాః ॥ (-22)
న తే నియుద్ధేన జవేన యోగ్యా సు కదాచన ।
కుమారా ఉత్తరం చక్రుః స్పర్ధమానా వృకోదరమ్ ॥ (-23)
ఏవం స ధార్తరాష్ట్రాంశ్చ స్పర్ధమానో వృకోదరః ।
అప్రియేఽతిష్ఠ దత్యంతం బాల్యా న్న ద్రోహచేతసా॥ (-24)
తతో బల మతిఖ్యాతం ధార్తరాష్ట్రః ప్రతాపవాన్ ।
భీమసేనస్య తద్జ్ఞాత్వా దుష్టభావ మదర్శయత్ ॥ (-25)

ఇక్కడ భీముడు చేసిన పనులు బాల్యము వలననే కావచ్చును. భీమునకు ద్రోహబుద్ధి లేకను పోవచ్చును. కాని ఇట్టిపనులను ధర్మరాజుకాని, కుంతికాని, మరే పెద్దలుకాని నిరసించినట్లు లేదు. దీనివలన దుర్యోధనుడు భీమకృత్యములకు బాధ పొందినాడు. బాధపడినవాడు దానికి తగిన ప్రతిక్రియ చేయుచుండుటయు బాల్యము నుండియు అభ్యాస మైనది. కనుక చిన్నతనమునుండియు వీరిలో ఒకరిపై నొకరు స్పర్థ పెంచుకొనుచు అకృత్యములు చేయుచునే ఉన్నారు దాని ఫలితముగ దుర్యోధనుడు భీమునకు విషాన్నము పెట్టుట ఇత్యాదులు జరిగినవి.

రాజసూయయాగమునందు ధర్మరాజు కానుకలను పరిగ్రహించి కృత్యమునందు దుర్యోధనుని నియోగించినాడు. ధర్మరాజు అందరిని సగౌరవముగ రాజసూయమున కాహ్వానించినాడు. అట్టి స్థితిలో దుర్యోధనుడు అజ్ఞానముచేత కావచ్చును; మయసభయందు తిరుగుచు భ్రాంతులకు లోనై ఉన్నది లేనట్లు. లేనిది ఉన్నట్లు భావించుచు, తదనుగుణముగ ప్రవర్తించెను. అప్పుడు వారందరును పరిహసించిరి.

తతః స్ఫాటికతోయాం వై స్ఫాటికాంబుజశోభితామ్ ।
వాపీం మత్వా స్థల మివ సవాసాః ప్రాపత జ్జలే ॥ (సభా-47-6)
జలే నిపతితం దృష్ట్వా భీమసేనో మహాబలః ।
జహాస జహసుశ్చైవ కింకరాశ్చ సుయోధనమ్ ॥
వాసాంసి చ శుభా న్యస్మై ప్రదదౌ రాజశాసనాత్ ।
తథాగతం తు తం దృష్ట్వా భీమసేనో మహాబలః ॥
అర్జునశ్చ యమౌ చోభౌ సర్వే తే ప్రాహసం స్తదా ।
నామర్షయ త్తత స్తేషా మపహాస మమర్షణః ॥
ఆకారం రక్షమాణ స్తు న స తా న్సముదైక్షత ।
పున ర్వసన ముత్క్షిప్య ప్రతరిష్య న్నివ స్థలం ॥ (-10)
ఆరురోహ తత స్సర్వే జహసు శ్చ పున ర్జనాః ।
ద్వారం తు పిహితాకారం స్ఫాటికం ప్రేక్ష్య భూమిపః ॥
ప్రవిశ న్నాహతో మూర్ధ్ని వ్యాఘూర్ణిత ఇవ స్థితః ।
తాదృశం చాపరం ద్వారం స్ఫాటికోరుకవాటకమ్ ॥ (-12)
విఘట్టయన్ కరాభ్యాం తు నిష్క్రమ్యాగ్రే పపాత హ ।
ద్వారం తు వితతాకారం సమాపేదే పునశ్చ సః ॥ (-13)
తద్వృత్తం చేతి మన్వానో ద్వారస్థానా దుపారమత్ ।

ఏవం ప్రలంభా న్వివిధాన్ ప్రాప్య తత్ర విశాంపతే ॥ (-14)

ఈఘట్టమునుబట్టి ధర్మరాజు ఆహ్వానించిన దుర్యోధనుని వీరు పరిహసించు చుండ తప్పని చెప్పలేదు. పోనీ తాను దగ్గరుండి ఈ సభాభవనమును దుర్యోధను నకు చూపించినట్లును లేదు ధర్మరాజుయొక్క పరోక్షమున ఇది జరిగె ననుటకు వీలు లేదు. అతని శాసనమున దుర్యోధనునికి వస్త్రములు ఈయబడినవి. దుర్యోధనుడు తండ్రితో చెప్పిన ఈ వచనములు పరిశీలింప దగును.

జ్యేష్ఠోఽయ మితి మాం మత్వా శ్రేష్ఠశ్చేతి విశాంపతే ।
యుధిష్ఠిరేణ సత్కృత్య యుక్తో రత్నపరిగ్రహే ॥ (సభా-50-22)
కృతాం బిందుసరోరత్నైః మయేన స్ఫాటికచ్ఛలామ్ ।
అపశ్యన్నలినీం పూర్ణా ముదకస్యేవ భారత ॥ 25
వస్త్రముత్కర్షతి మయి ప్రాహస త్స వృకోదరః ।
శత్రో ర్వృద్ధి విశేషేణ విమూఢం రత్నవర్జితమ్ ॥ (-26)
తత్రస్మ యది శక్తస్స్యాం పాతయేఽహం వృకోదరమ్ ।
యది కుర్యాం సమారంభం భీమం హంతుం నరాధిప ॥ (-27)
శిశుపాల ఇవాఽస్మాకం గతిఽస్స్యా న్నాత్ర సంశయః ।
సపత్నే నాపహాసో మే స మాం దహతి భారత ॥ (-28)
పునశ్చ తాదృశీ మేవ వాపీం జలజశాలినీమ్ ।
మత్వా శిలాసమాం తోయే పతితోఽస్మి నరాధిప ॥ (-29)
తత్ర మాం ప్రాహసత్ కృష్ణః పార్థేన సహ సుశ్వరమ్ ।
ద్రౌపదీ చ సహస్త్రీభిః వ్యథయంతీ మనో మమ ॥ (-30)
క్లిన్న వస్త్రస్య తు జలే కింకరా రాజచోదితాః ।
దదు ర్వాసాంసి మేఽన్యాని తచ్చ దుఃఖం పరం మమ ॥ (-31)
ప్రలభంచ శృణుష్వాన్య ద్వదతో మే నరాధిప ।
అద్వారేణ వినిర్గచ్ఛన్ ద్వారసంస్థానరూపిణా ॥ (-32)
అభిహత్య శిలాం భూయో లలాటే నాస్మి విక్షతః ।
తత్ర మాం యమజౌ దూరా దాలోక్యాఽభిహతం తదా ॥ (-33)
బాహుభిః పరిగృహ్ణీతాం శోచన్తౌ సహితా వుభౌ ।
ఉవాచ సహదేవస్తు తత్ర మాం విస్మయన్నివ ॥ (-34)
ఇదం ద్వారమితో గచ్ఛ రాజన్నితి పునఃపునః ।
భీమసేనేన తత్రోక్తో ధృతరాష్ట్రాత్మజేతి చ ॥ (-35)

సంబోధ్య ప్రహసిత్వా చ ఇతో ద్వారం నరాధిప ।
నామధేయాని రత్నానాం పురస్తా న్న శ్శ్రుతాని మే ॥ (–36)

ఈ వచనములలో నాకు జ్యేష్ఠుడు, శ్రేష్ఠుడు అని గౌరవించినట్లు అగు పడుచున్నదేకాని వారెవరును అక్కడ నన్ను గౌరవింపలేదు. సరికదా! అవమాన పరచిరి. ధర్మరాజు కింకరులచేత వస్త్రముల నిప్పించినాడు. కృష్ణుడు, అర్జునుడు, ఒక వైపున నవ్వుచుండగా, మరియొకవైపున ద్రౌపది స్త్రీలతో కలసి నాకు మనో వ్యధను కలిగించుచు పరిహసించినది. నేను ద్వారములేని చోట ద్వారమును భ్రమించి లోనికి పోవుచుండ భీమసేనుడు ధృతరాష్ట్రాత్మజ! అనినాడు. అనగ గుడ్డివాని కొడకా అన్న వెటకారమే కదా!

దీనినిబట్టి ధర్మరాజుతో సహా మొత్తము అందరును దుర్యోధనుని పరిహ సించి రని స్పష్టము ఇది అకృత్యమే. శత్రువైనను దుష్టుడైనను దుర్యోధనుడు ఆ పాండవుల అతిథి; ఆహూతుడు. మీదుమిక్కిలి కానుకలు స్వీకరించుచు బాధ్య తను నిర్వహించినవాడు. అట్టివానిని ఎగతాళి చేయుట పరమదుర్మార్గకృత్యము. యజ్ఞమునం దెవరిని అవమానింపరా దని, హేళన చూడరాదని సర్వసామాన్య ధర్మము.

అవజ్ఞయా న దాతవ్యం కస్యచి ల్లీలయాపి వా ।
అవజ్ఞయా కృతం హన్యా ద్దాతారం నాత్ర సంశయః । (బా. 13–30)
సర్వే వర్ణా యథాపూజాం ప్రాప్నువంతి సుసత్కృతాః ।
న చావజ్ఞా ప్రయోక్తవ్యా కామక్రోధవశా దపి ॥ (బా. 13–13)
యజ్ఞకర్మసు యే వ్యగ్రాః పురుషా శ్శిల్పిన స్తథా ।
తేషా మపి విశేషేణ పూజా కార్యా యథాక్రమం ॥ (–14)
తే చ స్యుః సంభృతా స్సర్వే వసుభి ర్భోజనేన చ ।
యథా సర్వం సునిహితం న కించి త్పరిహీయతే ॥ (–15)

రామాయణములోని ఈవాక్యములు యజ్ఞకర్మయందు అందరకు గౌరవ మీయవలయు నని, అట్లు చేయనిచో యజమానునకు వినాశము కలుగు నని చెప్పు చున్నవి. ధర్మరాజాదులు దుర్యోధనుని ఎడల చేసిన అపకృత్యము వారు పొందు సమస్త కష్టములకు కారణభూతమైన దనుట యథార్థము.

ద్యూతకృత్యము అధర్మ మని, అందు ముఖ్యముగ ద్రౌపదిని పణముగ పెట్టుట మహాపాప మని ద్రౌపదియే పలికినది. ప్రాతికామి, యుధిష్ఠిరో ద్యూత మదేన మత్తో దుర్యోధనో ద్రౌపది త్వా మజైషీత్ – (సభా – 66–4)

అనగా ద్రౌపది "కథం త్వేవం వదసి ప్రాతికామిన్ కో హి దీవ్యే ద్భార్యయా రాజపుత్రి, మూఢో రాజా ద్యూతమదేన మత్తో హ్యభూ న్నాన్య త్కైతవ మస్య కించిత్ ॥" (సభా-66-5) అనును.

ఈసందర్భములో ధర్మరాజు ద్యూత మొనరించుట తప్పుకాదు. అనుటకు అతని నియమమును అనగ - "సుహృద్ద్యూతమునకు ఆహ్వానింపబడినచో రా నని చెప్పను." అన్న అతని ప్రతిజ్ఞ నింద్యము. వ్యసనవిషయమున సప్త వ్యసనములలో చేరిన ద్యూతము భారతమునందు పలుచోట్ల పలువురచే నిందింపబడుచుండ ధర్మరాజు అట్టి వ్యసనరూప మగు నింద్యవిషయమున నియమము నుంచుకొనుట ఎంత తప్పో గదా! అది రాజులకు పీడరాని ధర్మమేయగుచో ప్రత్యేకముగా ద్యూత విషయమున నియమము కల్పించుకొను టేల?

ధర్మరాజు ఓడిన అనంతరము ద్రౌపదిని శకుని వచనానుసారము పణ మొడ్డెను. అందువలన ద్రౌపదిని పణముగా పెట్టుటలో అతని తప్పు లేదు. అని వాదించు దుర్యుక్తి విలసిత మతులకు ఒక ప్రశ్న. ధర్మరాజు తాను ఓడినపిమ్మట దుర్యోధనాదులకు దానిస యైనందున అతనికి ప్రశ్నించు నవకాశము లేదు. కనుక శకుని పణ మొడ్డ మనగా అస్వతంత్రుడై నందున ఆమెను పణముగా నొడ్డెనో అనుచున్నారు గదా! మరి దుర్యోధనుడు ప్రాతికామిని పంపి ద్రౌపదిని తోడ్కొని రమ్మని పంపినప్పుడు ఆమె ప్రశ్నింపగా అతడు సభకు వచ్చి ఆమె ప్రశ్న నివేదించెను. సభ్యు లెవ్వరును పలుకలేదు.

యుధిష్ఠిర స్తు తచ్ఛ్రుత్వా దుర్యోధన చికీర్షితమ్ ।
ద్రౌపద్యా సమ్మతం ద్యూతం ప్రాహిణో ద్భరతర్షభ ॥ (స 66-18)
ఏకవస్త్రా త్వధోనీవీ రోదమానా రజస్వలా ।
సభా మాగమ్య పాంచాలీ శ్వసుర స్యాగ్రతో భవ ॥ 19
స గత్వా త్వరితం దూతః కృష్ణాయా భవనం నృప ।
న్యవేదయ న్మతం ధీమా న్ధర్మరాజస్య నిశ్చితం ॥ 20

ఈశ్లోకములలో ధర్మరాజు ద్రౌపదికి దూతను పంపినట్లున్నది గదా! అస్వతంత్రు డగువాడు ఇట్లు దూతను పంపవచ్చునా? ద్రౌపదిని ఒడ్డుటలో అస్వతంత్రుడై ఒడ్డె నని ఎట్లు చెప్పగలరో వారి నీతి బాహ్యవచనములకు వారే తృప్తిపడవలెను.

సభలో ఆమె ప్రశ్నకు సమాధానము చెప్పుటకు వికర్ణుడు తప్ప తక్కిన వారు దుర్యోధనభీతులై చెప్ప లేదని అక్కడ ఉన్నది. భీష్మద్రోణులు ఏల

చెప్పలేదు? భీష్ముడు కర్రవిరుగక, పాము చావక కొట్టినట్లు చెప్పినాడు. కాని ధర్మరాజు ఎందుకు పలుకలేదు? అస్వతంత్రుడై పలుక లేదన్నమాట. నీతిబాట కాదని ఆమెకు సమ్మతదూతను పంపుట లోనే తేలిపోయినది.

ద్రోణవధానంతరము తన అసత్యమువలననే ద్రోణుడు అట్టి చావు చచ్చెను. అందులకు అర్జునుడు క్రుద్ధుడు కాగా, ద్రోణునియందు దౌష్ట్యము చూపుటకు ధర్మరాజు సభలో ధర్మ మడుగగా చెప్పలేదు. ద్రోణు డని సమాధాన మిచ్చెను.

విదురుడుకూడ ధర్మవిషయకమైన ప్రశ్న సభలో వేసినప్పుడు సమాధాన మీయకపోతే అది సభకాదు, వారు ధర్మపరులుకారు, అని అనును. దీనివలన ద్రౌపదీప్రశ్న సమాధానము చెప్పలేనంత గహనము కాదని ధర్మజవిదురుల భాషితమువలన తెలియుచున్నది. ద్రోణుడు చెప్పకపోవుటలో ఆతని తప్పును ప్రత్యేకముగా పేర్కొనిన ధర్మరాజు ఎందుకు చెప్పలేదు? కావున విదురనింద వ్యంగ్యముగా ధర్మరాజునందే పర్యవసించుచున్న దనవచ్చును.

ఈ సందర్భములో భీముడు ధర్మరాజు చేతులు కాల్తు నని చెప్పుటవలన కూడ ఈవిషయము నిరూపింపబడుచున్నది. ఇచ్చట కొందరు పండితులు తమ బాహువులనే తగులపెట్టుకొందునని భీముడు పల్కినదానికి వ్యాఖ్యానము చేయుచున్నారు అట్లు వ్యాఖ్యానించుట వారి పాండిత్యదౌష్ట్యదర్పాహంకారములకు నిదర్శనమే కాని, మరియొకటి కాదు. భీముడు సాధారణముగా తప్పు లేనిదే ధర్మరాజును అనడు. ఈ విషయము వేరు సందర్భములో వివరముగా వ్రాసియున్నాము ఈగీతోపదేశతత్త్వమున మరియొకచోట సహృదయులు చూడగలరు.

అస్వతంత్రుడైన ధర్మరాజు ద్రౌపదిని శకునిశాసనముమీద ఒడ్డుచు అతడు ద్రౌపదిని వర్ణించిన తీరు సహృదయతల్లజహృదయములకు అరుంతుదమై ఉన్నది. ద్రౌపదిని వర్ణించుటకు ఆతడు స్వతంత్రుడైననే అట్లు వర్ణించినందులకు ధర్మము తోడ్పడును గాని లేక తద్బాహ్యామే యగును. ఇదియును మరియొక చోట విస్తరింపబడినది

కనుక ద్యూతమున ధర్మరాజు ప్రవర్తించుట అధర్మ్యమే. కనుకనే వారికి ఆ యధర్మఫలము వెంటనే సిద్ధించినది.

కావున దుర్యోధనుని ప్రతికృత్యమునకు ధర్మరాజాదులు ఒనరించిన దుష్కార్యము కారణ మగుచునే ఉన్నది.

నారదుడు రాజసూయయాగము చేయు మని ప్రబోధించెను. దాని ఫలిత ముగ బహ్వనర్థములు జరుగు ననియు చెప్పెను. దుర్యోధనుడు కారణముగ సర్వ క్షత్రవినాశము కలుగు నని పలుమారులు చెప్పినట్లే, ధర్మరాజు కారణముగ కూడ చెప్పబడినాడు. ముఖ్యముగ వ్యాసుడు చెప్పిన ఈ వాక్యము ధర్మజదుర్యోధను లిర్వురుకూడ సమానకారణమే అన్న భావము వ్యక్తము చేయుచున్నది.

తత్రియోదశ సమా రాజన్ ఉత్పాతానాం ఫలం మహత్ ।
సర్వక్షత్రవినాశాయ భవిష్యతి విశాంపతే ॥ (సభా. 56-11)
త్వా మేకం కారణం కృత్వా కాలేన భరతర్షభ ।
సమేతం పార్థివం క్షత్రం క్షయం యాస్యతి భారత ॥ (-12)
దుర్యోధనాపరాధేన భీష్మార్జునబలేన చ । (-13)

ఇందువలన ఒక్క దుర్యోధనుని నిందించుట, భారతనిరూపితార్థమును, తత్కర్త వ్యాసమహర్షి హృదయమును ఎఱుగకపోవుటయే.

## (8) సంజయుని రాయబారము.

యుద్ధారంభమున అర్జునుని ప్రవృత్తికి సంజయరాయబారముకూడ ఒక ముఖ్యకారణమై యున్నది. సంజయుడు అర్జునునకు ప్రాణస్నేహితుడు.

అభీక్ష్ణదృష్టోఽసి పురా హి న స్త్వం
ధనంజయ స్యాత్మసమః సఖాఽసి ॥

అని ధర్మరాజు సంజయార్జునుల స్నేహమును ప్రశంసించెను. ప్రాణస్నేహితుని వాక్యములు అర్జునుని హృదయములో చెరగని ముద్ర వేసినవి. ఆ వాక్యములను అత డనేకవిధములుగ పర్యాలోచించెను. సంజయుడు వేసిన యుద్ధవిముఖరూపబీజములు అర్జునహృదయక్షేత్రములో క్రమక్రమముగ అంకురించి, పల్లవించి, మొగ్గతొడిగి, పుష్పించి ఫలరూపమునకు వచ్చి యుద్ధారంభకాలమున శ్రీకృష్ణుని మ్రోల విషాదమును వెల్లడించుట జరిగినది. ఇచ్చటి అర్జునవాక్యము లన్నియు అనాటి సంజయరాయబారమునకు శబ్దానువాదములో, అర్థానువాదములో, భావానువాదములో తప్ప వేరు కాదు.

సంజయుని రాయబారము అర్జునుని ముందుగా కదల్చివేసినది. క్షుభితహృదయుడైన అర్జునుడు విషణ్ణుడైనాడు. శ్రీకృష్ణుని యుపదేశ మాతని కావశ్యకమైనది. గీతోపదేశ మావిర్భవించినది.

సంజయుని రాయబారము అర్జుననేకాక, ధర్మరాజునుకూడ సంక్షోభమున పడవేసినది. అయితే దానికి ఘోషము వచ్చుటకు కొంతకాలము పట్టినది. యుద్ధము

పూర్తి యగునప్పటికి ధర్మజుని మనస్సులోని క్షోభ రూపము పొంది చెరగరాని దయ్యెను. భీష్మాదులు నారదాదులు పలువురు ఆతని క్షోభను రూపుమాపుటకు యత్నించిరి. కాని ప్రయోజనము లేదయ్యెను. శ్రీకృష్ణుడుకూడ ఇట కుంఠిత ప్రయత్నుడయ్యెను. అట్టితరి అనుభవజ్ఞుడును, కార్యశూరుడును, త్యాగధను డును, ధర్మనిరతుడును అగు భీష్ముడు ఉపదేశింపవలసివచ్చినది. అర్జునునకు, ధర్మజునకుకూడ ఒకే విధముగ భావసంక్షోభము కలిగినది.

ఏతా న్న హంతు మిచ్ఛామి ఘ్నతోఽపి మధుసూదన ।
అపి త్రైలోక్యరాజ్యస్య హేతోః కిం ను మహీకృతే ॥ (గీ. 1-35)

అని అర్జునుడనును.

త్రైలోక్యస్యాపి వా దాతా నాస్మాన్ కశ్చిత్ ప్రహర్షయేత్ ।
బాంధవాన్ నిహతాన్ దృష్ట్వా పృథివ్యాం విషయైషిణః ॥ (శాం. 7-8)
తే వయం పృథివీహేతో రవధ్యాన్ పృథివీశ్వరాన్ ।
సంపరిత్యజ్య జీవామో హీనార్థా హతబాంధవాః ॥ (శాం. 7-9)

ఈ యుద్ధవైముఖ్యము ఇప్పుడు తీవ్రతరమై వెలువడినను, అప్పటినుండి "అంత రుడగుడాయతే, ఒహి ర్వక్తుం న శక్యతే" అనునట్లు అతనికి లోలోపల కలంచుచునే యున్నది కాని, తదావిష్కరణావేశము ఇప్పటికి కలిగినది.

## 9. ధర్మజుని మనస్తత్త్వము.

సంజయుని రాయబారఘట్టముకన్న కృష్ణుని రాయబారమునకు పంపుచు చెప్పిన ధర్మజుని పలుకులు వింతలకే వింత పుట్టించునవి; ధర్మజుని మొగ్గు సంధి కన్న యుద్ధము వైపే ఉన్నది. "యుధిష్ఠిర" అన్న నామము అన్వర్థ మగునట్లు ఆతడు ప్రవర్తించెను.

యుద్ధమే ప్రసక్త మగుచో మనపైపున దోషము లేనట్లుగా వెల్లడి యగు నట్లు కర్తవ్యము నిర్వహింపు మని కృష్ణునితో అనుటయు, నొకింత యర్జునుని హృదయ దౌర్బల్యమునకు, ధర్మసందేహమునకు తావైన దనవలెను. అర్జునుడు ఈ కృత్రిమరాజకీయమును గ్రహించుకొనె ననవలయును. యుద్ధమునందు అక్కడక్కడ కృష్ణుడు చేయు విపరీతవ్యాఖ్యలు, వింతచేష్టలు ఖండించుచు అర్జునుడు వాదించిన ఘట్టములు పరిశీలించినచో అర్జునమనస్తత్త్వము వెల్లడి కాగలదు. ఇంత గీతాబోధజరిగిన తరువాత "కరిష్యే వచనం తవ" అని కృష్ణునికి వాగ్దానము చేసినను, కృష్ణుడు అక్కడక్కడ చేయుమన్న విషయములలో సందేహగ్రస్తుడగుచు మరల కృష్ణుని ప్రేరణతోనే చేయుచుండుట గమనింపదగియున్నది.

డిప్పటికి అర్జునుని మనస్తత్వము ఎట్లుండునో ఊహింప "విమృశ్యైత దశేషేణ" అన్న కృష్ణవాక్యము ననుసరించి సాకల్యవిమర్శ చేయువారలకు వేరుగా నొక్కి చెప్పవలసిన పని లేదు.

(10) కృష్ణుడు దౌత్యమున దూతగ వ్యవహరింప లేదు.

కృష్ణుడు రాయబారిగా నేగి విదుర నింట విడిసెను. తత్కారణము దుర్యోధనునికి చెప్పుచు కృష్ణుడు పాండవపక్షపాతమును చూపెను. "పాండవులు నాకు కావలసినవారు, వారికి శత్రువ వగు నీవు నాకును శత్రుడవే" అనుట యేమి సమంజసము? కృష్ణు డిప్పుడు పోయి మధ్యవర్తిత్వము నెరపుటకు గదా! అప్పుడు మధ్యవర్తిత్వము నెరపు భారము తనయం దున్నంతవరకు ఉభయపక్షములకు చెందని వాడుగా కదా! కృష్ణు డుండవలయును. అట్లున్నాడా కృష్ణుడు? లే దని సదసద్విమర్శకులకే తెలియును. "న మే ద్వేష్యోస్తి న ప్రియః" అన్న కృష్ణ వచనమునకు ఇతరసందర్భములయం దట్లుండెనేమో! కాని ఇటవిరుద్ధముగా ప్రవర్తించినా డనవలయును గదా! సంజయుడు రాయబారిగా నేగెను; వాడు అర్జునునికి ఆత్మసము డగు సఖుడు. ధృతరాష్ట్రుడు పాండవస్నేహితుడే యగు సంజయుని రాయబారిగా పంపెను. 'ధనంజయ స్యాత్మసమః సఖాసి॥' అని ధర్మజుడు సంజయునితో అనెను కదా!

సంధి కుదర దన్న భావము విదురుడు ప్రకటించినప్పుడు కృష్ణుడు ఏమన్నాడు; బంధువులలో తగవు వచ్చినప్పుడు తగువు చెప్పవలెను. అందుకుగా నారాక అని గదా అన్నాడు. అట్టి సందర్భములో దుర్యోధనుని తాత్కాలికముగా నైనను బంధువుగా నెంచి ప్రవర్తింపవలయునే కాని, శత్రు వని పేర్కొనుట ధర్మబద్ధ మగునా?

కృష్ణుడు దేవుడు; ఆతనికి విధినిషేధము లంటగట్టరాదు. అన్నచో—

యద్య దాచరతి శ్రేష్ఠ స్తత్త దేవేతరో జనః।
స యత్ప్రమాణం కురుతే లోక స్త దనువర్తతే॥ (గీ-21)
న మే పార్థాస్తి కర్తవ్యం త్రిషు లోకేషు కించన।
నానవాప్త మవాప్తవ్యం వర్త ఏవ చ కర్మణి॥ (-22)
యది హ్యహం న వర్తేయం జాతు కర్మ ణ్యతంద్రితః।
మమ వర్త్మానువర్తంతే మనుష్యాః పార్థ సర్వశః। (-23)
ఉత్సీదేయు రిమే లోకాః న కుర్యాం కర్మ చే దహమ్।

సంకరస్య చ కర్తా స్యా ముపహన్యా మిమాః ప్రజాః ॥ (–24)
సక్తాః కర్మ ణ్యవిద్వాంసో యథా కుర్వంతి భారత ।
కుర్యా ద్విద్వాం స్తథాఽసక్త శ్చికీర్షు ర్లోక సంగ్రహమ్ ॥ (–25)
న బుద్ధిభేదం జనయే దజ్ఞానాం కర్మసంగినామ్ ।
జోషయే త్సర్వకర్మాణి విద్వా న్యుక్త స్సమాచరన్ ॥ (–26)

ఈశ్లోకములు ఎందుకు చెప్పినట్లో? ఇందులో తాను దేవుడయ్యును; తనకు కర్తవ్యము లేకున్నను, అజ్ఞులను దృష్టి యందుచుకొని ఇట్లుందును; విద్వాంసు డట్లే యుండవలయును అన్నభావము ననుసరించి లోకహితైషిగా, ధర్మప్రచార కుడుగా, ధర్మబుద్ధిప్రేరకుడుగా కృష్ణుడు మధ్యవర్తిగ ఉండదగు రీతిలో కదా నుండవలయును. అట్లున్నాడా? ఇదే అర్జునునికి సంతాపకారకమైన దనవలయును గదా! కృష్ణుడు రాయబారిగా పోవునపుడు "వారికి మాకును నీవు మొదటి స్నేహి తుడవు" "భవా న్నః ప్రథమ స్సుహృత్" అని అర్జునుడు అనును. కృష్ణు డట్లు ప్రవర్తింప లేదనుట స్పష్టముకదా?

'కృష్ణుడు చెప్పినట్లు నడువుము. రాముడు నడచినట్లు నడువుము" అని గదా పెద్దలందురు. కనుక కృష్ణుని బోధయే మనకు ఉపదేశము కాని, ఆతని ఆచర ణము కాదు. కనుక కృష్ణుని యీప్రవర్తనము మనకు ప్రేరకము కాకూడదు. అందురా? అట్లెక్కడ నున్నది. ధర్మవేత్తలు చెప్పిన వాక్య మేదియు నిట లేదే. "ఎవడో ఒకకూత యేదో సందర్భములో నేదో చెప్పితి" నన్న యహంకార విమూ ఢాత్ముని వాక్యము ప్రమాణమును, కృష్ణుని వాక్య మప్రమాణము అగునా? నేను నడచుకొనుచున్నా నన్న వాక్యము ప్రమాణము కాదా? అగుచో ఇదియును అట్లే యని నిరాకరించుట కర్తవ్యమే

## 11. యుద్ధమునకు సిద్ధమైన తీరు.

యుద్ధమునకు సిద్ధమైన తీరు అర్జునునకు బాధాకరమే కాగలదు. సహజ ముగ అజ్ఞాతవాస మైన వెనుక తమ రాజ్యము తాము పాలించుకొను స్థితిలో నున్నా మని దుర్యోధనునకు తెలియజేసి పెద్దల సమక్షములో అట్లు తెలియజేసినను, రాజ్యమును ఈయ నన్నచో అప్పుడు యుద్ధప్రయత్నములు చేయవలయును. కాని, ఉత్తరాభిమన్యుల వివాహసమయమున సమావిష్టులైన బంధువులలో వారం దరు తమ పక్షమున నుండు నట్లు చేసిన ప్రయత్నము ఏధర్మపరుడు చేయనిదే అని తోచును ఇట్లు చేయుట దుర్యోధనుని రెచ్చగొట్టుటయే యగును, దుర్యోధనుడు

దుర్బుద్ధియే కావచ్చునుకాక. తాము సద్బుద్ధి కలిగి యుండవలయునుకదా: అని విచారింపబూనుటలేదు. ఆసందర్భమున బలరాముని వాక్యముల సారము గోత్రిలవలెను.

(12) కులక్షయము జరుగ రాదన్నదే ప్రధానధర్మము.

స ఏవ పాపిష్ఠతమో యః కుర్యాత్కులనాశనమ్ ।

అన్న వచనానుసారము ఎవడు ఎన్నిధర్మముల నాచరించినను కులనాశము చేసినచో అది ధర్మముల నన్నిటిని అణచివేసి ప్రబలమైన నరకహేతువగును. ఒక ధర్మకార్యము జరుగుచుండగా అందు కులప్రతిష్ఠ ప్రధానముగ నిర్వర్త్యమగుచో అది ఉత్తమధర్మ మనిపించుకొనుచుండును. అనేక మహాపురుషుల తపోజ్ఞానవైరాగ్యముల నాధారముగ జేసికొని కులధర్మములు ప్రతిష్ఠగొనును. అవి కులనాశనముతోనే నశించిపోవును. ఒక వ్యక్తి తన ప్రయోజనమును సాధింపనెంచి యేదో ధర్మమును పురస్కరించుకొని "ఈ ధర్మమును నేను చేయుచున్నాను. అని అహంకారవిమూఢాత్ముడై అజ్ఞానవిలసితము, పాశవికబలసంకలితము నైన ఒక పని ధర్మకార్య మన్నట్లు చేసినచో తత్ఫలముగ సదాచారధర్మములను నాశనము చేసినవా డగును.

అల్పస్య హేతోః బహు హాతు మిచ్ఛన్
విచారమూఢః ప్రతిభాసి మే త్వమ్ ॥ (రఘు. 2-47)

అన్న కాళిదాసు వచనమునకు సరి యగు ఉదాహరణ మగును. కడకు తాను అకృతార్థు లగుటయే గాక కృతార్థు లయిన కులపురుషులను గూడ అధర్మపంకమున కూలద్రోసినవా డగును.

ఇట్టి భావము అర్జునునికి చిన్నప్పటినుండియు జరిగిన అనేకసంఘటనల మూలమున మనస్సును కలచివేయుచునే యున్నది. ముఖ్యముగ సంజయుని రాయబారము, కృష్ణుని రాయబారము పరిశీలింపగా వారల మధ్యవర్తిత్వములో కులక్షయము కా రా దన్న ప్రధానాశయము వెల్లడి చేయబడుచున్నదై అర్జునునికి ఈ ఘట్టము సంచోదకమైన దనవలయును.

అజ్ఞాతవాసము పూర్తియైన దనిపించుకొని తా మెవరో విరాటునకు తెలియచెప్పుకొనిన అనంతరము విరాటరాజు ఉత్తరను అర్జునున కిచ్చి వివాహము చేయుదలంచును. అభిమన్యునకు భార్యగ, తనకు కోడలుగ ఆమెను స్వీకరింతు నని అర్జునుడు చెప్పెను. కాని విరాటుడు అర్జుననకే ఇత్తు ననెను.

ఉత్తరాం ప్రతిగృహ్ణాతు సవ్యసాచీ ధనంజయః ।
అయం హ్యౌపయికో భర్తా తస్యాః పురుషసత్తమ ॥ (వి. 71-34)

ప్రతిగృహ్ణా మ్యహం రాజన్! స్నుషాం దుహితరం తవ ।
యుక్త ఏవ హి సంబంధో మత్స్యపాండవయో రపి ॥ (36)

కి మర్థం పాండవ శ్రేష్ఠ ; భార్యాం దుహితరం మమ ।
ప్రతిగ్రహీతుం నేమాం త్వం మ యూ దత్తా మిహేచ్ఛసి ॥ (వి. 72-1)

అర్జునః :—

అంతఃపురేఽహ ముషితః సదా పశ్యన్ సుతాం తవ ।
రహస్యం చ ప్రకాశం చ విశ్వస్తా పితృవ న్మయి ॥ (వి. 72-2)

ఈ ఘట్టము పరిశీలనార్హము.

ప్రతి ఒక కుటుంబియు పరిశీలింపవలసిన విషయ మిందు గలదు.

అర్జునునకు ద్రౌపదివలన కొడుకు గలడు. యుద్ధము చేయునంతటి మహా వీరుడు; ఆపైన సుభద్రవలన కలిగిన పుత్త్రుడు అభిమన్యు డున్నాడు. వివాహ వయస్సులో నున్నాడు. ఎవరైననూ పిల్ల నిత్తు నన్నప్పుడు వివాహవయోపేతు డైన పుత్రు డుండగా తండ్రి కిత్తు నందురా? అట్లు ఎందు కిచ్చెద నని యుండును. "ఊనషోడశవర్షో మే" అని, "అబాలశ్చ అకృతవిద్యశ్చ" అని, "న యుద్ధయోగ్యతా మస్య పశ్యామి" అని రామునంతటివానిని గురించి దశరథుడు విశ్వామిత్రునితో అనినాడు. యుద్ధము వచ్చుచో అభిమన్యుడు మహాబలపరాక్రమశాలురు, తేజో వీర్యవిరాజితులు అయిన ధనుర్ధారుల ఎదుట నిలచి యుద్ధము చేసి గెలుచునా? అన్న సందేహము విరాటున కుండియుండును. అట్టి యువకునికి పిల్ల నిచ్చుచో పిల్ల గతి యే మగునో? యని తలంపు గలిగియుండియుండును. అందులకే ఒకటికి రెండు పర్యాయములు అర్జుననే వివాహ మాడు మని విరాటుడు నొక్కి చెప్పినాడు. అర్జునుడు తానే బలవంతము చేసి అభిమన్యున కిప్పించినాడు ఉత్తరను. అట్టి పరి స్థితులలో ఈ యుద్ధమునందు ఆ యభిమన్యువధయే జరిగినచో తమ వంశమే నిలువ దని అర్జునుని భావమై యుండినోవును. ఇది విరాటభావనాసంచోదితమును, స్వభావనావిషయమును అయి అర్జునుని యుద్ధవిముఖుని చేసియుండును. అందు చేతనే "సహాస్మదీయై రపి యోధ ముఖ్యైః" (గీ-11-26) అనుట గమనార్హము. యుద్ధము సంభవించినచో నెవరు చావకూడ దని తాను భావించినాడో వారందరూ అక్కడ అనగా విశ్వరూపమున హతప్రాయు లైనట్లు కనుగొనినా డర్జునుడు. ఇది ముందు ఊహించినట్లు అభిమన్యుని విషయమును గూడ స్ఫురింప జేయుచున్నది.

మహావీరుడు, క్షత్రియధర్మనిరతుడు ఎవడును యుద్ధభీతిని పొందడే యన్నచో దశరథు డేల పొందెను? కనుక యుద్ధధర్మములు బహుకార్యఫలితము లిచ్చునవి. వానిని ముందుగ ఎంతటి మహావీరులైనను, మహాయోధులైనను, క్షత్రియధర్మనిరతులైనను ఆలోచింతు రనుట సహజము. ఆపైన యుద్ధము చేయుట వీరక్షత్రియధర్మముగ కన్పట్టుచున్నది. కనుక అర్జునుడు స్వధర్మపరిత్యాగము, పరధర్మపరిగ్రహము చేసి "దృష్ట్వేమం స్వజనం కృష్ణ" (1-28) ఇత్యాదిగా చెప్పలేదు. ఎప్పటినుండియో అతని మనమున బీజభూతముగ నున్న విషయములే ఈ సందర్భములో అవిష్కృతము లైనవి.

14. మహానాయకలక్షణములలో "కృపావాన్" అని యున్నది.

ఏ పని చేయుచున్నను ముఖ్యముగ క్షత్రియు డైనవాడు యుద్ధోన్ముఖు డగుచున్నపుడు క్షత్రియధర్మము ననుసరించి యుద్ధము చేయవలసినవాడే అయ్యును మానవధర్మపురస్సరముగ కృపావంతుడు కావలెను. అందుకే మహావీరపురుష లక్షణముగా అర్జునునియందు ఉత్తమమానవధర్మ మగు కృప కలిగినది.

"కృపయా పరయాఽఽవిష్టః (1-28)"

"తం తథా కృపయాఽఽవిష్టం (2-1)"

అని మహానాయకలక్షణ మగు కృపావేశము అర్జునునియందు చూపుటకే యిట ఈ ఘట్టము ప్రసక్త మైన దనవలయును. అందువలన అర్జునుడు కృపావంతుడుగ నిరూపింపబడుటకే ఈ ఘట్టము ప్రయోగింపబడినదిగా వ్యాఖ్యానింప దగును.

15. అవికత్థనత్వమును చూప బోవుట.

మహానాయక లక్షణములలో "అవికత్థన" అని ఒక విశేషణ మున్నది. వికత్థనుడు ఇట్లుండును.

ఇద మద్య మయా లబ్ధ మిదం ప్రాప్స్యే మనోరథమ్।
ఇద మస్తీద మపి మే భవిష్యతి పున ర్ధనమ్ ॥ (గీ. 16-13)
అసౌ మయా హత శ్శత్రుః హనిష్యే చ పరా నపి।
ఈశ్వరోఽహ మహం భోగీ సిద్ధోఽహం బలవా న్సుఖీ॥ (11-14)
ఆఢ్యోఽభిజనవా నస్మి కోఽన్యోఽస్తి సదృశో మయా।
యక్ష్యే దాస్యామి మోదిష్య ఇత్యజ్ఞానవిమోహితాః ॥ (-15)

అనేకచిత్త విభ్రాన్తా మోహజాలసమావృతాః ।
ప్రసక్తాః కామభోగేషు పతంతి నరకేఽశుచౌ ॥ (-16)
ఆత్మసంభావితాః స్తబ్ధా ధనమానమదాన్వితాః । (-17)

ఆత్మశ్లాఘాపరాయణత్వమే వికత్థనత్వము. అదేట "ఆత్మసంభావితాః" అను పదముచే గీత పేర్కొనుచున్నది. ఈ పై చెప్పిన లక్షణములు కలవారే ఆత్మసంభావితులు. అన్న భావ మిందు కలదు. ఇట్టివారే వికత్థనులు. ఇట్టి వికత్థనత్వము లేకుండుట మహానాయకుని లక్షణము. అది అర్జునునియందు వెలుగొందజేయ నెంచి మహాజ్ఞాని, మహాకవి యగు వ్యాసుడు అర్జునునియందు కర్తృత్వమును, అహంకారమును పోగొట్ట నెంచుచున్నాడు.

ఉలూకరాయబారమందలి (ఉ 159-30-113) భావము గమనింపవలయును. ఇక్కడి అర్జును పలుకులు వికత్థమునకు మారుపేరుగ దుర్యోధను డెత్తిపొడిచెను.

అకత్థమానో యుధ్యస్వ కత్థసేఽర్జున కిం బహు ।
పర్యాయా త్సిద్ధి రేతస్య నైతత్ సిధ్యతి కత్థనాత్ ॥

ఆ అపవాదమును పోగొట్టుకొనుటకై అర్జునుడు చేసిన ప్రయత్నము "కథం భీష్మ మహం సంఖ్యే" ఇత్యాదివాక్యములద్వారా విశదమగును. అనగ తన అవికత్థనత్వమును లోకమునకు చూపుటకే అర్జునుడు ఇట్లు వ్యవహరించె ననవలయును. అంతేగాని భీతుడైగాని, మోహితుడై కాని పరధర్మాశ్రయుడై కాని అట్టి పలుకులను పలికె ననుటకు అవకాశము లేదు.

అందులకే "శిష్య స్తేఽహం శాధి మాం త్వాం ప్రపన్నమ్" అని అర్జునుని కృష్ణునకు శిష్యునిగ నిరూపించు నీ ఘట్టమును అవతరింపజేసినాడు మహాకవి.

లోకములోకూడ ఎవరైన నేదైన నొకపని చేయునపుడు అది సామాన్యమైన దైనను "నేనున్నాను కానిమ్ము" అని పెద్ద లనుమతించువరకు చేయకుండుట గమనార్హము. ముఖ్యముగ ఈ యుద్ధమునకు మూలబీజము ఎవరికి వారు వికత్థనులై తమ తమ బలములు అధికము లని భావించుటచే కలిగిన దని స్పష్టము. వికత్థనులై కామమన్యుపరీతాత్ములై చేసిన యుద్ధము సద్గతి ప్రదము కాదు అది అర్జునుని ఆలోచనలో ప్రధానాంశము.

అక్రోధనో హ్యవ్యసనీ మృదుదండో జితేంద్రియః ।
రాజా భవతి భూతానాం విశ్వాస్యో హిమవా నివ ॥ (శాం-7-29)
క్షిప్రకారీ జితక్రోధః సుప్రసాదో మహామనాః ।
అరోషప్రకృతి ర్వ్యక్తః క్రియావా నవికత్థనః ॥ (-30)

ఇందు ముఖ్యముగ అవికత్థనత్వము గమనార్హము. ఇది ప్రపంచించుటకే అర్జునుని ప్రయత్నము. ఈ శాంతిపర్వశ్లోకముల సారమే అర్జునుడు అపేక్షించి కృష్ణుని అడిగి తెలిసికొనినాడు. కృష్ణుడు చెప్పినదికూడ ముఖ్యముగ జితేంద్రియత్వము. జితక్రోధత్వము, అరోషప్రకృతి, మనఃప్రసాదము-పై శ్లోకములో వివరింపబడినవి. ఇవి అందరు అడిగి తెలిసికొనవలసినవే కదా। అట్టి స్థితి లోకమున చూచుచున్నవారు ఇంత మహాయజ్ఞమునకు దీక్షితుడు కాకున్న యర్జునుడు ఈ మాత్రపు పలుకులు అనినాడనినచో నేల యింతగా బెంబేలుపడి యర్జును దధర్మపరుడు, శోకమోహగ్రస్తుడు; స్వధర్మపరిత్యాగి, పరధర్మపరిగ్రహీతుడు; అనితమ యజ్ఞానవిలాసములను విలసింపజేసికొందురో కారణ మరయరాదుగదా!

భగవద్గీత భీష్మపర్వమున నిబద్ధమైనదికదా। కురుసేనలు భీష్ముని నాయకత్వమున, పాండవసేనలు ధృష్టద్యుమ్న కృష్ణార్జునుల నాయకత్వమున మోహరించియున్న తరుణమున భీష్ముడు సింహనాదము చేసి శంఖము పూరించెను. భీష్ముడు "కురువృద్ధుడు, పితామహుడు, ప్రతాపవంతుడు" ఈమూడువిశేషణములు భీష్ముని వైశిష్ట్యమును ఉగ్గడించునట్టివి.

## భీష్మ వైశిష్ట్యము

కురుపాండవులకు కురువు మూలపురుషుడు. ఆతని పేరనే కురుక్షేత్రము వెలసినది. కురుక్షేత్రము తపఃక్షేత్రమని, ధర్మక్షేత్రమని, పుణ్యక్షేత్రమని, రణక్షేత్రమని మహాభారతమున పలుతావుల ప్రశంసింపబడినది. మహత్త్వపూర్ణమగు నాక్షేత్రములో యుద్ధమునకు సన్నద్ధులైనారు కురుపాండవులు. కురుపాండవులందరిలో భీష్ముడే పెద్ద. వయస్సులోనేగాక అన్నిటపెద్ద యన సంశయము లేదు. ధర్మానుభవమున, తపశ్శక్తిలో, పుణ్యసంపదయందు రణపాండిత్యమున ఆతనికంటె పెద్ద ఆ కురుక్షేత్రమున కూడినవారిలో ఎవ్వరును లేరు.

పితామహుడనగా తాత. ఇది భీష్మునకు-కురుపాండవులకుగల సంబంధభావమును తెలుపుచున్నది. భీష్ముడు వారియందు అధికప్రీతి గలవాడనుట స్పష్టము. ఇంక "ప్రతాపవాన్" అనుటవలన అతడు ఆదిత్యసదృశుడని భావము స్ఫురించును. ఆదిత్యమండలాంతర్వర్తియై నారాయణుడు వెలుగొందుచుండునని ఉపనిషత్ప్రసిద్ధము. అనగ ఆదిత్యసదృశుడగు భీష్ముడు కూడ అంతర్యామిరూపపరమాత్మకు తద్ధాత్మకజ్ఞానమునకు ఆధారభూతుడగుచున్నాడు.

## "తస్యసంజనయన్ హర్షం"

ఏకాదృశవైశిష్ట్య విశిష్టు డగు భీష్ముడు "తస్యసంజనయన్ హర్షం" ఆతనికి ఆనందము కూర్చుచు శంఖము పూరించెను "తస్య" ఆతని ఆత డెవరు? సామాన్యార్థము. ప్రకరణప్రియుక్తముగ చూచిన "ఆతడు" దుర్యోధనుడు. భీష్ముని శంఖధ్వని అంతతో నిలుపక కొంత ముందున కేగుచ మరికొన్ని యర్థములు స్ఫురించును. "తత్" శబ్దము పూర్వస్పృష్టార్థక మేగా బుద్దిసార ప్రకాశకముగకూడ ప్రయుక్తమగును. ఇది శాస్త్రసంప్రదాయము భీష బుద్దిసారము-అర్జునుడే అర్జునునకును భీష్మశంఖనాదము హర్షకారణ మయ్యెన శ్రీకృష్ణునకును అది హర్షదాయకమే. అతడు పరమాత్మకదా? "తత్" శబ్దమ పరమాత్మను తెలుపునని వేదజ్ఞులెరుగనిదికాదు "తదితి సర్వనామ, సర్వం బ్రహ్మ" కావున "తస్య సంజనయన్ హర్షం" అనగా భీష్మాయత్త యుద్ధతంత్రుడై దుర్యోధనునకు పరాక్రమాతిశయముచేతను కృష్ణసఖిత్వముచేత భీష్మాదులకం రకు ప్రీతిపాత్రుడై విలసిల్లు అర్జునునకు, భూభారహరణార్థము భువిని శ్రీకృష్ణ రూపమున అవతరించిన పరమాత్మకును ఏకకాలమున హర్షమును కల్గించుచ భీష్ముని శంఖనాదము దిక్కుల మ్రోగెను. అని భావము.

## భీష్ముని సింహనాదము – వైశిష్ట్యము

భీష్ముడు శంఖనాదము చేయుటకు ముందు సింహనాదము చేసెను "సింహ నాదం వినద్యోచ్చైః శంఖం దధ్మౌ" (గీ 1-12) యుద్ధభూమిలో మొదట శంఖ నాదము పూరించినవాడు భీష్ముడే, తన్నాదము కంటె పూర్వము సింహనాదము గావించినవాడు భీష్ము డొక్కడే. అతని తర్వాత పలువురు శంఖములను పూరిం చిరే కాని సింహనాదము చేయలేదు. కృష్ణార్జునులు సైతము శంఖధ్వానము మాత్రమే గావించిరి. "సింహనాదము" భీష్మునకు మాత్రమే చెప్పుటలో విశేష మున్నది.

"ప్రతద్విష్ణుః స్తవతే సూర్యాయ
మృగో న భీమః కుచరో గిరిష్ఠాః।
య స్యోరుషు త్రిషు విక్రమణే।
ష్వధిక్షియంతి భువనాని విశ్వా॥"

అని శ్రుతిగలదు. ఇది విష్ణువును స్తోత్రము చేయును. "విష్ణువు భీమ మృగము అనగా సింహమువలె కుచరుడు, గిరిష్ఠుడును. ఆ విష్ణువుయొక్క మూడు విక్రమణములందు విశ్వము లన్నియు సంస్కృతము లైనవి. అట్టి విష్ణు

వృను స్తోత్రము చేయుము." అని భావము. ఇచట "భీమ" "మృగ" శబ్దముల వలన సింహము తెలియబడుచు తత్సదృశుడు విష్ణువని తెలియబడుచున్నది కావున సింహనాద మనగా విష్ణునాదమే. అనగా విష్ణుధర్మప్రకాశకనాదము.

పై ఋక్కునందు స్తుత డగు భీమమృగసంకాశు డగు విష్ణువు గిరిష్ఠుడుగా వర్ణింపబడినాడు. గిరిష్ఠుడనగ పర్వతశిఖరమున వెలయువాడు.

## గిరి యనగ వేదము

వేదములకు గిరి సంజ్ఞ. "త్రీన్ గిరిరూపాన్ అవిజ్ఞాతా నివ దర్శయాం చకార" అను శ్రుతి వలన ప్రసిద్ధము.

సావిత్రకాఠక మను ఒక కర్మప్రకరణప్రసంగములో ఇట్లు కలదు.

భరద్వాజు డను ఋషి ఇంద్రునివలన మూడు ఆయుర్దాయములను అనగా మూడు వందల సంవత్సరముల జీవితప్రమాణమును పొంది బ్రహ్మచర్యము నవలంబించి వేదాధ్యయనము గావించెను. ఇంకను తృప్తి పొందక నాలుగవ ఆయుర్దాయమునకై ఇంద్రుని వేడగా దానితో నేమి చేయుదు వని ఇంద్రుడు ప్రశ్నించెను. వేదాధ్యయనమును పూర్తిగా వింతు ?" నని ఆతడు సమాధానము చెప్పెను. అప్పుడు ఇంద్రుడు భరద్వాజునకు మూడు గిరిరూపములను చూపి వాని యందుండి ఒక్కొక్క పిడికిలి మాత్రము గ్రహించి "భరద్వాజా! ఇంతకాలము నీ వధ్యయనము చేసిన దింతమాత్రమే" అని చెప్పి వేదముల యనంతత్వము నుపదేశించెను.

ఈ ప్రసంగమున "గిరి" రూపములుగ చూపబడినవి మూడు వేదములే. ఆ గిరులపై ప్రతిష్ఠు డగువాడు విష్ణువు. "వేదైశ్చ సర్వై రహ మేవ వేద్యః ।" అని భగవంతుని యుపదేశము సమీక్షింపుడు.

## సింహనాదము – విష్ణుధర్మము.

పై విషయములను సంగ్రహించినచో సింహనాదము అనగా వేదప్రతిపాద్యమైన విష్ణుధర్మ మని విశద మగును. భీష్ముడు ఆత్మనిష్ఠ మగు విష్ణుధర్మమును ప్రకాశ మొనరించి తర్వాతనే శంఖధ్వానము చేసెను. తద్ద్వారమున దుర్యోధనునకు, అర్జునునకు, పరమాత్మ యగు కృష్ణునకు కూడ సందేశ మిచ్చెను. దుర్యోధనుడు తన సేనాని యొక్క యుద్ధసన్నద్ధతను మాత్రమే గ్రహించి సంతృప్తు డయ్యెను. అర్జునుడు భీష్మపితామహుని శక్తి వైభవమును గ్రహించినవాడై తత్సదృశశక్తియుతులు తమ వర్గములో లేమికి విచారించి, ఆతని జయింపవలయు నన్న ధర్మమున, తపస్సున, యోగమున, సదాచారమున, దైవత్వమున నాతనితో సమానుడు కావలయు ననియు, ఆతనియందు నిహితమై యున్న విష్ణు

ధర్మోపబోధమును తాను పొందదలచినవాడై పరమాత్మకు ప్రపన్నుడయ్యెను. తన యవతారప్రయోజనము సిద్ధప్రాయమైన దని భీష్ముని సింహనాదమును శ్రీకృష్ణరూపి యగు పరమాత్మ ప్రశంసించెను. వ్యవహారమున తాను భీష్మునికంటె పిన్నయైనందున ఆతని యనుమతి తనకు లభించినట్లు భావించి యోగమహిమతో అర్జునునకు ధర్మబోధ చేయుటకు సమకట్టెను.

## కృష్ణబోధ భీష్మచరితమే.

కృష్ణుడు అర్జునునకు బోధించినది భీష్మచరిత్రమే యనవలయును. గీతయందు మహత్తరముగ వివరింపబడిన స్థితప్రజ్ఞలక్షణములు, గుణాతీతుని లక్షణములు, దైవీసంపన్నుని లక్షణములు — ఇవి అన్నియు భీష్మునియందు సజీవములై యలరారుచున్నవి. ఆరవయధ్యాయము అగు "ఆత్మసంయమయోగము"నకు భీష్ముని ప్రతీకగ భగవంతుడు అర్జునున కుపదేశించెను. "వాసుదేవ స్సర్వమితి స మహాత్మా సుదుర్లభః ।" అను వాక్యములోని మహాత్ముడీతడే. "కౌంతేయ! ప్రతి జానీహి న మే భక్తః ప్రణశ్యతి ।" అని భగవంతుడు అర్జునుని ముఖమున అభయ మిచ్చిన దీ భక్తశిఖామణి యగు భీష్మునకే.

"తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా ।
ఉపదేక్ష్యంతి తే జ్ఞానం జ్ఞానిన స్తత్త్వదర్శినః ॥"

అను శ్లోకములో భగవంతుని యుద్దేశమున గల జ్ఞాని భీష్ముడే. కావుననే భగవంతుడు ఉపదేశించిన తర్వాత మరల ఉపదేష్ట కాగలిగినవా డయ్యెను. శాంతి, ఆనుశాసనిక పర్వములలో ధర్మజాదులకు ఉపదేశించినది భీష్ముడేకదా!

విషాదశబ్దము భీష్ముని చెప్పు నని మునుపే వివరించితిమి. అర్జునుడు విషాదునితో యోగమును అనగా సమత్వము నాకాంక్షించు ప్రసంగము ఈ అధ్యాయమున కలదు. కావున "అర్జునవిషాదయోగ మైనది. భీష్మునితో సమత్వమును అర్జును డాకాంక్షించుటకు కారణము పైన వివరించితిమి. "వివాహశ్చ వివాదశ్చ సమయోరేవ శోభతే" అనికదా ప్రాజ్ఞుల యభిమతము.

## శివుడు — భీష్ముడు

"విషాద" శబ్దము శివపర మనియు, వివరించితిమి. శివుడును భీష్ముడును ఒక్కరే యన జనును. రుద్రాధ్యాయమునకు,

శ్రుతం గర్తసదం యువానం
మృగం న భీమ ముపహత్ను ముగ్రమ్ ।

ఇత్యాదిశ్రుతియందును, రుద్రుడు భీమమృగసదృశు డనియు, అతడు స్తుత్యు డనియు చెప్పబడినది. భీమమృగసదృశత్వము భీష్మునకును చెప్పబడిన దని వెనుక చెప్పితిమికదా! కావున శివకేశవు లిరువురు భీమమృగ మనగ సింహశబ్దముచే పరిచ్ఛిన్నులగుచున్నారు. సింహనాదము వారి తత్త్వమును ప్రకాశింపజేయున దగును. శివకేశవుల తత్త్వమును ఈ విధమున వెల్వరించిన భీష్ముడు తత్త్వవేత్త లందరిలో మహనీయుడు. ఇతడు కాంతాకనకములను రెంటిని విసర్జించిన మహాత్యాగి.

వేధా ద్వేధా భ్రమం చక్రే కాంతాసు కనకేషు చ।
తాసు తే ష్వ వ్యనాసక్తః సాక్షా ద్భర్గో నరాకృతిః॥

కాంతలయందు, కనకమునందు మనస్సులను భ్రమింపజేయు శక్తిని బ్రహ్మ నిక్షిప్తము గావించెను. ఆరెండింటియందును అనాసక్తుడై శివుడు మహాయోగిగా మన్నన లందెను. మనుష్యులలో అట్టి అనాసక్తయోగమును నిర్వహించిన ఘనత ఒక్క భీష్మునకే దక్కును.

సారంగధరచరిత్రమున చేమకూర వేంకటకవి భీష్ముని యందలి ఈవిశేషమునే భంగ్యంతరమున చెప్పెను.

నిజము భీష్మ సంతతి జితేంద్రియునకైన।
నాశపుట్టు మది నిరాశ వుట్టు
దితరు లనగ నెంత యేకాంతమై యున్న
ధనము పట్ల యువతిజనముపట్ల (2-12)

కావున భీష్ముడు నరాకృతి దాల్చిన భర్గు డనవలయును. నిత్యము ఉపాస్యమగు గాయత్రీమంత్రములోని "భర్గో దేవస్య-ధీమహి" అను చోట గల భర్గశబ్దమే. ఈశ్వరుడే ఈ భర్గుడు. "ఈశ్వరానుగ్రహా దేవ పుంసా మద్వైతవాసనా" అని యున్నందున ఈశ్వరానుగ్రహముచేతనే అద్వైతభావము, అనగ జీవాత్మ ద్వైతభావము కలుగు నని భావము. ఈశ్వరుడే యగు భీష్ముని సింహనాదానునాదిత మగు నను గ్రహమున అర్జునునిలో అద్వైతభావము నందవలెనన్న వాసన అనగా సంస్కారము కలిగినది. తత్ప్రయత్నమే నరుని ప్రసంగము. ఆ ప్రసంగము వలననే అర్జునుడు విషాదునితో యోగము పొందును. కావున అర్జునవిషాదయోగము

అర్జునుడు అందరిని జయించినట్లు కేవలము ధనుర్విద్యాపాటవముతో, తన ముష్టిమహిమతో భీష్ముని జయింప లేదనుట అనుభవసిద్ధమైన విషయము.

సమ్మోహనాస్త్రము వేసినపుడు ఉత్తరగోగ్రహణసందర్భమున అది భీష్మని స్పృశింపలేదు. గదా! కావున ఆతని జయించుట దుర్ఘటము. అందుచేతనే అరును నకు "యది వా నో జయేయుః" అనగా భీష్మ నాధారముగా జేసికొని మనలనే జయింతు రేమో! శత్రువులు, అన్నసందేహము కూడ కలిగినది

కాని క్షత్రియవీరుడు జయించినను, జయింపబడినను, యుద్ధము సిద్ధమై నప్పుడు యుద్ధము చేసి గెలుపొందవలె! లే కున్న "యుద్ధే చా వ్యపలాయనమ్" అని నందున యుద్ధవిరమణ చేయక చావనైనను చావవలెను.

హతో వా ప్రాప్స్యసి స్వర్గం జిత్వా వా భోక్ష్యసే మహీమ్ ।
తస్మా దుత్తిష్ఠ కౌంతేయ యుద్ధాయ కృతనిశ్చయః ॥ (గీ 2-37)
స్వధర్మ మపి చావేక్ష్య న వికమ్పితు మర్హసి ।
ధర్మ్యా ద్ధి యుద్ధా చ్ఛ్రే యోఽన్యత్క్షత్రియస్య న విద్యతే ॥ (2-31)
యదృచ్ఛయా చోపపన్నం స్వర్గద్వార మపావృతమ్ ।
సుఖినః క్షత్రియాః పార్థ! లభన్తే యుద్ధ మీదృశమ్ ॥ (2-32)
అథ చే త్త్వ మిమం ధర్మ్యం సంగ్రామం న కరిష్యసి ।
తత స్స్వధర్మం కీర్తిం చ హిత్వా పాప మవాప్స్యసి ॥ (2-33)
అకీర్తించాపి భూతాని కథయిష్యన్తి తేఽవ్యయామ్ ।
సంభావితస్య చాకీర్తి ర్మరణా దతరిచ్యతే ॥ (2-34)
భయా ద్రణా దుపరతం మంస్యన్తే త్వాం మహారథాః ।
యేషాం చ త్వం బహుమతో భూత్వా యాస్యసి లాఘవమ్ ॥ (2-35)
అవాచ్యవాదాం శ్చ బహూ న్వదిష్యన్తి తవాహితాః ।
నిన్దన్త స్తవ సామర్థ్యం తతో దుఃఖతరం ను కిమ్ ॥ (2-36)

ఈ శ్లోకములలోని భావములు ఇంతకు ముందు అర్జునునికి తెలియనివేనా? సకలవిద్యారహస్యవేది, సకల క్షత్రియ ధర్మవేది, మహాతపశ్శాలియు నగు అర్జు నున కింతమాత్రము తెలియదా?

ఈ పై శ్లోకములలో కృష్ణుడు చెప్పిన భావమంతయు విరాటపర్వమున పలాయన మొనరించుచున్న దుర్యోధనుని తూలనాడిన అర్జునుని పలుకులలో లేదందురా? నివాతకవచులు మున్నగు రాక్షసులను సంహరించిన అర్జునునికి యుద్ధ మన్న భయము కలదందురా. ఈశ్వరునితో యుద్ధ మొనరించిన అర్జునునకు యుద్ధ మన్నభయమా? ఉత్తరగోగ్రహణమున మొత్తము మహావీరుల నందరను తరిమి తరిమి కొట్టిన అర్జునునకు యుద్ధ మన్న భయమా?

కాదు కాదు; కానేకాదు; మరేమి? సకలతేజోవిరాజితధర్మమూర్తి భీష్ముడు. అతనిమీద నేయస్త్రశస్త్రములును పనిచేయవు అతడిపుడు సేనానాయకుడు. అతనిని జయించిననే తాను విజయుడగును. కాని యుద్ధము చేసి అతనిచేత చావ వచ్చునే. అది కాదు తత్త్వము. ఒక మహావిషయమును తెలిసికొనుటకు ఆ యా సందర్భములలో సాధ్యపడకపోయినచో మహాకవులరచనలలోని గట్టి పట్టులను చేబటి అక్కడ విషయముల నెట్లు పరాకాష్ఠకు తెచ్చి సమరస మొనరించిరో వాని నెరింగి ఆయాఘట్టములను సుబోధ మొనరించుకొనవలయును. అది బుద్ధిమంతుల లక్షణము. విజ్ఞుల లక్షణము. పరిశీలకుల లక్షణము. ధర్మజ్ఞుల కుండవలసిన లక్షణము.

## రఘువంశము – సింహవృత్తాంతము

కాళిదాసు సింహవృత్తాంతము నేల కల్పించెను? కాళిదాసరఘువంశములో నందినీమాయాకల్పితసింహదిలీపమహారాజసంవాదఘట్టము పరించిరా?

స త్వం నివర్తస్వ విహాయ లజ్జాం
గురోర్భవాన్ దర్శితశిష్యభక్తిః ।
శస్త్రేణ రక్ష్యం య దశక్యరక్షం
న త ద్యశః శస్త్రభృతాం క్షిణోతి ॥ (రఘు. 2-40)

దీని సారము "శస్త్రసాధ్యము కాని దానిని సాధింపకుండుట రాజధర్మమునకు హానికలుగజేయదు. అనియే కదా? కాళిదాసు ఈ ఘట్టమునందు సింహమునే యేల కల్పింపవలయును? పార్వతికి పుత్రసదృశమునా నున్న దేవదారువృక్షవినాశకమగు గజసంక్షోభకముగా సింహమును అట కల్పింపవలసి వచ్చినది అందురేమో. ఇది నిజతత్త్వముకాదుగదా! పార్వతిపెంచిన చెట్టును గజ మొకటి క్లిష్టపరచుట, దాని వలన శోకించిన పార్వతిని సంతసింప జేయ కుంభోదరుని సింహముగా నొనరించి వృక్షరక్షణమున నియమించి ఒకనిర్ణీతసమయములో తత్ప్రాంతమునకు వచ్చిన జంతువును, సింహమున కాహారముగా కల్పించుట యదార్థకథ కాదు గదా! నందినీ ధేనువు రాజును పరీక్షింప నెంచి కల్పించిన కథ కదా! ఇది ఇంకొక రీతిగను కల్పింప నగును.

అవునా! ఏదో ఒక మహాసంఘటనము కాళిదాసుయొక్క సింహకల్పనమునకు మూలమై యుండును. అ దేమో కనుగొనుటయే విమర్శకుని మర్మజ్ఞత.

"సింహనాదం వినద్యోచ్చైః" అని గీతలో భీష్ముని సింహనాదమే నిర్దేశింపబడినది. కాళిదాసు కూడ సింహనాదమునే అనగ సింహము యొక్క వాక్కులనే

పేర్కొనెను. గీతలో శస్త్రసాధ్యులు కాని భీష్మాదుల నెదుర్కొనుట కంటె శస్త్ర పరిత్యాగము చేయుట మే లనియు, అది యశోనాశనము కాదనియు అర్జునుడు భావించెను "అకృతవ్యూహాః పాణినీయాః" పాణినీయసంప్రదాయజ్ఞులు అకృతవ్యూహులు అనగా తలపెటిన సూత్రము వినాశోన్ముఖముగ నున్నచో దాని నాధారముగ చేయు కార్యమును చేయరు. ఒకవేళ చేసినను దానిని మంచివోవుదురు అటులనే అర్జునుడు తొలుదొల్త శస్త్రము నెత్తినవాడై, మరల భీష్మాదులశక్తివైభవములను జప్తికి తెచ్చుకొని వారిపై శస్త్రప్రయోగము నిష్ప్రయోజన మగునని గ్రహించి శస్త్రప్రయోగమును మానివేసెను. అందువలన అతని కెట్టియపకీర్తియు కలుగ బోదు. ఈవిషయమును చక్కగ అవధరించిన మహాకవి కాళిదాసు. దీనినే హృద్యమగు శ్లోకముగ రూపొందించెను.

ఇట్లాలోచించినచో అర్జునుడు విషాదము నొంద లేదని తెలియును. అద్వైత జ్ఞానస్వరూపుడగు భీష్ముని సింహనాదమువలన తాను కృష్ణునివలన భీష్మునితో సమానమగు జ్ఞానిగా రూపొందవలయునని భావించెను.

యది మా మప్రతీకారం అశస్త్రం శస్త్రపాణయః ।
ధార్తరాష్ట్రా రణే హన్యు స్తన్మే క్షేమతరం భవేత్ ॥ (1-46)

ఈ శ్లోకముపై కొంచెము గురియుంచి చూడుడు. ఇప్పటివరకు అర్జునుడు అశస్త్రుడు కాలేదు.

"ప్రవృత్తే శస్త్రసంపాతే ధను రుద్యమ్య పాండవః ।" (గీ. 1-20)

దీనిని బట్టి ధనస్సు అతని చేతిలో ఉన్నదికదా?

"గాండీవం స్రంసతే హస్తాత్" (1-30) అని యున్నందున అర్జునుని చేతిలోని గాండీవము జారిపోయినదని వ్యాఖ్యానింపవచ్చును. అని అందురేమో అట్లు అనరాదు. వినరాదు.

ఏవ ముక్త్వాఽర్జున స్సంఖ్యే రథోపస్థ ఉపావిశత్ ।
విసృజ్య సశరం చాపం శోకసంవిగ్నమానసః ॥ (1-47)

అన్న సంజయ వాక్యమును గమనింపుడు.

"దృష్ట్వేమం స్వజనం కృష్ణ ।" (1-28) అనునది మొదలుకొని "తన్మే క్షేమతరం భవేత్" (1-46) అను నంతవరకు గల వచనములుచెప్పి అర్జునుడు రథోపస్థమున కూర్చుండెను. అప్పుడు సశరమగు చాపమును విడచెను. కనుక కూర్చున్నపిమ్మట సశరచాపమును విడచినాడు.

మహావీరుడు కూర్చున్నప్పుడు చేతిలో సశరచాప ముండదు. కనుక అశస్త్రుడ నగు నన్ను ధార్తరాష్ట్రులు చంపినను అద్ది నాకు క్షేమమగునని అర్జును డను

నప్పుడు అతడు సశరచాపహస్తుడే. ఆ మాట అని సశరచాపమును వదలినాడు. ఇది అర్జునునిలో కలిగిన ప్రాణభీతి అని కాని, లేక క్షత్రియధర్మరాహిత్య మని గాని చెప్పుట కవకాశము లేదు. అశస్త్రుడ నగు నన్ను చంపుచో అది నాకు క్షేమంకర మగును.

### స్వదేహార్పణము అయశోజనకము కాదు.

రఘువంశమున దిలీపుడు సింహమునకు స్వదేహార్పణము చేసి నందినీధేనువును కాపాడ నెంచెను. పూజ్యవస్తువును కాపాడుటలో ధర్మ మనియేకదా భావము. అర్జునుడును అట్టిధర్మమునే చేయుచున్నాడు.

శత్రువు నెదుర్కొనక అతనిచే చంపబడుట క్షత్రియునకు తగదు. అది పాపజనకము అందురేమో? అది కానేకాదు.

కిమప్యహింస్య స్తవ చేన్మతోఽహం యశశ్శరీరే భవ మే దయాళుః,
ఏకాన్త విధ్వంసిషు మద్విధానాం పిండే ష్వనాస్థా ఖలు భౌతికేషు॥ (రఘు. 2-57)

ధర్మరక్షణకై స్వశరీరత్యాగము పాపహేతువుకాదు. మీదుమిక్కిలి యశస్కరమని దిలీపుని వాక్యమే ప్రమాణము.

స్వశరీరార్పణము అయశోజనకము కానేరదను కాళిదాసకల్పనకు భగవద్గీతలోని యర్జునవచనములే ప్రేరకము లని చెప్పవలయును. ఏరూపముగా చూచినను అర్జునుడు క్షత్రియధర్మమును వదలి పరధర్మమును స్వీకరింపలేదనుట స్పష్టము. అందువలన అర్జునవిషాదయోగమునకు నప్పుడు శోకాదిశబ్దములను పురస్కరించుకొని శోకముగలవాడు, విషాదము గలవాడు, అని చెప్పరాదు. అర్జునవిషాదమును వ్యాఖ్యానింపబూని కాళిదాసు మరియొక రీతిగా కల్పించుట కవకాశమున్న కథలో ఈశ్వరయోగము కలుగునట్లుగా మలిచినాడు. దీనికి ప్రేరకము అర్జునవిషాదమే. విషాదశబ్దము విషభక్షకుడగు ఈశ్వరుని చెప్పుచు ఆఈశ్వరులోని కామజేతృత్వమును కూడ చెప్పును. ప్రకృతము అట్టికామజేత భీష్ముడు. అర్జునుడు అట్టి విషాదుడు కానెంచెను. అనగా భీష్మధర్మధర్మి కానెంచి ఇట్లు పలికినాడన్నమాట

### భగవద్గీత అంతయు అర్జునవిషాదయోగమే.

కృష్ణుడు చెప్పబోవునది సకలధర్మజ్ఞానసంగ్రహమై అర్జునుని అట్టి భీష్మునితో అనగా విషాదునితో యోగమొనరించునది గావున మొత్తమీ భగవద్గీతయంతయు అర్జునవిషాదయోగ మనియే చెప్ప నవకాశ మున్నది. కేవలప్రథమాధ్యాయమునకే అర్జునవిషాదయోగ మనుపేరు చెల్లనే చెల్లదు. కావున ప్రథమాధ్యా

యమునమాత్రమే అర్జునశబ్దమునుయోగశబ్దముతో జత చేయుట సమరసమ
తక్కినవిఅవాంతరవిభాగములగుటగమనింపదగును.

రామాయణమునందు వాల్మీకి నారదుని వలన ఒక మహాపురుషుని గూః
తెలియగోరి అత డిట్టిట్టిగుణగణసంపన్నుడై యుండవలవలె నని చెప్పుచు

"కో న్వస్మిన్ సాంప్రతం లోకే గుణవాన్ కశ్చ వీర్యవాన్"

ఇత్యాదిగా పదునారు గుణములను పేర్కొనినాడు. "వీర్యవాన్" ఇత్యాద
లన్నియు గుణములే అయ్యును "వీర్యవాన్" ఇత్యాదిగాప్రత్యేకముగ మరల మర
పేర్కొనబడుట విశేషార్థద్యోతకము ఇక్కడ కూడ గ్రంథ మంతయు అర్జు
విషాదయోగ మయ్యును దానిలోని యధ్యాయములు కూడ సాంఖ్యయోగాదుల
ప్రత్యేకముగ పేర్కొనబడినవి. "త మేవం గుణసంపన్నం" అనునప్పుడు గుణ
బ్దము. "బహవో కళ్యాణగుణాః సంతి పుత్రస్య తే" అని చెప్పినపుడు గుణ
బ్దము ఈవీర్యవత్త్వాదుల నన్నింటిని సంగ్రహించుచునే యున్నది. సాంఖ
యోగాదు లన్నియు అర్జునవిషాదయోగాంతర్భూతములే యగుచున్నవి. శో
మోహరహితుడగు భీష్మునితో సమానయోగము బొందుటకు "న త్వం శోచిత
మర్హసి", "నైవం శోచితు మర్హసి" "నైనం పాప మవాప్స్యసి" ఇత్యాది
అర్జునునకు కృష్ణుడు ద్వితీయాధ్యాయమునందే కాక తక్కిన అధ్యాయములంద
కూడ చెప్పుట గమనార్హము.

"మాశుచః సంపదం దైవీ మభిజాతోఽసి పాణ్డవ।" (16-5

మచ్చిత్త స్సర్వదుర్గాణి మత్ప్రసాదా త్తరిష్యసి। (18-58

అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః ॥" (18-66

ఇట్లు విషాద యోగమనునది 18వ అధ్యాయమువరకు అర్జునుని యంద
అనుస్యూత మగుచునే యున్నది.

నష్టో మోహః స్మృతి ర్లబ్ధా!

విసృజ్య సశరం చాపం శోకసంవిగ్నమానసః। (1-47

పృచ్ఛామి త్వాం ధర్మసంమూఢచేతాః।" (2-7

ఇత్యాదివచనములవలన అర్జునుని మానసము శోకసంవిగ్నమైనదని దానికి
కారణము ధర్మసమ్మూఢత మని తెలియుచున్నది. "సమ్మూఢ" మనగా సమ్మో
హము. అర్జునునకు కలిగినది ధర్మసమ్మోహమే. కృష్ణుడు చెప్పవలసినదంతయు
చెప్పి,

"కచ్చి దజ్ఞానసమ్మోహః ప్రణష్ట స్తే ధనంజయ!" (18-72)

తనే ప్రశ్నించుటవలన అర్జునునకు కలిగినది సమ్మోహమే అనినిర్ణయమగుచున్నది. గీత ఫలవంత మయినది అని చెప్పవలసివచ్చినచో అర్జునుని నోట సమ్మోహము నష్ట మయిన దనియే సమాధానము రావలసియున్నది.

మదనుగ్రహాయ పరమం గుహ్య మధ్యాత్మసంజ్ఞితం ।
య త్త్వయోక్తం వచ స్తేన మోహోఽయం విగతో మమ ॥" (11-1)

ఈ శ్లోకములో అర్జునుడు కృష్ణుడు రెండవ అధ్యాయము నుండి చెప్పుచు వచ్చిన వచనములవలన మోహము తొలగినది. సమ్మోహము తొలగలేదు. ఆపైన ఐశ్వరూపదర్శనము, విశ్వాత్మవివరణము, ఎంతగనో జరిగినది. ఆపైన అర్జునుని సమ్మోహము తొలగవలసియే యున్నది. కృష్ణుడును సమ్మోహము ప్రణష్ట మైనదా? అని ప్రశ్నించెను.

నష్టో మోహః స్మృతి ర్లబ్ధా త్వత్ప్రసాదా న్మయాఽచ్యుత ।
స్థితోఽస్మి గతసందేహః కరిష్యే వచనం తవ ॥ (18-73)

మోహము నష్టమైన దనియే చెప్పెను. సమ్మోహము నష్టమైన దని (11-1) శ్లోకాని. (18-73) శ్లోకాని అర్జునుడు చెప్పలేదు. కాని స్మృతి లబ్ధమైనది. గత సందేహుండ నైతిని. ఇదిగో వినుచున్నాను. నీవచనమును పాటింతును. విస్మృతవిషయము మరల అనుభవమునకు వచ్చుట స్మృతి. అర్జునునకు ఈస్మృతి కలిగినది. అర్జునునకు సందేహము ఉండగా అవి తీరినవి. స్మృతి యని చెప్పుటచే మరచిన విషయము మరల గుర్తుకు వచ్చిన దని భావము దానివలన గీతలో కృష్ణుడు చెప్పిన విషయము లేవియు అశ్రుతచరములు కావు. అని తెలియుచున్నది. సందేహము అనగా సమానకోటికము. ఔను, కాదు. అనుటకు సమానమైన ప్రతిపత్తియే ఉండును. దీనివలన గూడ విషయము అపూర్వ మనుటకు వీలులేదు. కాగా అర్జునునికి తెలిసిన విషయముల లోనే మరపు ఇదా! అదా? అను సందేహము కలుగగా కృష్ణుని వచనములు, మరచిన విషయము జ్ఞప్తికి వచ్చి అందలి కొన్ని విషయములలో సందేహము లుండగ తొలగించినవి. కనుక కృష్ణుని బోధ అర్జునునికి అననుభూతము కాదు. కనుక కృష్ణబోధ అర్జునునియందలి సమ్మోహమును తొలగించుట కుపకరింపనేలేదు

## కృష్ణోపదేశము నిష్ఫలమా?

భగవదుపదేశము నిష్ఫల మనుట అతిసాహసవచన మగును. కృష్ణుడు గురువు. అర్జునుడు శిష్యుడు. గురువు శిష్యునికి బోధించు విషయము అపూర్వమై యుండవలయు నను నియమము లేదు. తెలిసిన విషయములను గూడ నిస్సందేహ

ముగా చెప్పుటయే గురూపదేశఫలము ఒకప్పుడు అపూర్వవిషయములుకూ గురుబోధితములు కావచ్చును. పార్వతీదేవికి ఉపదేశకాలమున పూర్వజన్మవిద లన్నియు స్ఫురించిన వని కాళిదాసు వివరించెను. ప్రాక్తనజన్మవిద్యలే గాక ఈ జన్మలో పొందిన విషయములుకూడ విస్మృతము లయినచో గురూపదేశమువల నిస్సందిగ్ధములై యలరారును ఒక సందర్భములో శిష్యునికి ఉపస్థితిలో నున్న విషయములే గురూపదిష్టములై యలరారును ఇట్టి సందర్భములలో గురూపదే ములకు ఫలము అవిద్య వీడ్పడుట మాత్రమే. గురుశిష్యసంబంధము ఒక అపూర్వబంధము. అది ఒక పవిత్రమైన బంధము. అది పితాపుత్రసంబంధవ వంటిది. అది సమాన మగు వారి మైత్రి యెట్టో అట్టిది. భార్యాభర్తల ప్రేమ ఎట్టిదో అట్టిది. అందుకే అర్జునుడు ఇట్లనుచున్నాడు :—

తస్మాత్ప్రణమ్య ప్రణిధాయ కాయం
ప్రసాదయే త్వా మహ మీశ మీడ్యమ్ ।
పి తేవ పుత్త్రస్య సఖేవ సఖ్యుః
ప్రియః ప్రియాయార్హసి దేవ సోఢుమ్ ॥ (11-44

అర్జునుడు "శాధి మాం త్వాం ప్రపన్నమ్"॥ అని కృష్ణునికి శిష్యుడై ప్రపన్నుడైనాడు. కాని "నీవు నాకు గురువువు." అని చెప్పలేదు. ఈ శ్లోకములో "నన్ను నీవు తండ్రివలె స్నేహితునివలె, ప్రియునివలె, క్షమింపుము." అన చున్నాడు. ఇందులో గురువు శిష్యునిపట్ల ఎట్టి బంధము కలవాడై యుండవలెనొ వివరింపబడుచున్నది. ఒకప్పుడు తండ్రిగాను, ఒకప్పుడు స్నేహితునిగాను, ఒక ప్పుడు ప్రియుడుగా నుండవలెను. ఇందులోనే రాజమిత్రకాంతారూపముగ నున్న త్రివిధబోధలు గురువువలననే లభించు నన్న మహార్థము వెలువడుచున్నది. పితృ శబ్దముచేతనే రాజబోధకూడ సుగ్రహీత మగుచున్నది.

ఈ మూడువిధము లగు బోధనలలోనుగూడ విషయము అశ్రుతపూర్వము అననుభూతపూర్వము అయి యుండవలె నను నియమములేదు కనుక అర్జునునకు కృష్ణుని బోధ అతనికి తెలియనిది కాదు. తెలిసినదే కొంత మరపునకు లోగా కొంత సందేహగ్రస్తము లోగా సమాసమొనరించె నని తెలియ దగును.

అర్జునునికి కృష్ణుడు చేసిన బోధ ఎంతమాత్రమనగా యుద్ధము చేయను అన్నవానిని "నీమాట పాటింతును" అన్నంతవరకే. కనుకనే భవిష్యద్రణరంగ మున అనేకసందర్భములలో అర్జునుడు అనేకసందేహములు వ్యక్తము చేయుచుం డుట వాటిని కృష్ణుడు తొలగించుచుండుట గమనింతుము.

అగుచో అనుగీతలలో సమస్త విజ్ఞానము గీతలలోనే చెప్పబడినది.

"స హి ధర్మః సుపర్యాప్తః బ్రహ్మణః పదవేదనే ॥"

ఇత్యాదివచనములకు, గతి యేమి? అన్నచో ఆగీతారూపబోధ బ్రహ్మపద వేదనముగ సరిపోవును. అనగా దానినుండి సామాన్యజ్ఞానమునే గాక, విశేషజ్ఞానమును పొంద దలంచినను పొందవచ్చును. అన్నంతమాత్రమే. ఇది సామాన్య వచనమే కాని, అంతయు అందే ఇమిడియున్నదన్న భావముతో చెప్పినది కాదు. అందులకే అర్జునుడు మరల తన్మహార్థము చెప్పుమనుటకును కారణమైనది. విశేషార్థము అనుగీతాబోధితము. సమగ్రవిజ్ఞానము కావలె నన్నచో భగవద్గీత, అనుగీతలు రెండును కలిపిననే అగును ఇంతకు చెప్పవచ్చిన దేమనగా గీతాబోధ అర్జునునకు తెలియని విషయములను బోధింపలేదు.

ఇందేవియు సకలశాస్త్రప్రవీణు డైన యర్జునునికి క్రొంగ్రొత్త విషయములు కానేరవు.

"ఇమం వివస్వతే యోగం ప్రోక్తవా నహ మవ్యయమ్ ।
వివస్వా న్మనవే ప్రాహ మను రిక్ష్వాకవేఽబ్రవీత్ ॥ (గీ. 4-1)
ఏవం పరంపరాప్రాప్త మిమం రాజర్షయో విదుః ।
స కాలే నేహ మహతా యోగో నష్టః పరంతప ॥ (2)
స ఏ వాఽయం మయా తేఽద్య యోగః ప్రోక్తః పురాతనః ।
భక్తోఽసి మే సఖా చేతి రహస్యం హ్యేత దుత్తమమ్ ॥ (3)
అపరం భవతో జన్మ పరం జన్మ వివస్వతః ।
కథ మేత ద్విజానీయాం త్వ మాదౌ ప్రోక్తవా నితి ॥ (4)

కృష్ణార్జునుల వచనములవలన, కృష్ణమహిమాతిశయము, ఆ కృష్ణుని అనుగ్రహముననే పరంపరగా వివస్వంతుడు మున్నగు వారు యోగమహిమ నందుచుండుట అర్జునునికి అవగతమును కాదు అన్న విషయము స్పష్టము. అట్టి స్థితిలో అర్జునునకు ఈ గీతాబోధామృతము అనుభూతిమధురమే అనుట చెల్లునా ?

మ య్యాసక్తమనాః పార్థ యోగం యుంజ న్మదాశ్రయః ।
అసంశయం సమగ్రం మాం యథా జ్ఞాస్యసి త చ్ఛృణు ॥ (గీ. 7-1)
జ్ఞానం తేఽహం సవిజ్ఞాన మిదం వక్ష్యా మ్యశేషతః ।
యద్ జ్ఞాత్వా నేహ భూయోఽన్యత్ జ్ఞాతవ్య మవశిష్యతే ॥ (గీ. 7-2)

అను శ్లోకములవల్లకూడ గీతాప్రతిపాద్య మగు విషయము అర్జునునకు తెలియదు అనేకదా!

"ఇదం తు తే గుహ్యతమం ప్రవక్ష్యా మ్యనసూయవే ।
జ్ఞానం విజ్ఞాన సహితం యద్జ్ఞాత్వా మోక్ష్యసేஉశుభాత్ ॥" (గీ. 9-1)

దీనివల్లనకూడా గీతాబోధ అర్జునాஉ శ్రుతపూర్వమే అని తెలియుచున్నది.

"భూయ ఏవ మహాబాహో శృణు మే పరమం వచః ।
య త్తేஉహం ప్రీయమాణాయ వక్ష్యామి హితకామ్యయా ॥" (గీ. 10-1)

ఇందువలనగూడ గీతారూపమగు పరమవచనము తద్గతమగు బోధ అర్జునునకవిదితమే. కనుక గీతాబోధ అర్జునునకు తెలియని అంశమే యని తెలియుచున్నది. మరి తెలసినదానినే తెలియజెప్పినాడనుట అనదగునా? వినదగునా?

అనవచ్చును. వినవచ్చును.

"పరం బ్రహ్మ పరం ధామ పవిత్రం పరమం భవాన్ ।
పురుషం శాశ్వతం దివ్యం ఆదిదేవ మజం విభుమ్ ॥" (గీ 10-12)
ఆహు స్త్వా మృషయ స్సర్వే దేవర్షి ర్నారద స్తథా ।
అసితో దేవలో వ్యాసః స్వయం చైవ బ్రవీషి మే ॥ (13)
సర్వ మే త దృతం మన్యే య న్మాం వదసి కేశవ ।
న హి తే భగవ న్వ్యక్తిం విదు ర్దేవా న దానవాః ॥ (14)
స్వయ మే వాత్మ నాత్మానం వేత్థ త్వం పురుషోత్తమ ।
భూతభావన భూతేశ దేవదేవ జగత్పతే ॥ (15)
వక్తు మర్హ స్యశేషేణ దివ్యా హ్యాత్మవిభూతయః ।
యాభి ర్విభూతిభి ర్లోకాన్ ఇమాం స్త్వం వ్యాప్య తిష్ఠసి ॥ (16)
కథం విద్యా మహం యోగిన్ త్వాం సదా పరిచింతయన్ ।
కేషు కేచ న భావేషు చింత్యోஉసి భగవ న్మయా ॥ (17)
విస్త రే ణాత్మనో యోగం విభూతిం చ జనార్దన ।
భూయః కథయ తృప్తి ర్హి శృణ్వతో నాస్తి మేஉమృతమ్ ॥" (18)

ఈ శ్లోకములవలన కృష్ణబోధ అర్జునునికి తెలిసినదనియే తెలియ నగును. నారదుడు, అసితుడు, దేవలుడు, వ్యాసుడు, అర్జునునకు చెప్పిరి. ఇచ్చట "స్వయం చైవ బ్రవీషి మే" నాకు నీవు కూడ చెప్పుచున్నావు అనగా వారలు నాకు చెప్పగా వింటిని. ఇప్పుడు నీవే స్వయముగా చెప్పుమన్నావు. కావున ఇ దంతయు నిజ మని భావింతును.

"సర్వ మేత దృతం మన్యే య న్మాం వదసి కేశవ"

కాని వారలు చెప్పగా వినినప్పుడు, నీవుచెప్పగావినినప్పుడు నాకు తృప్తి కలుగుట లేదు. అమృతరూప మగు నీ బోధ మరల చెప్పుము.

భూయః కథయ తృప్తిర్హి శృణ్వతో నాస్తి మేఽమృతమ్ ।"

దీనివలన విన్నయంశమే మరల మరల వినవలెనని అర్జునునికి కోరిక యైనందున వారలు చెప్పిన దానినే మరల వినుచున్నా డని తేలుట లేదా?

"స కాలే నేహ మహతా యోగో నష్టః పరంతప"

అని యేల కృష్ణ డనినాడు. ఆ వాక్య మసత్యమై యుండునా? కానవసరము లేదు. ఈ యోగపద్ధతిలో నున్న ఈ యంశ మంతయు ఆచరింపవలసినవార లగు రాజర్షులలో ప్రచార మడుగంటినది. కాని అర్జునుడు మహాతపశ్శాలి, మహాభక్తుడు నారదాదిదేవర్షులకును కృష్ణునివలె సంసేవ్యుడును, ఇష్టుడును అయివుండుటచే వారు ఈయోగవిషయములను అర్జునునకు తెలయజేసిరి. అనగా మహర్షులలో నీవిష యము ప్రచారములోనే గలదని రాజర్షిపరంపరలో లేకున్నను అర్జునునికి మాత్రము ఇది నారదాదులచే చెప్పబడియే యున్నది. అగుచో వారలు చెప్పిన యంశమును అర్జునుడు మరచెనా? అని ప్రశ్న కలుగును. మరచియే యుండవచ్చును. "స్మృతి ర్లబ్ధా" అన్న పదముచే మరచిన విషయము స్మరణకు వచ్చిన దనియే కదా యర్థము.

"అనుశాసనికపర్వములో యుద్ధసందర్భములో చెప్పిన విషయమును మరల చెప్పుము. ఆవిషయమును మరచితిని" అనికృష్ణుని అర్జునుడు అడిగిన దానినిబట్టి కూడ అర్జునునికి మరపుసహజమే అనవచ్చును.

## అర్జునునికి మరపులేదు.

అర్జునునికి మరపు కల దని వ్యాఖ్యానింపరాదు. నారదుడు చెప్పగా మొదట వినినాడు. ఆ యమృత బోధ మరల వినవలె నని యనిపించినాడు. ఇంకను ఆ యమృతాస్వాదనమున తృష్ణ పెరిగినది. దేవలునివలన వినినాడు. ఇంకను విన వలయు ననియే యనిపించినది. జ్ఞానస్వరూపుడే యగు వ్యాసుని వలన వినెను. అయినను అర్జునునికి తృప్తి తీరలేదు. కృష్ణుని వలన ఇప్పుడు విననాడు. మరల తృప్తి బొందక,

"భూయః కథయ తృప్తిర్హి శృణ్వతో నాస్తి మేఽమృతమ్" అని ప్రశ్నించి వానియనుగ్రహమున విననాడు. అది యుద్ధసందర్భమగుటచే మరల మరల వినుట కవకాశము లేమిచే కార్యప్రవృత్తుడై యుద్ధముచేసినాడు. యుద్ధానంత

రము మరల చెప్పు మని యడిగినాడు. కృష్ణుడు "నే నిప్పుడు చెప్పలేను. అప్పుడేదో యోగమహిమచే చెప్పగలిగితి" ననినాడు

అరణ్యపర్వములో 12వ అధ్యాయములో 9వశ్లోకమునుండి 79వ శ్లోకము వరకు గల శ్లోకములలో అర్జునుడు, కృష్ణుడు, ద్రౌపది పలికినపలుకులు చూచినచో సమగ్రముగ కృష్ణతత్త్వము అర్జునునకు ద్రౌపదికి కూడ విదితచరమే

ముఖ్యముగ ద్రౌపది వచనములలో నారదుడు, అసితుడు మున్నగువారు కృష్ణుని ప్రభావమును పలుమార్లు ఉగ్గడించినట్లున్నది కావున అర్జునుడు "అసితుడు మున్నగు వారు చెప్పగ నీ ప్రభావమును వినియున్నా" నను గీతావాక్యము యథాలాపముగ అనినది కాదు.

అర్జునుని మరపును ప్రధానకారణముగ భావింపరాదు అర్జునునకు కృష్ణతత్త్వము ఎంత విన్నను తృప్తి లేదనుటయే సత్యము. అగుచో కృష్ణుడు "అప్పుడు యోగయుక్తుడనై చెప్పితిని. మరల అది చెప్ప వీలుకాదు. తదర్థకమగు గాథను వినిపింతు" ననుటయు యథార్థముగ భావింపరాదు.

ఒక మహావిషయమును మరల మరల వినవలయు నని ప్రతివారును కోరవలయు నని అర్జునుని ప్రవృత్తి వలన తెలియవలయును.

"మరల చెప్పవీలుకాదు"– అను కృష్ణవచనమువలన ఒక విషయము ఒక సందర్భములో అపరిస్థితులప్రాభవమున ఒకడు చెప్పగలుగును. అట్టి అవకాశమును జారవిడుచుకొన్నచో ఎంతటి గురువైనను దానిని మరల ఆ ఆనుపూర్విలో వివరింపలేడు," అన్న విషయము తెలియవలయును. కనుక ప్రథమపర్యాయమున నే గురుముఖమున విన్నది శిష్యులు ధారణ చేయవలయును–అన్నదే పరమార్థము. "లోకములను ఎట్లు సృష్టింపగలడో అట్లు నాశనము చేయగలడు మరల అట్లే సృష్టింపగలడు," అని బహుపర్యాయములు అనేకవ్యక్తులచే నీ భారతమునందే కృష్ణుడు కీర్తింపబడెను. కృష్ణుడు గీతలను చెప్పి నప్పుడు యోగయుక్తుడై చెప్పితి ననుట యోగమహిమాతిశయప్రకాశనార్థమే కాని నిజము కాదు. అతడవతరించినది మొదలు వృష్ణివంశము క్షయమగు నంతవరకు ఆతనికి ఆదివ్యయోగసంపత్తి అవిచలితమై యున్నది. ఆ యాదవకుల సంక్షయసమనంతరము ఆతనికి ఆ దివ్యతత్త్వము నశించిన దని వివరింపబడినది.

కృష్ణుడు యాదవకులనాశమును స్వయముగా జరిపి తండ్రిని చేరి "నీవు స్త్రీలను కాపాడుచుండుము ధనంజయుడు వచ్చును. రాముడు నారాక ఎదురుచూచుచు వనమున నున్నాడు. నేను కురువంశనాశనము చూచినాను. ఇప్పుడు యాదవుల

నాశనము కనుగొంటిని. యాదవపురిని యాదవులులేక ప్రవేశింపలేను. వనమున రామునితో తప మొనరించెదను. అని పోవ స్త్రీలు ఏడ్చిరి. కృష్ణుడు వెనుతిరిగి "సవ్యసాచి వచ్చి దుఃఖమునుండి మిమ్ము ఉద్ధరించును".

పురీ మిమా మేష్యతి సవ్యసాచీ
స వో దుఃఖా న్మోచయితా నరాగ్ర్యః ।  (మౌ. 4-12)

అని చెప్పి వనమునకు పోగా అక్కడ యోగయుక్తుడైన రాముని ముఖము నుండి శ్వేతసర్పము వెడలుట చూచెను. వరుణుడు మున్నగువారు ఎదుర్కొని రాముని పూజించిరి.

తతో గతే భ్రాతరి వాసుదేవోఽజాన స్సర్వా గతయో దివ్యదృష్టిః ।
(మౌ. 4-17)

రాముడు పోగా వాసుదేవుడు "దివ్యదృష్టిః, సర్వా గతయః అజానన్॥" అనగా దివ్యదృష్టులను సర్వవిషయకజ్ఞానములను తెలియనివాడైనాడు "జానన్" అని విడదీయవచ్చును. కాని కృష్ణుడు పోగా అర్జున శక్తులు నశించిన వని చెప్పు చున్నాడు. కావున బలరాముడు పోగానే కృష్ణుని సర్వజ్ఞానములు దివ్యదృష్టులు అతనికి స్ఫురింపలేదని చెప్పుటే భావ్యము.

అవతారము మొదలు ఏతదంతము కృష్ణుడు ఏది చేసినను, ఏది అన్నను అది అంతయు యథార్థ భగవత్స్వరూపముగనే భావింపవలయును. ఇందేకృత్యము మానవత్వప్రకటనార్థమో, లేక, మరోవిధముగనో జరిగిన దని వ్యాఖ్యానించుట తత్త్వజ్ఞులకు లక్షణము కాదు. కావున కృష్ణుడు ధర్మ మాచరించితిననినను, "అధర్మ మాచరించితి" ననిననూ, అదంతయు భగవతత్త్వమువలెనే అప్రతిహతమైనది. అట్లే అర్జునుని ప్రవృత్తిలో కలిగిన వైవిధ్యమును వ్యాఖ్యానింపవలయును. అగుచో "అపరం భవతో జన్మ" ఇత్యాది అర్జునకృతములగు ప్రశ్నలు, కృష్ణునిసమాధానములు మున్నగున వన్నియు యుద్ధభూమిలో నున్న స్వపక్ష - పరపక్షయోధులకు యుద్ధవిషయమున కల సందేహనిరాసార్థమే ప్రవర్తిల్లినవి.

కావున అర్జునుడు మరచె ననుటకు అవకాశము లేదు. "బహుభి ర్బహుధా శ్రుతం" అనినట్లు అనేకులచే అనేక విధములుగ అనేకపర్యాయములు విన్న జ్ఞానమే జ్ఞానము అని చెప్పు వాక్యము ననుసరించి అర్జునుడు అట్లు వినినాడు. విన దలంచియే మరల మరల ప్రశ్నించినాడు.

కనుక ఈబోధ అర్జునునకు తెలియనిది కాదు. భీష్మసింహనాదప్రేరితుడై తత్సదృశమగు బోధను ఇంతకుముందే కలిగియుండియు, మరల దానినే విన వలయు నని కృష్ణునకు శిష్యుడైనాడు.

ఈ అర్జునవిషాదయోగఘట్టము కేవలము ప్రథమాధ్యాయపరిమితము కాదు. 18 అధ్యాయములవరకును పరివ్యాప్తమై యున్నదని చెప్పబడినది. ఈ అభిప్రాయము నింకను దృఢీకరించుటకు ఈక్రింది యుపపత్తులను గమనింపుడు.

ఇ త్యహం వాసుదేవస్య పార్థస్య చ మహాత్మనః ।
సంవాద మిమ మశ్రౌషం అద్భుతం రోమహర్షణమ్ ॥ (గీ. 18-74)
వ్యాసప్రసాదా చ్ఛ్రుతవా నిమం గుహ్యతమం పరమ్ ।
యోగం యోగేశ్వరా త్కృష్ణా త్సాక్షా త్కథయతః స్వయమ్ ॥ (-75)
రాజన్ సంస్మృత్య సంస్మృత్య సంవాద మిమ మద్భుతమ్ ।
కేశవార్జునయోః పుణ్యం హృష్యామి చ ముహు ర్ముహుః ॥ (-76)

అను నీ సంజయవాక్యములచే ఈగీతాబోధ కేశవార్జునుల సంవాద మని తెలియుచున్నది. అనగా వా రిద్దరు భీష్మసింహనాదప్రేరితులై తమ తమ తేజో వీర్యబలపరాక్రమాదులను, వానికి పోషక మగు బ్రహ్మవిద్యను న కరించుకొనిరి. అందువలన అర్జునవిషాదయోగ మనగా అర్జునునకు మాత్రమే కలిగిన విషాద మని చెప్ప వీలు కలుగదు. అర్జునశబ్దముచే నరనారాయణు లగు కృష్ణార్జునులు ఇరువురు చెప్పబడుదురు. వారిరువురు విషాదునితో అనగా భీష్మునితో యుక్తు లగుదురు. అనగా సమాను లగుదు రని చెప్పవచ్చును. అందువలననే—

య ద్యహంకార మాశ్రిత్య న యోత్స్య ఇతి మన్యసే ।
మిథ్యైష వ్యవసాయ స్తే ప్రకృతి స్త్వాం నియోక్ష్యతి ॥ (గీ. 18-59)

ఈ శ్లోకమువలన తెలియ దగు నంశ మేమనగా, "నేను యుద్ధసన్నద్ధుడనే; నీవు అట్లు కాకున్నచో నా ప్రకృతి నీ చేత యుద్ధము చేయించును." అనగా—

మ యైవై తే నిహతాః పూర్వమేవ
నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్ ॥ (గీ. 11-33)

అనగా "ముందుగా నాచే చంపబడిన వీరలను నిమిత్తమాత్రుడవుగా నుండి చంపుము" అను భావమువలన "నేను ఇప్పుడు నా ప్రకృతికి వశుడనై యుద్ధమునకు గడంగితిని. నా యంశభూతుడ వగు నీవు ఆ ప్రకృతినియోగమును పీడలేవు, అను భావము వ్యక్త మగుచున్నది. కావున ప్రకృతివశత్వము ఇరువురియందు సమానముగా నుండుటచే —

"ప్రకృతిః కర్త్రీ పురుష స్తు పుష్కరపలాశవ న్నిర్లిప్తః ।"

అన్నచొప్పున న న్నేప్రకృతి నడుపుచున్నదో ఆప్రకృతియే నిన్నును నడుపును,

"నైవం పాప మవాప్స్యసి" ఇత్యాది పూర్వోక్త వాక్యముల నాధారముగా చేసికొని చూచినచో కృష్ణుని యభిప్రాయము ఇట్లు వ్యక్తమగును. "మన మిరువురము నిమిత్తమాత్రులమే; అవతారప్రయోజన మగు నీభూభారహరణము చేయుదము; అట్టి సంకల్పముతో మనము ప్రకృతివశులమై జన్మించినాము; ఆప్రకృతికిప్పుడు మన సంకల్పమువలన కలిగిన బలము కలదుసుమా! ఆప్రకృతి నెదిరించు శక్తి నాకు లేదు, నీకుండదు; మనమిప్పుడేకాదు. ఎల్లప్పుడును,—

బహూని మే వ్యతీతాని జన్మాని తవ చార్జున ।
తా న్యహం వేద సర్వాణి న త్వం వేత్థ పరంతప ॥

ఎన్నియో జన్మలు ఎత్తుచునే యున్నాము; ప్రకృతికి వశుల మగుచున్నాము; ఎంతవరకు మనము ప్రకృతికి లోబడగలమని సంకల్పించినామో అంతవరకు ఆప్రకృతికి లోబడవలసినవారమే. అది నాకు తెలియుచునే యున్నది. నీ వింకను గుర్తింపలేదేమో? లేక గుర్తింపనట్లున్నావు." "న త్వం వేత్థ" అనునప్పుడు "న" అనునది ఉపమావాచకముగూడ ఓ గును. "నావలె నీవును ఎరుగుదువు", అన్న భావము చెప్పకొనినచో సరి యగును.

కృష్ణుడు అర్జునునకు—

అశోచ్యా నన్వశోచ స్త్వం ప్రజ్ఞావాదాం శ్చ భాషసే ।
గతాసూ నగతాసూం శ్చ నానుశోచన్తి పండితాః ॥ (గీ. 2-11)

అను శ్లోకము మొదలు,

ఏవం బుద్ధేః పరం బుద్ధ్వా సంస్తభ్యాత్మాన మాత్మనా ।
జహి శత్రుం మహాబాహో! కామరూపం దురాసదమ్ ॥ (గీ. 3-43)

అను శ్లోకమువరకుగల గ్రంథభాగముచే, "దృష్ట్వేమం స్వజనం కృష్ణ" (1-28) నుండి "త న్మే క్షేమతరం భవేత్" (1-46) అనునంతవరకును "కథం భీష్మ మహం" (2-4) అనునదిమొదలు "రాజ్యం సురాణా మపి చాధిపత్యం" (2-8) అనునంతవరకును అర్జునుడు పలికినపలుకులకు సమాధానముగ చెప్ప వలసిన విషయమంతయు చెప్పెను. ఈమొత్తము గ్రంథభాగమున ప్రతిపాదింపబడిన విషయము నంతను నిరుపపదముగ యోగ మని కృష్ణుడు "ఇమం వివస్వతే యోగం ప్రోక్తవా నహ మవ్యయమ్" (4-1) అనువచనముచే చెప్పెను. దీనివలన ద్వితీయాధ్యాయములో, తృతీయాధ్యాయములో, కృష్ణుడు చెప్పిన విషయ మేది గలదో అది అంతయు అవ్యయ మైన యోగముగా కృష్ణుడు చెప్పుటవలన అట నట ప్రయోగించిన సాంఖ్యబుద్ధి, కర్మబుద్ధి అనువిధముగ విభజించుట కవకాశమిచ్చు వచనములకు సామాన్యాకారమున విశేషమును సూచించుటకు అపద

ములు ప్రయుక్తములే. ఆ పదములు కర్మలను, జ్ఞానులను విడదీసి ఈవిషయము జ్ఞానులకు చెప్పినది, ఇది కర్మలకు చెప్పినది, అని తమతమవాదబలములతో వ్యాఖ్యానించుట గీతకు అన్యాయము చేయుటయే. భగవద్వచనమును అపార్థము చేసి తాము పతితులగుటయే గాక, ఆవ్యాఖ్యానములు చదువువారిని గూడ పతితుల నొనరించుటయే తప్ప వేరుకాదు.

"ఇమం" అని "ఇదం" శబ్దముచే భగవత్ప్రోక్తమైన ఆ అవ్యయ యోగము పేర్కొనబడుటచే ఆ యోగము కృష్ణార్జును లిరువురికికూడ అనుభూతి మధుర మగుచున్నదే కాని, అందు ఒకరికి తెలిసి ఒకరికి తెలియక యున్నదనుటయు అసందర్భప్రలాపమే యగును. ఇది వివస్వంతుడు మున్నగువారికి పరంపరగా బోధింపబడుచున్నను కాలాంతరమున సర్వజనులకు నష్టప్రాయముగ అగుపించు చున్నది

స ఏ వాయం మయా తేద్య యోగః ప్రోక్తః పురాతనః ।
భ క్తోసి మే సఖా చేతి రహస్యం హ్యేత దుత్తమమ్ ॥ (4-3)

ఇచట "అయం" "స ఏవ" "ఏతత్", అన్నపదములవలన వివస్వంతుడు మున్నగువారికి చెప్పినది ఇప్పుడు నీకు చెప్పినది ఒకటే. ఏతచ్ఛబ్దముచే పేర్కొన బడుటచే కాలాంతరములలో చెప్పబడిన ఈ యోగమునకు అనన్యత్వముసూచించు టయే భగవన్మతము. "ఇమం" "ఇమం" అని ఒకటి రెండు శ్లోకములలోను గ్రహింపబడినది "అయం" "ఏతత్" శబ్దములచే గుర్తింపబడుచున్నదీ ఒకే తత్త్వము. "స కాలేన" (2) 'స ఏవ' (3) అను తచ్ఛబ్దముచే గుర్తింపబడుచున్న తత్త్వము ఇదమాదులచే గుర్తింపబడుచున్న తత్త్వము, కాలభేదముచే వేరాః అన్నభావముసామాన్యబుద్ధికి తోచును. కాని తచ్ఛబ్దార్థము ఏత చ్ఛబ్దగృహీతమగు టచే తచ్ఛబ్దము, ఏతచ్ఛబ్దము రెండింటికి ఏకత్వము ప్రతిపాదించుటకు ప్రయో గింపబడినవి. మూడు శ్లోకములలోనుగూడ యోగశబ్దమును నిరుపపదముగ ప్రయోగించుటవలన "పురా ప్రోక్తః" "అద్యప్రోక్తః"అని కాలభేదముచేబోధింప బడుటను సూచించుచున్నది. కాని "ప్రోక్తవాన్" "ప్రోక్తః" అని కాలభేదముచే సూచింపబడుచున్న యోగమునకు సమానముగానే పూర్వకాలసూచకమగు "క్త" ప్రత్యము ప్రయోగింపబడుటచే "పురాతనః" (3) అని చెప్పుటచే కృష్ణార్జునుల విషయములో ఈ యోగము కాలభేదము లేనట్లే తెలియవలెను. తచ్ఛబ్దము "సః" అని రెండు మూడు శ్లోకములతో గ్రహింపబడుట యోగమునందు కాలభేదసూచక ముగా గ్రహింపరాదు. తచ్ఛబ్దము పరమాత్మవాచకము "రసో వై సః" ఇత్యాదు శ్రుతులయందు గ్రహింపబడిన పరమాత్మకు, "యోగః" అని గ్రహింపబడుచున్న

యోగవిషయమునకు పరమాత్మానస్యత్త్వము సూచించుట ప్రయోజనము. "సః,సః" అని 2, 3 లలో గ్రహించుట కృష్ణార్జునులిరువురు తత్త్వమున ఏకత్వమున్నను వ్యావహారికదశయందు వేరుగా గుర్తించుట జరుగుచున్నది కాన తత్పరస్పరముగా వారలను చెప్పుశబ్దముకూడ రెండు పర్యాయములు చెప్పబడినది.

అగుచో—

అపరం భవతో జన్మ పరం జన్మ వివస్వతః ।
కథ మేత ద్విజానీయాం త్వ మాదౌ ప్రోక్త వా నితి ॥ (4–5)

ఈ శ్లోకమునం దర్జునుడు భగవతత్త్వ మెరుంగని అజ్ఞానమును ప్రకటించెను.

బహూని మే వ్యతీతాని జన్మాని తవ చార్జున ।
తా న్యహం వేద సర్వాణి న త్వం వేత్థ పరంతప ॥ (4–5)

ఈ భగవద్వచనమును అర్జునుని అజ్ఞత్వమును బాహాటముగా వెలువరించుచున్నది. "అహం వేద" "న త్వం వేత్థ" అన్నపుడు నేనెరుగుదును; నీ వెరుంగవు అని చెప్పి పరంతప అని అర్జునుని సంబోధించినాడు. నీ వెరుంగకపోవుట వల్ల పరుడనగు నన్ను తపింపచేయుచున్నావు.

మా మాత్మపరదేహేషు ప్రద్విషంతో ఒభ్యసూయకాః ।

అనగా తత్త్వ మెరుంగనివారు ఆత్మ పరదేహములయందుగల నన్ను గుర్తింపక ద్వేషాసూయలను ప్రకటించుచుందురు. అది భగవంతుడ నగు నాకు సంతాపకర మని భావము. ఆ యర్థమే ఇట కనుగొననగును. నీవు నన్ను గుర్తింపక నన్ను తపింపజేయుచున్నావు అని అర్థము. కాని నీవు గుర్తించియేయున్నావు. "న త్వం వేత్థ" అన్నచోటగల "న" కారము ఉపమావాచకము. "మృగో న భీమః" అన్నచోట "న" కారము ఉపమానాచకము. అట్లే ఇక్కడకూడ "న" కారము నుపమావాచకముగా గ్రహింపనగును. "యథా అహం వేద, తథా త్వం వేత్థ" అనగా నా జన్మలెట్లు నాకు గుర్తున్నవో అట్లే నీకును నీజన్మలు గుర్తున్నవి. నేను నా జన్మలతో నీ జన్మల నెట్లు గుర్తించుచుంటినో అట్లే నీవును నీ జన్మలతో నన్నును గుర్తించుచున్నావు. అన్న భావమే చెప్పనగును. అగుచో తన అజ్ఞత్వమును అర్జును డేల ప్రకటించెను?

ఇట ఒక విషయము గీతాప్రచారకులు గుర్తింపవలయును. ఉభయ సేనల నడుమ కృష్ణార్జును లిరువురు చేయు నీ సంవాదము యుద్ధవాహినిలో నున్న ఇరు వాగులవారియందు గల సమస్త వీరులను పురస్కరించుకొని జరుగుచున్నది. ఇందున్న వారందరు పరిణతభావము కలవారు కారు. అందరి హృదయములు

యుద్ధమున సిద్ధ్యసిద్ధులయందు సమబుద్ధి కలిగియున్ననే ఇది యజ్ఞ మగును. లేకున్న అపవిత్రత కలుగగలదు. కావున అర్జునుడు ఎవరెవరి యందు ఎట్టెట్టి సందేహములు పొడచూపునో, శోకవిషాదము లు కలుగునో వాటిని సంగ్రహించి ప్రకటింపగా కృష్ణుడు తదనుగుణముగా సమాధాన మిచ్చెను. కనుక గీతారూప మగు కృష్ణార్జునసంవాదము వారిరువురకే పరిమితము కాదు. ఈ విషయము ఏ.వి.రము ద్వితీయభాగమునందు విస్తరించి వివరింపబడును. కనుక కృష్ణార్జును లిరువురు జ్ఞానులే.

అర్జునుని 'అపరం భవతో జన్మ' అన్న ప్రశ్న మొదలుకొని జరిగిన కృష్ణార్జునుల సంవాదము గ్రహింపదగిన అనేక విషయములను గురించి ప్రసక్తాఽనుప్రసక్తముగా సాగినది. ఇట "మే" "తవ" అని ప్రయోగించుటచే ఈ గీతలో 3 వ అధ్యాయమువరకు జరిగిన యోగబోధ పరంపరగా ప్రచారము పొందుచుండుట వీరిరువురలోనే అని తెలియవలయును. ఎప్పు దెప్పుడు ఈ బోధ అవసరము అన్నచో యుద్ధకాలమునందే అని తెలియును. అపుడు కృష్ణు డుపదేశించుచుండును. కృష్ణాంశ మగు అర్జునుడు వినుచుండును. వీరి సంవాదమువలన యోధవీరవర్గ మంతయు ఉత్తేజిత మగుచుండును. అర్జునుడు వివస్వంతుడు మున్నగు బోధ్య పరంపరలో బోధకు డగు భగవంతునివలెనే అనుస్యూతముగా వచ్చుచున్నా డని తెలియవలయును.

మొత్తము గీతాబోధ అంతయు జరిగిన తరువాత.

కచ్చి దేత చ్ఛ్రుతం పార్థ! త్వ యైకాగ్రేణ చేతసా ।
కచ్చి దజ్ఞానసంమోహః ప్రణష్ట స్తే ధనంజయ ॥ (18-72)

అన్న భగవత్ప్రశ్న గమనింప దగును. అర్జునుడు ధర్మసంమూఢచేతస్కుడు. ఇట కృష్ణుడు అజ్ఞానసంమోహము తొలఁగినదా? అని అడుగుచున్నాడు. నీవు ధర్మమని సమ్మోహము పొందినది అజ్ఞాన సంమోహము. అందుకే "సర్వధర్మాన్ పరిత్యజ్య" అని ఇంతకు ముందు కృష్ణు డుపదేశించినాడు. నీవు ధర్మ మనుకున్న దంతయు అజ్ఞానవిలసితమే యని భావము. అర్జునుడు "మోహోఽయం విగతో మమ" (11-1) అనును. ప్రస్తుతము భగవత్ప్రశ్నానంతరము-

నష్టో మోహః స్మృతి ర్లబ్ధా త్వత్ప్రసాదా న్మయాఽచ్యుత ।
స్థితోస్మి గతసందేహః కరిష్యే వచనం తవ ॥ (18-73)

ఈశ్లోకముచే మోహము నష్టమైన దని అర్జునుడు చెప్పెను. సంమోహము నశింపలే దని చెప్పనే లేదు. "స్మృతిర్లబ్ధా" "గతసందేహః" అన్న పదముల వలన సంమోహము నష్టమైన దని వ్యంగ్యముగా గ్రహింపవలెను. ఈ గీత

అందరికిని చెప్పిన దగుటచే వారలను దృష్టిలో నుంచుకొని వారివారి యోగ్యత ననుసరించి కొందరికి మోహముమాత్రమే పోయినది. కొందరికి స్వస్వరూపాను భూతి కలిగినది. కొందరికి సందేహములు మాత్రమే తొలగినవి. అని అర్జునుడు కృష్ణునికి తాము చేసిన ఉపన్యసంగఫలమును వివరించినాడు.

అనుగీతలలో—

శ్రావిత స్త్వం మయా గుహ్యం జ్ఞాపిత శ్చ సనాతనమ్ ।
ధర్మం స్వరూపిణం పార్థ ... (ఆశ్వ 16–9)

ఇట పార్థ శబ్దము "కచ్చి దేత చ్ఛ్రుతం పార్థ" అన్న గీతలోని పార్థశబ్దమును ఆకర్షించుచున్నది.

ఇత్యహం వాసుదేవస్య పార్థస్య చ మహాత్మనః ।
సంవాద మిమ మశ్రౌషం అద్భుతం రోమహర్షణం ॥ (18–74)

అన్న సంజయవచనములోని పార్థశబ్దమునూ ఆకర్షించుచున్నది. "వాసుదేవ స్సర్వ మితి స మహాత్మా సుదుర్లభః" అని భగవంతుడు చెప్పిన వచనాను సారముగా సంజయవచనమున కిట్లు భాష్యము చెప్పవలెను. వాసుదేవుడే సర్వము అన్న భావము కలవాడు పార్థుడు, కనుకనే మహాత్ముడు. ఇట గల చకారము మాహాత్మ్యమున వాసుదేవ, పార్థులు ఒక్కరే అన్న భావము సంజయవచన సారము. అర్జునుడు అనుగీతలలో "మాహాత్మ్యం దేవకీమాతః" అని కృష్ణుని ప్రశ్నించెను. ఆ మాహాత్మ్యము కృష్ణార్జునుల ఏకత్వనిరూపకమైన గీతాబోధ. "తచ్చ తే రూప మైశ్వరమ్" నీ ఈశ్వరసంబంధ మగు రూపము అని చెప్పి అవి నానుండి తొలగినవి అని చెప్పెను. అప్పుడు కృష్ణుడు "గుహ్యం శ్రావితః సనాతనం జ్ఞాపితః", అని చెప్పెను. అనగా పురాతనమైన యోగ మని నాల్గవ అధ్యాయములో చెప్పబడిన పురాతనయోగమే సనాతనయోగముగా గ్రహింపబడినది దానిని ప్రశ్నప్రతివచనరూపముగ సందేహరహిత మగునట్లు శ్రవణేంద్రియమధుర ముగా గీతలో వివరింపబడినది. ఆపరమాత్మస్వరూపము అర్జునునికి విశ్వరూపమున జ్ఞాపితము. అనగా చూపబడినది. ఈ రెండు అంశములు గీతలో అర్జునుని ముఖమున "గతసందేహః, స్మృతి ర్లబ్ధా" అన్న పదములచే సూచితము లైనవి. "గతసందేహః" అన్నది శ్రవణేంద్రియముద్వారా విన్న యోగాంశమునకు సంబంధించి చెప్పినది. "స్మృతి ర్లబ్ధా" అన్నపదముచే విశ్వరూపముద్వారా ద్రష్టవ్య దృష్టియోగవిషయక విశ్వరూపమునకు సంబంధించినది అని తెలియ దగును.

"ధర్మం స్వరూపిణం' అనుటచే మన యిరుపురి రూపములుగా నవతరించిన ధర్మము గీతలో వివరింపబడిన దని అర్థము. కనుక గీతలో కృష్ణార్జునుల స్వరూపమైన ధర్మము శ్రవణేంద్రియ, చక్షురింద్రియమధురముగా నిర్ధారిత మైనది.

బలరాముడు నిర్యాణము చెందినపుడు అతని ముఖమునుండి శ్వేతసర్పము వెడలుట కృష్ణుడు చూచెను. సర్పమునకు "చక్షుశ్శ్రవము" అని పేరు. యోగయుక్తుడైన బలరాముని ముఖము నుండి సర్పాకార మగు కుండలినీశక్తి అనగా దృశ్య, శబ్దవ్యరూపముగా నున్న యోగశక్తి భూభారహరణకార్యము పూర్తియైనది గాన ప్రయాణమైనది. తదుపరి కృష్ణార్జునులు యోగనిర్ముక్తులైరి. కృష్ణుడు వెంటనే నిర్యాణము చెందెను. అర్జునుడుకూడ శక్తిహీనుడై యోగరహితుడై మహాప్రస్థానము సోదరులతో చేసెను.

యోఽహం త మర్జునం విద్ధి యోఽర్జునః సోఽహ మేవ తు ।
యద్బ్రూయా త్తత్తథా కార్యం ఇతి బుధ్యస్వ భారత ॥ (మౌ. 6-22)

కృష్ణుడు తనకు చెప్పినట్లు అర్జునుని మేనమామ, కృష్ణుని తండ్రి యగు ఆనకదుందుభి యను వసుదేవుడు అర్జునునికి కృష్ణనిర్యాణానంతరము చెప్పిన ఈ పై వచనము కృష్ణార్జునుల ఏకత్త్వమునకు "ఏక మేవాద్వితీయం బ్రహ్మ" అన్న అద్వైతసిద్ధాంతమూలస్తంభమైన ఉపనిషద్వచనమువలె పరమ ప్రమాణమైనది. ఏకసత్త్వమే నరనారాయణులుగా ద్విధా భూతమైనట్లు వ్యాసుడు చెప్పిన భావమును కాళిదాసు తన శాకుంతలమున మధుకరిక – పరభృతిక అను నామములుగల చేటికల ముఖమున వివరించెను. ఏక మేవ నౌ జీవితం ద్విధా స్థితం శరీరమ్ ।
(శా. అంక. 6)

ఏష నారాయణః కృష్ణః ఫాల్గునశ్చ నర స్స్మృతః ।
నారాయణో నరశ్చైవ సత్త్వ మేకం ద్విధా కృతమ్ ॥
ఏతౌ హి కర్మణా లోకా నశ్నువాతేఽక్షయా న్ధ్రువాన్ ।
తత్ర తత్రైవ జాయేతే యుద్ధకాలే పునః పునః ॥ (ఉ. 48-21, 22)
తవ భ్రాతా మమ సఖా సంబంధీ శిష్య ఏవ చ ।
మాంసా న్యుత్కృత్య దాస్యామి ఫాల్గునార్థం మహీపతే ॥
ఏష చాపి నరవ్యాఘ్రో మత్కృతే జీవితం త్యజేత్ ।
ఏష న స్సమయ స్తాత తారయేమ పరస్పరమ్ ॥ (ద్రో. 108-33,34)
భోక్తారం యజ్ఞతపసాం సర్వభూతమహేశ్వరమ్ ।
సుహృదం సర్వభూతానాం జ్ఞాత్వా మాం శాంతి మృచ్ఛతి ॥
తం సన్తః శ్రోతు మర్హన్తి సదసద్వ్యక్తిహేతవః ।
హేమ్నః సంలక్ష్యతే హ్యగ్నౌ విశుద్ధిః శ్యామికాపి వా ॥

న మే ద్వేష్యోఽస్తి న ప్రియః ।

ప్రథమ భాగము

సమాప్తము.

ఓమ్ తత్సత్.